| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| భగవద్గీతలు, మూలముమాత్రము | ... | 0 | 6 |
| „ ఆంధ్రతాత్పర్యసహితము | ... | 1 | 12 |
| „ అనిబిసెంటుగారి ఇంగ్లీషుతర్జుమా | ... | 0 | 10 |
| „ శ్రీరామచంద్రసరస్వతీకృత ఆంధ్రటీకాతాత్పర్య వివరణసహితము | ... | 4 | 8 |
| అష్టోత్తరశతోపనిషత్తులు, మూలము | ... | 8 | 0 |
| పంచీకరణము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 3 |
| „ తెనుఁగువచనము | ... | 0 | 3 |
| శంకరగీతాభాష్యము, సవ్యాఖ్యానము, మేలుప్రతి | ... | 2 | 8 |
| వాసుదేవమననము, తెనుఁగువచనము | ... | 1 | 0 |
| విచారసాగరము, తెనుగువచనము | ... | 5 | 0 |
| శ్రీవిద్యారణ్యకృతజీవన్ముక్తిప్రకాశిక, ఆంధ్రతాత్పర్యసహితము | | 2 | 8 |
| నైష్కర్మ్యసిద్ధి, సురేశ్వరాచార్యకృతము, ఆంధ్రటీకాతాత్పర్యము | | 5 | 0 |
| పంచదశీప్రకరణము, సవ్యాఖ్యానాంధ్రటీకాతాత్పర్యసహితము | | 6 | 0 |
| విచారచంద్రోదయము „ | ... | 0 | 10 |
| వేదాంతస్తోత్రపంచకము „ | ... | 0 | 6 |
| శివగీతా, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | ... | 1 | 0 |
| సదాముక్తిసుధార్ణవము, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | ... | 0 | 10 |
| రామగీతా „ | ... | 0 | 8 |
| సనత్సుజాతీయము, సటీక | ... | 0 | 8 |
| శంకరవిజయము, సవ్యాఖ్యానము | ... | 2 | 8 |
| సౌందర్యలహరి, ఆంధ్రటీకాతాత్పర్యము | ... | 0 | 8 |
| శాంతివిలాసము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 6 |
| హఠయోగప్రదీపిక, „ | ... | 3 | 0 |
| భక్తిఫలనముక్తి | ... | 0 | 1 |

శ్రీః

# శ్రీకృష్ణావతారతత్త్వము

## ఎనిమిదవ ప్రకరణము.

ఇయ్యది.

కడప మ్యునిసిపల్ హైస్కూలునందు ప్రధానాంధ్రపండితుఁడగు

కావ్యస్మృతితీర్థ

జనమంచి శేషాద్రిశర్మచే రచింపఁబడినది.



చెన్నపురి:

“వావిళ్ల” ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1928

శ్రీః.

# భద్రోదంతము.

కరుణాతరంగితాంతఃకరణులారా!

శ్రీకృష్ణావతారతత్త్వమున నెనిమిదవప్రకరణమును గడువుతప్పక వెలువరించుభాగ్యము నాకబ్బెనని యుబ్బుచు నాయామోదము నేతత్కాలమున మీకుం దెలుపుకొనుచున్నాఁడను. శ్రీకృష్ణావతారచరిత్రామృతరాశిదరిఁ జేర రెండుబారల దూరముగలదని విన్నవించుకొనుచున్నాఁడను. కాని యాదూరము మూఁడుబారలదూరము గలదగునేమో నిర్ణయించునధికారము నాకు లేదు. శ్రీకృష్ణపరమాత్మయే నిర్ణయింపఁ గలవాఁడు. ఈయెనిమిదవప్రకరణము వివాహాహ్వానపత్రమువంటిది. ఇందు లీలామానుషవిగ్రహుఁ డగుశ్రీకృష్ణునకు బహువిధరూపనామముల వెలసినశ్రీకాంతకు వివాహము మర్త్యలోకాచారమును బట్టి సాగినవార్త కలదు. ఆచరిత్రమే యీప్రకరణమునఁ గడుం బెద్దది. తుదకీప్రకరణమున నెనమండ్రుగురుభార్యలుగా మహాలక్ష్మి తన్ను సేవింపఁగాఁ బరమపురుషుఁడు విరాజిల్లుచుఁ దన యవతారఫలమును గనఁబఱచును. ఈవివాహము వైశాఖమాసమున నిందు జరగినది. వైశాఖమునకు మాధనామము

గలదు. రాధ భగవంతునకుఁ బ్రాణాధికురాలు కదా. విభవ నామసంవత్సరమున నిది సాగుట మఱియు ప్రియసత్కారము. ఎవరికి? సాధుజనులకు. ఈ కారణములం బట్టి విభవవత్సరము శ్రీకృష్ణభక్తులకు సన్మంగళముల నొసంగునని నమ్ముచున్నాఁడను. కాలయవనుఁడు మథుర ముట్టడించుట, ముచుకుందుని పూర్వజన్మవృత్తాంతము, బలరామ శ్రీకృష్ణపరిశ్రమముల కొక్కచోట సంగతికలుగుట, జరాసంధ గర్వోన్మూలనము, ద్వారకానిర్మాణము, తన్నగరమునఁ గలతీర్థములమాహాత్మ్యము, బలభద్రవివాహము, రుక్మిణీకల్యాణము, స్యమంతకమణిచరిత్రము, సత్యభామాదులు శ్రీహరికిఁ బత్నులగుట లోనగు వృత్తాంతము, లీప్రకరణమునఁ బ్రధానములు. రుక్మిణీకల్యాణ విషయమున నా వ్రాసినయభిప్రాయము చక్కఁగాఁ బరికింపఁ దగినది. పురాణము లీవిషయమున నెట్టి భేదాభిప్రాయమును గనఁబఱచి కథ నలంకరించినవో పఠింపఁదగినది. కథను బఠించుటకుముందే యీ యభిప్రాయము నంగీకరింపరాదను భావమూనువారి కిందలితత్త్వ మెఱుకపడదని గట్టిగాఁ జెప్పఁగలను.

క. వినఁదగు నెవ్వఁడు చెప్పిన
వినినంతనె వేగపడక వివరింపఁదగుం
గనికల్ల నిజము తెలిసిన
మనుజుఁడెపో నీతిపరుఁడు మహిలోసుమతీ.

అనుసూక్తి నాదర్శముగానుంచుకొను బుద్ధిమంతులకు నా వ్రాఁతలోనిసారము సమ్మతమగునన్న నమ్మకము నా కున్నది.

పెక్కుసారులు చదివి నిష్పక్షపాత మతిఁ బరికింతురని సాధు జనులఁ గోరుచున్నాఁడను.

కొందఱు నా వ్రాయుచున్న మహాకవిపోతనగారి పద్యములకును మూలమునకును గలభేదమును దెలుపువిమర్శనమును గాంచి భేదాభిప్రాయమును గనఁబఱచుచున్నవారు. మూలమున లేనిభావమును దెలుఁగుననున్నపు డిది భాగవత తాత్పర్యము కాదనియు నిద్దానివలననే శ్రీకృష్ణచరిత్రమును మతాంతరులాక్షేపింప నవకాశముకలిగెననియు వ్రాయుచున్నాఁడనే గాని యా మహాభక్తాగ్రేసరుని గవికులసార్వభౌము నాక్షేపింప నే నెంతటివాఁడను. వారిపాదధూళికైన నీడుగాని నేను వారి నాక్షేపింతునా. అట్టిభావమును బొందవలదని ప్రార్థించుచున్నాఁడను. కొందఱు భాగవతమును దెనిఁగించునభిప్రాయము నాకుఁ గలదని భావించినట్లు తెలియవచ్చెడిని. శ్రీకృష్ణపరమాత్మ యీయల్పసేవకునివలన నేయే కార్యములు చేయింపఁబూనెనో యెవ్వ రెఱుంగుదురు? నా యూహాలు సుంతయు సాగవనియు, భగవంతుఁడాడింప నీచర్మనిర్మితప్రతిమ యాడుచున్నదనియు, దీనివలనఁ గలుగుకీర్త్యపకీర్తులకుఁ గారకుఁడు శ్రీకృష్ణుఁడే యనియు, నమ్ముచున్నాఁడను. ఇంకను విశేషించి పెంచి వ్రాయఁదగునంశములు లేవు. కాని ద్రవ్యసహాయము కావలయుననియు, నది యొదవకయున్న సాగుట కష్టమనియు, నీవఱకుఁ బాడినపాటనే మరలఁ బాడుచున్నాఁడను. ఈవఱకుఁ దోడ్పడుచున్న యంతరంగభక్తుల

నింకను దోడ్పడఁ బ్రార్థించుచున్నాఁడను. ఏది యెట్లున్నను ఈగొప్పకార్యము నత్యల్పమతినగు నాచేతఁ జేయించి మీగొప్పతనమును గనఁబఱతురని మహాత్ములగు మిమ్మెల్లం గోరుచున్నాఁడను. తొమ్మిదవ ప్రకరణమును శీఘ్రకాలమున వెలువడఁజేయు భాగ్యము నాకొసఁగఁ బరమేశ్వరుని హృదయారవిందమున నిడుకొని సదా వేఁడుచున్నాఁడను. అపరాధము లేవియున్నను క్షమింప సాధువులశిరస్సాగ్గి యభ్యర్థించుచున్నాఁడను.

ఇట్లు విన్నవించు సుజనపాదసేవకుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ. శ్రీ. శ్రీ.

# పోషకులు.

## శ్రీకృష్ణావతారతత్త్వమును బోధించు పుణ్యపురుషులు.

కడప.

మ. రా. శ్రీ. కే. గుండూరావుగారు, బి. ఏ., బి. యల్.
,, విరూరు పిచ్చయ్యగారు, బి. ఏ., ప్లీడర్.
,, సి. లక్ష్మీనారాయణశాస్త్రిగారు, బి. ఏ., బి. యల్.
,, కాకూరు శ్రీనివాసరావుగారు, బి. ఏ., బి. యల్.
,, యస్. సుబ్బరావుగారు, బి. ఏ., బి. యల్.
,, పి. సుబ్బరావుగారు, బి. ఏ., బి. యల్.
,, వి. రాధాకృష్ణయ్యగారు, బి. ఏ., బి. యల్.
,, బి. పి. దేవరాజులునాయుఁడుగారు, బి. ఏ., బి. యల్.
,, పి. నారాయణరెడ్డిగారు, బి. ఏ., బి. యల్.
,, సి. పి. రామచంద్రరావుగారు, బి. ఏ., బి. యల్.
,, కే. సూర్యనారాయణరావుగారు, ప్లీడర్.
,, భోగనాథము వేంకటసుబ్బయ్య శ్రేష్ఠిగారు.
,, పత్తి రాఘవులు శ్రేష్ఠిగారు.
,, కంచిరాజు లక్ష్మీనరసింహయ్యగారు.
,, సుంకేసుల సుబ్బయ్యగారు.
,, కామిసెట్టి లక్ష్మీనరసయ్యశ్రేష్ఠిగారు.
,, దేపతి పిచ్చయ్యశ్రేష్ఠిగారు.
,, కామిసెట్టి వేంకటేశముశ్రేష్ఠిగారు.
,, మల్లెంకొండు రామలింగయ్యశ్రేష్ఠిగారు.

మ. రా. శ్రీ. మాలేపాటి చిన్న వెంగన్నశ్రేష్ఠిగారు.
,, అన్నలూరు శేషగిరిరావుగారు.
,, మాలేపాటి వీరయ్యశ్రేష్ఠిగారు.
,, బి. శేషగిరిరావుగారు.
,, శ్రీకంఠము నరసింహయ్యగారు.
,, వేమగంటి శ్రీనివాసరావుగారు, బి. ఏ., ఎల్. టి.
,, పి. వీరభద్రరావుగారు.
,, పుష్పాల వేంకటస్వామినాయఁడుగారు.
,, శాస్త్రపాటి చలపతిరావుగారు.
,, బొందలకుంట వేంకటనారాయణరావుగారు.
,, ఆర్. గోవిందరావుగారు, బి. ఏ., తహసీల్దార్.
శ్రీమతి తలుపుల వేంకటసుబ్బమ్మగారు.
మ. రా. శ్రీ. బచ్చు వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, సకలా వేంకటసుబ్బయ్యగారు.
,, చిల్లా వేంకటకొండయ్యగారు.
,, వీరబోయిన కొండయ్యగారు.
,, మాకం జంగంశ్రేష్ఠిగారు, చీమలపెంట. [పల్లె.
,, గంగవరము వేంకటనారాయణరెడ్డిగారు, మిన్నాయగారి
,, పి. సీతారామయ్య పంతులుగారు, ఎమ్. ఏ., మునిసిపలాధికారులు.
,, సగరం గురురావుగారు, బి. ఏ., ఆఫిషియల్ రిసీవర్. యుత్తురువై ఎస్టేటు, వీరకేరళము.
,, గడియారము కృష్ణస్వామయ్యగారు.
,, గజరాంపల్లి రామచంద్రరావుగారు.
,, సూర్యవంశము వేంకటసుబ్బరావుగారు.
,, మద్దిరాల చెంచయ్యశ్రేష్ఠిగారు, నందిమండలము.

## కమలాపురము.

మ. రా. శ్రీ. బచ్చు రాఘవయ్యశ్రేష్ఠిగారు.
,, జి. సుబ్బరావుగారు.
మ. రా. శ్రీ. రాణువ ఫణిరావుగారు.
,, హనుమగుత్తి చెంచిరెడ్డిగారు, గ్రామమునిసిప్.

## వల్లూరు.

మ. రా. శ్రీ. సముద్రాల రామస్వామిగారు.
,, బెస్తవేముల నరసయ్యశ్రేష్ఠిగారు.
,, తంగటూరు చెన్నయ్యశ్రేష్ఠిగారు.
,, వంకదారు మాచయ్యగారి మల్లయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, పోలేపల్లి వెంగన్నశ్రేష్ఠిగారు, ఆరణిపోలేపల్లి సుబ్బయ్యశ్రేష్ఠిగారు.

## ఎఱ్ఱగుంట్ల.

మ. రా. శ్రీ. ఎఱ్ఱగుంట్ల వేంకటసుబ్బయ్యగారు, కరణము.
,, ఎఱ్ఱగుంట్ల వేంకటసుబ్బయ్యగారు.
,, మాలేపాటి నాగయ్యగారు, తల్లము సూరయ్యగారు.
,, పేర్ల నాగిరెడ్డిగారు.
,, ఏ. శ్రీనివాసులునాయఁడుగారు.
,, శంకరయోగి సుబ్బరావుగారు, నిడుజువ్వి.
,, అయ్యాదొరనాయఁడుగారు.

## పులివెందుల.

మ. రా. శ్రీ. మద్దాల బోగాదిశ్రేష్ఠిగారు, వేములకొత్తపల్లి.
,, పోలేపల్లి సుబ్బయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు, వేంపల్లి
,, పుల్లగూర వేంకటశేషయ్యశ్రేష్ఠిగారు, వేంపల్లి.

మ. రా. శ్రీ. కావుటూరు ఆనందరావుగారు, పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు.
,, లింగిరెడ్డి గంగిరెడ్డిగారు, ఎద్దులాయగారి, కొత్తపల్లి.
,, వడ్డకుంట అశ్వత్థమయ్యగారు, వేంపల్లి.
,, వద్దిరెడ్డి కొండారెడ్డిగారు, లింగాల. [తాలూకా.
,, సోము ధర్మారెడ్డిగారు, పాపాయపల్లె, జమ్ములమడుగు

## ప్రొ ద్దు టూ రు.

మ. రా. శ్రీ. కొప్పరపు సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, నారాయణము సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, నారాయణము సుబ్బరామయ్యశ్రేష్ఠిగారు.
,, వంగీపురము శ్రీనివాసాచార్యులుగారు, బి. ఏ., ప్లీడరు.
,, సి. నరసరామశాస్త్రిగారు, బి. ఏ., ప్లీడరు.
,, యం. రామస్వామయ్యగారు, ప్లీడరు.
,, రావులకొలను సుబ్బరావుగారు, డిప్టీ నాజరు.
,, ఉప్పలూరు భద్రయ్యగారు.
,, డి. రాజశేఖర కవిసింహులుగారు, శతావధానులు.

## రా జం పే ట.

మ. రా. శ్రీ. ఆర్కాటు పరశురామరావుగారు, యం. యల్. సి., [నెందలూరు.
,, యాదాళ్ల వేంకటరామయ్యశ్రేష్ఠిగారు, చిన్నపురెడ్డిపల్లె.
,, నూకల వేంకటసుబ్బయ్యగారు, అప్పయరాజుపేట.
,, పిడతల చిన్నవేంకటసుబ్బయ్యగారు, పెనగలూరు.
,, అచ్యుతన్న రామచంద్రరావుగారు, టంగుటూరు.
,, మంచి వీరరాఘవయ్యగారు, మందపల్లె.
,, పుట్టా నాగసుబ్బరాయశ్రేష్ఠిగారు, చిట్టివేలు.
,, గాలా వేంకటరెడ్డిగారు, పాటూరు గ్రామమునిసిఫ్.

## సిద్ధవటము.

మ. రా. శ్రీ. చల్లా చెంచుపాపిరెడ్డిగారు, చంద్రపల్లి.
,, గోపవరము గోపాలురెడ్డిగారు, గోపవరము.
,, యాదాళ్ల వేంకటరామయ్యశ్రేష్ఠిగారు, చిన్నపురెడ్డిపల్లె.

## రాయచోటి.

మ. రా. శ్రీ. కోట బాలయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు, నీలకంఠరావుపేట.
,, రేవులూరు సిద్దయ్యశ్రేష్ఠిగారు, కస్తూరిరాజుగారిపల్లె.
,, చిన్నబయ్యన్నగారి లక్ష్మన్నగారు, ఎఱ్ఱదొడ్డిపల్లె.
,, కుర్నూతుల వేంకటరమణయ్యగారు, లక్కిరెడ్డిపల్లె.
,, పర్వతరాజు వేంకటరమణయ్యగారు, నూలివీడు.
,, పుల్లగూర బాలసుబ్బయ్య దత్తుకుమారుఁడు పిచ్చయ్యశ్రేష్ఠిగారు, నీలకంఠరావుపేట.

## అనంతపురమండలము, హిందూపురము.

మ. రా. శ్రీ. దొంతి భీమయ్యగారు.
,, కట్టా అయ్యగారి గుండయ్యశ్రేష్ఠిగారు.
,, మాకము సీనయ్యగారి నారాయణయ్యశ్రేష్ఠిగారు.
,, నేగు బుచ్చయ్యశ్రేష్ఠిగారు.
,, గోరంట్ల వేంకటేశయ్యశ్రేష్ఠిగారు.
,, ఆర్. వేంకటేశయ్యశ్రేష్ఠిగారు.
,, పి. ఆదినారాయణయ్యశ్రేష్ఠిగారు.
,, కరణము కృష్ణరావుగారు, బేవినహాళ్లి.
,, శ్రీరాము తిమ్మయ్యశ్రేష్ఠిగారు.
,, పెద్ద నరసప్పగారి హనుమంతుగారు.
,, రెడ్డిపల్లె అప్పారావుగారు, కొడిగిపల్లె.
,, ఈడిగి అంజనప్పగారు.
,, టి. నారాయణరావుగారు, బ్యాడిగెర, మడకశిరతాలూకా.

## అనంతపురము.

మ. రా. శ్రీ. వెలమకూరు ఆత్మారామప్పగారు, పినాకినీ ముద్రాక్షరశాలాధికారులు.
,, హొట్టి శివరావుగారు, ప్లీడరు.
,, పులమతి ఆదిమూర్తిరావుగారు, ప్లీడరు.
,, జి. భద్రయ్యశ్రేష్ఠిగారు.
,, జి. రామయ్యశ్రేష్ఠిగారు.
,, బి. వేంకటప్పగారు.
,, ఏ. జి. కృష్ణారెడ్డిగారు, గ్రామమునిసిఫ్.
,, బి. ఓబుళేశప్పగారు.
,, కొమారుపల్లె వేంకటరావుగారు, అనుంపల్లె.
,, రాచర్ల తిప్పయ్యగారు, బెళగుప్ప.

## గుత్తి.

మ. రా. శ్రీ. యస్. సుబ్బరావుగారు, బి. ఏ., ప్లీడర్.
,, వై. శేషప్పగారు, ప్లీడరు.
,, వై. కొండలరావుగారు.
,, సి. సుందరరామయ్యగారు, హెడ్ క్లర్కు, మునిసిపుకోర్టు.
,, ఆర్కాటు గుండూరావుగారు, బి. ఏ., బి. యల్.
,, సిద్ధవరము వేకటసుబ్బయ్యగారు, బి. ఏ., ప్లీడరు.
,, కోవూరు వేంకటరావుగారు, పెన్షనర్.
,, నిట్టూరి లక్ష్మీనారాయణరావు, బి. ఏ., ప్లీడరు.
,, తరిమెల సుబ్బారెడ్డిగారు, తరిమెల.
,, జంబులపాడు పెద్దవేంకటప్పగారు, ధర్మపురి.
,, కానుగోవి కృష్ణమూర్తిరావుగారు, రివిన్యూ ఇన్‌స్పెక్టరు. (ఇప్పటినివాసము, అవుకు)
,, మొలకతాళ్ల చిన్నపుల్లయ్యగారు, గాండ్లపాడు.

## బళ్లారి మండలము.

మ. రా. శ్రీ. పిట్టా శేషప్పశ్రేష్ఠిగారు, ప్రజాసంఘకార్యదర్శులు.
,, రావుసాహెబు, జె. పాపయ్యశ్రేష్ఠిగారు.
,, అయ్యగార బసప్పశెట్టిగారు, కిరోసెల్లు.
,, ఏ. భీమరావుగారు, వ్యాపారస్థులు, ఆదవాని.

## కందనూలుమండలము.

మ. రా. శ్రీ. ఖాదర్ బాదర్ అంబాజీరావుగారు, నంద్యాల.
,, అవధానము వేంకటనరసయ్యగారు, ఉయ్యాలవాడ.
,, గాడిచెర్ల వెంకోబరావుగారు, గన్నవరము.

## కృష్ణామండలము.

మ. రా. శ్రీ. నండూరు వీరభద్రరాయశర్మగారు, నూజివీడు.

## నెల్లూరుమండలము.

మ. రా. శ్రీ. వెలంపల్లి రామకృష్ణమ్మగారు.
,, మలుమూడి లక్ష్మీనరసింహయ్యగారు.
,, ఇడమకంటి వేంకటరామిరెడ్డిగారు, తాళ్లూరు.
,, అల్లంపాటి పోలిరెడ్డిగారు, మంగుపల్లె.
,, పత్తి గురుమూర్తిశ్రేష్ఠిగారు, కుల్లూరు.
,, బొమ్మిశెట్టి లక్ష్మీనరసింహస్వామిశ్రేష్ఠిగారు, నెల్లూరు.
,, పువ్వాడ సుబ్బరాయశ్రేష్ఠిగారు, పెన్నబద్వేలు.
,, అన్నలూరు చిన్నచెన్నప్పనాయఁడుగారు, ఎనమదల గ్రామ మునసఫు, తూర్పుకంభంపాడు.

## గుంటూరుమండలము.

మ. రా. శ్రీ. ఆకెళ్లసప్రగడ లక్ష్మీనారాయణరావుగారు, బి. ఏ., బి. ఇ. డిస్ట్రిక్టు బోర్డు ఇంజనీయర్ గారు.
,, మారుటూరు పుండరీకాక్షుఁడుగారు, పట్టిచెరుకూరు.

## గోదావరి మండలము.

మ. రా. శ్రీ. కలిదిండి వేంకటరాజుగారు, రాజమహేంద్రవరము.
,, శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దర్, జమీందారుగారు, ఏలూరు.
,, దేశిరాజు సత్యనారాయణమూర్తిగారు, కరణం, పెద్దపట్నము
,, బొడ్డు మల్లికార్జునరావుగారు, బాపిరాజుగారు, ఏలూరు.
,, గిరెగె మాణిక్యముగారు.
,, ఏ. యస్. స్వామిగారు.
,, పెద్దిరెడ్డి రామరావుగారు, కైకవరము.
,, పి. యం. శ్రీనివాసయ్యంగారు, బి.ఏ., ఎం.ఎల్. డిస్ట్రిక్టు మునిసిఫ్, కాకినాడ.

## విశాఖపట్టణమండలము.

మ. రా. శ్రీ. మాడుగుల వేంకటస్వారావుగారు, జమీందారులు, బొంతలకోడూరు.

## గంజాము.

మ. రా. శ్రీ. పుల్లెల వేంకటరమణయ్యపంతులుగారు, ఇచ్ఛాపురము.

## చెన్నపురము.

మ. రా. శ్రీ. వి. యస్. నరసింహాచార్యులుగారు, బి. ఏ., బి. యల్.
,, కట్టా జోగయ్యగారు.
,, వాకాటి కృష్ణయ్యశ్రేష్ఠిగారు, ఆదెప్పనాయనివీథి.

# విషయసూచిక.

విషయము. | పుట.


| విషయము. | | పుట. |
|---|---|---|
| కాలయవనుఁడు మథురాపురి ముట్టడించుట. | ... | 13 |
| ముచుకుందుని పూర్వజన్మవృత్తాంతము. | ... | 29 |
| బలరాముఁడు వసుదేవాదులకు రాజనీతి నుపదేశించుట. | ... | 54 |
| బలరామవాసుదేవులు కరవీరనగరముఁ జేరుట. | ... | 56 |
| రామకృష్ణ పరశురామ సంభాషణము. | ... | 58 |
| పరశురాముంగూడి రామకృష్ణులు గోమంతపర్వతమున కరుగుట. | | 68 |
| జరాసంధుఁడు గోమంతమును ముట్టడింప నరుగుట. | ... | 73 |
| జరాసంధుఁడు గోమంతమును ముట్టడించి యుద్ధము చేయుట. | ... | 82 |
| రామకృష్ణులు కరవీరపురమున కరుగుట. | ... | 91 |
| శక్రదేవునకుఁ బట్టాభిషేకము చేసి శ్రీహరి ప్రయాణము చేయుట. | | 102 |
| రామకృష్ణులు మథురానగరమున కరుదెంచుట. | ... | 111 |
| బలభద్రుఁడు యమునానది నాకర్షించుట. | ... | 112 |
| ద్వారకానగర నిర్మాణము. | ... | 120 |
| గోమత్యుపాఖ్యానము. | ... | 128 |
| గజగ్రాహములకు శాపవిముక్తి కల్గుట. | ... | 134 |
| ద్వారకాపురమందలి శంఖోద్ధార తీర్థమహత్వము. | ... | 140 |
| ప్రభాసతీర్థమహాత్వము. | ... | 144 |
| రత్నాకర రైవతకాచలమాహాత్మ్యము. | ... | 147 |
| శ్రీకృష్ణుఁడు మథురానగరవాసుల ద్వారకకుం జేర్చుట. | ... | 157 |

గృహావృక్షములు, తత్ఫలములు. ... 160
గృహముల నుండఁదగులతలు. ... 163
మధురానగరవాసుల శ్రీహరి ద్వారకాపురికిం జేర్చుట. ... 167
బలభద్రవివాహము. ... 179
శ్రీరుక్మిణీకల్యాణ కథ. ... 194
రుక్మిణి శ్రీహరికిఁ బంపినసందేశము. ... 215
రాజులు కలవరపడుట. ... 242
రాజులు పరస్పరము సంభాషించుట. ... 248
రుక్మిణి కృష్ణాగమనమును గోరి పరితపించుట. ... 257
శ్రీకృష్ణున కభిషేకోత్సవమును జేయుట. ... 265
శ్రీకృష్ణాభిషేకోత్సవము. ... 279
శాల్వుఁడు కాలయవనునికడ కరుగుట. ... 302
కాలయవనుని సమాధానము. ... 318
రుక్మిణీకల్యాణము. ... 320
శ్రీహరి రుక్మిణిని రథమునఁ గూరుచుండఁ జేయుట. ... 324
రుక్మి శ్రీకృష్ణు నెదిరించి భంగపడుట. ... 336
రుక్మిణీకల్యాణమహోత్సవము. ... 350
భీష్మకుఁడు రుక్మిణిని గన్యాదానవిధిచే గృష్ణునకు సమర్పించుట. 357
పార్వతి లోనగుపతివ్రతలు శ్రీకృష్ణు నాశీర్వదించుట. ... 359
ప్రద్యుమ్నకుమార చరిత్రము. ... 268
రుక్మిణీసంతానము. ... 383
స్యమంతకోపాఖ్యానము. ... 384
శ్రీకృష్ణుఁడు సత్యభామాదికాంతలం బరిణయం బగుట. ... 406
శతధన్వుఁడు స్యమంతకమణి నపహరించుట. ... 414

శ్రీః

# శ్రీకృష్ణావతారతత్త్వము.

## ఎ ని మి ద వ ప్ర క ర ణ ము.



శ్లో. అస్తోకస్మితభర మాయతాయతాక్షం
నిశ్శేష స్తనమృదితం వ్రజాంగనాభిః,
నిస్సీమ స్తబకితనీలకాంతిధారం
దృశ్యాసం త్రిభువనసుందరం మహ స్తే. ౨౮
త్వచ్ఛైశవం త్రిభువనాద్భుతమిత్యవైమి
యచ్చాపలం చ మమ వాగవివాదగమ్యమ్,
తత్కింకరోమి విరణన్మురళీవిలాస
ముగ్ధం ముఖాంబుజ ముదీక్షితు మీక్షణాభ్యామ్. ౩౨
అశ్రాన్తస్మిత మరుణారుణాధరోష్ఠం
హర్షార్ద్రద్విగుణమనోజ్ఞ వేణుగీతమ్,
విభ్రామ్యద్విపులవిలోచనార్ధముగ్ధం
వీక్షిష్యే తవ వదనాంబుజం కదాను. ౪౪. ఆ. ౧

బాలాయ నీలవపుషే నవకింకిణీక
జాలాభిరామజఘనాయ దిగంబరాయ,
శార్దూలదివ్యనఖభూషణభూషితాయ
నందాత్మజాయ నవనీతముషే నమస్తే. ౨. ఆ. ౭౪

ఉదారమృదులస్మితవ్యతికరాభిరామాననం
ముదాముహు రుదీర్ణయా మునిమనోంబుజామ్రేడితమ్,
మదాలసవిలోచనవ్రజవధూముఖాస్వాదితం
కదాను కమలేక్షణం కమపి బాల మాలోకయే. 3. ఆ ౧౧.

మహాశయులారా! శ్రీ కృష్ణావతారతత్త్వమున సప్తమ ప్రకరణమునఁ బరబ్రహ్మ మొనరించిన విచిత్ర కార్యములఁ దెలుపు పవిత్రతరకథలఁ బఠించి కృతకృత్యులై తిరి. ఆ ప్రకరణమునందు సనత్కుమార శ్రీకృష్ణసంవాదము, నందునకు హరి దుర్గాస్తోత్రము నుపదేశించుట, మఱియు నందునకు వర మొసంగుట, ఉద్ధవుని గోకులమున కనుపుట, శ్రీహరి గోకులమునకుం బోవుట, రాధామాధవసంవాదము, ఋభుమునికి ముక్తినొసంగుట, నారదచరిత్రము, బలరాముని యద్భుత కార్యములు, శ్రీ రామకృష్ణులకు నుపనయనము, వారు విద్య నభ్యసించుట, మృతపుత్త్రుని దెచ్చి గురువునకు వారు సమర్పించుట, జరాసంధుఁడు మధురపై కిరాఁగా వానిఁ బాఱఁదోలుట, ముచుకుందాదుల యుత్పత్తి యనుగాథలు ప్రధానములు. వానిం బఠించుతఱి నింతింతనరాని మానసోల్లాస ముదయింపక మానదు. భ్రమరగీతలు పఠించునపుడు, వారిభావము కామోద్దీపకమా జ్ఞానోద్దీపకమా యని విమర్శింపఁదగినది. అట్టిగాథలం బఠించునపుడు చిత్తము నేకాగ్రత నొందఁజేసి భగవంతుని మహిమము నెఱుంగఁ బ్రయత్నింపవలయునే గాని సామాన్యార్థమును దెలిసికొని పండ్లిగిలింపరాదు. వా రుపయోగించినపదము లెట్టివి? అవి కాముకు లుపయోగించునట్టివియా, కేవలజ్ఞాను లుపయోగించునట్టివియా, యని విమర్శింపవలసి

యుండును. రాధోద్ధవసంవాదము, రాధిక యుద్ధవునకు జ్ఞానోపదేశ మొనర్చినవిధముం బరికింపఁగా మానసము మహానందసాగరతరంగరంగమున నాట్యము సల్పఁగలదు. దుర్గాస్తోత్రరాజమును శ్రీకృష్ణపరమాత్మయే నందున కుపదేశించుటం జూడఁగాఁ దనమాయయే దుర్గాదినామముల విఖ్యాతినొందు ననియు, ఆమాయాదేవి నాశ్రయించి యుపాసించి పూజించి ధ్యానించినఁగాని స్వదాసత్వమును భక్తులు పొందఁజాలరనియు, శక్తి నుపాసింపనివాఁడు ముక్తిపదప్రాప్తి కశక్తుఁడగు ననియుఁ గావున మహామాయను దప్పక యుపాసింపఁదగునని యు, సర్వమతములకును మాయోపాసనము సామాన్యధర్మమనియుఁ, దదుపాసనావిషయమున నభిప్రాయభేదములుండ నవకాశమే లేదనియుఁ దెల్లమగును. త్రిమూర్తులు మాయాతీతులు గారనియుఁ దదిచ్ఛామాత్రకల్పితులనియు సృష్టికి లోఁబడినవారెల్లఁ దత్కల్పితులేయనియు నామెకు భగవంతునితో నవినాభావసంబంధము గలదనియు, దాని నెఱుంగక వాగ్ధోరణిం జూపి వాదించుట కేవలాజ్ఞానఫలమనియు విస్పష్టమగును. మాయోపాసకులనఁగా భగవదిచ్ఛాశక్తిని బ్రార్థించువారు భగవత్పాదారవిందదాస్యమునొందఁ బాత్రులగుదురని భగవంతునిభావమని పొడకట్టెడిని. మఱియు దేవతాభేదములు కర్మానుభవములకుఁ దగినట్లు కల్పితములనియు, వానిని బట్టుకొని తారతమ్యముగలదని కలహించుట పనిలేనిమంగలి పిల్లితలగొఱుగుట యనుసామెత కుదాహరణమువంటి దగుననియు బుద్ధిమంతులు గ్రహింపవలసిన సారము. ఇట్టికథలు పురాణములలోఁ గనఁబడఁగా వానిని దూషించుటగాక

యవి రాజసతామసపురాణములలో నొకదానియందుఁ జేరు
నని కొందఱు వాదింతురు. దీనికంటె హఠవాదము లోకమున
నింకొక్కటి యుండదు. స్కాందాదులు తామసపురాణములే
యగుచో నందుండి శ్రీమన్మధ్వాచార్యులుగారు ప్రమాణ
ములఁ జూపుట యేలొకో తెలియఁజాలకున్నాఁడను. కావలసి
నపుడు ప్రమాణములై తక్కినయెడల నప్రమాణములే యై
నచో నావాదమునకు విలువలేదని నా భావము. భగవంతుని
కళయే యొక్కొక్కపనికై యొక్కొక్కరూపమును దాల్చు
ననియు, భగవత్తత్త్వ మొక్కటియేయనియు నదిగానిది
బ్రహ్మాండజాలముల లేనేలేదనియు నెఱుంగుట జ్ఞానిలక్షణము.
దేవతాభేదములఁ గల్పించుట భక్తునిలక్షణముగాదని యిటఁ
దేలిన సారతరాంశము.

ఉపాసకుఁడు తన యుపాస్యదేవతను భగవంతుఁడుగాఁ
బ్రపంచములన్నియుఁ దన్మయములుగా నుపాసించుట విధి.
అనఁగా భగవద్భిన్నము లేదని భావము. నామరూపాదులు
కల్పితములు. నిర్గుణబ్రహ్మమును సగుణముగా నుపాసించుట
సన్మార్గము. నామరూపాదులు లేక సర్వవ్యాపకముగా నుపా
సించుట యనఁగాఁ దాఁ జూచుపదార్థములఁ దన్మయములుగాఁ
గాంచుట సర్వసమత్వముగల యోగీంద్రుని లక్షణము. అది
యెల్లరకు సాధ్యముకాదు. కావున నొక్కరూపము, ఒక్కనా
మము, ఒక్కస్థానము నున్నయట్లు కల్పించుకొని ధ్యానిం
చుటయే యుపాసన యనంబడును. కల్పించుకొన్న రూపముల
యందు నుత్తమమధ్యమాధమవ్యవస్థ కెట్లవకాశముకలదో నే
నూహింపఁ జాలకున్నాఁడను. నామరూపాదులు కల్పితములే

కావు. ఆయాలోకములు గలవు. అందే భగవంతుఁ డుండును. ఇతరత్ర భగవంతుఁడు లేఁడు. అన్నచో భగవత్తత్త్వ మెఱుంగఁజాలనివారే వీరని చెప్పుటకంటె వేఱొక్కమాట చెప్పనవసరము లేదు. వారితో వాదించుట వృథాకాలక్షేపముగాని ఫలము లేదు. అనఁగా వారికది భక్తజన్మములలోఁ దొలిజన్మము. ఇంక నిట్లు వాదించుచుఁ బెక్కుజన్మముల నెత్తినఁగాని యీ వాదము నిరర్థకమనియు, దీన సారము లేదనియు వా రెఱుంగఁజాలరు. ఏజన్మమున భగవంతుని దివ్యతేజస్స్వరూపమున నున్నది, భగవదంశము కాని దీబ్రహ్మాండముల నేదియు లేదు, భగవదుపాసనయనఁగా దానితత్త్వ మెఱుంగుటయే, ఇంకను దనకుందోఁచు పదార్థములెల్ల భగవన్మయములుగాఁ దోఁచుటయే, అను బుద్ధికుదురునో అదియే కడపటిజన్మము. తప్పక యతనికి భగవదనుగ్రహము కల్గును. అతఁ డాజన్మమున భగవదిచ్ఛాశక్తి యను ప్రకృతి నుపాసించియే కాలము గడపును. ఆమహామాయ యాతని యజ్ఞానాంధకారమును దొలఁగించి భగవత్తత్త్వము గనఁబడఁ జేయును. ఒక రుపదేశింప నక్కఱ లేదు. తనంతన లభించును. ఈవిషయమును శ్రీరామానుజాచార్యులవా రెఱింగిరి. శ్రీదేవీద్వారా శ్రీమన్నారాయణమూర్తికరుణకుఁ బాత్రులు కావలసినదే కాని వేఱుమార్గము లేదనిరి. శంకరాచార్యులువారుగూడ నీవిధమునే యుపదేశించిరి. స్వమతము నుపాసనావిషయమై తెల్పుచు విగ్రహారాధన మత్యల్పఫలప్రదమని నిరూపించి సమయమత ముత్కృష్టమని బోధించుచు స్వకృతసౌందర్యలహరియందు నూఱవశ్లోకమునందు,

శ్లో. ప్రదీపజ్వాలాభి ర్దివసకరనీరాజనవిధి
స్సుధాసూతేశ్చంద్రోపలజలలవై రర్ఘ్యరచనా,
స్వకీయైరంభోభిస్సలిలనిధిసౌహిత్యకరణం
త్వదీయాభిర్వాగ్భి స్తవజననివాచాంస్తుతిరియమ్.

అని స్వాభిప్రాయమును దెలిపిరి. మహామాయాదేవీ! భగవదిచ్ఛాశక్తీ! నీవుకల్పింపని దీలోకముల నేదియు లేదు. మేము చేయుపూజలన్నియు నీవు కల్పించిన వస్తువులచేతనేగాని క్రొత్త వస్తువులచేఁ గాదు. నీవిచ్చిన వాక్కుచేతనే యీస్తుతి నొనరించితిని. అని తెల్పిరి. ఔరా! శంకరాచార్య! ఎంతటి తత్త్వజ్ఞుఁడవయ్యా! నీ యొక్కొక్కమాటయు వేదసారముగ దయ్యా మహానుభావా! రామానుజాచార్యా! నిక్కముగా శాక్తుఁడవన నీవే. భగవత్తత్త్వము నెఱింగిన ధన్యుఁడవు. శక్తి యన భగవదిచ్ఛయని తెల్పి నీజన్మము కృతకృత్యత నొందఁజేసి కొంటివిగా మహాత్మా! నామములు కల్పితములని యెఱింగితివి. ఏనామమున నాపరదేవిని బిల్చిన నోయని పలుకునని స్వానుభవమున నెఱింగితివి. ఏరూపమునఁ బూజించినను ఆ సర్వేశ్వరున్యకుఁ జేరునని గ్రహించితివి. పురాణపూరుషునికరుణకుఁ బాత్రుఁడవు గనుకనే నిర్భయముగాఁ దత్త్వము నెఱిఁగించితివి. మదిలో నున్నదానిని దాఁచి నోట మఱొకలాగునఁ బల్కుచుండు కపటాచారుల దూరముచేసితివి. సెబాసు. మెచ్చవచ్చు. నీభక్తి యోగులకేని నుత్యము. పామరుల కనుష్ఠానార్హము.

రాధ యుద్ధవున కుపదేశించినవిషయము పరిశీలింపఁదగినది. ఆమె కాలస్వరూపము నెఱింగించెను. దాన నేమిలాభ

మని కొందఱ యూహింతురు. అది పొరపాటు. దాన గ్రహింపఁ దగినవిషయ మొక్కటియే. కాలమెట్లు విభక్తముకాకున్నను వ్యవహారార్థము మనము దానిని విభజించుకొని పెక్కు పేరులు దానికిం బెట్టి లోకవ్యవహారము సాగించుచున్నామో అట్లే భగవత్తత్త్వము నానారూపములుగాఁ బరిణమించి లోకవ్యాపారమును సాగించుచున్నదన్న నమ్మకముగల్గినచో దేవతానింద దూరమగును. కాలమఖండమైనను ఖండముగాఁ గావింపఁబడి నదో యట్లే యఖండభగవత్తత్త్వము బహువిధరూప నామ ధేయములుగా వెలసినట్లు భక్తుఁడు భావించుకొనును. దాన నీ విభాగము కల్పితమేగాని వాస్తవముగాదని స్పష్టమగు. ఈ విషయము త్రికరణశుద్ధిగాఁ దోఁచినపు డట్టిమానవుఁ డెవరిని దూషింపఁగలఁడు? ఎవరిని దూషించినను బరతత్త్వమును, దూషించినట్లే యగుంగదా. ఈపాటివిశ్వాసము భక్తునకు లేనిచో నిఁక నతఁ డాతత్త్వము నెట్లుపాసింపఁగలఁడు? తరణోపాయము నెట్లు కనుఁగొనఁగలఁడు! ఇట్టిసంశయము లు పెక్కులా రాధోపదేశఘట్టమును బఠించి తదర్థమును గ్రహించినఁ దొలఁగునునుట నిశ్చితము.

ఇప్పట్టున నొక్క ప్రశ్నము రాకమానదు. భగవంతుఁ డొకఁడుకలఁడని యంద ఱందురు. ఎక్కడనుండునన్న సర్వత్ర యనుటకన్న వేఱొకమాట పలుకఁజాలరు. అదియే శక్తి దాని నుండి లోకము లుద్భవిల్లినవి. ఇన్నిలోకములు,ఇన్ని ప్రాణికోటు లుత్పత్తిల్లినవి. ఇవన్నియు నెందు లీనమగును? ఆయవస్థయం దవి యెట్లుండును? భగవంతునియం దిమిడియుండుననఁగా జీవకోటు లుగానుండునా, ఆతేజస్సులో గలిసిపోవునా? కలిసిపోవుననిన,

మరల వానికి సృష్టిలో హీనతనువు రాఁ గారణమేమి? అని. ఈ ప్రశ్నమునకు సమాధానముచెప్పుటకే యిన్నిశ్రుతులు పురాణాదులు కంకణము కట్టుకొన్నవి. కాని పరస్పరభేదములేకుండ నేకరీతిగా నవన్నియుఁ జెప్పఁజాలకున్నవి. ఈప్రపంచములు శాశ్వతములందుమా"ఏకమేవా ద్వితీయంబ్రహ్మ"యను శ్రుత్యర్థము మిథ్యయనవలసి వచ్చును. అనుటకు నోరాడునా. క్షణభంగురమగు దీనిని శాశ్వతమనుట వెఱ్ఱితనముగాదా మాఱుచుండునని యంద ఱెఱుంగుదురు. స్వర్ణము కటకకుండలాదులుగా మాఱినను బదార్థ మొక్కఁడేయైనట్లు మార్పునొందినను వస్తువు చెడదుకదాయని కొంద ఱాక్షేపింతురు. వీరి నమ్మించుటెట్లు? ప్రళయమున నన్నియు నొకతత్త్వమునందే యిమిడిపోవునందమా సృష్టియందు "ధాతా యథా పూర్వ మసృజత్" అన్న శ్రుతివాక్యము వ్యర్థమగును. పూర్వ మున్నట్లనఁగా నీ భూతజాలములన్నియు నొకచో బీజరూపమున నుండుననియు, సమయమురాఁగాఁ గర్షకులు బీజములఁ జల్లినట్లు సృష్టికర్త వారివారికర్మానుసారము వారివారిం బుట్టించుచుండుననియుఁ బై శ్రుతిభావము కదా. దీనింబట్టి స్వస్వకర్మానుసారము మరల భూతకోటి పుట్టువుంగాంచునని యంగీకరింపవలయుఁ గదా. ఇంక నెట్టివాదము తుదముట్టునాయని యెంతును. దీనిందడవుట సముద్రమున కేఁతము వేసినట్టిదగును. మానుదమన్న నదియు న్యాయముగాఁ గనఁబడదు. కర్మ మనాదియని యంగీకరింపవలయు. కర్మము బ్రహ్మస్వరూపమనియు నంగీకరింపవలయును. గర్మఫలానుభవము తప్పదనియు నంగీకరింపవలయును.

పరతత్వ మొకజ్యోతిస్సు. దాని ప్రతిఫలనముచేతనే యెల్లవస్తువులు చేతనముం గాంచును. అగ్నియం దుష్ణగుణ మెట్టిదో, చంద్రచంద్రికల కెట్టిసంబంధమో, జలశీతముల కెట్టి బంధుత్వమో, పరతత్వమునకుఁ బ్రకృతికి నట్టియనుబంధము కలదు. పై వెట్లు వేఱుచేయ నెవరికే నశక్యములో యట్లే ప్రకృతిపురుషులకు వేఱుస్థితికల్పించుట బ్రహ్మాదులకేని శక్యముగాని పని. అగ్నినుండి విస్ఫులింగము లెగుర్చును. కొన్ని రూపముల డంగ నశించును. కొన్నిచల్లారి బొగ్గు లనఁబడును. ముక్తులగు జీవులు భగవంతునియందు విలీనులగుదురు. కర్మశేషముగల జీవులు కర్మానుగుణమగు రూపమును దాల్చి ఫలముల ననుభవించి సత్కార్మానుష్ఠానమునంజేసి ముక్తులగుదురు. ఈసంసార మనాదియని పేరుపొందినది. దీని కాద్యంతములు కలవనుట శక్యము గానిపని. కావున దీనినంతయుఁ బరికింపఁగా భగవత్కళావిరహితమైనది లేదనిమాత్రము పొడకట్టుచున్నది. అనాది సంసారమున నంతమిట్టిదని కల్పించుట వెఱ్ఱితనము. భక్తుఁ డింతమాత్రము గ్రహింపందగును. ఇంతకంటెఁ బొడవుగా నాలోచించిన నేదియుఁ దోఁపకుండుటయే గాక క్షణమాత్రజీవనము వ్యర్థముచేసినట్టులు నగు. ఒక్కనియాయుష్కాలమున నిర్ణయింప వీలులేనివిషయ మిది. భగవత్తత్వము నారాధించుట క్షేమముగాని యిట్టివిషయముల విచారించుచుఁ బ్రొద్దుపుచ్చి వెనుక జింతించుట యవివేక మగును. కావున భగవద్భక్తి నాధారము చేసికొని సంసారసాగరమును దరించి భగవత్పాదారవిందముల దర్శింప భక్తుఁడు గోరుచుండవలయును. లయముకాఁగా నిందేమియుండునని కొందఱును, మనభూముల

హద్దులు పోవుగదాయని కొందఱును, మనయిల్లు సౌధముకాన నశింపకున్న మరలసృష్టికాఁగా వచ్చి మనయింటిలోనే యుండ నగునుగదా యని మఱికొందఱును, ఇంతకాలము పైపూఁత లేకున్న చెడిపోవకుండునాయని యింకను గొందఱు నాలోచించు చెట్టిదో యిట్టి వెఱ్ఱిచర్చలను జేయుటయు నట్టిదే యని నా భావము. నే నింతదనుకఁ జూచివచ్చితిని. అక్కడిస్థితి యిట్లున్నది. మన మీత్రోవనఁబోయిన ముం ద్లుండవు. నేను బిలుచుకొనిపోవ సిద్ధముగనున్నాఁడను. రండని పిలుచువాఁడొక్కఁడును గానరాఁడు. ఈశ్రుతియం దిట్లున్నది. ఈస్మృతి యీయర్థమును దెల్పును. ఈపురాణ మీభావమును బోధించెడిని. ఈయితిహాస మిట్లని శాసించినదని చెప్పువారే కాని మోక్షమంటపమున కిన్ని స్తంభము లున్నవి, స్తంభముల నానుకొనికూర్చుండిన హాయిగానుండును, లోపలనుండి యిన్ని గడియలకు భగవంతుఁడు గరుడవాహనమో నందివాహనమో హంసవాహనమో మఱెద్దానినో యెక్కివచ్చును, భగవంతుఁడు రాఁగా మనము లేచి నిలుచుండవలయును. లేవకున్న భటులు చర్మకశలం గొట్టుదురు, ఇంతకర్పూరము వెలిఁగింపవలయుననియు నిన్ని మాఱులు దండప్రణామములు సమర్పింపవలయుననియుఁ దెల్పువా రొక్కరును గనఁబడలేదు, మతస్థాపకు లందఱిట్లే యింకొక్కదాని బ్రమాణముగాఁ జెప్పినపుడు వారిమాటల నన్నింటిని గలిపి మనకు శక్యమగునంతదనుక నాలోచించి సత్కార్యము నొనరించుచు నసత్కార్యముల వదలుచు భగవంతు నారాధించుచుఁ బెద్దల నాదరించుచుఁ బిన్నలఁ బ్రేమించుచు శాస్త్ర

ములఁ బఠించుచు దాంభికుల విసర్జించుచు హితమును సంగ్ర హించుచు నహితమునకు దూరముగానుండుచుఁ గాలము పుచ్చుటకంటె మంచిమార్గ మొక్కండును గానరాకున్నది. ఎవరి నాక్షేపింపను వలనుపడక యున్నది. కావున సులభమగునదియు, నితరసహాయమును గోరనదియు, ద్రవ్యమక్కఱలేనిదియు భగవత్సేవయే. జపయజ్ఞమే. సజ్జనగోష్ఠియే సద్గ్రంథపఠనమే. ఇంతకంటె నీలోకమున నల్పాయువు గలమనుష్యులకు వేఱుమార్గము తరణోపాయమును జూపునది కానరాదు. ఈభేదములలో నేదాని కలవాటుపడినను బరమతదూషణమున కవకాశము లేదు. పరదేవతానిందకుఁ జోటులేదు. కపటాచారములకు ననుకూలము లేదు. డంబముగానుండుటకు సమయము లేదు. పరులవంచింప మార్గములేదు. కావున నీమార్గమున నడువ నిశ్చయింతము. శ్రీకృష్ణపరమాత్మను సేవింతము. తన్నామమును జపింతము. శ్రీకృష్ణధ్యానమున మదినిలువ ననుగ్రహింపుమా యని రాధాదేవి నభ్యర్థింతము. తత్కారుణ్యము బాత్రులముగాకయున్న శ్రీహరిఁగొలువ నవకాశము లేదు. కావున ననాదిదంపతులై ప్రకృతిపురుషు లనంబరఁగిన రాధామాధవుల భజింతము. సంసారసాగరము గోష్పాదమాత్ర దగును. ఇది సత్యము. సత్యము. సత్యము.

మహాశయులారా! మూలసూత్ర మొక్కటియే. భగవన్నామసంకీర్తనము, తత్పాదసంసేవనము, తత్కథాపఠనము, అను నీమూఁడును మనుజులకు నవశ్యకములని. ఈమూఁడును సాగినఁగాని భక్తి స్థిరతఁగాంచదు. కావున నప్పనికిం గడంగు

దము. శ్రీకృష్ణావతారతత్త్వమున నేఁడవప్రకరణమునఁ జదివిన గాథల మది నిలిపియుందురు. ఇంక నెనిమిదవప్రకరణమును బఠింపవలయు ఇంతదనుక శ్రీకృష్ణమూ_ర్తి తనయవతారఫలమును విశేషించి చూపఁదలంపలేదు. ఈప్రకరణమున నా కమనీయమూ_ర్తిచరిత్రము లావిషయమును బోధించును. కాన శ్రద్ధమైఁ బఠింప నడుముకట్టుఁడు. జరాసంధుఁడు మథురానగరమును దండెత్తి యొక్కొత్తుగా మ్రింగఁబూని పదునేఁడు పర్యాయములు భగ్నాశుఁ డయ్యెను. పదునెనిమిదవపర్యాయమపారబలములం గూడి రాఁ బ్రయత్నము చేయుచుండెను. ఆమీఁదిచరిత్ర మీప్రకరణమునఁ జదువందగును. ముచుకుందాదులకథలు మహానందకరములు గావున వాని నోపికమైఁ బఠింపందగును. ఇఁకఁ గథారంభము చేయఁదలంచుచున్నాఁడను. గతప్రకరణమున వ్రాయఁబడిన ముచుకుందాదుల యుత్పత్తిచరిత్రమునుమాత్రము మఱువకుఁడు. సకలపాపక్షయార్థ మొక్కపర్యాయము శ్రీకృష్ణ వినుతిశ్లోకమును బఠింపుఁడు. మనస్సును దత్పాదారవిందముల నిలుపుఁడు. శ్లోకార్థమును దద్రూపమున నిముడునట్లు చేయుఁడు. దాన మహానందము కలుగును.

శ్లో. రాధా మోహన మందిరాదుపగత శ్చంద్రావలీ మూచివాఙ్
రాధే క్షేమ మయేఽస్తి తస్యవచనం శ్రుత్వాహ చంద్రావలీ,
కంస క్షేమ మయే విముగ్ధహృదయే కంసః క్వదృష్ట స్త్వయా
రాధాక్వేతి విలజ్జితో నతముఖస్మేరో హరిః పాతువః.

3 ఆ. ౧౦౬.

## కాలయవనుఁడు మథురాపురి ముట్టడించుట.

* ఆర్యులారా! ముచుకుందుని జన్మవృత్తాంతము హరి వంశమునుండి వ్రాయఁబడినదాని నేడవ ప్రకరణమునఁ జివర భాగమునఁ బఠించితిరి. యదుభూపాలకునకు నాగకన్యకయందుఁ గలిగినట్లు గలదు. భాగవతమునందు మాంధాతృపుత్త్రుఁడు ముచుకుందుఁడని కానంబడియెడిని. ఇంతటివిరోధము నెట్లు పరిహరింపఁదగునని ప్రశ్నింపక మానరు. కాని కాలయవనుని వధించిన ముచుకుందుఁడు హరివంశమునఁ జెప్పఁబడిన ముచుకుందుఁడు కాఁడేమో యని కొందఱందురు. ఇదియే కొంత వఱకు మనస్సునకు సరిపడియుండును. ఇట్లు సమాధానముచేసి కొని పైకథ పఠించిన మేలు. భగవద్విషయమున కీయల్పభేద ములు బాధకములు గావు. కావున నల్పముల ననల్పములుగా భావించి వెనఁగులాడక కథాసారమునఁ గలతరణోపాయమా ర్గము నెఱకుట భక్తులపని. గ్రంథాన్వేషణతత్పరులు పనిలేని

* ఈకథ శ్రీభాగవతము ౧౦ వ స్కంధము ఏఁబది, ఏఁబదియొక డవ యధ్యాయములనుండియుం, బ్రహ్మపురాణము ఎనుబదెనిమిదవ యధ్యా యమునుండియుం, విష్ణుపురాణము పంచమాంశము ఇరువదిమూఁడవ యధ్యా యమునుండియుం, గర్గసంహిత ద్వారకాఖండము రెండవయధ్యాయమునుం డియుం గ్రహింపఁబడినదని యెఱుంగునది. ఇందు ఈషద్భేదములుగా నుండు విషయములందుఁ బురాణభేదములఁ బాటింపక భాగవతము ప్రధానముగాఁ గైకొని వ్రాయఁబడుననియుం నెఱుంగుట సముచితము. ముచుకుందోత్పత్తి యందు హరివంశమునఁ గలవిషయమునకు భాగవతమునఁ గలవిషయమునకుఁ గలభేదము దుర్నివారము. కావున నట్టివిషయములందు నా యపరాధ మేమి యుంలేదని విన్నవించువాఁడను.

మంగలివంటిపని చేయఁబూనువారు పెక్కండ్రు గలరు. వారికిఁ గావలసినది కాలక్షేపమే. సాధువులకు వలయునది తరణోపాయము. ఈ రెండింటికి స్వర్గమర్త్యముల కున్నంతదూరము గలదు. కావున భక్తుల కట్టి భేదవిమర్శ మక్కఱలేనిది. ఎవరి నైననేమి ముచుకుందుఁ డనురాజును భగవంతుఁడు దర్శన మిచ్చి కృతకృత్యునిఁ జేసెను. అనువిషయము సాధుమానసులకు భక్తిమార్గమూనుచో నవసరము. అంతియకాని యీ ముచుకుందులలో నెవరు కాలయవను నడంచెను? ఈతఁ డే కాలమున జనించెను? ఇంతకాలము జీవింప మనుజుల కధికారము గలదా? బ్రదుక శక్యమా? పదార్థవిజ్ఞానశాస్త్రము ననుసరించి (సైన్సు) మనుజునియెమ్ముకలు నూఱువత్సరములకుఁ జెడునుగదా. అను నిట్టి ప్రొద్దుపోనిమాటలతో నక్కఱయుండదు. ఆయుర్దాయమున నొకక్షణమైన వ్యర్థముగాఁ బుచ్చరాదు. హరిస్మరణప్రభృతికార్యములతో నా కాలమును బుచ్చుట తరణోపాయమని సాధువులభావము. విమర్శించినను దెలియ శక్యముగాని విషయములఁ గాలముపుచ్చుచు నా ప్రసంగమే మోక్షపురుషార్థమనుకొనుచు సంతసించుమహాత్ములతో వాదము భక్తులకువలదు. అందఱఁ దరింపఁజేయ శక్యముకాదు. భగవత్కథలఁ గొందఱే పఠింతురు. అందుఁ గొలఁదిమందియే వాని మది నిలుపుకొందురు. అందును గొలఁదిమందియే భగవత్సేవాతత్పరు లగుదురు. అంతియగాని భగవంతుఁ డేయాకారమునుండును? ఉన్న శ్లేశాసనమునఁ గలదు? చూపుమని ప్రశ్నించి ప్రశ్నించి సభలలోఁ దమవాగ్ధాటి నుపయోగించి యుపయోగించి బల్లలు గ్రుద్దిగ్రుద్ది సభనుండి వినంబడు కరతాళధ్వనుల

కుబ్బియుబ్బి వార్తాపత్రికలయందుఁ దమపేరుంగాంచి సంతసించి సంతసించి ముక్తిపదమును జంకఁబెట్టుకొన్న సాధువు లూహింపరు. అది దుష్కాలక్షేపమని, తనజీవితమును వ్యర్థముచేసిన ట్లగునని భక్తులు భావింతురు. కావున భగవత్కథాసారామృతపానమును జేయఁగోరు మీరెల్ల రామార్గమున నడువరను నిశ్చితము నాకుఁ గలదు. కావున నిఁక సావధానులరై కథ నాలకింపుఁడు.

జరాసంధుఁడు పదునేడుపర్యాయములు పరాజయము నొంది పదునెనిమిదవపర్యాయము మహత్తరసంగ్రామ మొనరింపఁ బ్రయత్నము చేయుచుండెను. ఏక్షణమునవచ్చి మథురను ముట్టడించునో యని మథురానగరవాసు లుడుకుచుండిరి. వికద్రు వట్టితటినేకదా శ్రీకృష్ణునిం బ్రార్థించెను. భగవంతుఁడీబాధ నగరవాసులకుం గలుగకుండఁజేయఁ బ్రయత్నించుచుండెను. ఈవృత్తాంత మిట్లుండఁగాఁ గాలయవనునివృత్తాంతమించుకంత పరికింతము. నారదముని యొకానొకదినంబున లోకములఁ గ్రుమ్మరుచు మర్త్యలోకంబునకు వచ్చి యేమో మించి పోయినట్లు కాలయవనునికడకుం బోయి యతఁడు తన్నుం బూజింపఁ జల్లఁగాఁ గూరుచుండి యతనికి మేలుచేయఁ బూనినట్లు మెల్లఁగా నిట్లనియె. యవనాధిపా! బలపరాక్రమముల నాకంటె వీరుఁడు లేఁడని విఱ్ఱవీఁగుచుందువు. కాని లోకమున నెంతటివారు కలరని పరికింపవు. మథురానగరము కలదుకదా. అందు యాదవులు పాలకులుగ నుందురని విందువుకాదే? వారిలో నొక్కఁడు బలపరాక్రమాది రాజసద్గుణంబుల నసమానుఁడై యిల విలసిల్లెడిని. ఈలోకమున నంతటివాఁడు లేఁడని చెప్ప

వలసివచ్చినది. ఆతనికృత్యముల వింటివికదా. అని యొత్తిచెప్పఁగా వాఁడదరిపడి నారదునితో నిట్లు పలికెను. ఈఘట్టమున మూలమునందు,

శ్లో. నారదప్రేషితో వీరో యవనః ప్రత్యపద్యత. ౪౨
రురోధ మథురామేత్య తిసృభి ర్మ్లేచ్ఛకోటిభిః. ౪౩

అని కనుపెట్టడిని. మహాకవిపోతనగారు,

మ. యవనా నీవు సమస్తభూపతుల బాహాఖర్వగర్వోన్నతిం
బవనుండభ్రములన్ హరించుపగిదిన్ భంజించియు న్నేలయా
దవులన్ గెల్వవు? వారలన్ మఱచియో దర్పంబులేకుండియో
యవివేకస్థితి నొందియో వెఱచియో హైన్యంబునుం జెం
[దియో.

అను నీ పద్యముచాలక,

క. యాదవులలోన నొక్కఁడు
మేదినిపై సత్వరేఖ మెఱసి జరాసం
ధాదులఁ దూలందోలెను
దాదృశుఁ డిలలేఁడు వినవె తత్కార్యంబుల్.

అని వ్రాసిరి. శృంగారమున భక్తినిగాక తక్కుచోట్లఁ దెనుఁగునఁ బెంచివ్రాయలేదన్న నానుడి దీనితోఁ దొలఁగెఁ గదా. సమయానుసారము పెంచియుఁ దగ్గించియు మహాకవివ్రాసెననియు నట్టియధికారము గ్రంథకర్తలకుం గలదనియు నది తప్పుగాదనియు నెఱుంగుట మంచిదియేగాని భక్తిరసమున నొడలెఱుంగక పెంచిచెప్పెననియుఁ దక్కినతావుల నున్నదున్నట్లు వ్రాసెననియుఁ గల్పించుట మిగులఁ బొరపాటు. ప్రకృతమునకు రండు.

నారదమునీ ! నీవు వచించినవాఁ డెంతవాఁడు ? ఏరీతి విహరించును ? అతనిమిత్రు లెవరు ? దోస్సారము గలదా ? విశేషించి కయ్యములు సలిపెనా ? రణరంగమున నాబాహుశౌర్యమునకుఁ దాళఁగలఁడా ? శూరుఁడనన్న గర్వము గలదా ? అని ప్రశ్నించెను. నారదముని త్రికాలవేత్త. వీని కాయువు సమీపించి యి ట్లడుగుచున్నవాఁడు కదాయని యూహించి మఱింత యాగ్రహంబుఁ గల్పింపనెంచి యిట్లు బదులుచెప్పెను. కాలయవనా! ఏమి చెప్పుదును ? ఆయాదవవీరునిమహత్వ మద్భుతము. వినుము.

సీ. నీలజీమూతసన్నిభశరీరమువాఁడు
తామరసాభనేత్రములవాఁడు
పూర్ణేందుబింబంబుఁ బోలెడిమోమువాఁ
డున్నతదీర్ఘబాహువులవాఁడు
శ్రీవత్సలాంఛనాంచితమహోరమువాఁడు
కౌస్తుభమణిపదకంబువాఁడు
శ్రీకరపీతకౌశేయచేలమువాఁడు
మకరకుండలదీప్తి మలయువాఁడు
తే. రాజ యింతింతవాఁ డనరానివాఁడు
మెఱసి దిక్కులనెల్లను మెఱయువాఁడు
దెలిసి యేవేళలందైనఁ దిరుగువాఁడు
పట్టనేర్చినఁగాని లోఁబడనివాఁడు.

అని యనేకభంగుల వర్ణించి చెప్పెను. ఈపద్యమునకు మూలము మహాకవి భక్తి యే పుస్తకమున నొక్కమాటయైనఁ గానరాదు. కాని యొక్కొక్కపదమునందును శ్రీకృష్ణుఁడు భగ

వంతుఁ డనుభావము కలదు. ఈయర్థ మాపాపాత్మునకుఁ దెలి యుటెట్లు? ఈమాటలు చెవిఁబడినంతనే మండిపడి యాదవుఁ గలఁచి,

ఉ. యాదవుఁ డెంతవాఁడు ప్రళయాంతకుఁడైన నెదిర్చెనేని యుం, గాదనఁ బోర మత్కలహకర్కశబాహుధనుర్విముక్త నా, నాదృఢహేమపుంఖకఠినజ్వలదస్త్రపరంపరాసము త్పాదితవహ్నికీలలను భస్మము చేసెదఁ దాపసోత్తమా.

యని బిగ్గరగాఁ బలికెను. ముని యానందించెను. వెఱ్ఱి ముదిరి నది. రోకలిని దలకుఁ జుట్టుకొనుచున్నాఁడు. వీఁ డీయుపదేశ మున హరిపై కరుగును. మరల నీరూపమున మరలఁడు. లింగ శరీరముననే యెచ్చటికిఁ బోయినను బోవును. నా ప్రయత్నము ఫలించినది. నేనిఁక వెందేనరిగెద. అనిపలికి కాలయవనునకు మఱింత ప్రోత్సాహము గలిగించి నీకు శాశ్వతసుఖము కలు గుఁగాతమని దీవించి యథేచ్ఛం జనియెను.

కాలయవనుఁ డప్పుడే దండనాయకులం బిలువంబంచి సేనల నాయత్తపఱుపుఁడని యాజ్ఞాపింప వారశ్రమంబున మూఁ డుకోట్ల మ్లేచ్ఛవీరుల సంసిద్ధులను జేసి విన్నవించిరి. పయనము సాగించెను. సేనామహార్ణవము కతిపయదినములకే మధురానగ రంబుమీఁదవిడిసెను. ఆదాడి నగరవాసులకుఁ బ్రళయముగాఁ దోఁచెను. ఆబాలగోపాలము పరితపించిరి. దిక్కేమియని చింతించిరి. కాలయవనుఁడు మ్లేచ్ఛవీరుఁడు. కరుణయన నల్ల నిదో తెల్లనిదో యెఱుంగఁడు. వాహినులు దుర్జేయములుగా నున్నవి. ప్రాకారములు వీరిధాటికిఁ బటాపంచలు కాక తక్కవు.

పురంధ్రీమానరక్షణము చేయుటెట్లు? అని పెక్కుభంగులఁ జింతింపసాగిరి: ప్రాణములపై నాశ వదలిరి. అఱచేతులఁ బ్రాణము లుంచుకొని యేక్షణమున మ్లేచ్ఛవీరులచేఁ బడుదుమో యని తల్లడిల్లుచుండిరి. ఇంతకంటెఁ బామరులు గలరా. జగద్రక్షకుఁడు తమనగరమున నొకరూపమును దాల్చియుండ వారికేమి భయమంటును.

అత్తఱి శ్రీకృష్ణుఁడు బలరాముఁ గాంచి యిట్లు సంభాషించెను. కాలయవనుఁడు మననగరము నావరించి సేనల నిలిపెను. నేఁడో రేపో జరాసంధుఁ డపారసైన్యములం గూడి రాఁగలఁడు. వీరిరువురు బలశాలురుగాని సామాన్యులు కారు. మన మిపు డీకాలయవనునితో యుద్ధము చేయఁ బోవుదుమేని జరాజంధుఁ డాకస్మికముగ వచ్చి మన మొకమూల నుందుము గావున బంధువులఁ బొరిఁగొను. అట్లుగాదేని చెఱఁబెట్టఁ గొని పోవును. కావున బంధువులనందఱ నొక్కదుర్గమస్థలమున నునిచి కాపాడవలయును. ఆచోటు పరులకు సుదుర్గమముగా నుండవలయు. * కావున నేనొక్కండన పురము వెలువడిపోయి యీతని నుపాయంబున నశ్రమంబునం జంపించెద. నీ విందే యుండుమని యెఱింగించి తదనుమతంబుఁ బడసి మధురానగరంబు నిర్గ

---

* ద్వారకానిర్మాణము ముందు వ్రాయఁబడును. శ్రీభాగవతమున దశమస్కంధమున నేఁబదియవయధ్యాయమున ౪౦ వ శ్లోకమునుండి ౫౭ వ శ్లోకమువఱకుఁ గలభాగమును నిలిపి తరువాతియధ్యాయమునఁ గల కథను వ్రాసెదను. తక్కినపురాణములఁ గలకథ నిట్లే వదలితినని యెఱుంగవలయును. కాలయవనవధానంతర మీకథ కవకాశ మెక్కడిదను నాక్షేపము వచ్చునని యెఱుంగుదును. కాని మఱికొన్నిపురాణములకథలుగూడ దీనితోఁ

మించెను. కరములయం దొక్కయాయుధమైనను లేదు. ఒక్క సేవకుఁడైన వెంటలేఁడు. నగరద్వారము నిర్గమించి కాలయవనున కభిముఖుఁడై శ్రీరాధామనోహరుఁడు విలాసగమనంబున వెడలెను.

క. విభులగు బ్రహ్మప్రముఖుల
కభిముఖుఁడై నడవకుండునట్టి గుణాఢ్యుం
డిభరాజగమన మొప్పఁగ
నభిముఖుఁడై నడచెఁ గాలయవనున కధిపా.

అను పోతనగారి భక్తిభావము వేయినోళ్లఁ గొనియాడఁ దగి శిరోధార్యముగ నున్నది. అత్తఱి నాసేనలం గలవారెల్ల వీఁ డెవ్వఁడై యుండునా యని యూహింప సాగిరి. కొందఱు యుద్ధము చేయఁజాలక మనయేలికను దర్శింప వచ్చుచున్న జాడ తోఁచెడి ననుకొనిరి. కొంద ఱిందేమో మోస మున్నది. భీతుఁ డుగా నీతఁడు కానరాఁడు. ముందుముం దీతనికృత్యము తెలియఁగలదని గుసగుస లాడఁజొచ్చిరి. మఱికొంద ఱితఁడు కాలయవనునికడ కరిగి శరణాగతత్వము గనఁబఱచి యేమో మోసము చేయఁబోవుజాడ కనఁబడుచున్న దని పలుకసాగిరి. ఇట్లు పలువురు పలుభంగులఁ బలుకుచుండునంతలో శ్రీహరి కాలయవనున కభిముఖముగాఁ గొంతదూరము పోయెను.

---

గలుపవలయునుగాన నట్లు వ్రాయఁ దలంచితి నని విన్నవించెదను. ఇంతియ గాక ద్వారకానిర్మాణమునఁ బెక్కువిషయములు వ్రాయవలసియుండును. చాల గ్రంథమగును. ఇదియు నొకహేతువుగా నిట వదలితి ననియు నూహింపందగు.

అత్తఱిఁ గాలయవనుఁ డామహనీయమూర్తిం గాంచెను. ఈ ఘట్టమున శ్రీభాగవతశ్లోకములు వేదతుల్యము లనం దగు.

శ్లో. తం విలోక్య వినిష్క్రాంతముజ్జిహానమివోడుపమ్
దర్శనీయతమం శ్యామం పీతకౌశేయవాససమ్
శ్రీవత్సవక్షసం భ్రాజత్కౌస్తుభాముక్తకంధరమ్
పృథు దీర్ఘ చతుర్బాహుం నవకంజారుణేక్షణమ్
నిత్యం ప్రముదితం శ్రీమత్సుకపోలం శుచిస్మితమ్
ముఖారవిందం బిభ్రాణం స్ఫుర న్మకరకుండలమ్
వాసుదేవో హ్యయమితి పుమాన్ శ్రీవత్సలాంఛనః
చతుర్భుజో ఽరవిందాక్షో వనమా ల్యతిసుందరః
లక్షణై ర్నారదప్రోక్తై ర్నాన్యో భవితు మర్హతి
నిరాయుధశ్చలన్ పద్భ్యాం యోత్స్యేఽనేన నిరాయుధః.

ఈయమూల్యశ్లోకముల కేలాకో తెనుఁగున మహాకవిపోతన యొక్కపద్యమునే వ్రాసెను దానిం గాంచుఁడు.

మ. వనజాతాక్షుఁడు సింహమధ్యుఁడు రమావక్షుండు శ్రీవత్స
లాం, ఛనుఁ డంభోధరదేహుఁ డిందుముఖుఁ డంచద్దీర్ఘబా
హుండు స, ద్వనమాలాంగదహారకంకణసమిద్యత్కుండలుం
డీతఁ డా, ముని సూచించిన వీరుఁ డౌ ననుచు నమ్మ్లా
ధుండు గాఢోద్ధతిన్.

ఇంతకంటె వేఱొకపద్యమేని వచనమేని గానరాదు. కాలయవ నుని చూడ్కులకుఁ గనఁబడినపు డింతమాత్రమే చాలునని తృప్తిపడెనో తెలియఁజాల కున్నాఁడను. దీనితర్వాత నవనవ రముగా నొకసీసపద్యమును వ్రాసిరి. కవివరుహృదయ మెవ్వ రెఱుంగఁ గలరు ?

ఇట్లు నిరాయుధుఁడై వచ్చునా శ్రీకృష్ణునిం గాంచి కాలయవనుఁడు విస్మయం బంది నాకోరిన వైరి పట్టుపడిరెుడిని. వేగంబ పట్టుకొనియెద. అని యశ్వంబును గదలించి యభిముఖుఁడై వచ్చుచుండెను. క్షణమాత్రమునఁ జెంతకు వచ్చెను. కాలయవనుని దురూహ భగవంతుఁ డెఱుంగఁడా. మూర్ఖుఁ డీతఁడు నన్నుఁ బట్టవచ్చుచున్నాఁడు. వీని నిర్మూలించుటే యుచితము. అని హరి విచారించి హరిణగమనంబు నధిగమించి పరుగెత్తెను. వాఁడు నశ్వంబు డిగి వెంటఁ బరుగిడెను ఈచోట మూలవిరుద్ధమైనను మహాత్ముని పద్యము రసవత్తమము.

మ. యదువంశోత్తమ పోకుపోకు రణమీా నర్హ్వంబు కంసాదులన్, గదనక్షోణి జయించి తీవని సమిత్కామంబునన్ వచ్చితిన్, విదితఖ్యాతుల వీటఁబోవ నరికిన్ వెన్నిచ్చి యిబ్భంగి నే, గుదురే రాజులు రాజమాత్రుఁడవె వైగుణ్యంబు వచ్చుం జుమీా.

ఇంతతోఁ దృప్తి నొందక భక్తిరసం బుప్పొంగఁగా

మ. బలిమిన్ మాధవ నేఁడు నిన్ను భువనప్రఖ్యాతిగాఁ బట్టుదున్, జలముల్ సొచ్చిన భూమిక్రింద జనినన్ శైలంబుపై నెక్కినన్, బలిదండన్ విలసించినన్ వికృతరూపంబుం బ్రవేశించినన్, జలధిన్ దాఁటిన నగ్రజన్మహలికాశ్వాటాకృతుల్ దాల్చినన్.

అని భగవదవతారముల సంస్మరించి కృతార్థుం డయ్యెను.

ఇట్లు కాలయవనుండు వెంటఁబడి పరుగిడుచుండఁగా భగవంతుఁడు చిఱునవ్వు మోమునఁ దాండవమాడుచుండఁగాఁ గాలయవనా రా రమ్ము. కాలము సమీాపించినది. ముందు

ముందు నీగతి తెలియఁగలదు. నన్నుం బట్టెదవుగా. మంచిది. వత్సా! రమ్ము. రమ్ము. నీ కీ దేహరాజ్యభారజనితశ్రమాతిరేక మును బాపెదను. అని వానికిఁ జిక్కినట్లే నటించి సమీపమునకు రాఁగా దూరమునఁ గనఁబడుచుఁ బట్టుపడఁడేమోయను శంక గలుగనీయక నాచేతఁ జిక్కక తప్పించుకొనఁ జాలఁ డనునాశఁ బుట్టించుచుఁ బోయిపోయి తనమాయ నించుక నెఱింగిన బ్రహ్మాదిదేవతలు మింటనుండి తన్నుఁ గాంచి పరమానందభరితులగుచుండ నవివేకమున విఱ్ఱవీఁగు నాకాలయవనునిఁ బిలుచుకొని పోయిపోయి తమఃపరిపూర్ణంబై యెవ్వరికేఁ బ్రవేశింప శక్యముగాని యట్లుండి భయంకరంబై యున్న యొకపర్వతగుహాం బ్రవేశించి యగోచరుం డయ్యెను.

ఆగుహాయందుఁ జిరకాలమునుండి నిద్రపోవుచు మేల్కొనక యున్న మహాపురుషుఁ డొకఁ డుండెను. తాను జూచుచుండ గుహఁ బ్రవేశించి కృష్ణమూర్తి కనఁబడకపోవుటకుం గల కారణ మెఱుంగలేక యంధకారమునఁ గనఁబడలేదని యనుకొనుచు ముందు పోవుచున్నాఁ డన్నభ్రాంతిం బొంది లోపలికిం బోయి పోయి. యమ్మహాపురుషునిఁ గాలయవనుఁడు చూచెను.

న న్వసౌ దూర మానీయ శేతే మా మిహ సాధువత్
ఇతి మత్వాచ్యుతం మూఢ స్తం పదా సమతాడయత్.

అనుమూలమునకు,

ఉ. ఆలము చేయలేక పురుషాధమ! దుర్గభకంటకద్రుమా
భీలమహాశిలాసహితభీకరకుంజరఖడ్గసింహశా

ర్ధాలతరతుసంకలితదుర్గపథంబునఁ బాఱుతెంచి యీ
శైలగుహాళి సనిద్రక్రియఁ జాఁగి నటించినఁ బోవనిత్తునే.
అని మహాకవి పద్యము వ్రాసెను. ఇది కాలయవనునియూహకు సరిపోయియున్నదనక తప్పదు.

ఇట్లానిద్రించుపురుషునిం గాంచి యాంతరంగికమహాక్రోధరసం బుప్పొంగఁగా నామూర్ఖుఁడు కృష్ణుఁడే పరుండినట్లు నటించుచున్నాఁడన్నయూహ తోఁపఁగాఁ గాలం దన్నెను.

మూ. సన్వసౌ దూరమానీయ శేతే మా మిహ సాధువత్
ఇతి మత్వాచ్యుతం మూఢ స్తం పదా సమతాడయత్.
స ఉత్థాయ చిరం సుప్తశ్శనైరున్మీల్య లోచనే
దిశో విలోకయన్పార్శ్వే తమద్రాక్షీదవస్థితమ్. ౧౨
సతావత్తస్య రుష్టస్య దృష్టిపాతేన భారత
దేహజేనాగ్నినా దగ్ధో భస్మసాదభవత్క్షణాత్. ౧౩

అని మూలము కనుపట్టెడిని. దీనికి ముద్దుగా మహాకవి పద్యమును వ్రాసెను.

ఉ. తన్నిన లేచి నీల్గి కనుఁదమ్ములు మెల్లన విప్పి లోపలన్
సన్నపుఁగిన్క వర్ధిల దిశల్ గని దృష్టిసమిద్ధవిగ్రహో
త్పన్నమహాగ్నికీలముల. భస్మము చేసె నతండు సాయక
చ్ఛిన్నవిరోధికంఠవను శ్రీభవనున్ యవనున్ లఘుక్రియన్.

మెల్లన విప్పి=అనుదానికి స్వారస్యముగాఁ గనుఁదమ్ములు అనుట బాగుగనే యున్నది. కాని క్రోధరసము వర్ణించునపుడు నేత్రములను గమలములతోఁ బోల్చుట బాగుండునా యని శంక నొందుచున్నాఁడను. సన్నపుఁగిన్క వర్ధిల = అనునది సమయోచితముగ ముద్దులు మూటఁగట్టుచున్నది.

ఇట్లు కాలయవనుని పాదతాడనమున నందు శయనించి యున్న మహాపురుషుఁడు లేచి గాఢాంధకారము క్రమ్మియుం డుటయు నందుఁ దాను జిరకాలమునుండి పండుకొనియుండు టయు నివికారణములుగాఁ దటాలున లేచి కూరుచుండి నిద్రా భంగము గావించిన మహాపాపాత్ముఁ డెవ్వఁడురాయని నిద్రాము ద్రితములైయున్న నేత్రముల విప్పి నలుదెసలు పరికించెను. చెంత నిలుచున్న దుష్టునిం గాంచెను. తద్దర్శనమాత్రమునఁ గ్రోధము శతగుణిత మయ్యెను. నేత్రగోళములనుండి మంటలు వెలువడియె. అవి యాదుష్టదానవు నామూలము భస్మముగా నొనరించెను. ఒక్కక్షణమాత్రమున నతఁడు భస్మరాశి యయ్యె ను. కాలయవనుని నామముమాత్రము మిగిలెను.

మహాశయులారా! ఈకథయం దొక్కముఖ్యవిషయము కలదు. అదియే భగవదిచ్ఛను దెల్పును. కావున దానిని మన మెఱుంగవలయును. కథను జదివినంతనే రణరంగమునఁ బాఱి పోవుట శ్రీకృష్ణునియం దొకతప్పుగాఁ దోఁచును. శ్రీకృష్ణావ తారమునఁ దక్కిన యవతారములకంటె విశేషము గలదని పెక్కుతావుల వ్రాసియుంటిని. తానే కాలయవనుని బరిమా ర్చిన గొప్పయేమి? లోకము దానినుండి నేర్చుకొనఁ దగిన ధర్మమేమి యుండును? భగవంతుఁ డిపు డొనర్చినకార్యము నుండి లోకము కర్మము బలవత్తరమైనదని యెఱుంగును. దానిని వినుఁడు. భగవంతుఁడు సాక్షిమాత్రుఁడని యుపనిష త్తులు మొదలు సకలగ్రంథములు ఘోషించును. కావున భగ వంతుఁ డగుశ్రీకృష్ణునకుఁ గాలయవనునియం దాగ్రహము లేదు. చిరకాలమునుండి శయనించియున్న ముచుకుందునకు

దర్శన మీయఁదగుకాలము సమీపించినది. కాలయవనున కీదేహము వదలఁదగుసమయము దగ్గరకు వచ్చినది. ఈ రెండింటికి మార్గదర్శకుఁడు తాను. కాలయవనుని కర్మము ముచుకుందుని బ్రేరేపించి వీని భస్మము చేయనెంచినది. దానిని మార్చు టెవరికి శక్యము? నిమిత్తమాత్రము భగవంతుఁడు దానును. గర్తగా నిలువంబడియెను. వేఱుమార్గమున వీని నాగుహాచెంతకుం బంపఁగూడదా యన్న ప్రశ్నము రాఁదగినదే. కాని యేదే నొక పన్నాగమునఁ గాలయవనుని గుహలోనికిం బంపవచ్చును. గాని వానిమూలమునఁ దనచేఁ జావనున్న మూఁడుకోట్లమ్లేచ్ఛవీరభటులఁ బొలియించు టెట్లు? ఇన్ని కార్యము లొక్కసమయమున నే కావలయును గదా! కర్మము మూఁడుకోట్లభటులఁ గాలయవనుని సేనలోఁ జేర్చి నాఁటిదినము యుద్ధమునకుఁ బ్రయాణ మగునట్లు చేసినది. ముచుకుందున కాదినమువఱకే యాగుహలో నిద్రించు నవసరము గావున నాఁటిదినమే కాలయవనుఁడు మధుర ముట్టడించునట్లు చేసినది. ఈవిషయము భగవంతునకుం దప్ప వేఱెవ్వ రెఱుంగరు. ఎఱుంగఁజాలరు. కర్మసిద్ధాంతము భగవత్స్వరూపమెకదా. దాని కధ్డువాఁ డొక్క భగవంతుఁడే. కావున నాసమయమునఁ దన సాక్షిత్వ మును మహర్షులకు వెల్లడించెను. నిరాయుధుఁడై వెడలెను. ఆయుధములు లేవన నర్ధ మేమి? ఇతరుల కట్లు కనఁబడియెఁ గాని తలంచిన మాత్రమున నాయుధములెల్ల నగపడవా. సంకల్పమున మూఁడులోకములు నశింపవా. పాప మాదసూఁజొఁడు నిరాయుధుఁడు వచ్చుచున్నాఁడు. తనకుంజిక్కునూ

పట్టుకొనిపోయి కారాగారమున నుంచుట మేలని భావించెను. వానియూహ యెఱింగి వత్సా! రారమ్ము. కాలము సమీపించినది. ఈపాపజన్మము వదలుదువుగాని రమ్మా. అని యూహించుచుఁ జిఱునవ్వు నవ్వుచుఁ బరుగిడ సాగెను. వాఁడును వెంట నంటెను. గిరిగుహం జేరి యెందో పోయినట్లయ్యెను. ఎందుఁ బోయెను. సర్వవ్యాపకుఁడు పోవు టెక్కడికి? వచ్చు టెక్కడికి? వానికన్నులకుం గానరా కుండెను. వానికర్మము మఱింత ముందునకుఁ బోవఁ బ్రేరేపించెను. వాఁడీమోసగాఁ డిం దుండునని నమ్మెను. లోపలఁ బ్రవేశించెను. సింహవ్యాఘ్రాది క్రూరజంతువులు మహావ్యాళములు నిందుండునేమో యని వాని కించుకయు శంక కలుగలేదు. ఏలయన. వెనుకనుండి కర్మము వానిం ద్రోయుచున్నది. వానికి స్వాతంత్ర్య మేమున్నది? వాఁడు పరుగిడి యాబాలునిం బట్టవలయుననియే పోయెను. బాలుఁ డీగుహలోఁ దూఱి పరుగిడఁ జాలక నావలని భీతిచే శయనించి దొంగవేషము వేసెనని వాఁడు తలంచెను. కాని యాతనికర్మము మృత్యువును బ్రేరేపించెను. అది నిదురించుమహాత్ముని నేత్రగోళములఁ దేజోరూపమున నుండెను. ఈమూర్ఖుఁ డాగ్రహమున నించుకయు నాలోచింపక యామహాపురుషుని గర్మసంచోదితుఁడై కాలందన్నెను. అప్పటి కాతని యాయువు ముగిసినది. క్షణకాలమే మిగిలినది. ఆమహాపురుషుఁడు లేచి చెంతనున్న యాదురాత్ముని నిద్రాభంగహేతుసంభూతమహత్తరకోపాగ్నిజ్వాలల నేత్రగోళములమూలమున నాతనిపయిం బఱపెను. తన్మూలమునఁ గర్మ

ప్రేరితమృత్యువు వానిం గాల్చి భస్మము చేసెను. ఇన్నింటిని గాంచుచు భగవంతుఁ డుదాసీనుఁడై యుండెను.

ఈకార్యము నీరీతిగా భగవంతుఁ డొనర్చుటచేఁ గలుగు లాభము లేవి యనఁగా లోకులు తమకు బాధగలుగఁగా దానికిం గారణము వేఱొకరని వారి నిందింపరాదనియుఁ దన కర్మమే తన కాకష్టములఁ గల్పించె ననియు నిట్టికర్మముల నిఁక జేయకుండుట మంచిదనియు గ్రహించుటయొక్కలాభము. కష్టములు కలుగఁగా భగవంతుని దూఱుట లోకమున సహజము. సర్వసాక్షి యగుభగవంతుని నిజకర్మవశమునఁ గలిగిన కష్టములకు గారకుండని భావింపరాదనియు దూఱరాదనియు నెఱుంగుట రెండవలాభము. స్వకార్యము నెవరు నెఱుంగరానిచందమున నొనరించుట యామహాత్మునకు సహజము. అది యొకగొప్ప గాదు. ఎట్టికష్టకార్యమైన నశ్రమంబునం దీర్పఁగల శక్తిమంతుఁ డని యెఱుంగుట మూఁడవలాభము. ఇట్టిలాభము లెన్నియో లోకులకుం దెలుపఁబూని శ్రీకృష్ణపరబ్రహ్మ మూ కాలయవనుని దీసికొని పాఱిపోయినట్లు నటించి యాతనికి విముక్తిం బ్రసాదించెను. కావున భగవంతుఁ డొనర్చుకార్యములయందు గుణదోషముల విచారించుపనికి బ్రహ్మాదులే వలం తులు కారన నిఁక మానవు లేపాటివారు? ఈకార్య మిట్లేల చేయవలయు నని ప్రశ్నింపఁ బూనుట యపరాధము. అజ్ఞాన విలాసము నగుఁగాని వేఱొకటి కాదు. కావున శ్రీహరి యే కార్యమొనర్చినను నది సకారణము లోకోపకృతిపరాయణము నగుంగాని వ్యర్థము కాదు. ఇఁకఁ దరువాతివృత్తాంత మేలాగు సాగెనో పరికింతము.

## ముచుకుందుని పూర్వజన్మవృత్తాంతము.

* కాలయవనుఁడి ట్లంతమొందెను. అని శుకమహర్షి తెలుపఁగాఁ బరీక్షిన్న రేంద్రుఁ డెవ్వఁడానిద్రవో వృమహాత్ముఁడు? తెలిసికొనఁ గోరిక కలదు. అన విని యోగిపుంగవుఁ డానందపర వశుఁడై రాజా! ఈప్రశ్న ముత్తమోత్తమము. దీనిచే భగ వన్నుతి చేసిన ట్లగును. వినుమని యిట్లు చెప్పెను. ఇక్ష్వాకు వంశము లోకవిశ్రుతము కదా. అందు మాంధాతృభూజానికి ముచుకుందుఁ డనుకొడుకు గలఁడు. ఆతఁడు మహాబలపరా క్రమములు కలవాఁడు. సత్యసంధుఁడు. బ్రహ్మజ్ఞానసంపన్నుఁడు. ఆతఁడు రాక్షసభీతు లగుదేవత లభ్యర్థింప సహాయుఁడై వారి భీతి మాన్పి చాలకాలము రాక్షసుల పొగ రడఁగించెను. అమరలోకరక్షకుఁ డనుప్రసిద్ధనామ మాతని కాసమయమునఁ జెల్లెను. దేవతలు మెచ్చి యారాజున్నప్రదేశమున కరిగి యిట్ల నిరి. రాజేంద్రా! నిష్కంటకంబయి సర్వసుఖాకరంబు నగురా జ్యంబు వదలి మారక్షణకార్యమున బద్ధాదరుఁడవైతివి. నీతలం పుత్తమోత్తమము. మాభీతిని దొలఁగించితివి. ఇపుడు హాయిగ నున్నారము. ఈకార్యమున నీసకలభోగములు పోయినవి. నర లోకమున నీబంధువు లెందఱో కాలగతిం జెందిరి. భృత్యులు నిన్నెఱింగినప్రజలు ప్రస్తుతము లేరు. కాలము బలవత్తరము. బలవంతులలో నదియే బలముగలది. భగవత్స్వరూపము. అవ్య యము. భగవంతుఁడు ప్రజలను గాలాధీనులనుగా నొనరించి క్రీడించు చుండును. కాలము గడవ బ్రహ్మాదులకే నశక్యము.

---

* ఇది భాగవతము ననుసరించియే వ్రాయఁబడును. విష్ణుపురాణాదు లయందుఁ గలభేదము చూపఁబడునని యెఱుఁగవలయు.

పశుపాలకుఁడు పశువులఁ ద్రిప్పునట్లు మర్త్యులులోనగు జీవకోటుల నీశ్వరుఁ డాడించుచుండును. కైవల్యమిచ్చు నధికారము మాకులేదు. కాన దాని నడుగక వేఱొక్కవర మర్థింపుము. ఇత్తు మనిరి.

ముచుకుందుఁడు పరమభాగవతుఁడు. భగవంతుని సేవించి తజ్జన్యజ్ఞానమున నలరువాఁడు. కావున దేవతలభాషణముల నాలకించి చిరకాలనిద్రం గోరెను. దేవత లా

మూ. నిద్రయా దేవదత్తయా.

తఁడు కోరినట్లే నిద్ర నొసంగిరి. చిరకాలము యుద్ధ మొనరించి నిద్రపోవ నూహించువాఁడుకావున నాతఁడు నిద్రనే కోరెను.

శ్లో. నిద్రార్తస్సుమహాకాలం నిద్రాం వవ్రే వరం సురాణ్
ప్రోక్తశ్చ దేవై స్సంసుప్తం యస్త్వాముత్థాపయిష్యతి
దేహజే నాగ్నినా సద్య స్సతు భస్మీ భవిష్యతి. ౨౨

బ్రహ్మపురాణము. ౧౧. అధ్యా.

విష్ణుపురాణమున నుండుశ్లోకములు బ్రహ్మపురాణములోనివే.

దేవతలు వరము నిచ్చుచు మహారాజా! నిన్నెవండు నిద్రనుండి లేపునో నీదేహజమగుతీవ్రాగ్ని చే వాఁడు భస్మము కాఁగలఁడు. కావున స్వేచ్ఛగా నిద్రపొమ్ము. అని వరమిచ్చి పోయిరి. ముచుకుందుఁ డావరమును గైకొని తన్నెఱింగిన వారు లేనిభూమండలమునకుం బోయిన ఫలము లేదని యా పర్వతగుహాయందు శయనించుటకుమాత్రమే యీభూలోకమునకు వచ్చెను. చాలకాలము శయనించియుండఁ గాలయవనుఁడు వచ్చి నిద్దుర లేపి భస్మరాశియయ్యెను. కాలయవనుఁడు

కాలగతినొందినంతనే భక్తపరాధీనుఁడు శ్రీకృష్ణపరబ్రహ్మము సాక్షాత్కరించెను.

శ్లో. తమాలోక్య ఘనశ్యామం పీతకౌశేయవాససమ్
శ్రీవత్సవక్షసం భ్రాజత్కౌస్తుభేన విరాజితమ్. ౨౩
చతుర్భుజం రోచమానం వైజయంత్యా చ మాలయా
చారుప్రసన్నవదనం స్ఫురన్మకరకుండలమ్. ౨౪
ప్రేక్షణీయం త్రిలోకస్య సానురాగస్మితేక్షణమ్.

శ్రీ భాగవతము.

ఇట్టిమహాపురుషుని శ్రీమన్నారాయణమూర్తిని గాంచెను. ఈశ్లోకరత్నములకు మహాకవిపోతన,

సీ. వనరుహాలోచను వైజయంతీదామ
శోభితు రాకేందుసుందరాస్యు
మకరకుండలకాంతిమహితగండస్థలుఁ
గౌస్తుభాలంకృతు ఘనశరీరు
శ్రీవత్సలాంఛనాంచితవక్షు మృగరాజ
మధ్యుఁ జతుర్బాహు మందహాసు
గాంచనసన్నిభకౌశేయవాసు గాం
భీర్యసౌందర్యశోభితుఁ బ్రసన్ను
ఆ. నమ్మహాత్ముఁ జూచి యాశ్చర్యమును బొంది
తన్మనోజ్ఞదీప్తి తనకుఁ జూడ
నలవిగాక చకితుఁడై యెట్టకేలకుఁ
బలికెఁ బ్రీతి నవనిపాలకుండు.

అని వ్రాసి కృతార్థుఁడయ్యెను.

ఇట్లు ముచుకుందుఁ డెదుట సాక్షాత్కరించిన పరమే శ్వరుం దర్శించి యాశ్చర్యచకితుఁడై యామహత్తరతేజము చూడరాని మహానుభావా! యని సంబోధించి నీపాదములు పద్మపలాశకోమలములు.విషమకంటకావృత మగునీగిరికందరమునఁ దిరుగు నీవెవఁడవు? ఒంటరిగాఁ దిరుగుచున్నాఁడవో, తేజస్సులలోఁ తేజస్వి యగుసూర్యభగవానుఁడవా యేమి? లేక సోముఁడవా, మహేంద్రుఁడవా, లేకున్న లోకపాలురలో మఱొక్కఁడవా ? నిన్ను దర్శించినంత నే నూహించువిధ మేది యనఁగా సకలదేవాదిదేవుఁడ వగుపురుషర్షభుఁడ వనియే. ఏలయనఁగా నీయనుపమానదివ్యతమ తేజస్సున నీగిరిగుహాధ్వాంతము రూపుమాసినది. ఇట్టి యనుపమాన తేజ మాపరమేశ్వరునకుందప్ప వేఱొకనికుండఁ దరముగాదు. ఇంతియగాక నీదర్శనంబున నామది నొకవాంఛ జనించినది. నీపాదసేవ నిరంతరము చేయవలయు ననునదియే యావాంఛ. నాయీవాంఛఁ దీర్పుము. నాకుం దెలుపవలయునని నీకుం దోఁచినయెడల జన్మకర్మగోత్రముల నెఱింగింపుము. వినఁగోరెద. నాయొక్కయు మత్పూర్వులయుఁ జరిత్రము నించుక యాలకింపుము. మే మిక్ష్వాకువంశజనితులము. క్షత్రబంధువులము. నన్ను ముచుకుందుఁడని యెల్లరుఁ బిలుతురు. యావనాశ్వతనయుఁడను. నిద్రచే నపహృతేంద్రియుఁడనై చిరప్రజాగరశ్రాంతుఁడనొట నీగుహాంతరమున శయనించితి. ఎవ్వఁడో నన్ను లేపెను. అతఁడు స్వపాపముచేతనే భస్మీభూతుఁడయ్యెను. అవల నీవు దర్శన మిచ్చితివి. అమిత్రశాసనబిరుదము నీకే చెల్లును

మానసీయచరిత్రా! నీ తేజస్సపారము. దానింజూడఁ జాలకున్నాఁడను. దానిచేతనే ప్రాణికోటికెల్ల మానసీయుఁడ వగుపరమేశ్వరుండవని యెఱింగితిని. అని ముచుకుందుఁడు పలుక భూతభావనుఁ డగునాపరమేశ్వరుఁడు మోముపైఁ జిఱునవ్వు పొలయుచుండ మేఘనాదమువలె గంభీర మగుస్వర మలర నిట్లు పలికెను. ఓయిరాజమునీ! నాజన్మకర్మము లసంఖ్యాకములు. అనంతుఁడ నగుట నాజన్మకర్మముల లెక్కింప శక్యముగాకయుండు. ఒకప్పుడు శ్రమించి భూరజంబుల లెక్కించిన లెక్కింపవచ్చుఁగాని నావగు జన్మకర్మముల లెక్కింపఁ దరముగాదనుట నిక్కము. నాజన్మకర్మములు కాలత్రయాపాదితములు. వానిని లెక్కింపఁగాని పఠింపఁగాని పూనినచో నిరంతరము జీవించు తపశ్శక్తిగల మహర్షులు తుది గాంచలేరు అయినను నాయిప్పటిజన్మకర్మముల నేకరింతు వినుము. ధర్మరక్షణార్థము విరించి వానినెఱింగి నాసన్నిధి విన్నవించెను.

రాక్షసులు భూలోకమును బాధింపఁ బెక్కుజన్మంబులం గాంచిరి. వారిఁ బొలియింప యదుకులంబున నవతరించితిని. ఆనకదుందుభివంశమున జన్మించితిని. వాసుదేవుఁ డగునన్నుం బలు వసుదేవసుతుఁడనగుట వాసుదేవుఁ డందురు. కాలనేమిం బొలియించితి. తత్స్వరూపుఁడేకదా కంసుఁడు. ప్రలంబాదులు మృతిం గాంచిరి. వారిబంధువులు పొలిసిరి. ఈకాలయవనుఁడు నీతీక్ష్ణదృష్టిచేఁ బొలిసెఁగదా. అట్టివాసుదేవుఁడ నగు నేను నీకొఱ కీగుహ కరుదెంచితి. పూర్వము నన్ను నీవు విశేషించి పూజించితివి. భక్తవత్సలనామమున నలరు నే నాపూజానిరతికిఁ దృప్తి నొందితిని. రాజేంద్రా! వరము లడుగుము. నీకు సర్వ

వాంఛల నొసంగెదను. నన్నాశ్రయించిన ప్రపన్నుఁడు మరల శోకంబు నందఁడని నమ్ముము. అని భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు పలుక ముచుకుందుఁడు పరమప్రమోదవాహినీపరిమగ్నమాన సుండై నమస్కరించి సాక్షాత్కరించిన యామహాత్ముని శ్రీమన్నారాయణుంగా నెఱింగి గర్గమహర్షి వాక్యమును సంస్మరించుచు నిట్లు వినుతించెను. మహాత్మా! గర్గమునివాక్యము ననుసరించి యిరువదెనిమిదవమన్వంతరమున ద్వాపరయుగమున జన్మింతువని యెఱింగితి. యదుకులమున నవతరించితివి. నేను మాయామోహితుఁడనై యీసంసారచక్రమున నవశుఁడనై పరిభ్రమించుచున్నాఁడను. ఆమాయ భవదధీనయగుట దాఁటరానిది. దానిచే దుఃఖములు సుఖములుగాఁ దోఁచుచున్నవి. సంసారమునఁ బరిభ్రమించు స్త్రీపురుషులెల్ల వంచితు లగుదురు. నీదయవలన నీమానుషశరీరము దొరకియు నీపాదారవిందభజనమం దాదృతి లేక యున్నాఁడను. మహాంధకారకూపపతితపశువుమాడ్కి నున్నాఁడను. కాలము వ్యర్థముగా నాకీజన్మమునఁ జెల్లినది. అంతియగాక రాజ్యశ్రీమదమునఁగూడ దానిని దుర్విషయములఁ గడపితిని. నాపూర్వపుణ్యవశమున నీదర్శనము లభించినది. భార్యాపుత్త్రాదిసకలవాంఛలకుఁ జిక్కి వారేమో యుద్ధరింతురని మోసపోతిని. అంతియగాక నరదేవనామమున గజహయములు లోనగుపశువులు నన్నుం బరివేష్టింప విఱ్ఱవీఁగి

---

## ముచుకుందకృతశ్రీకృష్ణస్తుతి.

శ్లో. విమోహితోఽయం జన ఈశ మాయయా త్వదీయయా త్వాం న భజత్యనర్థదృక్, సుఖాయ దుఃఖప్రభవేషు సజ్జతే గృహేషు యోషిత్పురుషశ్చ వంచితః. ౧. లబ్ధ్వా జనో దుర్లభమత్ర మానుషం కథంచిదవ్యంగమయ

తిని. ఈసంసారము ఘటకుడ్యసన్నిభమని నమ్మనైతిని. దిగ్విజయము గావించి యశము సంపాదించి స్త్రీలం గూడి విహరించి సకలసుఖసమృద్ధుఁడనై భవత్పాదారవిందచింతనము చేయనైతిని. మహానుభావా! ఎన్నియో పుణ్యములు చేసినఁగాని సత్సమాగమము లభింపదు. అది లభింపఁగా నీసేవ చేయవలయునన్న బుద్ధిపొడమును. అది పొడమినఁగాని యీసంసారము దాఁటు

---

త్వత్తస్తవ, పాదారవిందం న భజత్యసన్మతిర్గృహాంధకూపే పతితో యథా పశుః. ౨. మమైష కాలోఽజితనిష్ఫలో గతో రాజ్యశ్రియోన్నద్ధమదస్య భూపతేః, మర్త్యాత్మబుద్ధేస్సుతదారకోశభూష్వాసజ్జమానస్యదురంతచింతయా. ౩. కళేబరేఽస్మిన్ ఘటకుడ్యసన్నిభే నిరూఢమానో నరదేవ ఇత్యహం, వృతో రథేభాశ్వపదాత్యనీకపైర్గాం పర్యటంస్త్వామగణయ్య దుర్మతిః. ౪. ప్రమత్తముచ్చైరితి కృత్య చింతయా ప్రవృద్ధలోభం విషయేషు లాలసం, త్వమప్రమత్తస్సహసాభిపద్యసే క్షుల్లేలిహానోఽహిరివాఖుమంతకః. ౫. పురారథైర్హేమపరిష్కృతైశ్చరన్ మతంగజైర్వానరదేవసంజ్ఞితః, స ఏవ కాలేన దురత్యయేన తే కళేబరో విట్క్రిమిభస్మసంజ్ఞితః. ౬. నిర్జిత్య దిక్చక్రమభూతవిగ్రహో వరాసనస్థస్సమరాజవందితః, గృహేషు మైథున్యసుఖేషు యోషితాం క్రీడామృగః పూరుష ఈశ నీయతే. ౭. కరోతి కర్మాణి తపస్సునిష్ఠితో నివృత్తభోగస్తదపేక్షయా సకృత్,పునశ్చ భూయాసమహం స్వరాడితి ప్రవృద్ధతర్షో న సుఖాయ కల్పతే. ౮. భవాపవర్గో భ్రమతో యదా భవేజ్జనస్య తర్హ్యచ్యుత సత్సమాగమః, సత్సంగమో యర్హి తదైవసద్గతౌ పరాపరేశే త్వయి జాయతే మతిః. ౯. మన్యే మమానుగ్రహ ఈశ తే కృతో రాజ్యానుబంధాపగమో యదృచ్ఛయా, యః ప్రార్థ్యతే సాధుభిరేకచర్యయా వనం వివక్షద్భిరఖండభూమిపైః. ౧౦. న కామయేఽన్యం తవపాదసేవనా దకించన ప్రార్థ్యతమాద్వరం విభో, ఆరాధ్య కస్త్వాం హ్యపవర్గదం

వెరవు దొరకదు. కావున మహేశ్వరా! ఏపుణ్యవశంబుననో నీవు దర్శన మిచ్చితివి. కృతకృత్యుఁడ నైతిని. ఇఁక నీదయకుఁ బాత్రుఁడ నగునట్లనుగ్రహింపుము. మరల నీసంసారసాగరపరిభ్రమణము కలుగకయుండఁ జేయుము. నీదర్శనము సకలపాప

---

హారే వృణీత ఆర్యో పరమాత్మబంధనమ్.౧౧.తస్మాద్విసృజ్యాశిష ఈశ సర్వతో రజస్తమస్సత్త్వగుణానుబంధనాః, నిరంజనం నిర్గుణమద్వయం పరం త్వాం జ్ఞప్తిమాత్రం పురుషం వ్రజామ్యహం. ౧౨. చిరమిహ వృజినార్తస్తప్యమానో నుతాపైరవితృషషడమిత్రో లబ్ధశాంతిః కథంచిత్, శరణద సముపేతస్త్వత్పదాబ్జం పరాత్మన్నభయమృతమశోకం పాహిమాపన్నమీశ. ౧౩. శ్రీభాగవతాంతర్గత ముచుకుందస్తుతిస్సమాప్తా.

## బ్రహ్మపురాణాంతర్గత ముచుకుందకృత శ్రీకృష్ణస్తుతిః.

శ్లో. పురా గార్గ్యేణ కథితమష్టావింశత్తమే యుగే, ద్వాపరాంతే హరేర్జన్మ యదువంశే భవిష్యతి. ౧. స త్వం ప్రాప్తో న సందేహో మర్త్యానాముపకారకృత్, యథా హి సుమహత్తేజో నాలం సోఢుమహం తవ. ౨. తథా హి సజలాంభోదధ్వనిధీరతరం తతః, వాక్యం తమితిహోవాచ యుష్మత్పాదసులాలితం. ౩. దేవాసురే మహాయుద్ధే దైత్యాశ్చ సుమహాభటాః, న శేకుస్తే మహత్తేజ స్తత్తేజో న సహామ్యహమ్. ౪. సంసారపతితస్యైకో జంతోస్త్వం శరణం పరం, సంప్రసీద ప్రపన్నార్తిహర్తా హర మమాశుభమ్. ౫. త్వం పయోనిధయశ్శైలాస్సరితశ్చ వనాని చ, మేదినీ గగనం వాయురాపోఽగ్నిస్త్వం తథా పుమాన్. ౬. పుంసఃపరతరం సర్వం వ్యాప్య జన్మవికల్పవత్, శబ్దాదిహీనమజరం జన్మక్షయవివర్జితం. ౭. త్వత్తోఽమరాస్తు పితరో యక్షగంధర్వరాక్షసాః, సిద్ధశ్చాప్సరసస్త్వత్తో మనుష్యాః పశవః ఖగాః. ౮. సరీసృపా మృగాస్సర్వే త్వత్తస్సర్వే మహీరుహాః, యచ్చ భూతం భవిష్యద్వా కించిదత్ర చరాచరే. ౯. అమూర్తం మూర్త

క్షయకరము. సకలపురుషార్థప్రదము. కావున నిన్ను భజించె
దను. భవబంధములఁ ద్రెంపుము. పరమపురుషార్థము నొసఁ

---

మథవా స్థూలం సూక్ష్మతరం తథా, తత్సర్వం త్వం జగత్కర్తర్నాస్తి కించి
త్త్వయా వినా. ౧౦. మయా సంసారచక్రేఽస్మిన్ భ్రమతా భగవన్
సదా, తాపత్రయాభిభూతేన న ప్రాప్తా నిర్వృతిః క్వచిత్. ౧౧. దుఃఖా
న్యేవ సుఖానీతి మృగతృష్ణా జలాశయః, మయా నాథ గృహీతాని తాని తా
పాయ మేఽభవన్. ౧౨. రాజ్యముర్వీబలం కోశో మిత్రపక్షస్తథాత్మజాః,
భార్యా భృత్యజనా యే చ శబ్దాద్యా విషయః ప్రభో. ౧౩. సుఖబుద్ధ్యా
మయా సర్వం గృహీతమిదమవ్యయ, పరిణామే చ దేవేశ తాపాత్మకమభూ
న్మమ. ౧౪. దేవలోకగతిం ప్రాప్తో నాథ దేవగణోఽపి హి, మత్తస్సాహాయ్య
కామోఽభూచ్ఛాశ్వతీ కుత్ర నిర్వృతిః. ౧౫. త్వామనారాధ్య జగతాం
సర్వేషాం ప్రభవాస్పదం, శాశ్వతీ ప్రాప్యతే కేన పరమేశ్వర నిర్వృతిః.
౧౬. త్వన్మాయామూఢమనసో జన్మమృత్యుజరాదికాన్, అవాప్య పాపా
న్పశ్యంతి ప్రేతరాజానమంతరా. ౧౭. తతః పాశశతైర్బద్ధా నరకేష్వతిదా
రుణమ్, ప్రాప్నువంతి నరా దుఃఖం విశ్వరూపమిదం తవ. ౧౮. అహమత్యంత
విషయీ మోహితస్తవ మాయయా, మమత్వాగాధగర్తాంతే భ్రమామి
పరమేశ్వర. ౧౯. సోఽహం త్వాం శరణమపారమీశమాద్యం సంప్రాప్తః
పరమపదం యతో న కించిత్, సంసారశ్రమపరితాపతప్తచేతా నిర్విణ్ణే పరి
ణతధామ్ని సాభిలాషః. ౨౦.

ఇతి బ్రహ్మపురాణాంతర్గతస్తుతిః విష్ణుపురాణాంతర్గతస్తుతిశ్చ.

గర్గసంహితాంతర్గత శ్రీకృష్ణస్తుతిః.

శ్లో. కృష్ణాయ వాసుదేవాయ దేవకీనందనాయ చ, నందగోపకుమా
రాయ గోవిందాయ నమో నమః. ౧. నమః పంకజనాభాయ నమః పంకజ
మాలినే, నమః పంకజనేత్రాయ నమస్తే పంకజాంఘ్రయే. ౨. నమః కృష్ణాయ

గూర్పుము. అని పలికి భగవత్పాదపంకజములపయిం బడి యుండెను.

శ్రీహరి కరుణాతరంగితాంతరంగుఁడై యాభూజాని లెమ్మని కరకమలంబు శిరంబున నునిచి లేపి రాజేంద్రా! నీమనస్సు నిర్మలమైనది. వరముల నాశింపక పరిపక్వమైనకతంబున విజ్ఞానసంపన్నమైనది. తృప్తియనునది కలుగుట పరమతపఃఫలముననే గాని వేఱొంటఁ గాదు. భక్తులుకానివారు ప్రాణాయామాదుల నెంత యరికట్టినను మనస్సు సంతృప్తిని బొందదు. నాయందు భక్తిగలవారలకే యది వశంగతమై యుండును. రాజవర్యా! ఇష్టానుసారము భూస్థలంబునఁ జరియింపుము. నాయం దావేశించిన బుద్ధిగలవాఁడవగు నీకీ భూసంచారము పీడాకరము కాఁజాలదు. నాకరుణకుం బాత్రుఁడ వైతివి. కావున సుస్థిరతమభక్తి నీకుఁ గుదురుఁగాక. నీవు పూర్వము క్షత్రియధర్మ మాశ్రయించి మృగయావినోదంబుల బహువిధజంతువుల హింసించితివి. తపంబునఁ దత్పాపంబు నశింపఁ గలదు. నన్నాశ్రయించు నీకట్టి పాపశేషము నశింపకుండునా. జన్మాంతరమందు సర్వభూతసుహృత్తముఁడవై బ్రాహ్మణవంశంబునంబుట్టి నన్నుఁ జెందఁగలవు.

---

శుద్ధాయ బ్రహ్మణే పరమాత్మనే, ప్రణతక్లేశనాశాయ గోవిందాయ నమో నమః. 3. నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షిశిరోరుబాహవే, సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటీ యుగధారిణే నమః. ४. హరేమత్సమః పాతకీ నాస్తి భూమౌ తథా త్వత్సమోనాస్తిపాపహారీ, ఇతి త్వం చ మత్వా జగన్నాథదేవ యథేచ్ఛా భవేత్తే తథా మాం కురు త్వమ్. ౫. ఇతి.

అని భగవంతుఁ డనుగ్రహింప నా ముచుకుందభూజాని భక్తినమ్రాత్మకంధరుఁడై శ్రీహరికి వలగొని నమస్కరించి యా తమోనిబిడగుహానుండి వెడలి * సూక్ష్మప్రమాణశరీరంబులం గన్పట్టుమనుష్యులను దిర్యగ్జంతువులను వృక్షములను లతలను గనుంగొని కలియుగము వచ్చినట్లున్నదని విచారించి యిం దుండరాదని నిశ్చయించి యుత్తరాభిముఖుండై పోయెను. శ్రీహరికరుణచే నాతనికిఁ దపోనిష్ఠ యలవడియెను. సకలసంశయములు తొలఁగెను. సర్వసంగములు దూరము లయ్యెను. శ్రీవిష్ణుపాదారవిందములపైఁ జిత్తము నిల్చెను. మెలమెల్లన గంధమాదనపర్వతంబునకుం బోయి యందుండి పరమపావననరనారాయణ నివాసంబగు బదరికాశ్రమంబునకుం బోయెను. పరమశాంతి నూని శ్రీహరి నారాధించుచు ముక్తసంగుఁడై యుండెను. ఇఁక ముచుకుందునిగూర్చి చెప్పఁదగినవిశేషములు లేవు. భగవంతుఁ డవ్వల నేమియొనర్చెనో తెలియం దగియుండును. ఆకథ ముందువినఁగలరు. ఈకథాసారము నాలకింపుఁడు.

మహాశయులారా! కాలయవనుని మరణానంతరము ముచుకుందుఁడు నలుప్రక్కలం గాంచి శ్రీహరిం గనుంగొని సంభాషించి భగవంతుఁడని యెఱింగి వినుతించెను. అను నీవిషయమునం గల విషయమునఁ జెప్పఁదగినది భక్తి యొక్కటియేకదా, మఱొకవిశేషము మన మెఱుంగవలయు. భగవత్కరుణకుం బాత్రుఁడై వరములఁ బొందుతఱి ముచుకుందు

* స వీక్ష్య క్షుల్లకాన్ మర్త్యాన్ పశూన్ వీరుద్వనస్పతీన్, మత్వా కలియుగం ప్రాప్తం జగామ దిశముత్తరామ్ = అని శ్రీభాగవతము. దశమస్కంధము. ఏఁబదిరెండవయధ్యాయము.

నను హారి చెప్పినవిషయమున విశేషముగలదు. తప స్స్వాభావం
పుము. దానిచే మృగయా విహారంబుల జంతువులం జంపిన
పాపం బడంగు ననియె. మృగవధము రాజులకు విహితమని
శాస్త్రములు ఘోషించునుగదా దానిం బాప మేలాగు కలుగు
నన్నశంక కలుగక తప్పదు. శాస్త్రములు రెండువిధములు.
సామాన్యములని విశేషములని వానిపేరులు. ఒకటి లోకవ్యవ
హారమును సాగించునది. రెండవది పరలోకోపకారకవిషయ
ముల బోధించునది. అహింస పరమధర్మమనుట యుభయసాధా
రణధర్మము. కాని యది రెండవమార్గము నాశ్రయించినవారికే
విశేషవిధియై చెల్లును. లోకసంబంధము గలవారలకుం గొన్ని
నియమములు దాటదగినవియై యుండు. లేకున్న వ్యవహా
రము సాగదు. వారికివి దోషములని తోంచినచో వా రాపని
యందు బద్ధాదరులు గాంజాలరు. బద్ధాదరులుకాకున్న నాపని
నిర్వహింపంజాలరు. కావుననే బ్రహ్మచారులకు గృహస్థులకు,
వానప్రస్థులకు సన్న్యాసులకు ధర్మములు వేలువేలు నిరూపిం
పంబడినవి. లోకవ్యవహారార్థమే యట్లు కల్పింపంబడినవని
యెఱుంగవలయును. ముక్తిమార్గమును గోరువారల కొక్క
రీతిగనే ధర్మము లుండును. అంతియగాక కులభేదముల ననుస
రించి విశేషధర్మములు గలవు. హింసాకర్మము వృత్తిగాంగల
బోయకులమునం బుట్టిన ధర్మవ్యాధుండు తత్కులోచితధర్మ
మునం గొంత మానెను. కావున నంతమాత్రము వైరాగ్యము
నాశ్రయించినందులకు ఫలముగాంద్రికాలజ్ఞాన మలవడెను.
కౌశికుం డనుముని పతివ్రతాప్రేరణమున ధర్మజిజ్ఞాసువై తన
చెంత కరుదెంచెనని యెఱుంగంజాలెను. అనంగా హింసావృ

త్రిని మాని మాంసమమ్ముపనినిమాత్రమే చేపట్టెను. కావున నొక్కగొప్పదుష్కార్యము మానినపుడు ప్రతిఫల మనంతము కావలదా. ఆకథవలన దుష్కార్య మాచరించువంశమునఁ బుట్టినవారుగాఁడ నందుఁ బ్రధానమును మానినంతన వారికి జ్ఞాన మలవడును. అనఁగా దుష్కార్యమును మానుట సత్కార్యాచరణమున కంటె నుత్కృష్టము. అన్న నీతియే మన మెఱుంగఁ దగినది. ధర్మవ్యాధున కాజన్మమున ముక్తి దొరకు నన్న గల్గ యనక తప్పదు. ఆవిజ్ఞానమున భవిష్యజ్జన్మ మహింసాకర్మోచితమై యలవడును. దాన నిష్పంగుఁడై భగవంతు నారాధింపఁ గలఁడు. దాన ముక్తి దొరకుననుట సిద్ధాంతము. అణిమాదిసిద్ధులు గలిగినంతమాత్రాన ముక్తి దొరకదని సర్వసిద్ధాంతవిషయము. కావున రాజధర్మములఁ జెప్పినపుడు వేఁట తత్కాలోచితధర్మముగాఁ జెప్పఁబడినను దానిమానుట యుత్తమమనక తప్పదు. రాజధర్మముల ననుష్ఠించుచుండిననే ముక్తి రాదనుట సత్యము. వానిని వదలి జ్ఞానప్రధానధర్మముల నవలంబించినఁగాని పరమపదము చేర నర్హుఁడు కాఁడు. కావుననే,

శ్లో. ప్రవృత్తిరేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలా.

౫. అధ్యా. ౫౬.

అని మనువు చెప్పెను. అంతియగాక భూతహింస మానుట సకలసత్కర్మముల నాచరించుట యను మహాకార్యముతో సమాన మని మనుస్మృతియే శాసించు చున్నది.

శ్లో. వర్షేవర్షేఽశ్వమేధేన యో యజేత శతం సమాః,
మాంసాని చ నఖాదేద్య స్తయోః పుణ్యఫలం సమమ్.

ఫలమూలాశనై ర్మేధ్యై ర్మున్యన్నానాంచ భోజనైః,
నతత్ఫల మవాప్నోతి యన్మాంసపరివర్జనాత్.

౫ అధ్యా. ౫౪ శ్లో:

ప్రతివత్సర మశ్వమేధయాగమున దేవతలఁ దృప్తిపఱచుచు నూఱువర్షము లట్లు కాలము గడపినవాని కెట్టిఫలము లభిం చునో మాంసాహారమును మానిన నట్టిఫలము గల్గును. ఫల ములు కందమూలములు లోనగు పరమపావనమునిభక్షణార్హ పదార్థముల భుజించినవారికి మాంసమును వదలిపెట్టినవానికిఁ గలుగుపుణ్యము లభింపదు అనిక దా పై శ్లోకములభావము. దీని సారమేమనఁగా జంతువులను దనవలెనే భావింపవలయునేకాని వధింపరాదనియు నది యాత్మహత్యవంటి దనియు జంతువుల మనుష్యులయాహారముకొఱకుఁ బుట్టించినవాఁడు బ్రహ్మయ నియు దురూహలు చేయుట యవివేకము. ఆవాదమున మను ష్యులఁ దినురాక్షసుల నేల దూషింపవలయునని ప్రశ్నించిన నోరు మూయవలయునేకాని బదులాడ వలనుపడదు. భగవం తుఁడు భూతజాలముల ననేకభంగులఁ దమతమకర్మఫలముల ననుభవింపఁ బుట్టించెనుగాని మనుష్యులను గావఁ బూని తదు చితాహారములకొఱకు నిన్నిజంతువులను బుట్టింపలేదని యెఱ ుంగుటయే బుద్ధిమంతుల లక్షణము.

భగవంతుని రెండవవాక్యము బ్రాహ్మణకులమందుఁ బుట్టి సర్వభూతదయాపరుఁడవై పరమపదము నొందఁగల వను నదియే. అనఁగా బ్రాహ్మణజన్మ మెత్తకున్న ముక్తి దొరక దనియా శ్రీహరిభావ మని కొందఱకు శంక గలుగవచ్చును. కాని దానిభావ మదికాదు. సర్వభూతదయాపరుఁ డెవఁడో

వాఁడు బ్రాహ్మణశబ్దవాచ్యుఁ డనఁగా బ్రహ్మజ్ఞానసంపన్నుఁ డని భావము. ముచుకుందునకు రెండుజన్మములు కొఱంత యున్నవి. కాన నీజన్మమున ముక్తిదొరకదు. రాఁబోవు బ్రాహ్మణజన్మమున ముక్తి దొరకునని శ్రీకృష్ణుని యాశయము. బ్రాహ్మణుఁడు కానివానికి ముక్తిలేదని భావము కాదు. ఎంతవఱకుఁ గులభేదములు పాటింపఁబడునో యంతదనుకఁ గర్మములఁ దదుచితరీతి నాచరించు చుండవలసినదియే. ఆవల సకలకర్మముల నాచరించుచుఁ దత్ఫలములం గోరక భగవద్భక్తుఁడై విరక్తుఁడై ముక్తుఁ డగునని సారము. కావున భూతదయాపరుఁడై భగవద్భక్తుఁడు కావలయునని యీయుపదేశవాక్యద్వయసారము.

ముచుకుందుఁడు గుహ వెడలివచ్చి సూక్ష్మరూపముల నలరారు మనుష్యులను బశుపక్ష్యాదులను దరుగుల్మాదులం గాంచి కలియుగచిహ్నములు కనఁబడుచున్నవని తలంచి గంధమాదనమునకుం బోయెనన్న విషయమునుండి గ్రహింపఁదగువిశేషముల నాలకింపుఁడు. ముచుకుందుఁడు దేవదానవులకు జరగిన సంగ్రామమున విష్ణు లగు దేవతల రక్షింపఁ బోయెను. ఆ చిక్కులు చిరకాలమునకుంగాని చక్కఁబడలేదు. మనుష్యలోకమునఁ గొన్ని యుగములు గడచెను. దేవత లాతనియెడం బ్రీతులై మర్త్యలోకమున నిన్నెఱింగినవారు లేరు. కావున వరమేదియేఁ గోరుకొను మనిరి. దీర్ఘనిద్రను గోరెను. భగవంతుని ప్రోత్సాహమున మర్త్యలోకమున నీపర్వతగుహయందే శయనించు నూహకలిగెను. కాలయవనుఁ డీతనిచేఁ జావఁదగుఁ గదా. తత్కార్యమున కీప్రయత్నము సాగకున్న నెట్లు? భగవంతుఁ డీపన్నాగమును బన్నెను. ముచుకుం

మేఁడు మర్త్యలోకమును వదలి దేవలోకమున కరుగుతఱి నున్న మనుష్యపశుపక్షివృక్షలతాదులకును, నాతఁడు నిదుర నుండి లేచిచూచునప్పటివారిస్థితికిని సంబంధమే లేకుండెను. కలియుగమున నుండు మానవులకంటెఁ గృతయుగీయమాన వులు చతుర్గుణదేహప్రమాణాదులు గలవారు. త్రేతయందు మూఁడింతలు పెద్దగా నుందురు. ద్వాపరమున ద్విగుణప్రమా ణముగా నుందురు. కృతయుగమునందున్న ముచుకుందుఁడు మరల మర్త్యులను జూడక నిదురించియుండి లేచి చూచున ప్పటికి మనుష్యులు, పశుపక్ష్యాదులు, తరువులు తీఁగలు లోన గునవి యత్యల్పములుగాఁ గనుపట్టెను. వానిఁ జూచఁగనే య తని కచ్చెరువు గలిగి యిది కలియుగారంభమని తోఁచెను. గర్గ మహాముని తెలిపిన ప్రకారము ద్వాపరమున శ్రీకృష్ణావతా రము గలుగునని యెఱింగెను గానఁ గలికాల మాసన్నమైనట్టు లాతఁ డెఱింగెను. అంతియగాక యిట్టియల్పమనుష్యులతోఁ గలిసియుండుట మేలుకాదనియు నతఁ డూహించెను. కృత యుగమానవులకు వారియభిప్రాయములకు వారియాహార ములకు వారు చేయుకార్యములకును, గలియుగమునం దుండు వారు చేయుకార్యములకు హస్తిమశకన్యాయము పట్టును గదా. కావున నీకాలమున నుండఁగూడదని ముచుకుందుఁడు తీర్మానించుకొనియె. కలియుగమున నుండువారికంటెఁ గృతయు గమానవులు నాల్గింత లధికప్రమాణము గలవారుగ నుందు రన్నమాట నమ్మఁదగి యుండునా యను దురూహ కొందఱకు నుండవచ్చును. కాని దానికి సమాధానము చెప్పుటయు నంత గొప్పవిషయము కాదు. మనయనుభవమునే యుదాహరణ

ముగా గ్రహింతము. భారతవర్షమున (గలమానవులకంటెం బారసీకమునందును, శ్వేతద్వీపము (రష్యా) నందునుండు వా రెంతయెత్తు బలముగలవారలో పరీక్షింతము. వారిచెంత మన దేశీయుల నిలువంబెట్టినఁ దండ్రికొడుకులవలె కనంబడదా. వారియాహారము పని పరిశీలింపుఁడు. మనవారియాహారము పని విమర్శింపుఁడు, సంబంధముకలదా. ఇంతయేల ? మనపితా మహులకు మనకుఁ గలవ్యత్యాసమును గనినచో స్పష్టమగును. అప్పటివా రిప్పుడు లేకుంట మనమాటలు ఆటలు సాగుచున్న వికాని వారుండిన నివి సాగునా. నూఱుసంవత్సరములక్రిందటి వారు, మూఁడుదినములుఁ శుష్కోపవాసము చేసి నాల్గవదినము యథాపూర్వముగ భుజించి దినకృత్యమును దీర్చువారు. ఈకా లమున మూఁడుగంటలవిరామము భుక్తివేళలకు నడుమనున్నం దాళఁజాలరు. పట్టుమని భక్షింపఁజాలరు. విధిలేక యొక్కదిన ముపవసించిన మఱుదినము పారణచేసి మఱేపనియుఁ జేయఁ జాలరు. యోజనమాత్రము నడువఁజాలరు. ఇంతస్వల్పకాల మున నింతటిభేదము కనంబడుచున్న దికదా. ఇంక యుగభేదముల మాట యిటఁ జెప్పనేటికి ? మనోగోచరముకానియంతయంత రము గలదు. కాఁబట్టియే పూర్వగాథలు వారియలవాటులు మనకు విచిత్రములుగాఁ దోఁచుచున్నవి. వారికి తపోనిష్ఠ ప్ర ధానము. ఇప్పుడది యప్రధానము. ఏకార్యమైనను జేయలేని యపుడు వేదాంతము చెప్పుట యప్పటియలవాటు. కాఁబట్టి యాకాలపువారి యాచారవ్యవహారాదుల నిప్పటివా రాక్షే పింప నర్హులు కారు.

కలియుగధర్మము లివ్వియని పూర్వులే పురాణాదులయం దాదేశించిరి. క్రమముగా నవి స్పష్టపడుచున్నవి. కలియుగమునఁ గాఁబోవు నాచారము లిట్టివని, యాహారము లిట్లుండునని, వారియూహ లిట్లు పరిణమించునని, ఆయు స్సింతమాత్రమగునని యింక ననేకవిషయములను స్పష్టముగాఁ బూర్వులు తెలియఁజేసిరి. తెలివితక్కువచే మనవారు నమ్ముట లేదు. కాని యనుభవమునఁ బరీక్షించువారు నమ్ముచునే యున్నవారు. కలియుగవిభూతిఁ దెలుపు వచనముల నించుక పరికింపుఁడు. ఇందేవి యసత్యమును దెలుపునో విమర్శింపుఁడు. ఇవి మనకేల యనరాదు. ప్రధానము లివ్వియే. వీనిం బరిశీలించుచుండినచోఁ బ్రవృత్తి పరిశుద్ధమగును.

శ్లో. తతశ్చానుదినం ధర్మ స్సత్యం శౌచం క్షమా దయా,
కాలేన కలినా రాజన్ న ఙ్క్ష్యత్యాయుర్బలం స్మృతిః. ౧
విత్తమేవ కలౌ నృణాం జన్మాచారగుణోదయః,
ధర్మన్యాయవ్యవస్థాయాం కారణం బలమేవ హి. ౨
దాంపత్యేఽభిరుచిర్హేతుర్మాయైవ వ్యావహారికే,
స్త్రీత్వే పుంస్త్వే చాభిరతి ర్విప్రత్వే సూత్రమేవ హి. 3
లింగమేవాశ్రమఖ్యాతా వన్యోన్యాపత్తికారణమ్,
అవృత్త్యా న్యాయదౌర్బల్యం పాండిత్యే చాపలం వచః. ౪
అనాఢ్యతైవాసాధుత్వే సాధుత్వే చాఢ్యతైవ హి,
స్వీకార ఏవచోద్వాహే స్నానమేవ ప్రసాధనమ్. ౫
దూరవార్యయనం తీర్థం లావణ్యే కేశధారణమ్,
ఉదరంభరతా స్వార్థ స్సభ్యత్వే ధార్ష్ట్యమేవ హి. ౬

దాక్ష్యం కుటుంబభరణే యశోఽర్థే ధర్మసేవనమ్,
ఇత్థం ప్రజాభిర్దుష్టాభి రాకీర్ణం క్షితిమండలమ్. ౭
బ్రహ్మవిట్ క్షత్రశూద్రాణాం యోబలీ భవితా నృపః. ౮
ప్రజాస్తు లుబ్ధై రాజన్యై ర్నిర్ఘృణై ర్దస్యుధర్మిభిః,
అచ్ఛిన్నదారద్రవిణా యాస్యంతి గిరికాననమ్. ౯
శాకమూలామిషక్షౌద్రఫలపుష్పాష్టిభోజనాః,
అనావృష్ట్యా వినంక్ష్యంతి దుర్భిక్షజ్వరపీడితాః. ౧౦
శీతవాతాతపప్రావృడ్హిమై రన్యోన్యతః ప్రజాః,
క్షుత్తృడ్భ్యాం వ్యాధిభిశ్చైవ సంతప్స్యంతే చ చింతయా,
త్రింశద్వింశతివర్షాణి పరమాయుః కలౌ నృణామ్. ౧౧
క్షీయమాణేషు దేహేషు దేహినాం కలిదోషతః,
వర్ణాశ్రమవతాం ధర్మే నష్టే వేదపథే నృణామ్. ౧౨
పాషండప్రచురే ధర్మే దస్యుప్రాయేషు రాజసు,
చౌర్యానృతవృథా హింసా నానావృత్తిషు వై నృషు. ౧౩
శూద్రప్రాయేషు వర్ణేషు ఛాగప్రాయాసు ధేనుషు,
గృహప్రాయే ష్వాశ్రమేషు యౌనప్రాయేషు బంధుషు. ౧౪
అణుప్రాయా స్వోషధీషు శమీప్రాయేషు స్థాస్నుషు,
విద్యుత్ప్రాయేషు మేఘేషు శూన్యప్రాయేషు సద్మసు. ౧౫
ఇత్థం కలౌ గతప్రాయే జనేషు ఖరధర్మిషు,
ధర్మత్రాణాయ సత్త్వేన భగవా నవతరిష్యతి. ౧౬
చరాచరగురో ర్విష్ణో రీశ్వరస్యాఖిలాత్మనః,
ధర్మత్రాణాయ సాధూనాం జన్మకర్మాపనుత్తయే. ౧౭

శ్రీభాగవతము. ౧౨. స్కం. ౨. అధ్యాయము.

శ్లో. కలేః స్వరూపం మైత్రేయ యద్భవాం ప్రష్టుమిచ్ఛతి,
తన్నిబోధ సమాసేన వర్తతే యన్మహామునే. ౯
వర్ణాశ్రమాచారవతీ ప్రవృత్తిర్న కలౌ నృణామ్,
నసామఋగ్యజుర్వేద వినిష్పాదనహేతుకీ. ౧౦
వివాహా న కలౌ ధర్మ్యా న శిష్యగురుసంస్థితిః,
న దాంపత్యక్రమో నైవ వహ్నిదేవాత్మకః క్రమః. ౧౧
యత్ర కుత్ర కులే జాతో బలీ సర్వేశ్వరః కలౌ,
సర్వేభ్య ఏవ వర్ణేభ్యో యోగ్యః కన్యావరో ధనే. ౧౨
యేన కేనైవ యోగేన ద్విజాతిర్దీక్షితః కలౌ,
యైవ సైవ చ మైత్రేయ ప్రాయశ్చిత్తం కలౌ క్రియా ౧౩
సర్వమేవ కలౌ శాస్త్రం యస్య యద్వచనం ద్విజ,
దేవతాశ్చ కలౌ సర్వా స్సర్వ స్సర్వస్య చాశ్రమః. ౧౪
ఉపవాస స్తథాయాసో విత్తోత్సర్గ స్తపః కలౌ,
ధర్మో యథాభిరుచిరై రనుష్ఠానై రనుష్ఠితః. ౧౫
విత్తేన భవితా పుంసాం స్వల్పేనాఢ్యమదః కలౌ,
స్త్రీణాం రూపమదశ్చైవం కేశై రేవ భవిష్యతి. ౧౬
సువర్ణమణిరత్నాదౌ వస్త్రే చోపక్షయం గతే,
కలౌ స్త్రియో భవిష్యంతి తదా కేశై రలంకృతాః. ౧౭
పరిత్యక్ష్యంతి భర్తారం విత్తహీనం తథా స్త్రియః,
భర్తా భవిష్యతి కలౌ విత్తవానేవ యోషితామ్. ౧౮
యో యో దదాతి బహుళం ససస్వామీ సదా నృణామ్,
స్వామిత్వహేతు సంబంధో నచాభిజనతా తథా. ౧౯

గృహాంతా ద్రవ్యసంఘాతా ద్రవ్యాంతా చ తథా మతిః,
అర్థాశ్చాత్మోపభోగ్యాంతా భవిష్యంతి కలౌ యుగే. ౨౦
స్త్రియః కలౌ భవిష్యంతి స్వైరిణ్యో లలితస్పృహాః,
అన్యాయాదాప్తవిత్తేషు పురుషా స్స్పృహయాళవః. ౨౧
అభ్యర్థితాపి సుహృదా స్వార్థమేవ నిరీక్షతే,
పణార్థార్థార్ధమాత్రేపి కరిష్యంతి తథా స్పృహాం. ౨౨
సమానపౌరుషం చేతో భావివిప్రేషు వై కలౌ,
క్షీరప్రదానసంబంధి భావిగోషు చ గౌరవం. ౨౩
అనావృష్టిభయప్రాయాః ప్రజాః క్షుద్భయకాతరాః,
భవిష్యంతి తదా సర్వే గగనే సక్తదృష్టయః. ౨౪
కందమూలఫలాహారా స్తాపసా ఇవ మానవాః,
ఆత్మానం ఘాతయిష్యంతి హ్యనావృష్ట్యాతిదుఃఖితాః. ౨౫
దుర్భిక్షమేవ సతతం తదా క్లేశ మనీశ్వరాః,
ప్రాప్స్యంత్యవ్యాహతసుఖప్రమోదా మానవాః కలౌ. ౨౬
అస్నానభోజనోఽన్నాని దేవతాతిథిపూజనం,
కరిష్యంతి కలౌ ప్రాప్తే నచ పిండోదకక్రియాం. ౨౭
లోలుపా హ్రస్వదేహా శ్చ బహ్వన్నాదనతత్పరాః,
బహుప్రజాల్పభాగ్యా శ్చ భవిష్యంతి కలౌ స్త్రియః. ౨౮
ఉభాభ్యామపి పాణిభ్యాం శిరఃకండూయనం స్త్రియః,
కుర్వంత్యోగురుభర్తౄణామాజ్ఞాంభర్త్స్యంత్యనాదృతాః.
స్వపోషణపరాః క్షుద్రా దేహసంస్కారవర్జితాః,
పరుషానృతభాషిణ్యో భవిష్యంతి కలౌ స్త్రియః. 30

దుశ్శీలా దుష్టశీలేషు కుర్వంత్య స్సతతం స్పృహాం,
అసద్వృత్తా భవిష్యంతి పురుషేషు కులాంగనాః ౩౦
వేదాదానం కరిష్యంతి వటవశ్చాకృతవ్రతాః,
గృహస్థా శ్చ నహోష్యంతి నదాస్యం త్యుచితాన్యపి. ౩౧
వానప్రస్థా భవిష్యంతి గ్రామ్యాహారపరిగ్రహాః,
భిక్షవశ్చాపి మిత్రాది స్నేహసంబంధయంత్రణాః. ౩౨
అరక్షితారో హర్తార శ్శుల్కవ్యాజేన పార్థివాః,
హారిణో జనవిత్తానాం సంప్రాప్తే తు కలౌయుగే. ౩౪
యో యోఽశ్వరథనాగాఢ్య స్స స రాజా భవిష్యతి,
యశ్చ యశ్చాబలస్సర్వ స్స స భృత్యః కలౌయుగే. ౩౫
వైశ్యాః కృషివణిజ్యాది సంత్యజ్య నిజకర్మయత్,
శూద్రవృత్త్యా ప్రవత్స్యంతి కారుకర్మోపజీవినః. ౩౬
భైక్షవ్రతపరాః శూద్రాః ప్రవ్రజ్యాలింగినోఽధమాః,
పాషండసంశ్రయాం వృత్తి మాశ్రయిష్యంతి సంస్కృతాః,
దుర్భిక్షకరపీడాభి రతీవోపద్రుతాజనాః, [ఖితాః.
గోధూమాన్నయవాన్నాఢ్యాన్ దేశాన్ యాస్యంతి దుః
వేదమార్గే ప్రలీనే చ పాషండాఢ్యే తతో జనే,
అధర్మవృధ్యా లోకానా మల్పమాయు ర్భవిష్యతి. ౩౯
అశాస్త్రవిహితం ఘోరం తప్యమానేషు వై తపః,
నరేషు నృపదోషేణ బాల్యే మృత్యు ర్భవిష్యతి. ౪౦
భవితా యోషితాం సూతి పంచషట్సప్తవార్షికీ,
నవాష్టదశవర్షాణాం మనుష్యాణాం తథా కలౌ. ౪౧

పతితోద్భవశ్చ భవితా తథా ద్వాదశవార్షికీ,
నాతిజీవతి వై కశ్చి త్కలౌ వర్షాణి వింశతిః. ४२

అల్పప్రజ్ఞా వృథాలింగా దుష్టాంతఃకరణాః కలౌ,
యత స్తతో వినక్ష్యంతి కాలేనాల్పేన మానవాః. ४३

యదా యదా హి మైత్రేయ హాని ర్ధర్మస్య లక్ష్యతే,
తదా తదా కలే ర్వృద్ధి రనుమేయా విచక్షణైః. ४४

యదా యదా సతాం హాని ర్వేదమార్గానుసారిణాం,
తదా తదా కలే ర్వృద్ధి రనుమేయా విచక్షణైః. ४५

ప్రారంభా శ్చావసీదంతి యదా ధర్మభృతాం నృణాం,
తదానుమేయం ప్రాధాన్యం కలే ర్మైత్రేయ పండితైః. ४६

యదా యదా న యజ్ఞానా మీశ్వరః పురుషోత్తమః,
ఇజ్యతే పురుషైర్యజ్ఞై స్తదా జ్ఞేయం కలేర్బలం. ४७

న ప్రీతి ర్వేదవాదేషు పాషండేషు యదారతిః,
కలేర్వృద్ధి స్తదా ప్రాజ్ఞై రనుమేయా విచక్షణైః. ४८

కలౌ జగత్పతిం విష్ణుం సర్వస్రష్టార మీశ్వరమ్,
నార్చయిష్యంతి మైత్రేయ పాషండోపహతా జనాః. ४९

కిందేవైః కింద్విజై ర్వేదైః కింశౌచే నాంబుజన్మనా,
ఇత్యేవం విప్రవక్ష్యంతి పాషండోపహతా జనాః. ५०

విష్ణుపురాణము. ६ అంశము.

ఇట్టివి కలిమహిమలు. భారతమునందు నితరపురాణము లందు నెన్నియో కలవు. వానినెల్ల నిటఁ జేర్చుట తప్పుకాదు

కాని గ్రంథవిస్తరభీతి మానితిని. పైశ్లోకములకు వ్యాఖ్యయు మానితిని. సులభముగా నర్థమగునన్నయూహా నాయీ విశ్రాంతికి హేతువు. కలియుగ మారంభించి యైదువేలసంవత్సరములు దాఁటి యిరువదితొమ్మిదివత్సరము లైనది. పై వానిలో నింతయల్పకాలముననే యెన్నియెయో లోకమునఁ బరిదృశ్యమానము లగుచున్నవి. కలియుగము వృద్ధికానుకాను విశేషించి పైవిషయములు వాడుకలోనికి వచ్చును. అట్టికాల మింకను గొంతకాలము రాకయుండుఁగాక. పురాణములయందలి నీతు లప్రమాణములని కొందఱు పలుకుచుందురు. ఎంతకాలమునకుముందో కలిధర్మములు వ్రాసిరికదా? తు చ లు తప్పకుండఁ బ్రత్యక్షముగా నవి సాగుచున్నవి. ముందుముందు తదుక్త విపరీతధర్మములు సాగకమానవు. ఈతనువుతో నుండి వానినన్నింటిని లోకులకుఁ దెల్పుచుఁ బురాణములు ప్రమాణములా కావా యని హెచ్చరించుటకు సాధ్యముకాదు కాని తదుక్తప్రకారము కొన్ని సాగినపుడు తక్కినవి సాగఁజాలవనుటకన్న యసంగతప్రసంగము వేఱొకఁ డుండదన్న నమ్మకము నాకున్నది. కావునఁ గలికాలము ధర్మవృక్షమునకు వేలుపురువ్వంటిది. అట్టియిక్కాలమందు భగవన్నామసంకీర్తనము తరణోపాయ మనక తప్పదు. ముచుకుందుఁడు కలికాలమానవులను గాంచి వెఱగందెననుట వింతవిషయము కాదు. కలియుగము రానున్నదనఁగా నట్టిమానవులు కనుపట్టిరనఁగా నిప్పటికాలపువా రెట్లుండువారో చెప్పనక్కఱ యుండదు. కావునఁ గలికాలము భక్తిజ్ఞానవైరాగ్యధ్వంసకము. ఐన నిట్టి కట్టడికాలమునకు ననువగుధర్మములు మహాత్ములు శాసించిరి. ఏద్రవ్యవ్య

యము లేని భగవన్నామసంకీర్తనమే పరమపదప్రాప్తికి సోపాన మనిరి. ఏపాపములైనను జేసినఁగాని స్మరించినంతన మానవుల నంటవనిరి. ఈకాలమునకుఁ దగినట్లు లెన్నియో సులభోపాయము లాదేశించినను వాని నాశ్రయింపకుండుట కలిమాహాత్మ్యమునఁగాక మఱేకారణమున నుండును? ఇట్టికాలమునందును మహర్షులు మానవుల యోగక్షేమముల నారయుచుఁ గించిద్భక్తి కుదిరినను వారిని దరింపఁజేయ నాసించుచుఁ బ్రచ్ఛన్నరూపముల వారి నాశీర్వదించు చున్నవారని నమ్మవలయును. ఈవిశ్వాసమును దొలఁగింపఁ గొందఱు కలికాలపురుషులు కపటవేషముల నూని ధర్మోపదేశములు చేయుచు వేదాంతుల మని శిష్యులను జేర్చుకొనుచు మంత్రముల నుపదేశించుచు భాగవతము నుదాహరణముగాఁ గనఁబఱచి వ్యభిచారము తప్పుగాదనుచు ద్రవ్యము నాకర్షించుచు నున్నవారు. వారిం గాంచినపుడు భక్తివిశ్వాసములుకూడఁ దొలఁగుచుండును. ఐనను బురాణములఁ బఠించి తదర్థముల నెఱింగి తదుక్తరీతిగాఁ బ్రవర్తించువారు లేరన్న మహాపాతకము వచ్చును. వారి నెఱుంగఁగలవారు కొలఁదిమందియే కలరు. కలికాలమున శ్రీకృష్ణపరమాత్మనామస్మృతియే సకలపురుషార్థప్రదమని యీ కథాసారము. ఇంతకన్నఁ బెంచి వ్రాయఁబూనను.

ఆర్యులారా! ఈముచుకుందుని చరిత్రమునుండి మన మెఱుంగఁదగిన విశేషాంశములు పెక్కులు గలవు. తపశ్శక్తిచేఁ జిరంజీవిత్వము సంపాదింపఁ గలమనునదొకటి. పాపభీతిచే నొక్కగుహలో దాఁగియున్నను భగవంతుఁ డాతనికడకుఁ దనకుఁదానే వచ్చుననునది రెండవది. తద్దర్శనమాత్రమునఁ బాపా

త్ములు భస్మప్రాయము లగుదురనునది మూఁడవది. ఇవి ప్రధానములు. మఱియు నెన్నియో కలవు. వీనిం బరిశీలించి వాని నలవాటు చేసికొని భగవత్కారుణకుం బాత్రులము కావలయును. వేఱుమార్గములు కానరాకున్నవి. భగవత్సందర్శన వాంఛ కలవారమగుట ప్రధానకార్యమని గ్రహింపవలయును. ఇంతట నీవిషయమును వదలి తరువాతికథను వ్రాసి నాకృత్యమును నెఱవేర్చెదను.

బలరామునుఁడు వసుదేవాదులకు రాజనీతి నుపదేశించుట.

* ఉదారమనీషులారా! జరాసంధుఁడు పదునెనిమిదవపర్యాయము మధురానగరమును ముట్టడింప వచ్చుచున్నాఁ డన్న వార్త యాదవులకుం దెలిసె ననియు వారాతురులై విచారించుచుండ వికద్రుఁ డనువృద్ధయాదవుఁడు యదువంశవిస్మృతి నెఱింగించె ననియు లోఁగల వ్రాయఁబడియెఁగదా. ఆనడుమఁ గాలయవనవృత్తాంతము ముచుకుందుని వృత్తాంతము వ్రాయవలసివచ్చె. ఇపుడు మరల నించుక వెనుకకుం బోయి విచారింపవలయును. కాలయవనస్మృతి మొదలగునవి ముగిసిన పిదప మరలఁ గోపకు లొక్కచోఁ గూడి జరాసంధయుద్ధప్రయత్నమును గూర్చి విచారించు చున్నవారని స్మరింపుఁడు. అట్లైనం గాని కథ వరుసగా సాగిన ట్లుండదు. కావున మధురానగరమున రహస్యమండపమున యాదవులందఱు గూరుచుండి మంత్రము నడపుచున్నవారని యూహించి మీఁదికథను సాగింపుఁడు చక్కఁగా బోధపడును.

---

* ఇది హరివంశము విష్ణుపర్వము ముప్పదితొమ్మిదవ యధ్యాయము నుండి గ్రహింపఁబడినది. ఇతరపురాణములయం దీగాథ కానరాదు.

యాదవు లొక్కచోటం జేరిరి. బలరామకృష్ణులు నం దుండిరి. వికద్రుప్రభృతులు జరాసంధునియుద్ధప్రయత్నముం గూర్చి మాటలాడిరి. మధురానగర మింక నిలువదని నశింపక తప్పదని నిశ్చయించిరి. ఆసమయమున యదువృద్ధులమాట లాలకించి వసుదేవాదుల సమ్మతిం గొని బలరాముఁ డిట్లు పలుక నారంభించెను. యదుపుంగవులారా! మీకుం దోఁచిన ప్రకారముల వెల్లడించితిరి. నగరమునకు రానున్న కష్టములం దెల్పితిరి. ఈవిషయమున నాకు నెట్లు తోఁచినదో యావిధ మెఱిఁగించెదను. దానిని విని యుక్తమని తోఁచిన నంగీకరింపుఁడు. కాదేని పరిత్యజింపుఁడు. ఏ వాక్యముగాని హేతుసంయుతమై క్రమము నతిక్రమింప దైవము మెచ్చునట్లుండఁదగు న్యాయశాస్త్రము దాని నంగీకరింపఁ దగినట్లుండుటయే యుక్తము. అట్టి వాక్యము నెల్లవారు నంగీకరింప వలయును. రాజు న్యాయమును బ్రధానలక్ష్యముగా నెఱింగి సంధివిగ్రహయానాసన ద్వైధీభావసంశ్రయములను షడ్గుణముల కనుకూలముగా నుండునట్లు ప్రవర్తింపవలయును. విద్వాంసుఁడగు రాజు తన కంటె బలవంతుఁడు పైనెత్తివచ్చినపుడు తన కపజయము గల్గునని నిశ్చయించుకొని యటనుండక తొలంగి చనవలయును. వాసి నోర్వఁగల సహాయసంపద గలిగినచో యుద్ధము చేయక భీతుఁడై పరుగిడరాదు.

జరాసంధుఁ డిన్నిపర్యాయములు లోడిపోయియు మరల యుద్ధము సేయవచ్చుటకుఁ గారణము మేమన్నదమ్ముల మిట నుండుటయేగదా. మమ్ముఁ బొడువఁ బూనినవాఁడేకాని యాదవుల జయింపఁబూనినవాఁడు కాఁడు. కంసాది క్రూరధారణీ

శ్వరుల మేమిరువురము వధించుటచే నీక వీరిని జయింపకున్న దమకు మేమంతకుల మగుదు మనుభీతిచేత సహాయసంపద లేక యిప్పుడున్నవారమనియు నిప్పుడే జయింప మంచిసమయము నియు భావించి పదునేడుపర్యాయములు తానోడిపోయినను లజ్జలేక మరల గొప్పదండును గూర్చుకొని రానున్నవాఁడు. ఇంతటి క్రోధము నూనుటకుం గలకారణము మే మిట నుండు టయే కాని వేఱుకాదు. కావున నగరమునకు యదుకులము నకు మేలుకోరి కృష్ణుఁడు నేనును జరాసంధు నోడింపఁ జాలు వారమయ్యు నశక్తులవలె నీముహూర్తమునందె యెల్లవారె ఱుంగనట్లు స్థలాంతరమునకుం బోవుదుము. సహ్యపర్వతప్రాంత ముల నలరు జనపదముల కరిగి యందుండుము. కరవీరనగరము క్రౌంచపత్తనము గోమంత మనుపర్వతోత్తమము తత్ప్రాంత ములఁ జూడఁదగినవి. వానిం జూచుటయు నొకభంగి నాలో చింపఁగా నుపకారమేయని యూహించెదను.

బలరామవాసుదేవులు కరవీరనగరముఁ జేరుట.

ఈ మధురానగరమునుండి మేమిరువుర మన్నదమ్ము లము వెడలిపోవుట విని జయేచ్ఛగలవాఁడైనను జరాసంధుఁడు నగరమును బ్రవేశింపఁ బూనక మమ్ముఁ బట్టుకొనఁ దలంచి వెంట వచ్చును. సహ్యారణ్యమును బలములంగూడి మమ్ముం బట్టుకొనఁ బ్రయత్నించును. కావున నీయాత్ర మాయిరువుర కేకాక కులమునకుం గూడ శ్రేయస్కరియగు. పౌరులకుఁ బుర మునకు దేశమునకు సుఖమును గల్గించును. విజిగీషువులగు రాజులకు శత్రువును బొలియించుటయే ప్రధానముకాని స్వల్పాపజయాదులు ప్రధానగణ్యములు కావు. మీా రితఁగా

లోచనలకు మదిఁ జోటీయక మాకాజరాసంధునివలన నపకా
రము గల్గునేమోయని భయంపడక మేమిట లేకున్న నగరము
నకుఁ బౌరులకు యాదవవీరులకు నేమి యుపద్రవము కల్గునో
యని సంశయింపక మమ్మెడఁబాయుట కుమ్మలింపక యాకస్మిక
ప్రళయములు గల్గునోకోయని విచారింపక మఱియు నెన్ని
యేని యాలోచన కవకాశమును గల్పించుకొనక నెమ్మదిగా
నుండుఁడు. మేమిదే పోయివత్తు మని యెల్లరయుల్లంబులు పల్ల
వింపఁ జెప్పెను.

బలదేవునినుడుల కెవ్వరును బదులుచెప్పఁజాలక చిత్ర
ప్రతిమలం బోలి యుండిరి. శ్రీకృష్ణుఁ డగ్రజుపలుకులకు సమ్మ
తించి పయన మయ్యెను. వారిరువు రించుకయు సంశయమును
బొందక దక్షిణాపథమునకు నభిముఖులై కామరూపములం
గొని పోయిపోయి జనపదములం గాంచుచు సుఖముగాఁ
దిరుగుచుండిరి. సహ్యాపర్వతపృష్ఠభాగముల సుఖముగా విహ
రించిరి. అందుండి దక్షిణమునకుఁ బయనము సాగించిరి. కొలఁది
దినములకే వారు సహ్యమహీధర విభూషితంబగు కరవీరనగర
మును జేరిరి. అందు యదువంశజనితులే యసంఖ్యాలుగా నివ
సించుచుండిరి. కొలఁదికాల మందుఁ బుచ్చి వేణానదీతీరమును
జేరి యందు మనోహరంబై పరమపావనంబై తరువరమను
ప్రఖ్యాతిం బడసిన న్యగ్రోధవృక్షమును (మఱ్ఱిచెట్టు) బొడఁ
గాంచిరి. ఆచెట్టు క్రిందిభాగమున నొకతపోధనుఁ డుండెను.
ఒకయంసమునఁ బరశువును ధరించియుండెను. జటావల్కలము
లాతని దేహమున విరాజిల్లుచుండెను. ఆతనితేజస్సు దీప్తాగ్ని
శిఖను మించి, సూర్యమండలము నీసడించు చుండెను. క్షత్రి

యాంతకరుఁడై యెవరికీ జయింప నలవిగాని పరాక్రమము గలిగి సముద్రము నొకమూర్తి ధరించి యున్నచందమునను, ప్రళయకాలాగ్ని తనశక్తి నడంచికొనియున్నయట్లును, జెలంగుచుఁ ద్రికాలస్నానములచే దేవగురువో యనున ట్లొప్పుచు నామహర్షి కనఁజాలియుండెను. శ్వేతవర్ణముగవివత్సముం గూడి వలసినపుడు పాలుపిదుకు హోమధేనువును గాంచుచు నరణి యను యజ్ఞపాత్రమునిండఁ బాలను గైకొనుచు మహేంద్రగిరివాసుఁడగు రాముని గాంచి, [illegible] పరి శ్రాంతుఁడై యుండెను. ఉదయాద్రిమూర్ధమున విరాజిల్లు భాను బింబమువలె నా పరశురాముఁడు వెలుఁగుచుండెను.

## రామకృష్ణ పరశురామ సంభాషణము.

ఆభార్గవరాముం గాంచినంతనే న్యాయము [illegible]ప్పున వారు నమస్కరించిరి. ఈబాలకు లిరువురును బ్రదీప్తాగ్నితేజోవిరాజితులై యుండిరి. అంత శ్రీకృష్ణుఁ డామహామునిం గాంచి మధురోక్తుల నిట్లు ప్రశ్నించెను. ఆప్రశ్నము లోకవృత్తాంతజిజ్ఞాసను దెలుపుచుండెను. ఓభగవానుఁడా! నిన్ను జామదగ్న్యుఁడగుపరశురామునిగాఁ దలంచుచున్నాఁడను. నీవు మహర్షివరేణ్యుఁడవు. క్షత్రియకులాంతకుఁడవు. సాగరమును బాణవేగమున నవలకుం ద్రోలితివి. అయిదువందలధనుస్సుల పరిమాణము వెడల్పుగలిగి యంతవిశాలముగల భాగము సహ్యపర్వతమునుండి గ్రహించిన మహానుభావుఁడవు. జనపదముగా దాని నొనరించితివి. సాగరమును దూరమునకుఁ బంపి తద్భాగము నీజనపదమునఁ గలిపితివి. కార్తవీర్యుని సహస్రబాహువులను కాననమును బరశుధారచే ఛేదించిన పరాక్రమశా

లివి. తండ్రిం జంపినపగకై యాక్రూరధారణీశ్వరు నంతకుఁ జెం తకుం బంచితివి. ఆభూమి భవత్పరశుధారాసముత్సృష్టరక్త ధారలచే నిప్పటికి నెఱ్ఱవాఱి యున్నది. రాజకులాంతకుఁడ వగు నిన్ను రైణుకేయుంగాఁ దలంచుచున్నాఁడను. యుద్ధకాంక్ష మెయి నిన్నొక్కటి యర్థింపవలసి యున్నది. మాయీప్రశ్న మునకు బదులిచ్చి మాకోరికను దీర్పుము. మేమిద్దఱము మధు రానగరవాసులము. యమునాతీరమున నున్న యాపట్టణము శ్రుతపూర్వమనియే తలంతును. అందు యాదవు లున్నవారు. యాదవవంశము నీ యెఱింగినయదియే కాని క్రొత్తది కాదు. నియతవ్రతుఁ డగు వసుదేవుఁడు మాతండ్రి. పుట్టుక మొదలు మే మిర్వురము వ్రతములయందే నియోగింపఁ బడితిమి. కంస క్రూరభూజానిభయమున మాతండ్రి శంకితుఁడై రహస్య ముగా మమ్ముఁ బెంచెను అచ్చటినుండి మధురకుఁ దేఁబడితిమి. ఇదియే యందులకుఁ బ్రథమము. మే మాకంసుని పొగరుం గాంచి సభయందు వధించితిమి. ఆతనితండ్రిని మధురారాజ్య మున కధిపతిగా స్థాపించితిమి. యాదవోచితగోవ్యాపారము నే చేయుచున్నారము.

ఇట్టులుండ మధురానగరము నష్టగింప మమ్ము హింసింప జరాసంధుఁడు మహత్తరసేనాతతిం గూడి వచ్చెను. పెక్కుమా ఱులు వాని జయించి పాఱఁదోలితిమి. నగరరక్షణార్థము యాదవులభీతిఁ బాపుటకై తగినప్రయత్నము చేయవలసి యున్నది. అందులకుఁ దగుసాధనములు లేవు. సారథులు లేరు. కాలుబంట్లు లేరు. యుద్ధపరికరము లేవియు మాకడ లేవు. మరల జరాసంధుఁడు మధుర ముట్టడింప రానుండు టెఱింగి

మేమిరువురమే నగరమునుండి వచ్చితిమి. నిన్ను దర్శించితిమి. ఇదియె మదాగమన విషయము. మంత్రోపదేశాదిరూపమునఁ దోడ్పడుదువుగాక. అని శ్రీకృష్ణుఁడు పలికి యూరకుండెను. పరశురాముఁడాకృష్ణవాక్కుల నాలకించి పరమప్రీతి చెలువార నిట్లు బదులు పలికెను. * శ్రీకృష్ణా! మహాప్రభూ! పడమర సముద్రతీరమునుండి యిపుడే శిష్యులను వదలి యొక్కఁడన మీతో నాలోచింప వచ్చితి. పద్మనేత్రా! నందవ్రజమున నీ వుంట నెఱుంగుదును. దానవులం బెక్కుమందిని దునుముటయు దురాత్ముఁడగుకంసుని వధించుటయు నెఱుంగుదును. జరాసంధునితోఁ బోరుటయు నెఱింగి మీయన్నదమ్ము లిటవత్తురని తెలిసి కొనియే వచ్చితిని. † కృష్ణా! జగన్నాథుఁడవని యవ్యయుఁడవని రక్షకుఁడవని నిన్నెఱుంగుదును. బాలుఁడవుగాకయున్నను దేవకార్యార్థసంసిద్ధికొఱకు బాలత్వము నంగీకరించితివి. నీవెఱుంగని దీలోకములమూఁటను సుంతయు నుండదు. అయినను లోకశిక్షార్థము భక్తిభావమునఁ బ్రశ్నించితివి. కావున బదులు చెప్పెదను. గోవిందా! మీపూర్వులచేతనే యీనగరము ప్రతిష్ఠింపఁబడినది. కరవీరరాష్ట్రముకూడ నేలుపఁబడినది. వాసుదేవా! ఈకరవీరనగరమున మహాయశుండగు రాజు శృంగాలనామమున నున్నవాఁడు. అతఁడు పరమకోపనుఁడు.

---

* అపరాంతాదహం కృష్ణ సంప్రతీహాగతః ప్రభో, ఏకఏవ వినా శిష్యైర్యువయోర్మంత్రకారణాత్ = అని మూలము.

† జానే త్వాం కృష్ణ గోప్తారం జగతః ప్రభుమవ్యయం, దేవకార్యార్థసిద్ధ్యర్థ మబాలం బాలతాంగతమ్. న త్వయా విదితం కించిత్త్రిషు, లోకేషు విద్యతే తథాపి భక్తిసూత్రేణ శృణు వక్ష్యామి తే వచః=అని మూలము.

మహానుభావా! నీదాయాదులగురాజులనెల్ల నీతఁడు మచ్చరమూని నామమాత్రావశిష్టులను జేసెను. వీరపురుషుఁడు తనకంటె నధికుఁడుగాని సముఁడుకాని వేఱొకఁడుండరాదని యీతనిమతము. అహంకారరూపుఁడు. అజితాత్మకుఁడు. నిత్యమత్సరి యనంబడు. రాజ్యలక్ష్మీమదమున విఱ్ఱవీఁగువాఁడు. పుత్త్రులకుంగూడ భయంకరుఁడు. కావున నీతనిరాజ్యమున మీరు నేను నివసింప నర్హముకాదు. కరవీరపురము ఘోరమైనది. పార్థివదూషితమైనది.

మఱొక్కవిషయమును జెప్పెదను. జరాసంధుఁడు బలోదగ్రుఁడు. మీరిరువురును యుద్ధము చేయవలయును. ఈవేణానదిని బాహుసహాయమునవే దాఁటి నివాసార్హమగుపర్వతమునకుం బోవుదము. ఈపర్వతము యజ్ఞపర్వత మనఁబడును. ఇది స్వహ్యపర్వతశాఖయని యొఱుంగుఁడు. ఇందు మాంసలోలుభులగుతస్కరులు నివసింతురు. నానాద్రువులత లిందుఁగలవు. విచిత్రముగాఁ గానంబడు. పుష్పితపాదపము లెల్లయెడలఁగనంబడును. అందొక రాత్రి గడపుదము. దానియందే ఖట్వాంగనది ప్రవహించుచుండును. నికషోపలభూషితయగు నానదిని దరింతము. గంగోత్తరి కడి సమానము. పర్వతాగ్రమునుండి పడుచుండును. కావునఁ జూడఁదగియుండును. తత్ప్రపాతస్థలము దర్శనీయము. అందుఁ దాపసారణ్యము గలదు. అది మిగుల మనోహరము. ఈప్రాంతముల నివసించి తత్సుఖము ననుభవించి పర్వతములను గాంచుచు నందలిమహర్షుల దర్శింతము. అందుండి మనోహర మగుక్రౌంచనగరమును దర్శింతము. ఆనగరమున నీవంశమునఁ బుట్టిన రాజేంద్రుఁ డొకఁడు ధర్మ

రతుఁడున్నవాఁడు.మనోకపినామ మాతనికిం గలదు. వనవాసు లగుజను లారాజ్యమున నుందురు. ఆరాజును జూచికయే పగ లంతయు బర్వతప్రాంతభూములం గడపి యానదుహాం బను తీర్థంబున నివసింతము. అందుండి బయలువెడలి సహ్యపర్వతవివ రమార్గమున గోమంతమనం బ్రఖ్యాతం బగు నేకశృంగపర్వత మునకుం బోవుదము. ఆశృంగ మత్యున్నతిం జెలువారు. పక్షులు గూడ నచటికిం బోఁజాలవు. అది దేవతలకు విహారస్థానము. జ్యోతిర్గత లందు వెలయుచుండును. స్వర్గసోపానమువలె నాగిరి కనంబడును. కావుననే గగనస్పృశ మగుశిఖరము దానఁ గలదు. విమానములనుండి యాశిఖరమున దేవతలు డిగి విహ రింతురు. మేరుపర్వతమున కిదియొత్తున రెండవది.

ఆగోమంతశిఖరాగ్రమునందుండి సూర్యశశాంకుల నుద యాస్తమయముల నొక్కరీతిగాఁ జూడవచ్చును. సముద్రతరం గములకదలికలందున్నఁగనంబడును.ఆపర్వతకూటమున నిచ్ఛకుఁ దగినట్లు విహరింపవచ్చును. ఆకూటమునుండి దుర్గయుద్ధమున జరాసంధు నోడింపఁజాలుదురు. ఆపర్వతాగ్రమున నున్న మిమ్మె ఱింగి యుద్ధదుర్మదుఁ డగుజరాసంధుఁడు మిమ్ము జయింపఁగో రును. మీరిరువురును వానితో యుద్ధము సాగించుచుండఁ జాలకాలముక్రింద మానిన యాయుధసంయోగమును నేను జూచెదను. దేవత లీపర్వతాగ్రమున యుద్ధము సాగునని నిర్దే శించిరి. మాంసశోణితకర్దమభూయిష్ఠమై యది యుండఁగలదని వా రూహించిరి. అందుఁ జక్రము హలము గదయగుకౌమో దకియు నందకము నితరములగు వైష్ణవాయుధములు నీవు ప్రదర్శింపఁగా దేవతలు చూడఁగోరి యున్నవారు. కాల

నియుక్తులగు రాజుల మేనిరుధిరములఁ గొలసన్ని భరూపంబులం దాల్చి త్రాగఁగోరిన దేవతలు కొందఱు గలరు. ఈసంగ్రామము నకుఁ జక్రముసలసంగ్రామమని నామకరణము మున్నే చేసిరి.

ఆయుద్ధమున నీవైష్ణవరూపమును శత్రువులు దేవతలు చూడఁగలరు. కావునఁ జక్రగదలను ధరింపుము. చిరకాలము గా వానిని మఱచియున్నాఁడవు. దేవతల కానందమును గల్పిం చు విజయమును బడయుము. ఈబలరాముఁడు శత్రుభేదనపటు వగు ముసలమును ధరించుఁగాక. ఇది భూలోకమున రాజులతో నీకు మొదటియుద్ధ మగును. దీన భూభారావతరణ మగును. నీకు వైష్ణవదేహప్రాప్తియు వైష్ణవాయుధప్రాప్తియుఁ దేజః ప్రాప్తియుఁ గాఁగా నందఱు చూడఁగలరు. ఇదిమొదలు ధర ణియందు శస్త్రయుద్ధములు విశేషించి కాఁగలవు. కావున గోమంతమునకుఁ బోవుదము. జరాసంధయుద్ధమున కది తగినస్థ లము. ఈక్షీరము హోమధేనుప్రసాదము త్రాగుము. బల రాముఁడును ద్రాగుఁగాక. నేను ద్రోవఁ జూపెదను. పయ నము సాగింప నంగీకరింపుమని పరశురాముఁడు ప్రార్థించెను.

మహాశయులారా! ఈగాథనుండి విచారింపఁదగిన విష యములు కొన్ని గలవు. బలరాముఁ డుపదేశించిన రాజనీతిం బట్టి మన మెఱుంగఁదగిన విషయములు కొన్ని గలవు. శ్రీకృ ష్ణపరశురామసంవాదమునుండి నేర్చుకొనఁ దగిన రహస్యవిష యము లనేకములు గలవు. అందుఁ గొన్ని మాత్రమే వ్రాసె దను. సామాన్యమనుజుల ధర్మములకును రాజధర్మములకును భేద మెంతయో గలదు. ప్రాణములనైన విడువఁదగుఁగాని రాజు మర్యాదను వదలఁగూడదన్న న్యాయము సార్వత్రికము

గాదని దీన స్పష్టమగును. బలవంతుఁడు పైనెత్తివచ్చినపుడు బల హీనుఁ డగు రాజు సమయము కాదని లొంగి చనవలయును. అని బలరాముఁ డుపదేశించెను. దీన యొక్క యంతరార్థము గలదు. కాలము మంచిదిగానప్పుడు పౌరుష మూనరాదని గదా దీనిభావము. అనఁగాఁ దాత్పర్యమేమి? కాలము భగవత్స్వరూపము. దాని కడ్డము లేదు. అపరిచ్ఛేద్యము. అఖండము. అనిర్వచనీయమహిమాన్వితము.

శ్రుతి:—

సవిశ్వకృత్సర్వవిదాత్మయోని
　　ర్జ్ఞః కాలః కాలగుణీ సర్వవిద్యః,
ప్రధానం క్షేత్రజ్ఞస్పనిర్గుణోఽపి
　　సంసారమోక్షస్థితిబంధహేతుః.

కూర్మపురాణము:—

అనాదిరేష భగవాన్కాలోఽనంతోఽక్షరః పరః,
సర్వగత్వాత్స్వతంత్రత్వాత్సర్వాత్మత్వాన్మహేశ్వరః.
బ్రహ్మాణో బహవో రుద్రా అన్యే నారాయణాదయః,
ఏకో హి భగవానీశః కాలః కలిరితి స్మృతః.
బ్రహ్మనారాయణేశానాం త్రయాణాం ప్రకృతౌ లయః,
ప్రోచ్యతే కాలయోగేన పునరేవ చ సంభవః.
పరబ్రహ్మ చ భూతాని వాసుదేవోఽపి శంకరః,
కాలేనైవ చ సృజ్యంతే స ఏవ గ్రసతే పునః.
తస్మాత్కాలాత్మకం విశ్వం స ఏవ పరమేశ్వరః.

విష్ణుధర్మోత్తరము:—

"అనాదినిధనః కాలో రుద్రస్సంకర్షణస్స్మృతః,
కలనాత్సర్వభూతానాం స కాలః పరికీర్తితః.
కర్షణాత్సర్వభూతానాం స తు సంకర్షణస్స్మృతః.
సర్వభూతసమత్వాచ్చ స రుద్రః పరికీర్తితః.
అనాదినిధనత్వేన స మహాన్ పరమేశ్వరః."

అని శ్రుతులులోనగునవి ఘోషించు చున్నవి. కావునఁ గాలము పరబ్రహ్మస్వరూపము. దాని నుపాసించుట యనఁగా దానికి లోఁబడి వర్తించుట. ఆకాలము తనకు విజయావహం బైనచో ననఁగాఁ దనద్వారా భగవంతుఁ డొకకార్యమును సఫలముగాఁ జేయింప నిశ్చయించుచోఁ దాను దత్కార్యమునఁ బ్రవర్తింపవలయు. అపుడు తనప్రతిపక్షమున నున్నరాజు తొలంగును. భగవంతుఁ డెపుడు మఱొకనిచేఁ గార్యము చేయింప నుద్దేశించునో అపుడు తాను తొలంగి చనవలయునని దీనిరహస్యార్థము. కాలము ప్రాణికోటుల నాడించును. కాలమునకు భగవంతునకు భేదము కల్పించువాఁ డజ్ఞానులలో మొదటివాఁడని భావించి ప్రథమతాంబూల మీవలయును. భగవల్లక్షణములే కాలలక్షణములు. అఖండమగుకాలమును లోకవ్యవహారార్థ మిచ్ఛానుసారము విభజించుకొని వ్యవహరించు చున్నారము. అట్లే పరమేశ్వరుని ననేకరూపనామములచే నుపాసించుచున్నాము. కావునఁ గాలమును బరమేశ్వరస్వరూపముగా భావించువాఁడే ధన్యుఁడు. వానిప్రయత్నమే ఫలించును. ఇట్టులుండఁగాఁ దాను బలహీనుఁడయ్యును బలవం

తుఁ డగు రాజుతో యుద్ధము చేయఁబూనుట యనఁగాఁ గాల
మును దిరస్కరించుటయే కదా. ఆ కార్యము పంచిదగునా.
ఈనీతినే బలరాముఁ డుపదేశించెను.

"కం. తమకు జవం బెక్కినతఱి,
సముచితమగు సంగరంబు." అని భారతము తెల్పు
చున్నది. ఇదొకయుపదేశము. బలరాముని రెండవయుపదేశ
మును బరికింపుఁడు. నేను శ్రీకృష్ణుఁడు మధురలో నున్నందున
నిన్నిమాఱు లీపురికి బాధ కలుగుచున్నది. కావున మేమిపుడు పు
రము జీవితార్థ మెందేని పోవుదుము. శక్తిలేక కాదు.

"శ్లో. అహం తావత్సహార్యేణ ముహూర్తే ఒస్మిక్ ప్రకాశితే,
జీవితార్థం గమిష్యామి శక్తిమాన ప్యశక్తవత్."

అని పలికెను. దీనిభావమేమి? ఇపుడు జరాసంధుం బోలియింప
నవకాశము లేదు. మే మిటనున్న వాఁడు నగరమును ముట్ట
డింపక మానఁడు. దానఁ బౌరులకు ననేకకష్టములు గల్గకపోవు.
కాఁబట్టి మేమెందే నరుగుదు మనియె. ఎంతటివాఁడుకాని తన
వలన నొరులకుఁ బెక్కండ్రకొకముప్పు తప్పక కల్గునేని తన
సుఖము ప్రధానమని భావింపక వేఱొండుచోటికిఁ బోవలయు.
అనఁగా నితరుల కుపద్రవములు కల్గుటకుఁ దాను గారణభూ
తుఁడు కాకయుండవలయునని దీనిసారము. శక్తిగలవాఁడైనను
శక్తిహీనునివలె నటించవలయు ననఁగాఁ దనశక్తి యితరులకు
బాధగల్గింపఁ గూడదని భావము.

పిదప సోదరులిద్దఱు ప్రయాణమును సాగించి యొక్క
మఱ్ఱిచెట్టుక్రిందఁ గూరుచున్న పరశురాముం గాంచిరి. ఆ
మునిని శ్రీకృష్ణుఁ డెఱింగి తచ్చరిత్రమును స్తుతిరూపమునఁ

బలికి తనవచ్చినపనిని దెల్పెను. ఆమాటలు విని పరశురాముఁడు పల్కినవాక్కులు పఠింపఁ దగినవి. శ్రీకృష్ణా! భగవంతుఁడవు. సకలలోకనాథుఁడవు. పురాణపూరుషుఁడవు. నిన్నుఁ జూచుటకే వచ్చి కాచియున్నాఁడ ననియెఁ గదా. దీనిభావమేమి? రామకృష్ణులు కరవీరనగరమున కరుదెంతు రని యతఁ డెఱింగెను. త్రికాలజ్ఞాన మామహాత్మునకుఁ గలదని తెలియవచ్చును. పరశురాముఁడు శ్రీకృష్ణుని బొగడుటయేల? అనఁగా భగవదంశము. అతనియందుఁ బ్రవేశించి దుష్టభూపాలసంహారము చేసి శాంతి నొంది శ్రీరామునియం దైక్యమయ్యెను. పరమపవిత్రహృదయమునఁగాని భగవదంశము కార్యార్థము ప్రవేశింపదు. చిరకాల మాపరశురాముని హృదయంబున నిలిచి యితరాసాధ్యకార్యముల నిర్వహించెను. ఆపని పూర్ణము కాఁగాఁ దనచోటికిఁ దాఁబోయెను. కావునఁ దత్సహవాసము చిరకాలము కలుగుటంజేసి విమలజ్ఞాన మాయనకుఁ గల్గెను. కావున భవిష్యత్కాలజ్ఞాన మామునివర్యునకుంగల్గుట సహజము. తద్దర్శనమును జేయుటకే వీరిరువు రచ్చటికిం బోయిరి. అందు మృతి నొందఁ దగుప్రాణికోటి కలదు. జరాసంధుం గూడి పోవ వేచియున్నది. ఏచోట నెవరెవరి కేయేకాలముల మృతి గలుగవలయునో ఆచోట వారల నెల్ల నదృశ్యపాశములం దగిలించి యీడ్చుకొని పోవుట భగవంతునకుఁ గర్తవ్యము కదా. ఆపని నెట్లు మానఁ గలఁడు? ఆవిషయమే పరశురాముఁ డెఱింగించెను. పరశురాముఁ డిపు డవతారములలోఁ జేరినవాఁడు కాఁడా యని ప్రశ్నింపరాదు. ఆరూపమునఁ జేయవలసినకార్యము పూర్తియైనదని భావము. బలరామాదిరూపములఁ జేయఁదగు కార్య

ములున్నవి. ఇంతియ మనమెఱుంగఁదగు విషయము. ఆర్యు లారా! ఈకథయం దింక ననేకవిషయములు గలవు. కాని గ్రంథవిస్తరభీతిని వాని మానితిని. తరువాత రామకృష్ణు లా పరశురాముం గూడి యేయేకార్యముల నొనరించిరో వాని వినఁగోరుమీకుఁ దడవుగఁజేర్చుట మంచిదికాదు. తరువాతి గాథలం జిత్తగింపుఁడు.

పరశురాముంగూడి రామకృష్ణులు గోమంతపర్వతమున కరుగుట.

* రామకృష్ణు లట్లు పరశురాముఁడు వచించువాక్య ముల నాలకించి తదుక్తప్రకారము చేయఁగోరి యా కామ ధేను వొసంగిన క్షీరములం గ్రోలిరి. దాన సంపూర్ణబల దర్పములు వారి కమరియుండెను. పరశురాముఁడు త్రోవ చూపఁగాఁ బ్రయాణము సేసిరి. వారి గమన మాతరుణమున మదదంతావళిగమనమును దిరస్కరించుచుండెను. ముందుఁ బరశురాముఁడు వెనుక బలరాముఁడు పిఱుంద శ్రీకృష్ణుఁడు నడచుచుండఁ ద్రేతాగ్నులు వరుసఁగా నొకదానివెంట నొకటి యున్న చందము కనుపట్టెను. ఆమార్గమంతయుఁ దద్గమనమునఁ బవిత్రమగుటయే గాక కాంతిపుంజముల వెలయఁ జొచ్చెను. వారు ప్రయాణనియమముల ననుసరించి గోమంతమును గొలఁది దినములకు దేవతలు మందరపర్వతమున కరిగినట్లు చేరిరి. ఆ పర్వతవర్యము లతావిశేషపరివేష్టితము. వివిధతరువరసంకు లము. లతలు ద్విరేఫసంకీర్ణములు. పాదపములు శిలాంతరసంస్థి తిసంకటప్రదములు. మేఘధ్వనులంగూడి మయూరక్రేంకా

* ఈకథ హరివంశ విష్ణుపర్వము నలుపదవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

రము లందందు వినఁబడుచుండెను.శిఖరములు గగనమును స్పృశించుచుండెను. పాదపములు మేఘముల ముద్దిడుకొనుచుండెను. మదపుటేనుఁగులు దంతముల నెగఁజిమ్ముటచే నందలి పాషాణములయందుఁ జిహ్నము లగపడుచుండెను. పులుఁగులు కొలకొలమని కూయుచుంటఁ బర్వతము నెల్లయెడలఁ బ్రతినాదములు వినఁబడుచుండెను. ఉన్నతభాగమునుండి చట్రాలపైఁ బడుజలధారలు సర్వత్ర వ్యాపించుచు నుండెను. శార్దూలనఖము లెల్లయెడలఁ గనఁబడు చుండెను. నల్లని తాలగమిచే నాపర్వతము దూరమునుండి యెంతో వింతగాఁ గనఁబడుచుండెను. గైరికాదిధాతువు లాపర్వతదేహమును విచిత్రవర్ణము గలదానినిగాఁ జేయుచుండెను. దేవతాసంఘములు విహరించుచుండుట నాభూధరము కామరూపముగల మైనాకమువలెఁ గన్పట్టుచుండెను. జలధారలు పెక్కుతావులఁ గనఁబడుచు మనస్సంతోషమును గల్గించు చుండెను. శ్వేతాభ్రములు మూఁగియుంటఁ గాననము పాషాణములు కొన్నితావులఁ దెల్లగాఁ గనఁబడు చుండెను. వివిధమనోహరపల్లవకుట్మలప్రసూనఫలవిసరభాసమానతరువరములు పెక్కునామముల విలసిల్లు చుండెను. దంతావళిసంతానములు క్రిక్కిరిసి యుండెను. ఇతరమృగగణములు చరించుచుండఁ జూడ వేడుకగా నుండెను.

భూరిపాషాణములనడుమ విశాలభాగముల సిద్ధచారణదంపతులు వేడ్కమై నుండిరి. గంధర్వు లాయాయితావుల హాయిగాఁ బాడుచుండిరి. విద్యాధరగణము లున్నతగ్రావాగ్రములఁ గూరుచుండియుండిరి. సింహశార్దూలాది సత్వనాద

ములఁ బర్వతమంతయుఁ బ్రతిధ్వని చేయుచుండెను. వారిధారలు నేత్రపర్వ మొనర్చుచుఁ బెక్కుతావులం జూపట్టుచుండెను. అచ్చరలు నిర్భయముగా నందందుఁ దమ సఖీబృందముంగూడి విహరించు చుండిరి. పరమపావనవనస్పతిరాజములు సాంద్రకుసుమాభిభూషితములై చూచువారల కామోదమును గూర్పఁజాలియుండెను. ఆపర్వతము త్రిదశనివాస మగుటంగాఁబోలు శతమఖకులిశప్రహారముల నొక్కనాఁడేని యెఱుంగదు. దావాగ్నిభయ మాగ్రావశిరోమణికి లేదు. మహావాతపీడయు లేదు. కాని పెక్కుతావుల భయంకరధ్వనులు చేయుచు సెలయేఱులు ప్రవహించుచుండెను. ఆధ్వనుల కులుకుచెందక త్రిదశనారీమణులు సైతమాతీరములయందు శీకరములతాఁకున హాయిచెందుచు విహరించు చుందురు.

ఆపర్వతమును గాంచి పరశురాముఁడు రామకృష్ణులు పక్షులు వృక్షముల నెక్కునట్లు మహోత్సాహమున నధిష్ఠించిరి. వైనతేయపరాక్రము లగువారు తత్పర్వతము నధిరోహించి యందుత్తరపుశృంగమును జేరిరి. మనఃప్రీతికర మగు నావాసము నిర్మించుకొనిరి. పరశురాముఁడత్తఱి వారింగాంచి మనోభిరామముగ నిట్లు పలుక నారంభించెను. శ్రీకృష్ణా! నేను శూర్పారకపురమున కరిగెదను. దేవత లరుదెంచినను యుద్ధరంగమున మీ కోటమిలేదు. మిమ్ముం గూడి యింతదూరము నడచివచ్చినదే నాకుఁ బరమానందము. ఆయానందమే నాకుఁ గ్రొత్తశరీరమును నిర్మించినది. ఈస్థానమే మీనివాసముగా దేవత లేర్పఱచిరి. యుద్ధమున కనుకూల మగుస్థల మీయదియే. దేవతలకుఁ బ్రధానదైవము శ్రీమన్నారాయణమూర్తి.

లోకత్రయసుఖావహం బగు నాయీమాట నాలకింపుము. నీవిపు డారంభించిన లౌకికకర్మము మానుషహితార్థ మగుం గాక! ఆకర్మమున కిది తొలియంకురారోహణము. జరాసంధుని తోటి యుద్ధ మారంభముకాఁగా లోకమున కభ్యుదయము కల్గును. చక్రగదాపరిశోభితహస్తారవిందుఁడ వగుగోవిందు నిన్నుం గాంచి శతక్రతుఁడుగూడ భీతిల్లునుగాక. ఇదిమొదలు నీయాత్ర స్వర్గప్రతిపాదితమై యలరారును. నీ వస్త్రధారివై రణాంగణమున నిలువంబడఁగా రాజేంద్రులు స్వర్గమున కరిగి దాని నలంకరింతురు. వినతానందనుం డగుపక్షీంద్రుని ధ్వజముగా నుండుమని స్మరింపుము. రాజులందఱు నిపుడు యుద్ధకర్మాభిరతులై త్రిదివాభిముఖులై యున్నవారు. మఱియు ధార్తరాష్ట్రులకు లోఁబడి రణవ్యాపారనిమగ్నులై నీకొఱ కెదురు చూచుచున్నవారు. భూదేవి రాజులమరణమును గోరి భర్తృహీనగా నుండుకోరిక నేణివేణిని ధరించి నీయాగమనమును బ్రతీక్షించుచున్నది. కావున భూభారహరణార్థ మవతరించిన నీవు త్వరపడవలయు. దానవుల నిర్మూలింపవలయును. భూపాలకులకు స్వర్గసుఖమును గల్పింపవలయు. దేవతలకు సుఖసమృద్ధిని బ్రసాదింపవలయును. శ్రీకృష్ణా! నీచే సత్కృతుఁడ నైతిని. దీనిచే సచరాచరములచేఁ బూజితుఁడ నైతినని తలంచువాఁడను. నేనీ సాయంకాలము నీచే ననుమతుఁడనై ప్రయాణము చేసెదను. నీకుం గార్యసిద్ధి త్వరగా నగుంగాక. రాజులతో సంగరము చేయుతఱిని మహారణ్యములఁ దిరుగునపుడును నన్ను స్మరింతువుగాక. అని పలికి యెల్లకార్యములను లోకులకుం గష్టములను గల్గింప నొనరింపని శ్రీకృష్ణునిచే ననుమతుఁ

డై జయాశీర్వాదముల నొసరించి తాఁ బోవనెంచినదిక్కునకుఁ బరశురాముఁడు వెళ్లెను.

భక్తవర్యులారా! ఈకథయందుఁ దెలుపఁదగిన విశేషాంశములు గానరావు. కాని యొక్కవిషయ మిటనుండి గ్రహింపవలయును. భూభారహరణార్థ మవతరించినవాఁడు శ్రీహరి యని స్పష్టముగా నిటఁ జెప్పఁబడినది కదా. బలరాముఁ డేల యవతరించెను? అను ప్రశ్నము కలదు. దశావతారములలో శ్రీకృష్ణావతారము చేరదని దీనినుండి తేలెడిని. శ్రీకృష్ణుఁడు మనుష్యరూపమున నవతరింపలేదనియు మనుజరూపమితరులకు గోచరమగునట్లు చేసెనేకాని స్వరూపముననే భూలోకమున నున్నవాఁడనియుఁ దెలిసికొనవలయు. బలరాముఁడు తనచేఁ జావఁదగినవారలఁ బొలియించి యూరకుండును. విశేషించి శ్రీకృష్ణు ననుసరించి యుండును. తదుక్తప్రకారము చేయుచుండునని దీనిసారము. ఇట్లు వ్రాయుటచే వీ రిరువురకు భేదము కలదని తోఁపవచ్చు. కాని యది పొరపాటు. మనుష్యత్వము కలుగుట యవతార మనంబడు. మాయామానుషవిగ్రహధారిత్వము సర్వసాక్షిత్వద్యోతక మనంబడును. భేద మింతియేగాని వేఱు కాదు. ఏయేపని యెట్లెట్లు జరగునో తెలిసినట్లు చేయుట శ్రీకృష్ణుని కార్యము. తెలియనట్లు చేయుట బలరాముని పని. తాను భగవదంశము గలవాఁడనై యుంటినని యెఱుంగుట పరశురామునికృత్యము. ఈవిషయము నెఱింగినఁ జాలు. భేదబుద్ధితొలంగును. దశావతారములలో బలరామావతారము చేరదనియు శ్రీకృష్ణావతారమే చేరుననియుఁ బలుకువారిమాటలు విశ్వాసార్హములు కావనియుఁ దేటపడును. ఇంత

మాత్ర మెఱింగి యేయవతారమును ధ్యానించినను దత్కారణావాప్తు లగుట కభ్యంతరము గలుగదని నాకుం గలదృఢవిశ్వాసము. భేదబుద్ధి గలిగి పరమేశ్వరు ధ్యానించిన ఫలమల్పము. అవతారములయం దభేదబుద్ధి గలిగినచో నేమిలాభమనఁగా దేవతాంతరవిభేదము తొలఁగుటయే మహాలాభము. దాన సమదర్శిత్వము సిద్ధించును. తపోధ్యాననిష్ఠలకు ఫలమదియే కదా. ఇంతటిమహాలాభము భేదబుద్ధిచే నశించును. అట్టిలాభమును బోఁగొట్టుకొనుట కంటెఁ దెలివితక్కువ వేఱొండుండునా? సిరి రా మోకా లొడ్డువారు గలరా? మతద్వేషము వారిలాభమును బోఁగొట్ట సమర్థ మగును. తనకు రాఁగల మహాలాభమును గూడ నశింపఁజేయు మతద్వేషము నున్మూలింపఁ జేయనివా రున్మత్తులుగాక మఱెవ్వరగుదురు? కావున విషయము నెఱింగి భగవంతుని సేవించుట మంచిదని తెలుపుచున్నాఁడను. ఇఁకఁ దర్వాతి కథను జిత్తగింపుఁడు.

## జరాసంధుఁడు గోమంతమును ముట్టడింప నరుగుట.

* పరశురాముఁడు శ్రీకృష్ణానుమతుఁడై తనయిచ్ఛచొప్పునఁ బోవఁగా రామకృష్ణు లాగోమంతపర్వతశిఖరమునందుఁ గామరూపములు ధరించి సంచరించిరి. వనమాలలు వారి కంఠముల నలరుచుండెను. నీలపీతాంబరములు వారితనువులసంగతిఁ బ్రకాశించుచుండెను. శ్వేతనీలవస్త్రములు వారితనువులఁ గనఁ

* ఈకథ హరివంశ విష్ణుపర్వము నలువదియొకండవ యధ్యాయము నుండి సంగ్రహింపఁబడినది. "గోమంతశిఖరే రమ్యే చేరతుః కామరూపిణౌ" అని మూలము.

బడుచుండెను. రామకృష్ణు లిర్వురును గైరికధాతువుల మేనుల నలంది శిఖరమునఁ దిరుగుచుఁ గాననసంచారరతిని గనఁబఱచుచు నుదయించు శీతాంశుని గన్నులలరఁ గాంచుచు నుదయాస్తమయముల నొందు గ్రహములఁ బరిశీలించుచు నుండిరి.

అంత బలరాముఁడు కృష్ణు నెడఁబాసి యొంటరిగాఁ దిరుగ నూహించెను. పూచిన కదంబవృక్షచ్ఛాయలఁ గూరుచుండి మందమందపవమాన సుఖస్పర్శమున సొగయుచు నుండఁగా మద్యపానాసక్తి పొడసూపెను. వెంటనే ముఖము శోషిల్లెను. అంత నమృతప్రాశనవృత్తాంతము నామహాపురుషుఁడు స్మరించెను. మదిరాన్వేషియై యాభూరుహమును నిరీక్షించెను. ప్రావృట్కాలమున మేఘములు విడిచిన వృష్టిజలబిందువు లాతరుకోటరమునఁ బడియుండెను గాన నవి సుస్వాదుమద్యముగా మాఱెను. మనోహరపరిమళము నాసికారంధ్రములఁ జూఱఁగొనియెను. ఆసువాసనకు మిగుల సంతసించి యాతురంపడి దానిం గ్రోలెను. దాన మత్తెక్కఁగా దేహమును మఱచెను. దానిచే నాతనిముఖము క్రొత్తవిధముగాఁ దోఁచెను. లోచనములు చలింపసాగెను. * కదంబకోటరసంభూతిం గాంచినకతన నామద్యము కాదంబరి యనంబడియె. వారుణి యాతరుకోటరమున బలరామునిఁ దృప్తిచేయం గోరి మూర్తిభవించి దేవతలకమృతమువలెఁ దృప్తి నొందించెను. కాదంబరీ మదకలుండగు బలరాము నెఱింగి మూవురచ్చరలు చేరవచ్చిరి. ఆముగ్గురు వాస్తవము నాలోచింప నచ్చరమిన్నలు

* "కదంబకోటరే జాతా నామ్నా కాదంబరీతి చ." అనిమూలము.

కారు. * రూపమును ధరించిన వారుణీదేవియు, శీతాంశుని కళయు మహాలక్ష్మియు నని యెఱుంగవలయు. వీరు మువ్వురును రౌహిణేయు సమీపించిరి. అందు లక్ష్మీదేవి వారుణింగూడి యిట్లు పలికెను. బలరామా! నీవు దేవతలకు బలము నిచ్చువాఁడవు. జయింపుమా. వర్ధిల్లుమా. నేను నీకుం బ్రియురాల నగువారుణీకాంతను. నిన్ను సేవింప నరుదెంచితిని. బడబాముఖమున నంతర్ధానము నొందితివని విని నిన్నుఁ జూడఁగోరి తిరుగుచున్నదాన. పుణ్యమను చక్రమునఁ గేసరములందుఁ బరిభ్రమించునట్లు భూమండలమునఁ దిరుగుచున్నదానను. పుష్పకదంబపరిభూషితాలిముక్తభూరుహంబులం గాంచుచున్నదాన. నేను మేఘములద్వారా కదంబవృక్షము నొందితిని. తృషితుఁడవగునిన్నుం గాంచి నిజరూపము నొంది సేవించితిని. అమృతమథనకాలమం దేరూపము నొందితినో యారూపమునే యిపుడు ధరించితిని. వరుణుఁడు నాతండ్రి గావునఁ దత్ప్రేషితనై యిపు డరుదెంచితిని. నన్ననుగ్రహించి పరిగ్రహింపుము. నీవు వలదన్నను విడువఁజాలను. నిన్ను వదలి యేలోకమును జూడఁ గోరను.

ఇట్లు వారుణి మాటలాడి యూరకుండఁగా నాదిపద్మమును దివ్యశ్రవణభూషణములను ధరించి కౌశేయముంగట్టి కాంతిదేవి యిట్లు సంభాషించెను. ఆమెనేత్రము లెఱ్ఱగా నుండెను. బద్ధాంజలిపుట యూమెకుఁ గలప్రీతిని దెలుపుచుండెను. సుస్మితము ముఖపంకజాంతరమున నటనము చేయుచుం

---

* "మదిరారూపిణీ భూత్వా కాంతిశ్చ శశినః ప్రియా, శ్రీశ్చ దేవీ వరిష్ఠా స్త్రీ స్వయమేవాంబుజధ్వజా." అని మూలము.

డెను. మహాత్మా! సర్వోత్కర్షముగా వర్ధిల్లుము. చంద్రుని కంటెఁ బ్రియతముఁడవని వారుణీదేవివలె నిన్ను సేవింప నరు దెంచితిని. నన్నుఁ బరిగ్రహింపుమా యని ప్రార్థించెను. ఇట్లు కాంతిదేవి మాటలాడి యూరకుండఁగాఁ బద్మములయందే నివసించుచు విష్ణువక్షస్స్థలమున నివసించుచుఁ బద్మమాలికను హస్తమునఁ దాల్చి లక్ష్మీదేవి బలరాముని గాంచి యిట్లు వచించెను. రామా! రామా! నీవు సర్వలోకమనోహరుఁడవు. వారుణీదేవి నిన్నాశ్రయించెను. కాంతియు నిన్ను సేవించెను. వారిఁగూడి నేనును సేవింప నరుదెంచితిని. ఈపద్మమాలచే నీశిరస్సు నలంకరింతును. అనంతా! దీన నీశీర్షసహస్రరూప మగుమస్తకము ప్రకాశించుఁగాక. స్వామీ కరపంకజాకారము లగునీకుండలములను, నీలకౌశేయాంబరములను హారమును బరిగ్రహింపుము. భూషణాలంకారము నకిది సుసమయము. అని ప్రార్థింపఁగా వా రొసంగిన యలంకారపదార్థములఁ బరిగ్రహించి యలంకరించుకొని వారి నంగీకరించెను. అత్తఱి నాబలరామునిరూప మత్యద్భుతముగాఁ జూపట్టెను.

ఆసమయమున శ్రీకృష్ణుఁ డరుదెంచెను. వారిఁగూడిన బలదేవుఁడు మఱింత సంతోషించెను. దానఁ దత్తేజ మతిలోకసుందరముగాఁ గనుపట్టెను. దేవతలు జయజయధ్వను లొనరించిరి. రామకృష్ణులు గృహమునందు మాటలాడినట్లే యందును మాటలాడుచుండఁగా వినతాతనయుఁ డగుగరుత్మంతుఁ డరుదెంచెను. ఆతనిగమనవేగము సంగ్రామార్హముగ నుండెను. గరుఁడునియంగము దానవశస్త్రాస్త్రాంకితముగా నుండెను. తదా

గమనమును దేవతలు శ్లాఘించిరి. మున్ను భగవంతుఁడు వరుణాలయ మనంబడు క్షీరార్ణవమందు శయనించి యుండఁగాఁ గిరీటము వైరోచనునిచే నపహృతంబయ్యెను. తదానయనార్థమై మహాసంగ్రామము జరగెను. ఆసంగ్రామము సముద్రాంతర్భాగమున ఘోరంబుగా సాగఁగాఁ బక్షిరాజు వారలం గెల్చి యాకిరీటమును భగవద్ధారణార్థము తెచ్చెను. ఆనాఁడు చూపిన వేగమును జూపుచుఁ దార్క్ష్యుఁ డరుదెంచి కార్యాంతరార్థ మరుదెంచి శైలమూర్ధమున నాసీనుఁడై యున్న గురువగు శ్రీకృష్ణునిం గాంచెను. ఆకిరీటమును గ్రోడభాగమునఁ దాల్చి మానుషరూపమును దాల్చి ప్రకాశచేష్టానిర్ముక్తుఁడై కిరీటవిహీనుఁడగుహరిని దర్శించి తద్భావాభిజ్ఞుఁడు గాన నాకిరీటమును భగవచ్ఛిరమున నలంకరించెను. వైనతేయు నాశయమెఱింగి కృష్ణమూర్తి హర్షమున బలరామునిం గాంచి యిట్లు పలికెను. గరుడుఁడు దేవతాకార్యార్థము త్వరపెట్టుచున్నవాఁడు. ఈ పర్వతమునందే యుద్ధము కాఁగలదని దేవతలు నిశ్చయించిరి. తదర్థమై గరుడుఁ డరుదెంచెను. జరాసంధునిసేనాసముదయము ప్రవాహముం బోలి వచ్చుచున్నది. రథాగ్రము లగపడుచున్నవి. ధ్వజపటములు చక్షుర్గోచరము లగుచున్నవి. విజిగీషువు లగురాజుల సితాతపత్రములు చంద్రసంకాశములై కానవచ్చుచున్నవి. రథపంక్తులు శ్వేతాతపత్రసముదయములు దృష్టిగోచరము లగుచున్నవి. హంసపంక్తు లాకాశమున మందగమనమున నందముగాఁ బోవున ట్లీశ్వేతాతపత్రములు చాలుగఁ గనఁబడుచు మనచెంతకు వచ్చుచున్నవి. సోదరా! అల్లదె కనుఁగొనుము. ఆకసమున రాజులశస్త్రకాంతులు సూర్యకిరణ

ములం గలిసి తళతళ లాడుచు దిక్కుల వ్యాపించుచున్నది. దీనింబట్టి యూహింపఁగా ఈరాజుల శస్త్రాస్త్రములు నాశ్రైఁ బడఁగలవు. కాని వారు నశింతురన్నమాట సత్యము. జరాసంధుఁడు కాలరూపుఁడై వచ్చుచున్నాఁడు. మన కీయుద్ధము పరీక్షార్థ మేర్పడినది. ఆర్యా! మన మిరువుర మిందె యుందము. ఆతఁడు మనచెంత కరుదెంచుదాక నూరకుందము. తొలుదొలుత శత్రుబలములఁ బరీక్షించి యుద్ధారంభము చేయవలయునని రాజనీతి బోధించెడిని. అని పలికి శ్రీహరి నిర్వేదము నొందని మదితో నుండెను. యుద్ధాభిలాషము తచ్చిత్తమున వ్యాపించి యుండెను. జరాసంధుని వధింపఁగోరి తద్బలములఁ బరీక్షించుచుండెను. అందున్నరాజులఁ బరికించుచుఁ దనలోఁ దా నిట్లు తలపోయఁ జొచ్చెను.

ఈరాజులందఱు రాజమార్గమున నున్నవారు. శాస్త్రవిహితకర్మమున వీరెల్ల నశింపఁదలఁచి యున్నవారు. వీరినెల్ల మృత్యువు లాగుకొని వచ్చినదని తలంచెదను. వీరిదేహములు సురమార్గమునఁ బోవ నాశించుచున్నవి. వీరిభారమునకు దాళఁజాలకయే భూదేవి సురపురి కరిగి నిర్జరుల నభ్యర్థించెను. రాజసింహములు వీరిబలసముదాయములు భూదేవిని బీడించినవి. స్వల్పకాలముననే వీరెల్ల నశింప భారపీడంబాసి భూదేవి సుఖపడఁగలదు. భూతలము వివిక్తము కాఁ గలదు. నభోమార్గ మీరాజులచే వీరిసేనలచే నావరింపఁబడఁగలదు. ఇదియే ముందు కాఁగలకార్యము. ఈకార్యమున నేను సాక్షిమాత్రుఁడనై యుండెదను. కాఁగలకార్యము తనంతన సాగఁగలదు. అని శ్రీహరి యూహించు చుండెను.

మహామతులారా! ఈగాథయం దొకవిచిత్రవృత్తాంతము కలదు. దానిం బరిశీలించితిమేని యనేకవిషయములు బయలుపడఁగలవు. రామకృష్ణులు గోమంతశిఖరమునఁ గామరూపమును ధరించి సంచరించిరని మూలమునఁ గనఁబడెడు. కామరూపముల ననఁగా భావమేమి? నిర్మానుష్యమగు నాపర్వతమూర్ధమునఁ దమ దివ్యరూపములతో నుండిరనికదా దాని భావము. పరశురామునిగమనానంతరము రామకేశవులు తమ పూర్వరూపములం దాల్చి తిరిగి రనుటలోఁ గల రహస్యార్థ మేది? కాఁగలయుద్ధమున కీమానుష వేషము పనికిరాదనియుఁ దమపూర్వరూపముల వీక్షించినఁగాని యారాజమండలమెల్ల నొక్కుమ్మడి నశించుననియుఁ దాత్పర్యము. కావున బలదేవుఁ డవతారపురుషుఁడు కాఁడన్న వాదము. దీనితో నశించినది. రెండవతారము లేకకాలమున నుండనేలయన్న మొండివాద ముకూడ దూరమునఁ దొలఁగినట్లే. ఇంతమాత్రము చాలదం దు రేని మఱొక్క యుదాహరణముకూడ నిందే కలదు. దానిం జిత్తగింపుఁడు. అది బలరాముని మహిమమునే తెల్పును.

బలరాముఁ డొంటరిగా నొకచోట నుండెను. అంతలో మదిరాపరిమళము నాసికారంధ్రములఁ జూఱఁగొనియెను. వెంటనే బలరాముఁడు పైని దృష్టి నునిచెను. కదంబతరుచ్ఛాయ విశ్రమించియుండెను గావున నాతరువునందే యొకపరిమళ ముద్భవిల్లి తదీయహృదయము నాకర్షించెను. ఆతరురంధ్రమున వర్షజలము పడి యది మద్యరూపమును దాల్చి యుండెను. అంతలో నామద్యరూపిణియగువారుణియు శ్రీదేవియుఁ గాంతియు రూపములఁ దాల్చి వచ్చి యాతని సేవించిరి. అని

కథలోఁ గన్పట్టెడిని. ఇందలి రహస్యార్థ మేమి ? బలరాముఁడు సురాపానరతుఁడనియు నాతని కడ కెవ్వరో వచ్చిరనియు నిది యేనా రహస్యము ? అట్లయినచో సురాపానము పాపమూలక మేలయగును? కావున నాభావము సమంజసము కాదు. మఱే మనఁగా వినుఁడు. పూర్వకాలమందున దేవతాన్నైవేద్యవస్తువులలో నమృతాసవము కలదు. అఱువదినాలు గుపచారములలో నమృతాసవచషకప్రదాన మొక్కటి. అది సుర కాదు. ఆసవ మనఁగా సురయనియు నర్థము కలదు. ఒక్కశబ్దమున కనేకార్థము లున్నవి. పుష్పరసము సేకరించి ప్రాగుట పూర్వుల యాచారము. పుష్పరసమనఁగా మధువు. అనఁగాఁ దేనె. అది యనేకవిధముల నుండును. మధువనఁగా సురయనియు నర్థము కలదు. కదంబవృక్షవివరమునఁ బుట్టిన మధువునకు సార్థకముగాఁ గాదంబరి యని పేరు కలిగెనని మూలముననె కనఁబడుచున్నది కదా. ఒక్కొక్కపుష్పరసము ప్రధానమగుచో నాపేరు వచ్చును. వృక్షరంధ్రములఁ బుట్టిన మధువునకు జుంటితేనె యని పేరు. దానిని గూర్చు మక్షికము లత్యల్పరూపము గలవి. ప్రాయశః మధుమక్షికము లనఁబడెడునవి యవిగావు. ఈమక్షికములు బాధించునవికావు. మశకములవంటివి. అవి వృక్షరంధ్రముల మధువును సేకరించును. దానినే మనము జుంటితేనె యందుము. ఆమక్షికములు చల్లనితావుల నుండును. కావున వర్షోదకములు కదంబతరువివరమునఁ బడఁగా నందు మధు వావిర్భవించె నని చెప్పఁబడినది కదా. దానియర్థ మిది. ఆమధువును ద్రాగినంతనే యాతనివదనమున నొకవింతకాంతి యంకురించెను. తేనెను ద్రాగినచో నించుక యుద్రేకము కల్గు

ననుట స్పష్టము. అది వేఁడిని గల్గించును. దాన మాంద్యము వదలి దానిస్థానమున జాగ్రత్త చేరును. ఇట్టితఱి శశాంకమండలమునుండి కాంతియు నరుదెంచి బలరాముని బ్రార్థించి సేవించెను. అనఁగా శశాంకమండలమున నున్న భగవత్కళ యత్తఱి బలరామునకుఁ గనఁబడె నని భావము. భగవద్దత్తమేకదా చంద్రమండల ప్రకాశము. ప్రతిప్రాణికోటియందుఁ గలతేజస్సు భగవన్నిహితతేజస్సు గాక మఱేమి? శ్రీదేవి యామహాత్ము నాశ్రయించె ననుటలో వింత యేమి గలదు? అనఁగా బుష్పరసము గ్రోలఁగనే ముఖమున నొకక్రొత్తకాంతి కలిగెననియు నమానుష తేజ స్సంకురించె ననియు భావము. సురాపానము మహాత్ములకే విహితమైనపుడు మనకేల కాఁగూడ దన్నవాదము దుర్వాదము. మహాత్ములు చేయుకార్యములు మనము చేయఁ జాలుదుమా. కాఁబట్టి వారిం జూచి మన మభ్యసింపరాదు బలరాముఁడు మహావిష్ణువు కానిచో శ్రీదేవి యాతని నాశ్రయించెననుట విపరీతముగాఁ దోఁపదా. కాఁబట్టి దశావతారములలో నొక్కటియగు బలరామావతారము భగవంతునిగా దనుట పొరపాటు. అట్టిపాపకార్యమున కాస్తికుఁ డొడిగట్టఁ గూడదు. నాస్తికుల కిహపరములు శూన్యములు. కావున వారేమన్నను మనము బదులిడరాదు.

బలరామకృష్ణు లత్తఱిఁ గామరూపములఁ దాల్పనేల? అన్న దొకప్రశ్నము. గరుత్మంతుని హరి స్మరించెను. తదారూఢుఁడు కావలయు. కావున స్వరూపము నంగీకరించెను. దర్శనమాత్రమున విషమాట్టహాసముల నలరు రాజకులతిలకులు నశింపవలదా. అట్లు కాకున్న భూభార మడంగు టెట్లు? అవి లే

కున్న నవతారఫల మేమి? ఇన్నికారణములకు హేతుభూత మగునది భగవద్ద్రూపము. కావున వానిని దత్స్వయమగు వా రవధరించిరని గ్రహించి యిట్టిరూపమును ధ్యానించి కృతకృ త్యులము గావలయును. ధ్యానముతప్పఁ దక్కినమార్గములు భగవత్ప్రీతికరములు గావు. నిరపాయమగు మార్గమిది. ద్రవ్య మక్కఱలేనిత్రోవ యిది. ఇట్టి దీనిమానుకొనుట చాలలో పము. కావున భగవద్రూపమును ధ్యానించి తన్నామసంకీ ర్తనము చేయవలయును. ఇఁకఁ దర్వాతికథను జిత్తగింపుఁడు.

జరాసంధుఁడు గోమంతమును ముట్టడించి యుద్ధము చేయుట.

* రామకృష్ణు లిట్లు మాటలాడుకొనుచుండుతఱి సర్వ భూపాలకులలో నుపతంసప్రాయుఁ డగుజరాసంధుఁడు బలపరా క్రమసంపన్ను లగుభూపాలకులం గూడి తనపరాక్రమంబు నలు దిక్కుల విస్తరిల్లఁజేయుచుఁ దాం డుచ్చైశ్శ్రవస్సుల ధిక్కరించు తురంగంబులు పిక్కటిల్లుచుండ సంగరప్రసంగంబునకు వలంతు లగుస్యందనబృందము లమందరయంబున నొండొంటితో నోర యిుకఁ గాంచక రాఁగా నీలమేఘములఁ దిరస్కరించుచు భూరి ఘంటానాదముల నరిహృదయముల నదలించు మాతంగసంతాన ములు నడగొండలపిండు ననుకరించుచుఁ దోడరాఁగా సకలాస్త్ర సంభృతు లగుపదాతు లరిదుర్జయులగుచు రాఁగా నాపర్వత మును సమీపించెను. ఆతనిసేనలం గాంచునపుడు మేఘబృంద ములు భూతలంబునఁ జరించుచున్నవని తోఁపక మానదు. జరాసంధుఁడు దృఢప్రయత్నుఁడు. ఆతనియాటోపము దుర్ని

---

* ఈకథ హరివంశ విష్ణుపర్వము నలువదిరెండవయధ్యాయమునుండి సంగ్రహింపఁ బడినదని యెఱుంగవలయును.

వారము. ఆతఁ డట్టి చతురంగబలములం గూడివచ్చుట రామ కృష్ణులకుఁ జక్షుర్గోచర మయ్యెను. ఆ రాజబలము హృష్టయోధజనాకులముగ నుండెను. పట్టుకొనుఁడు. పోనీయకుఁడు. కొట్టుఁడు. పొడవుఁడు. అను మొదలగు భయంకరధ్వనులచే బ్రహ్మాండమును భేదించునది. ఆవాహిని సాగరసమానముగ నుండెను. అందుఁగల రాజులకందఱకు ముందు జరాసంధుఁ డుండెను. వారెల్ల గోమంతమును జుట్టుముట్టడించి నిలిచిరి. చుట్టును శిబిరములు నిర్మింపఁబడియె. వానింజూడఁ బూర్ణిమా తిథియందు సాగరతరంగములు స్మృతిగోచరము లగు. తెల్ల వాఱుతఱిఁ బర్వతము నధిరోహింప నారాజు లూహించిరి. గుంపులుగాఁగూడి యా గోమంతసానువుల నిలిచిరి. వారందఱు గుమిగూడి యాలోచించిరి. ఆగుంపుగుంపులు తుములములై ప్రళయకాలమేఘధ్వనులఁ దిరస్కరింపఁ జాలెను.

అంతట నిశ్శబ్దముగా నుండవలయునను రాజశాసనము ప్రబలెను. దాన నాబలసాగరము. శాంతమును వహించెను. అత్తఱి జరాసంధుఁ డెల్లరంగాంచి యిట్లు పలికెను. త్వరగా భూధరమును ముట్టడింపుఁడు. పర్వతము నలుప్రక్కల బలములు క్రిక్కిరిసి యుండఁదగు. ఏక్షణమున యుద్ధ మారంభమగునో యని వేచియుండవలయును. సంకులసమరమునందును దండనాయకు నాజ్ఞయెట్లో యని కనిపెట్టి సేన లుండందగు. టంకములనఁబడు సాధనములచేతను ఖనిత్రములచేతను బర్వతము త్రవ్వఁదగినది. దండనాయకులు మొదలగువారెల్ల యుద్ధదుర్గముల నలవరించి సమీపముగనే నిలువఁదగు. ఇది మొదటి పర్వతము ముట్టడి సాగవలయును. ఇది వసుదేవతనయుల మఱియుం

చినంతదనుక సాగఁగలదని యెఱుంగుఁడు. ఈపర్వతము రూప విహీనము కావలయును. ఆకాశమునుదాఁకు నీగిరి భూసమ మగునట్లు చేయవలయును. రాజులు నన్ననుసరించి గిరిపృష్ఠ భూముల నిలుతురుగాక. ఆయాయితరుణములఁ గనిపెట్టి పర్వత మధిరోహించు టొప్పును.

మద్రభూపాలుఁడు, కళింగదేశాధిపతియు, చేకితానుఁడును, గాశ్మీరరాజును, గారూషదేశపాలుఁడును, కింపురుష దేశనాయకుఁ డగుద్రుముఁడును, బర్వతప్రాంతభూముల కధినాథులగు మాలవులును, గోమంతము నపరభాగము నాక్రమింతురు గాక. పౌండ్రవేణునాదాదులు భూపాలకుంజరు లుత్తరపార్శ్వము నాక్రమించి నిలుతురు గాక. ఉలూకక్రైతవేయాదులు పూర్వభాగము నాక్రమింతురు గాక. నేను యాదవనాయకప్రభృతులం గూడి యీ దక్షిణభాగమున నిలిచియుందును. అని యాజ్ఞాపింప నందఱు నట్లే నిలిచిరి. రాజశాసనమును శిరములం దాల్చి పర్వతమును జాగరూకతతోఁ గాపాడుచుండిరి. అత్తఱిఁ జేదిరాజు దేవతలకు మహేంద్రుఁడు చెప్పునట్లు రాజులతో నిట్లు పలికెను. ఈగోమంతమున నింతయుద్ధ మేల? ఈగిరిమూర్ధ మత్యున్నతము. తరుసారప్రతానీ సమావేష్టితము. తృణసంతతి సాంద్రముగ నుండును. కావున దురారోహముగ నుండును. కావున దీనినెక్క శ్రమంపడుటకంటెఁ దృణవితానముల నెలకొల్పి తగులఁబెట్టిన నగ్నిజ్వాలల భస్మమగును. రాజులందఱు సుకుమారులు. బాణములతోఁ బోరాడువారు. పర్వతమెక్కి పాదచారులై సంగ్రామ మొనరింపఁజాలరు. ఈపర్వతము నతికట్టుటకు, ముట్టడించి పైకెక్కుటకు దేవతలకుం

గూడ శక్యము కాదు. దుర్గముననుండు శత్రురాజుల నిరోధిం చుట న్యాయము. పర్వతము నాశ్రయించువారు శత్రువులు ముట్టడించి చాలకాలము నిలుపఁగా భోజనాదులకు శ్రమం పడి లొంగిపోవుదురు. మనము పెక్కుమందిమి. అనుటయేగాని వసుదేవతనయు లిరువురు దేవసమానులని వినుచున్నాఁడను. వా రొనరించిన కార్యములంబట్టి దేవత లనఁబడయును. మనుష్యు లలో నెవ్వరు నొనరింపనికార్యములఁ జేసి ప్రఖ్యాతిం గాంచిరి. కావున వారిం దొడరి గెలుచుట కిది. అట్టులౌట శుష్క కాష్ఠాదులం బర్వతపార్శ్వముల నెలకొల్పి దవానలు నంటిం తము. దాన వారు పొలియఁ గలరు. ఆదావానలజ్వాలామాలి కలకుఁ దాళఁజాలక దిగివత్తురేని నంబఱముం గూడి పడఁ గొట్టుదము.

అని యారాజు పలుకఁ దద్వాక్యము నంద ఱామోదిం చిరి. ఇయ్యది సముచితమగు నాలోచనమని యంగీకరించిరి. కావున వెంటనే సైనికులెల్ల నొక్కుమ్మొగి శుష్కదారువులం జేర్చియు శుష్కతృణంబుల నెలకొల్పియు ననలు నుద్దీపింపఁ జేసిరి. నలుగడల నొక్కసారి హుతవహు నుద్దీపింపఁజేయఁగాఁ దదనుకూలముగాఁ బవమానుఁడు వీవ నారంభించెను. జ్వాలలు మేఘమండలమును స్పృశింపసాగెను. శుష్కకాష్ఠతృణసహా యుఁడగు ననలుఁడు శ్రీమంతమై మనోహరపాదపవంతమగు నాగోమంతము నట్టె దహించెను. హుతవహుఁ డిట్లు ప్రజ్వ రిల్లి దన్నుఁగాల్ప నా భూధరము పరితాపముం దెలుపఁగోరి గండోపలములఁ బడఁ జేసెను. ఆ చట్రాలగుంపులు పెటలి యంబరమునుండి మహోల్కలు పడునట్లు భయంకరధ్వాన

ములు చేయుచుఁ బడసాగెను. అత్తఱి నా సానుమంతము రక్త వర్ణమై భయంకరాకారమున వెలిఁగెను. కొలఁది ముహూర్తములకుఁ దనయున్నతిం గోలుపోయి భస్మమయ మయ్యెను. అందలి గహ్వరములయందున్న నాగేంద్రములు విహ్వాలములై దగ్ధగాత్రులై పడగలు వివశములుకాఁగా నయనములనుండి యగ్నికణము లురుల మిట్టిమిట్టిపడి ప్రాణములం బాసెను. సింహశార్దూలాది సత్త్వములెందుఁ బరుగెత్తనుజాలక యేమియుం దోఁచక యామంటలనే శరణముగాఁ గోరి మడిసెను. ఇట్టులుండ నిఁకఁ బతులుఁ లోనగు నల్పజంతువులమాట చెప్ప నేటికి? ఆధూమములు వియత్తలము నావరించి వికృతాకృతిం గనంబడం జేసెను. పర్వతమునుగాల్చి ఆబాధల కోర్వఁజాలక సైనికులు దూరముగఁ బరుగిడి నిలిచిరి.

అప్పట్టున రోషతామ్రాక్షుఁడై రాముఁడు శ్రీహరిం గాంచి యిట్లు పలికెను. వత్సా! ఈపర్వతము కాల్పఁబడుచున్నది. పాదపాదు లిఁక జీవింపఁజాలవు. మనపైఁగల రోషమున జరాసంధుఁ డీ భూధరమును గాల్చెను. కృష్ణా! కనుఁగొనుమా. హవ్యవాహునిజ్వాలలు సధూమములై యెట్లు భయంకరముగా నంబరము నంటుచున్నవో జలాశయము లింకెను. మృగపతి ప్రభృతి ప్రాణికోటి మంటల కాహుతి యయ్యెను. వత్సా! మనకొఱకై యీపర్వతము రూపడంగుచున్నది. మనకిది యయశస్కరము, కలంకప్రాయము నగు. కావున నీపర్వతమునకు మనము ఋణపడితిమి. ఏతన్నిర్మోచనార్థము మన మీ రాజలోకముతో యుద్ధ మొనరింతము. ఈ రాజులందఱును బర్వతమును దహించి రథారూఢులై యుద్ధ

ము చేయఁ బూనియున్న వారు. అని పలికి పెచ్చుపెరుగు నాగ్ర హంబున మేరుపర్వతమునుండి శశాంకుఁడు దిగున ట్లాగోమం తమునుండి * వనమాలాధరుండై కాదంబరీపానజనిత మదాతి రేకమునఁ జూడ భయంకరుఁడై బలదేవుఁడు దిగెను. వన మాల యా రామునియురమున మెఱయుచు వింతకాంతిని గల్గించుచుండెను. ఆతని దేహము శారద చంద్రచంద్రికం బోలి యొప్పుచుండెను. ఒక్కకుండలమే యా మహాత్మునికర్ణమున నమరియుండెను. ఇట్లు బలరాముఁడు పర్వతమునుండి దిగి రాజులనడుమ వ్రాలెను.

బలదేవుఁ డిట్లు రణాంగణమునకు దిగఁగా నీలాంబు దోపముఁడగు శ్రీకృష్ణుఁడు తన యపరిమితవిక్రమము కనంబడఁ జేయఁగోరి గోమంతశిఖరమునుండి దుమికెను. భగవత్పాదా ఘాతమున నాగిరివర మల్లలనాడెను. ఆభూధర మత్తఱుణమున భగవంతుఁడు తన్ను వదలిపోవుచుండ జలములువదలి మదజల విరాజమాన ద్విరదేంద్రమువలె నొప్పారెను. ఆజలముల నాదాపదహనుఁ డొక్కక్షణమునఁ జల్లారెను. కల్పాంతవారి ధారలచే సూర్యుఁడు చల్లఁబడునట్లు లాగిరి దహియించుదహ నుఁడు చల్లారుటం జూడ విచిత్రముగా నుండెను. శ్రీహరి సింహనాదమున శత్రుహృదయగ్రంథుల భేదించుచుఁ బీతాం బరము చెలువుసూపఁగా ఘనాకృతియలరారఁ గిరీటవర్యము శిరోభాగమునఁ బ్రకాశింపఁగా మోముదమ్మి దరహాసమున వింతగాఁ గానంబడఁ బుండరీకసంకాశనయనములు మనోహర

* నిపపాత బలశ్శ్రీమాన్ వనమాలాధరో యువా, సశారదేందు సంకాశో వనమాలాంచితోదరః = అని మూలము.

ములై యొప్పార శ్రీవత్సము హృదయఫలకమున వెలయు చుండఁగా యుద్ధరంగమున విహరింపఁ బ్రయత్నించెను. ఇట్లు రామకృష్ణులు తననుండి పడినడి దుముకగనే యాగోమంతము ప్రతిపాషాణసంధులనుండి జలధారలు వెసలఁగా నొక్కముహూర్తమున వనవహ్ని చల్లారుట చూడఁగా రాజలోకమునకు నిరాశ యంకురించెను. మనకింక విజయము గలుగదు. ప్రళయకాల మాసన్నమయ్యెనన్నయూహ ప్రకాశించెను.

మహాశయులారా! ఈ విషయమునుండి యెఱుఁగఁదగిననీతులు లేనియట్లు తోలుదోలుతఁ దోఁచును గాని యతిరహస్యవిషయ మిందొక్కటికలదు. అదియే మీ రెఱుంగఁదగినది. రాజులు పర్వతమును దహించునపుడు రామకృష్ణు లూరకుండిరి. పర్వతము దహింపఁబడి యందలి పశుపక్షిప్రముఖనిఖిలజంతువులు మరణింపఁగా నవల జలధారలు వెలువడ నాయగ్ని శాంతించునట్లు రామకృష్ణులు చేయుట యుక్తమా యను ప్రశ్నము రావచ్చును. దానికేమి సమాధానమన్న వినుఁడు. భగవంతుఁడు సర్వసాక్షి. కర్మస్వరూపుఁడు. లోకమునఁ గర్మసిద్ధాంతము ప్రబలము. దానిని మించునదియే లేదనక తప్పదు. కరుణాస్వరూపుఁడగు భగవంతుఁడు తాఁ జూచుచుండఁగా నిన్నిజంతువులు మడియుచుండఁ బ్రత్యుపకారము చేయసమర్థుఁడయ్యు నేల యూరకున్నవాఁడని ప్రశ్నింపరాదు.

"అంత వంత ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత."

భగవద్గీతా. ౨. అ. ౧౮. శ్లో.

అను నీభగవద్వాక్యమును స్మరింపుఁడు. కరుణాస్వరూపుఁడే

భగవంతుఁడు. కాని కర్మసిద్ధాంతమును వ్యర్థముచేయునా. దావదహనజ్వాలామాలిక భస్మముకావలసిన జంతువులకు మరణాము లేకుండఁజేసిన నేమిలాభము. అట్టి యసంగతకార్యము చేయఁ బూనునా. ఆజన్మము నాటితోఁ బూర్తికాఁగా మరలఁ గర్మానుగుణరూపము రానుండఁగా దానినడ్డుట భగవంతునకు ధర్మమగునా. కావనక తప్పదుగదా. కావునఁ దాను సర్వసాక్షిమాత్రుఁడై తమతమ కర్మానురూపఫలములం బొందుచుండు జీవులను జూచుచుఁ దాఁ జేసినయాజ్ఞ యప్రతిహతముగా సాగుచుండ నానందించుచుండును.

"శ్లో. సమోఽహం సర్వభూతేషు నమే ద్వేష్యోఽస్తి నప్రియః,
యేభజంతి తు మాం భక్త్యా మయితే తేషు చాప్యహమ్."

గీతా. ౯. అ. ౨౯.

అను నీవాక్యము పై భావమును దృఢపఱచుచున్నయది. ఎన్ని జంతువు లా దావాగ్నికి నాహుతులు కాఁదగునో యంత వఱకుఁ జూచుచుండి శ్రమంపడి బ్రదుకఁదగుజంతువులు మిగులఁగాఁ బర్వతపాషాణవివరములనుండి జల ముద్భవిల్లునట్లు తలంచెను. అట్లే జలధారలుదయింప దావాగ్ని చల్లారెను. హతశిష్టజంతువులు బ్రదికెను. పర్వతతాపము వాసెను. రాజులు తమప్రయత్నము తాఱుమాఱు కాఁగా భీతిల్లి యిఁక బ్రదుకఁజాలమని తలంచిరి. ఇన్నికార్యము లొక్కసారి చేయనేర్పు భగవంతునకుం గలదని యెఱుంగవలయు. ప్రతిజంతువు తన కర్మఫల మనుభవింపక తప్పదనియు నేరూపమున నేఫల మనుభవింపఁదగునో యట్లే యనుభవించుననియు దాని కంతరాయము

లుండవనియుఁ గర్గసూత్రమున కేలాటియద్దు లుండవనియు దీనిసారము.

మఱియొక్కవిషయ మిందుఁగలుగు. వనమాలావిభూషితుఁడు శ్రీకృష్ణుఁడేయనియు గావున భగవదవతారము హరియే కాని బలరాముఁడు కాఁడనియుఁ గొందఱ అభిప్రాయపడుదురు గాని యది మిగుల పొరపాటు. వనమాలావిభూషితుఁడై బలరాముఁ డొప్పెనని యీ యధ్యాయమునందే గలదు. దానిం గాంచిన నా సంశయము తొలఁగు. కాఁబట్టి రామకృష్ణుల యందు భేదబుద్ధినిమాని తత్సేవాలాభమున ముక్తినొందుట సముచితమని తలంచుచున్నాఁడను. ఇంకఁ దర్వాతికథను దెలుపఁ బూనెదను. సావధానులరై చిత్తగింపుఁడు.

హరివంశమునుండి వ్రాసిన యీకథయే భాగవతమునందు నామమాత్రభేదముగాఁ గలదు.

శ్లో. "ప్రాద్రుత్య దూరమశ్రాంతౌ తుంగ మాపుహతాం గిరిం,
ప్రవర్షణాఖ్యం భగవా న్నిత్యదా యత్రవర్షతి. ౧౦
గిరౌ నిలీనా వాజ్ఞాయ నాధిగమ్య పదం నృప,
దదాహ గిరిమేధోభి స్సమంతాదగ్ని ముత్సృజన్. ౧౧
తత ఉత్పత్య తరసా దహ్యమాన తటాదుభౌ,
దశైకయోజనోత్తుంగా న్నిపేతతు రధో భువి." ౧౨

అను నీశ్లోకములంబట్టి ప్రవర్షణ గోమంతశబ్దద్వయభేదము తప్పఁ దక్కినభేదము గానరాదని యోజింపనగు. రెండుపేరు లొక్కదానికే యుండవచ్చునన్నను విషయమునకు భేదము లేదు. కావున హరివంశకథకు భాగవతమునఁ గలకథకు భేద

మింతమాత్రమేయని యెఱుంగనగును. దీని తర్వాతికథ హరి వంశమున నున్నట్లు భాగవతమునఁ గానరాదు. భేదమునఁ గాదుగాని విషయమే లేదు. కావున హరివంశమునుండియే వ్రాసెదను. గోమంతమనుపేరు గోమత్తమని నాగరపుస్తకమునఁ గలదు. తాఁటియాకులపుస్తకమున గోమంతమని కలదు. ఇదియు గ్రహింపఁదగువిషయమే. తర్వాతికథను జిత్తగింపుఁడు.

## రామకృష్ణులు కరవీరపురమున కరుగుట.

* రామకృష్ణులు గోమత్తపర్వతమునుండి డిగ్గఁగానే తద్దర్శనమాత్రమున రాజలోకమంతయు సమ్మాధవాహన మయ్యెను. అత్తఱి రామకృష్ణులు బాహుయుద్ధకేళీసమా దృతిం గాంచి సముద్రమున మకరయుగము విహరించినట్లు తిరిగిరి. కొలఁదినిమేషముల కా రామకేశవులకు బాహుయుద్ధమునకంటెఁ బ్రాచీన శస్త్రాస్త్రములతోటి పోరుత్తమమని స్ఫురించెను. వెంటనే యంబరతలమునుండి యింతకుమున్ను జరాసంధునితో సంగర మొనరించుతఱిఁ బొడసూపిన దివ్యాస్త్రములు దృగ్గోచరము లయ్యెను. ఆయాయుధములు వహ్నిజ్వాలామాలికలఁ గ్రక్కుచుండెను. ఆ యాయుధములంగూడి మాంసలుబ్ధములగు భూతప్రేతపిశాచాదు లరుదెంచెను. అవి నరమాంసము నెపుడెపుడు భక్షింతుమాయని నాలుకలు చాపుచుండెను. అత్యద్భుతాకృతులుగల నా దివ్యాయుధములు నభశ్చరులకుంగూడ భయమును గల్గించుచుండెను. సాంవర్తకమను హలము సౌనందమను ముసలము సుదర్శనమగు చక్రము

---

* ఈకథ హరివంశ విష్ణుపర్వము నలువదిమూఁడవ యధ్యాయము నుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగునది.

కౌమోదకియను గద యను నీ నాలుగాయుధములు విష్ణుమూర్తికి దగిన యాయుధములు. ఆయాయుధములు సోదరులకుం బొడసూపెను.

తొలుదొలుత రాముఁడు హలమును బరిగ్రహించెను. అది తత్కారమున కలంకారముగఁ జూపట్టెను. సర్పరాజము కదలుచున్నట్లుండెను. దివ్యపుష్పమాలికల నది యలంకృతమై యుండెను. ముసలమును సవ్యకరమునఁ దీసికొనియెను. సౌనందమని దానికిం బేరుగలదు. అది వైరులకు దుర్నిరీక్ష్యము. పొడవడంగఁ జేయునది. కావుననే తద్దర్శనముననే పగవారు నిరానందులగుదురు. శ్రీకృష్ణుఁడు సహస్రాదిత్యతుల్యతేజస్సుగల చక్రము నవధరించెను. దానికే సుదర్శనమని పేరు. శార్ఙ్గమనుచాపమును గ్రహించెను. అది లోకప్రఖ్యాతిం గాంచినది. దేవతాప్రార్థనముల జెల్లించు గద నూర్ధ్వకరమున హరి గ్రహించెను. ఆగద కుముదాఖ్యుని పేరున వెలయుటఁ గౌమోదకియను ప్రఖ్యాతిం గాంచినది. అట్లు లావీరాగ్రేసరులు సోదరులు రిపులం బోరుసందు మూరొ్కనిరి.

ఆసోదరు లిర్వురు పరస్పర మేకరూపముగలవారు. జ్యేష్ఠకనిష్ఠసంజ్ఞలు ప్రపంచార్థము ధరించిరి. లక్షణములనుబట్టి రామగోవింద వ్యవహారము గల్గినది. సమరాంగణమునం దప్రతిరూపులు. విష్ణువు ద్విధాభూతలమున నవతరించెను. అంతియకాని భేద మేమాత్రము లేదు. అందు బలరాముఁడు పరాక్రమించి హలాయుధము నెత్తి పరవీరుల కంతకాకారముగాఁ గనఁబడుచు రథబృందముల నాకర్షించుచుఁ గరితురగములఁ

జూర్ణముచేయుచు యుద్ధము చేయసాగెను. మఱియుఁ గుంజర ములను హలాయుధమున లాగుచు ముసలమున మోఁదుచుం డెను. అది వీరులశస్త్రాస్త్రములకుఁ గదలక పర్వతమువలె నిలిచి యించుకయుఁ జలింపనిపౌరుషమున విహరించు చుండెను. ఆ మహాపురుషునాటోపమున కోర్వఁజాలక క్షత్రియవీరులందఱు విరథులై జరాసంధుని మఱుఁగున కరిగిరి. క్షత్రధర్మమున నిరతుఁ డగు నా జరాసంధుఁడు వారిం గాంచి భూజానులారా! పరా క్రమవిహీనమగు మీక్షత్రియవృత్తి నిందాపాత్రము. పలా యనపరాయణులగుట క్షత్రకులమునకు నుచితము కాదు. భూ్రీణహత్యవలెఁ బెద్దలు నిందింతురు. భీతిచేఁ బరుగిడుచు న్నారే. ఇది నీచముకాదా. ఇది తగునా. త్వరగా మరలుఁడు. కలిసికొని యుద్ధముచేయుఁడు. చేతగాకయున్న నేను వీరల నిర్వర యమాంతికమున కంపింతదనుకఁ జూచుచుండుఁడు.

అని క్షత్రియకులవృత్తిఁ బ్రశంసించి జరాసంధుఁడు పురికొల్పఁగా శరజాలములఁ బరఁగించుచు యుద్ధమునకుఁ బూనుకొనిరి. వారెల్ల సమరసన్నాహముల నాయతులై రాఁగా వారియుత్సాహమును గాంచుచు రామకేశవు లూరకుండిరి. మరల దుములయుద్ధ మారంభయ్యెను. పరస్పరసాయకము లంబరమునఁ బతులవలెఁ జరించుచుండెను. గదాభిఘాతశబ్ద ములు భయంకరముగా వినఁబడుచుండెను. పరసాయకములు వర్షధారలు పర్వతమును గదలింపఁజాలనిచందమున బలకేశవుల

---

* ఆయుధప్రగ్రహౌ వీరౌ తా వన్యోన్య మహాభుజౌ, పూర్వ జానుజ సంజ్ఞాతు రామగోవిందలక్షణౌ, సమరే ప్రతిరూపౌ తౌ విష్ణురేకో ద్విధాకృతః=అని మూలము.

బాధింపఁ జాలక పోయెను. అత్తఱి శ్రీకృష్ణుఁడు పరాక్రమించి శంఖచక్రగదాద్యాయుధములు ధరించి సమరాంగణమునఁ గ్రీడింపఁ జొచ్చెను. చక్రాయుధప్రహారమున రథములను గజ హయపదాతులను వీరాగ్రేసరులగు భూజానులను ఖేదించెను. గదాప్రహారములచేతను లాంగలాకర్షణాదులచేతను నొచ్చి నష్టచేతనులై భూపాలకులందఱు నిలువఁజాలక పోయిరి. సుద ర్శనధారానికృంతములై రాజుల దివ్యరథములు భగ్నాంగ ములై కదలఁజాలక పోయెను. ముసలాయుధప్రహారముల సోలి పష్టిహాయనవయస్సుకల నాగేంద్రములు భగ్నదంతములై ధరఁ ద్రెళ్ళెను. తురంగమసంహతులు నిలాతలమున భగ్నావయ వములఁ దొరఁగెను. ఆయుద్ధరంగమును బరికింపఁగాఁ బ్రళయ కాల భూలోకమువలెఁ గన్పట్టెను.

ఆమహాహవమునఁ ద్రెళ్ళిన చతురంగబలములం గాంచి పిశాచాది క్రవ్యాదగణములు మాంసలుబ్ధములై పరుగిడి వ్రాలెను. వెదురుపటడని కాలుగాపు దుప్పతిల్లు చప్పుడులంబోలె నాక్రందించువారును మూల్గువారును భగ్నాంగులై నినాద ములం జేయువారునై పదాతులు దొరలు పడివడిం బడిరి. ఆభూతలము నరకేశాస్థి రుధిరమాంసమజ్జాప్లుతమై యతిఘోర దర్శనమై యుండెను. అప్పుడు చక్రాద్యాయుధములు మెఱ యుచుండఁగా శ్రీకృష్ణుఁడా రాజలోకముం గాంచి యిట్లు పలికెను. భూపాలకులారా! హస్త్యశ్వరథసంయుతులరై వచ్చి యేల యుద్ధముచేయక యున్నవారు. దృఢసంకల్పముల సకలాస్త్రశస్త్రనిపుణులరై యరుదెంచి యేమివిజయము పొందఁ గల్గితిరి? పాఱుచున్నవారే. ఏల? నేను సోదరుఁడు సమరాం

గణమునఁ బదాతులమై మీయెదుట నున్నవారము. యుద్ధ దోషమెఱుఁగని జరాసంధుఁడు మిమ్ము జాలించువాఁడయ్యు నేల మమ్ము మార్కొనరాకయున్నవాఁడు ?

అని రామానుజుఁడు పలుకుచుండఁగాఁ బ్రతాపశాలి యగు దరదుఁడు హలాయుధము చేఁబూని భయంకరాకారుఁడై యున్న రాముని మార్కొనియెను. మదించినవృషభము మఱొకవృషభమును మార్కొనునట్లు తలపడి యిట్లు హెచ్చరించెను. అరిందమా! రామా! రమ్ము. రమ్ము. నన్ను మార్కొని సంగర మొనరింపుము. అన నుబ్బిళ్లూరు రాముఁ డాతనిం దలపడఁగా నయ్యది ఘోరాకార మయ్యెను. మదకుంజరము తల పడినట్లు పోరాడుచుండ రాముఁ డాగ్రహించి హలాయుధము నాతనిభుజములకుఁ దగిలించి యాకర్షించి ముసలమునం జావఁ గొట్టెను. ఆవ్రేటున దరదుఁడు క్రిందఁబడి యసువులం గోలు పోయెను. దరదునిపాటుఁగాంచి యాడుగలఁచుచు జరాసంధుఁ డా రాముని మార్కొనియెను. ఆజన్యము వృత్రబలభేదులకుం బలె సాగెను. చూచువారల కది రోమహర్షణజనకం బయ్యెను. ఇరువురు గదాయుద్ధనిపుణులు గావున గదలం ద్రిప్పుచు రణ కేళి సాగించుచుండిరి. భూమి యల్లలనాడుచుండెను. శిఖర ములం జెలువారు భూరిభూధరములపోల్కి వా రిరువురు పరాక్రమించుచుండఁగాఁ బక్కనవారెల్ల సంగరమును మాని వారినే చూచుచుండిరి. గదాయుద్ధమున నాయిరువురు మహాచార్యులు. విఖ్యాతింగాంచిన వీరశేఖరులు. మత్సరమునఁ దగులుపడిన క్రూరభుజంగములపోలిక బుసగొట్టుచుఁ బోరాడుచుండిరి. ఆమహాహవమును జూడఁగోరి దేవగంధర్వాదులు గుంపులు

గూడి యంబరమున నిలిచియుండిరి. వారందఱుండుటచే నంబ రము జ్యోతిర్గణప్రకాశము గలదిగఁ గనఁబడుచుండెను.

జరాసంధుఁ డాతురంపడి రాముని చెంతకుఁ బరు గెత్తెను. సవ్యమండలము నాశ్రయించి యాతఁడు రాఁగా రాముఁడు దక్షిణమండలము నాశ్రయించి యాతనిం దార్కొ నెను. వారు పరస్పరగదాఘాతములకుఁ బాలుపడిరి. దంతము లచేఁ బరస్పరము క్రుమ్ములాడు గజవరములచందంబున వారు గదలఁ గొట్టుకొనిరి. ఆనినాదము భయంకరముగాఁ బరఁగెను. రాముని గదానిస్వన మశనిఘోషమును మించెను. జరాసంధ గదానినాదము పర్వతము వ్రీలి పడినట్లుండెను. జరాసంధుని వ్రేటు రాముని గదలింపఁజాలక పోయెను. బలదేవుగదాభి ఘాతమును మాగధుఁడు ధైర్యమున నోర్వఁజాలెను. అత్తఱి నంబరమునుండి యొకవాక్కు వీతెంచెను. రామా! ఈజరా సంధుఁడు నీచే వధింపఁబడఁడు. కావున ఖేదమందకుము. వీనికి మృత్యుప్రదుఁడు వేఱొకండు గలఁడు. కాఁబట్టి యుద్ధమును మానుము. ఈమాగధుఁడు స్వల్పకాలముననే ప్రాణములఁ ద్యజింపఁగలఁడు. జరాసంధుఁ డామాటలు విని విమనస్కుఁ డయ్యెను. రాముఁ డింకేల నొప్పింపవలయునన్న ఖేదమున నూర కుండెను. ఇట్లు చాలసేపు వారు గదాయుద్ధము నొనరించి విర మించిరి. జరాసంధుఁ డోడిన క్షిల్లవార లెఱింగిరి కాన నాతఁడు మరలఁగనే యందఱు మరలిరి. ఎల్లవారు పయనము సాగింపఁగా నా రణరంగము భూతప్రేతాదిసాంద్రమై భయంకరముగాఁ గనంబడియెను.

రథములు కదలిపోవుచుండ మహాద్యుతిమంతుఁడగు చేదిరాజు యాదవసంబంధమును దలంచి కృష్ణుని సమీపించి కారూశసేనలు చేదిసైనికులు తన్నుఁ జుట్టుకొనఁగా బంధుత్వము నెఱింగించుచు గోవిందున కిట్టు లనియెను. శ్రీకృష్ణా! నేను నీమేనత్తకు భర్తను. నాబలములతో ని న్నాశ్రయించితిని. నీవు నాకు శరణ్యుఁడవు. ఎంతచెప్పినను జరాసంధుఁ డల్పబుద్ధిగలవాఁడౌట వినకపోయెను. కావున నోడిపోయెను. మనము కరవీరనగరమునకుఁ బోవుదము. అందు సృగాలవాసుదేవుఁడను రాజును గనుఁగొందము. మీయిద్దఱ కీరథవరములాయత్తము చేయఁబడియెను. జవనాశ్వములం బూన్పఁబడిన వీనినెక్కి పయనము సాగింపుఁడు. త్వరగాఁ జని యారాజసత్తము దర్శింతము. అని పలుకు మేనత్తపెనిమిటి మాటలాలించి పరమానందమున గోవిందుఁ డి ట్లనియె. ప్రమథనపరిశ్రాంతుల మగు మమ్ము బాంధవోచితవచనాంబుశీకరముల సంతృప్తులను జేసితివి. హితము మధురము దేశకాలోచితము నగువాక్యము పల్కువాఁడు లోకమున నరుదు. మే మిపుడు నిన్నుం గాంచుటచే సనాథుల మైతిమి. మాకన్నియు ఫలించినట్లే. నీవంటి ప్రియబంధువు దొరకినపుడు ఫలము గలుగక పోదుకదా. చేదిరాజా! ఇదిమొదలు పెక్కుయుద్ధరంగములు చూడఁగలవు. జరాసంధవధము లోనగు మహాద్భుతకృత్యములఁ గాంచఁగలవు. ఈచక్ర ముసలముల ప్రభావము కనుఁగొందువు గాక. ఈసంగ్రామకథను విని మది నిలుపువారలకు నుత్తమగతులు గలుగు. మనమిఁకఁ బయనము సాగింతము. కరవీరపురమును దర్శింతము. అని పలికి యాతనింగూడి ప్రయా

ణాము సాగించి త్రేతాగ్నులంబోలి మూఁడుదినములు మార్గమున గడపి నాల్గవదినమునఁ గరవీరనగరమును దర్శింపఁ జాలిరి.

మహాత్ములారా! ఈకథను బఠించితిరి. ఇం దొక్క రహస్యము కలదు. అది రామకృష్ణు లొక్కరూపమేయని తెల్పును. లోకమున దశావతారములలోఁ గృష్ణావతారము చేరును గాని బలదేవుని యవతారము చేరదనియు, రాముఁడు కృష్ణభ్రాత యన్నపేరుంబట్టి ప్రఖ్యాతినొందెఁగాని లేకయున్న నీతఁ డొనరించిన యద్భుతకార్యములు లేవనియుఁ బెల్లుగ నుద్ఘోషింతురు. అయ్యది పాసపాటుమాత్రమేగాక యసంగతము కూడనగునని యీకథ బోధించుచున్నది. ఈ యధ్యాయమునుండియే కొన్నిశ్లోకము లుదహరింపఁబడినవి. వానిం గాంచిన విస్పష్టమగును. విష్ణురూపమే రెండుగా విభక్తమయ్యెనని వానినుండి తెలియఁబడియెడిని. ఇంక భేద మెట్లు కల్గునో తెలియఁజాలక యున్నాఁడను. రాముఁ డనంతుఁడే కాని విష్ణువు కాఁడని కొంద అందురు. కాని వారికి భగవదవతారస్వరూపమే తెలియదు. అనంతుఁడనఁగా భగవంతుఁడే కాని యనంతనామకసర్పము కాఁడు. కావున నట్టి యసంగత శంకల కవకాశ మొసఁగి భేదబుద్ధిని గల్పించుకొనరాదు. అవి భక్తునిలక్షణము కాదు. దాన భక్తి రూపుమాయునే కాని వృద్ధి కాదు. ఉపనిషదర్థమును నశింపఁజేసిన ట్లగును.

శ్రుతి. "పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే,
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే."

ఈశావాస్యము.

ఈమంత్రము భగవత్తత్త్వ మొక్కటియేయని తెలుపును. సర్వ కారణ మదియేయని బోధించును. దానికి వేఱుకారణ మెందును లేదనుట దీన స్పష్టమగును.

శ్లో. పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః,
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ. ౫
ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్,
మమదేహే గుడాకేశ! యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి. ౭
న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్.
అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్, ,,
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్. ౧౦
దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్,
సర్వాశ్చర్యమయం దేవ మనంతం విశ్వతోముఖమ్. ౧౧
తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా,
అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా. ౧౩

భగవద్గీత ౧౧. అధ్యా.

ఇందు మొదటిశ్లోకము భగవంతునిరూపము లసంఖ్యలనియు నామధేయములు నవంతము లనియుఁ దెలుపును. అనఁగా సర్వ నామముల సర్వరూపముల నలరుచుండువాఁడని దీనిసారము. రెండవశ్లోకము భగవంతునియాకారమున సకలబ్రహ్మాండములు గలవనియు నేమిచిత్రము చూడఁగోరిన నదియెల్ల నందే యుండునవనియుఁ దెలుపును. అనఁగా రూపములు వానికాధారము భగవంతుఁడేయని దీనిసారము. మూఁడవశ్లోకము సామాన్య

దృష్టి కాతత్త్వము గోచరముకాదనియు జ్ఞానదృష్టికే యవి కనఁ బడుననియు బోధించును. అనఁగా భగవంతుఁడు తేజస్స్వరూపుఁడనియుఁ దద్దర్శనము మాంసచక్షుష్మంతులకు దొరకదనియు దీనిసారము. నాల్గవ దైదవశ్లోకములు భక్తానుగ్రహార్థ మనేక విధముల మనోహరములగు నాభరణముల భగవంతుఁడు తాల్చుననియు నత్యద్భుతముగా నుండునట్లు కనఁబడుననియుఁ దెల్పును. అనఁగా భక్తుఁ డేరూపము నభిలషించునో తదనురూపముగా నాభరణములు వస్త్రములు మాల్యములు చందనాదు లమరియుండుననియు సర్వశక్తిమంతున కదియొకయద్భుతముగాఁ దోఁపదనియు వీనిసారము. ఆఱవశ్లోకము సమయానురూపము లగురూపము లాతత్త్వమునుండియే పుట్టుచుండును గాని మఱొకటి యుత్పత్తిహేతువు లేదని వెల్లడించును. అనఁగా సృష్టి తదధీనమేయని దీనిసారము.

శ్రుతి. "సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః స్సహస్రపాత్." అను మంత్రముకూడ నీయర్థమునే వివరించుచున్నది. ఎన్ని గ్రంథములఁ బరికించినను భగవంతునియందు భేదము కానరాదు. ఇట్టులుండ సృష్టిస్థితిసంహారకర్తలగు బ్రహ్మ విష్ణుమహేశ్వరులలో భేదమును గల్పించు టేలాకో తెలియఁ జాలకయున్నాఁడను. ఈముువ్వరు తదంశసంభూతులే కాని వేఱుకాదే. ఇట్టివీరిలో నొకఁడు ముక్తిదాతయని, యింకొకఁడు కాఁడని పలుకుట కేవలాజ్ఞానమునఁ గాదా. బ్రహ్మకంటె విష్ణు వధికుఁడైనచో బ్రహ్మయిచ్చినవరముల విష్ణువేల త్రిప్పఁగూడదు? అవతారమెత్తి ప్రయాసపడవలసిన దేలాకో తెలియఁజాల

కున్నాఁడను. అజ్ఞానబల మూఁతగాఁ గైకొని హరిహరుల యందు భేదము కల్పింపరాదు.

శ్రుతి. "ఏకశ్చైవ రుద్రో న ద్వితీయాయతస్థే." అనియు,
శ్రుతి. "ఏకో నారాయణః." అనియు

రెండుభంగుల శ్రుతులు కనఁబడుచున్నవి. ఈ రెండింటికి భేదములేదు. ఏలన నీ రెండుపేరులే కాక యిఁకఁ గోటినామములా భగవంతునకుఁ గలవు. ఇంతమాత్ర మెఱుఁగనిచో జ్ఞానులని వారిం జెప్పరాదు. వారికంటె నజ్ఞానులు లేరనక తప్పదు. మా కొక్కదేవతయందే విశ్వాసము కలదనువారు కొందఱు గలరు. ఆమాటయు నాభక్తియు మంచిదే కాని ఇతరదేవతలీ దేవతాంశములు కావనుబుద్ధిమాత్ర మాపురుషులకు నుండరాదు. భగవద్రూపములలో నిది నా యుపాస్యమనుటమాత్రము తప్పు గాదు.

కావున రామకృష్ణులలో నొకఁ డెక్కుఁడు. వేఱొకఁడు తక్కువయని కల్పింపవలదనియు నిద్ద ఱొక్కరూపమే యనియు నీకథ మనకుం దెల్పుచున్నయది. ఇట్టి వెన్నియో గ్రంథముల యందుఁ గథలు కలవు. వానింగాంచియైన నమ్మక భేదవాదులగు కుక్షింభరులమాటలు విని మోసపోవుటకంటె దుర్గతి వేఱుగ నేమున్నది? ఆచార్యభక్షితావశిష్టపదార్థము శిష్యులు భక్షించిన భగవదనుగ్రహము త్వరగాఁ గలుగునని బోధించుతుచ్ఛులును దానిని విశ్వసించుమూర్ఖులును గొందఱు గలరు. శిష్యులకేమియు దుర్గతి రాదుగాని గురువునకు నీచజన్మము లభించునసుట నిక్కము. కావున నట్టి మాయమాటలకు లోఁబడక యట్టివారు ముక్తిని బ్రసాదింతురేమో యని యాశపడక

వారికి ముక్తిదొరకదని నమ్మి భగవత్సేవచేసి తన్నామసంకీర్తన మున దురితములు లయింపఁగా భగవద్దాస్యఫలము దొరకు ననియు దాన ముక్తి కరతలామలకమనియు విశ్వసించి కృతార్థులు గావలయును. వేఱొకమార్గము కానరాదు. ఇంతట నీ చర్చను వదలి తర్వాతి భగవత్కథను వినిపించెదను.

శక్రదేవునకుఁ బట్టాభిషేకము చేసి శ్రీహరి ప్రయాణము చేయుట.

* ఇట్టు లా రామకృష్ణు లా చేదిరాజుం గూడి కరవీరపురమునకుం బోయిరి. వారిరాక నెఱింగి సృగాలరాజు యుద్ధదుర్మదుఁడు కావునఁ బురమును ముట్టడింప నరుదెంచిరని యోజించి మహేంద్రవిక్రముఁడు కావున నాదిత్యసంకాశశతాంగము నెక్కి యుద్ధముచేయు వేడుక పైకొనుచుండఁగా సకలాస్త్రసంభృతముగ నాస్యందన మొప్పారుచుండఁ దన్నేమి నిర్ఘోషము దిశలఁ బ్రతిధ్వనించుచుండఁగా మందరపర్వతము నడచి వచ్చుచున్నదా యనునట్లు చూచువా రూహించుచుండ సకలాభరణములం దాల్చి పురము వెడలి వచ్చెను. ఆరాజుతూణీరము లక్షయ్యసాయక ప్రపూర్ణములు. మున్నాతఁడు సావిత్ర నియమమును బూర్తినొందింపఁగా సవిత తానే యాస్యందన వర్యము నొసంగెను. కావున నారథము సూర్యకాంతులం బోలి దుర్ధరతేజోవిరాజితంబై యుండును. దానిం గాంచినంతనే వైరిశతాంగములు చూర్ణము లగును. ఆరథముపై నెక్కి పలుమాఱు జ్యాలతికను ధ్వనింపఁజేయుచు రోషానిలుని వెడలఁగ్రక్కుచందమున నిట్టూర్పులం బుచ్చుచుఁ దద్వారా

* ఈకథ హరివంశ విష్ణుపర్వము నలువదినాల్గవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

క్రోధాగ్ని జ్వాలల వెడలించుచు భూషణకాంతుల వెదఁజల్లుచు మేరుమహీధరము ననుకరించుచు రథాధిరూఢమైవచ్చు పర్వతేంద్రముమాడ్కి వచ్చెను. ఆరథవేగమును రాజవీరప్రతాపోక్తిశబ్దము ధనుష్టంకారముననువీనిచే భూమి భీతిల్లి గడ గడ వడఁకెను.

ఇట్లు వచ్చుచున్న శ్రీమంతుఁడగు నా సృగాలనామక భూకాంతుని మూర్తిమంతమగు పర్వతేంద్రునిభాతి భాసిల్లు వానిం గాంచి శ్రీకృష్ణమూర్తి భీతిల్లక యెప్పటియట్లే యుండెను. ఆరాజుకూడ రథవేగ మద్భుతావహమై కనంబడ వచ్చి శ్రీహరిం గాంచెను. యుద్ధోత్సుకతఁ దనరారు నారాజు జవమున మేఘరాశి పర్వతముపై కడరినట్లు శ్రీహరిని మార్కొనియెను. వాసుదేవుఁడు చిఱునవ్వు మోముదమ్మి నటనముసల్పగా నాతని మార్కొనియెను. ఆయుద్ధము చూడంజూడ భీతికరముగ నుండెను. కుంజరద్వంద్వము దార్కొనినచందము కనఁబడెను. అత్తఱి సృగాలుఁడు గోవిందునిగాంచి యుద్ధాభిలాషమునఁ బెచ్చుపెరిగి కన్నుమిన్నెఱుంగక కృష్ణా! గోమంతమున యుద్ధకాలమున నీవొనరించిన చేష్టితమున ననాయకులై దుర్బలులగు రాజులకడఁ జెల్లెఁగాని యిటఁ జెల్లునా. క్షత్రియులు పాఱిపోయిరనియు వింటిని. వారెల్ల దీనులు. మూర్ఖులు. దుర్బలులు. కావున నీయాట లట సాగినవి. ఇంచుక నాయెదుట నిలుము. ఇదే నేను నీయెదుట నిలిచియున్నాఁడను. ఇంకెందుఁ బోఁగలవు? రణమున నిపుణుఁడవు కావని తోఁచెడిని. నే నొక్కఁడనే చతురంగబలాన్వితుఁడను. నీతోఁ బోరాడ నరుదెంచితిని. కాని యుద్ధధర్మము ననుసరించి మనమిరువురమే

పోరాడుదము. సైనికులతో నేమిలాభము? మనమిరువురిలో నెవఁ డోడునో తెలియఁగలదు. ధర్మయుద్ధమున నిధనము గల్గి నను మేలే. నీవు మృతినొందఁగా నేనే వాసుదేవుఁడ నయ్యె దను. నేను మడిసిన నీవొక్కఁడవే వాసుదేవుఁడ వయ్యెదవు.

అనిపలుకు సృగాలరాజువచనముల విని వాసుదేవుఁడు క్షమాన్వితుఁడై బాణములఁ గైకొని నన్నుం బ్రహరింపుమా యని పలుకుచు సుదర్శనమును గేల నుంకించెను. సృగాలభూ పతి క్రోధమూర్ఛితుఁడై శరనికరములఁ బరఁగించెను. అనేకా స్త్రములఁ బ్రయోగించెను. తనయొద్దనున్న సకలవిధాయుధ ములఁ బరఁగించెను. అగ్నికణములనుమియు నాయస్త్రశస్త్రజాల ములకుం గదలక శ్రీహరి భూరిశైలేంద్రంబుభాతి నుండెను. అంత నించుకయాగ్రహ మంకురింప శ్రీకృష్ణుఁడు చక్ర మును బ్రయోగించి యాతనిం బరిమార్చెను. ఆరాజు రక్త ధారలు స్రవింపఁగా సర్వాంగములు చూర్ణము కాఁగా వజ్ర నిర్భిన్నభూధరముపోలికఁ గ్రిందఁబడి యసువులు వెడలిపోవఁగా సురపురి కరిగెను. ప్రభువుపాటుఁగాంచి సైనికు లుత్సాహ మెడలఁగా నలుఁగడలఁ బరుగిడిరి. కొందఱు నగరమునుబ్రవేశించి యార్తులై రోదనము చేయసాగిరి. కొంద ఱందేయుండి విల పించుచు రాజకళేబరమును వదలఁజాలక యుండిరి. అట్టితఱి భీతులగు జనులందఱకు శ్రీహరి మేఘగర్జనమునుబోలు స్వర మున నభయం బొసంగి చక్రవిరాజమానహస్తం బెత్తి యిఁక భయపడకుఁడు, భయంపడకుఁడని పలుమా ఱొత్తి చెప్పెను. మఱియు నీరాజుదోషమున ననపరాధు లగుజనుల బాధిం పను. అది శూరవ్రతము కాదు. కావున మీ రింక భయంపడ

వలదనియుఁ బల్కెను. కాని ప్రభుభక్తిపరాయణులగు నా ప్రజలందఱును జరాసంధుని యుద్ధము వఱకుం బగులింప ధరఁబడి యున్న రాజుగాంచి యుద్విగ్నమానసులై బిట్టు రోదనము గావించిరి. ఆరోదనధ్వనుల నాలించి తత్పత్నులు పుత్రయుతంబుగా నరుగుదెంచి రణాంగణంబునఁబడియున్న ప్రాణనాయకుం గాంచి మించుదుఃఖమున మూర్ఛపడి యించుకతడవుండి మరల స్మృతిగల్గుడు విలపించిరి. తనయుఁడు జనకమరణసంతప్తస్వాంతుఁడై యుండఁ దమపతి నడంచిన శ్రీకృష్ణునిం గాంచి యానారీమణు లపారదుఃఖములపాలైరి. మఱియు నో ప్రాణేశా! నీవులేని యీనగరమున నీపుత్త్రకుఁ డెవనిచే నభిషిక్తుఁడుగాఁ జేయంబడును. ఒకసారిగా మమ్మందఱ విడనాడి యొంటరిగాఁ బోయితివెట్లు? విధవలమై యెట్లు మనఁగలము? అని విలపించుచుండఁ బద్మావతియను తొలిభార్య సాధ్వీతిలకమను ప్రఖ్యాతింగాంచిన నారీరత్నము విలపించుచుఁ గొడుకుం దోడుకొని శ్రీకృష్ణునంతికమునకు వచ్చి మహానుభావా! శూరాగ్రేసరా! యుద్ధకర్మమున నీచే నేరాజచంద్రుఁడు పడఁగొట్టఁబడియెనో ఆ భూపతికొడుకు వీఁడు. నీశరణ మొందెను. శ్రీగోపాలా! నా ప్రాణేశ్వరుఁడు నిన్నుదర్శించి నీయాజ్ఞను శిరసా వహించి బంధుధర్మమును నెఱపియున్న నిట్టిదుస్థితికిం బాలుపడక యుండును. అట్లుచేయక యవజ్ఞచేసి హతుఁ డయ్యెను. వైరమాతనితోడనే చెల్లెను. ఈకొడుకును నీకొడుకుగా భావించి కాపాడుము.

ఇట్లు లాపద్మావతీదేవి ప్రార్థింపఁగా విని కరుణార్ద్రమనస్కుఁడై శ్రీకృష్ణుఁడు మృదుపూర్వముగా నిట్లు పలికెను.

రాజపత్నీ ! యీదురాత్ముఁడు తెగియెనుగాన రోషముకూడ నతనింగూడియే పోయెను. నాకును నీవంతకుఁ బరితాపము గలుగుచున్నది. ఇపుడు నేను నీకు బంధువుఁడను.నిష్కల్మషము లగు నీవాక్కులచే నామనస్సు కరగినది. సృగాలభూపతికుమారుఁడు నాకును బుత్రతుల్యుఁడే. సంశయము లేదు. అభయప్రదానముచేసి పట్టాభిషేకము చేయువాఁడను. నీకొడుకు సుఖముగ జీవించును. జనులను సేవకులను మంత్రులను బురోహితులను మాంత్రికులను బిలుపింపుము. పితృపైతామహరాజ్యమున నీకొడుకు నభిషిక్తునిఁగ జేసెదను.ఆమాటలకలరి పౌరులు మంత్రులు పురోహితులు లోనగువా రభిషేకసంబారములం గైకొని శ్రీరామకృష్ణులున్నకడ కరుదెంచిరి. రామకేశవు లుండుతావుననే సింహాసనము నేర్పఱచిరి. శ్రీకృష్ణుఁ డాబాలకున కభిషేకోత్సవమును నడపించెను. ఇట్లు పట్టాభిషేకోత్సవమును నడపించి పురమునఁ బ్రవేశింపఁ జేసి ఆరేయి పయనము చేయ నిచ్ఛయించెను.

రామకేశవు లీరీతిగాఁ గరవీరపురమును దిలకించి నిశ్శత్రుకముగా దానినొనరించి సంగ్రామరంగమున నార్జించిన యారథమునందే కూరుచుండి ప్రయాణము చేసిరి. అందుండి పశ్చిమాభిముఖులై కొంతదూర మరిగిరి. శక్రదేవుఁడను సృగాలభూపతికుమారుఁడు తండ్రికి నూర్ధ్వదైహికక్రియలు సాగించి నగరమున నివసించి తనరాజ్యమును బూజ్యభంగిఁ బాలించుచుండెను. రామకేశవులు తమకృత్యమును నెఱవేర్చి విగతశత్రువులం బోలి మధురానగరమునకుఁ బ్రయాణము చేసిరి.

మహాశయులారా! ఈకథయం దేమివిశేషములు కలవని తోఁచును. కాని విశేషాంశ మొక్కండు కలదు. అది యెఱుంగవలసినదియే. సృగాలభూపాలుఁడు మృతినొందెను. తత్పుత్రునకు నాఁడే పట్టాభిషేకము సాగెను. పిదప నాతఁడు తండ్రి కగ్నిసంస్కారాదులు చేసెను. ఇదికదా కథావిధానము. ఇది శాస్త్రోక్తమేనా, కాదా యనునదియే ప్రశ్నము. పితృమరణాశౌచము క్షత్రియులకు విప్రులకంటె నెక్కుడుదినము లుండును. అందును శవసంస్కారముకూడఁ గాలేదు. అట్టితఱిఁ బట్టాభిషేకోత్సవము సాగవచ్చునా? భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు చెంతనుండియే యశాస్త్రముగా నిట్టికర్మము చేయింపవచ్చునా!

"శ్లో. యశ్శాస్త్ర విధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్."

అన్న భగవద్వాక్యము వ్యర్థమేనా. అనియడుగుట పొరపాటు గాదు. సమాధానము వినుఁడు. విధులు రెండువిధములు. సామాన్యములు విశేషములు అని. సామాన్యవిధులు నిరుపద్రవముగా నుండుతఱిఁ జేయవలసినవి. విశేషవిధులు గత్యంతరాభావమగుతఱి నెఱవేర్పఁదగినవి. అందును జాతిధర్మములయందు క్షత్రియజాత్యుచితధర్మములు ప్రత్యేకముగా విధింపఁబడినది. క్షత్రియులకుఁ బ్రజారక్షణము విధి. దానిని మించినధర్మములు లేవు. జాతులన్నింటికింగూడ నాపద్ధర్మములు ప్రత్యేకింపఁ బడినవి. సామాన్యదృష్టింజూడ నవి విపరీతములుగఁ దోఁచును. కాని యట్లుగాక సూక్ష్మదృష్టిం

బరిశీలించిన నవి ప్రధానములుగాఁ దోఁచును. ఆసూక్ష్మదృష్టి విశాలహృదయభావముగలవారికిం గాని గలుగదు. దానినె ఱుంగక యాక్షేపింతురు. క్షౌరము ప్రాతఃకాలమునందే కర్తవ్యమని విధివిహితము. కారాగృహవిముక్తునకు నది కాలనియమము నపేక్షింపక పోగును. సాయంకాలమునను జరపఁదగు. అపుడేమి సమాధానము. ఆపద్ధర్మములను సామాన్యధర్మములు బాధింపఁజాలవనియేకదా సారము.

"శ్లో. రాజకార్యనియుక్తానాం నటానాం రూపజీవినామ్,
శ్మశ్రురోమనఖచ్ఛేదే నాస్తి కాలవిశోధనమ్."

ముహూర్తచింతామణి.

అట్లే క్షత్త్రధర్మములందుఁ బ్రధానము ప్రజారక్షణము. దానిని మించినధర్మములు లేవు. "అహింసా పరమో ధర్మః"అనుసూక్తి క్షత్త్రియులకెల్లపుడును జెల్లదు. వేఁటయుఁ బరదేశజిగమిషయు వారికి విధివిహితములు. వీనికిందోడు నసంతుష్టియు రాజ్యాక్రమణమున నుండందగు. పాలనమున కనుగుణముగా ద్రోహుల శిక్షింపవలసి యుండును. అపుడు క్షమ పూనరాదు.

శ్లో. దశబ్రాహ్మణభృత్యర్థ మేకం హన్యాద్ద్విజం నృపః,
శతబ్రాహ్మణభృత్యర్థం బ్రాహ్మణో బ్రాహ్మణంతువా. ౪౨
పంచబ్రహ్మవిదామర్థే వైశ్యమేకం తు దండయేత్,
వైశ్యం దశవిశామర్థే విశం వా దండయేత్తథా. ౪౩
తథా శతవిశామర్థే ద్విజమేకం తు దండయేత్.
శూద్రాణాం తు సహస్రార్థే దండయేద్బ్రాహ్మణంతు వా.

తచ్ఛతార్థేతు వా వైశ్యం తద్దశార్థేతు శూద్రకమ్,
బంధూనాం చైవ మిత్రాణా మిష్టార్థేతు త్రిపాదకమ్. ౪౫
అర్థం కళత్రపుత్రార్థే స్వాత్మార్థేతు న కించన,
ఆత్మానం హంతు మారబ్ధం బ్రాహ్మణం క్షత్రియం విశం. ౪౬
గాం వా తురంగమన్యం వా హత్వా దోషైర్న లిప్యతే,

లలితోపాఖ్యానము. ౨. అధ్యాయము.

అనఁగాఁ బ్రజాపాలనముచేయుచో నితరులకు హానికలుగుచుండఁగా నొకని దండించిన నాహాని దొలఁగునేని బ్రాహ్మణునింగూడ దండింపవలయునని క్షత్రియులకు విధి విధించు చున్నది. ఎవ్వరికి బాధగల్గించినను బాపమన్న శాస్త్రము ప్రజాపాలకుఁడగు క్షత్రియునకుఁ గాదని భావము కదా!

శ్లో. అరాజకేహి లోకేఽస్మిన్ సర్వతో విద్రుతే భయాత్,
రక్షార్థమస్య సర్వస్య రాజాన మసృజత్ప్రభుః. 3
బాలోఽపి నావమంతవ్యో మనుష్య ఇతి భూమిపః,
మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి. ౮
తస్యార్థే సర్వభూతానాం గోప్తారం ధర్మమాత్మజమ్,
బ్రహ్మతేజోమయం దండ మసృజత్పూర్వమీశ్వరః. ౧౪
యది న ప్రణయేద్రాజా దండం దండ్యేష్వతంద్రితః,
శూలే మత్స్యానివాపక్ష్యన్ దుర్బలాన్ బలవత్తరః. ౨౦
స్వరాష్ట్రే న్యాయవృత్తస్స్యా ద్భృశదండశ్చ శత్రుషు,
సుహృత్స్వజిహ్మః స్నిగ్ధేషు బ్రాహ్మణేషు క్షమాన్వితః. ౩౨

మనుస్మృతి ౭ అధ్యాయము.

అదండ్యాన్ దండయన్ రాజా
దండ్యాం శ్చైవా ప్యదండయన్,
అయశో మహదాప్నోతి
నరకం చైవ గచ్ఛతి. ౧౨౮

మనుస్మృతి. ౮. అధ్యా.

ఈ మనుస్మృతివాక్యమునుబట్టి రాజధర్మములు తక్కినజాతుల కున్నట్టి ధర్మములు కాక వేఱురీతిగా నుండునని స్పష్టము లగును. సృగాలభూపాలకుఁడు మరణించినవెంటనే దేశ మరాజకమయ్యెను. దానఁ గీడు లెన్నియో క్షణమున వాటిల్లును. అది పనికిరాదుకదా. కావున వెంటనే రాజ్యలక్ష్మి తత్పుత్రుని వరించెను.

"శ్లో. బ్రాహ్మం ప్రాప్తేన సంస్కారం క్షత్రియేణ యథావిధి,
సర్వస్యాస్య యథాన్యాయం కర్తవ్యం పరిరక్షణమ్."

మను. ౭. అ.

ప్రజారక్షణ మన్నిధర్మములకంటెఁ బ్రధానమని పైవాక్యము తెలుపుచున్నది. కావునఁ బ్రజారక్షణమున దీక్షితుఁడగు రాజున కాకార్యము ముగిసినంతదనుక నాశౌచము రాదని యెఱుంగవలసి యుండును. కావున శ్రీకృష్ణుఁడు ప్రధానకర్మమును మానక చేయించెను. ఆవలిదగుకార్యము స్వకార్యము. కావున నీవే చేసికొమ్మా యని వెడలిపోయెను. కాఁబట్టి భగవంతుఁడు చెంతనుండి యిట్టి యకృత్యమును జేయింపవచ్చునా యన్న కుటిలప్రశ్నము మానుటొప్పు. ఇంతకంటెఁ బెంచి వ్రాయు టనవసరమని వదలి తరువాత భగవంతుఁ డేమిచేసెనో తెలిపెదను.

## రామకృష్ణులు మధురానగరమున కరుదెంచుట.

* అట్లు రామకృష్ణులు దమఘోషునింగూడి విధివిహితము లగుపయనముల మార్గమధ్యమునం బైదురాత్రములు గడపి యొకరాత్రి గడపినట్లే భావించుచు మహానందము ననుభవించుచు నెన్నియోసల్లాపములు సేయుచు మధురానగరమున కరుదెంచిరి. రామకృష్ణాదుల యాగమనము నెఱింగి యాదవులెల్ల వారి నెదుర్కొనిరి. ఉగ్రసేనాదియాదవవీరులు బలములంగూడి మహాహర్షమునఁ జెలరేఁగుచు వణిజులు సేవకులు మంత్రులు బాలవృద్ధులును భగవంతునిరాక కానందపరవశులై తమ్ముంగూడి రా నగరబాహ్యప్రదేశమునకుం జనిరి. తూర్యనాదములు నింగిముట్టెను. ఎల్లయెడలఁ బతాక లెత్తఁబడియుండెను. ఆనగరోత్తమ మత్తఱి నెంతోవింతగ నుండెను. దేవేంద్రుఁడు సురపురి కరుదెంచినతఱి దేవత లుత్సాహముల వెల్లివిరిసినట్లు రాజమార్గములం దంతటను బ్రజలు నిండి గేయములఁ బాడిరి. కొందఱుపెద్ద లాశీర్వదించిరి. కొందఱు యాదవుల పూర్వచరిత్రముల వినుతించిరి. మఱికొందఱు మహాజనులారా! యాదవవంశోద్ధారకులు రామకృష్ణులు మధురానగరమునకు దయచేసిరి. సుఖముగ నుండుఁడు. భయములెల్లఁ దొలఁగెను. శత్రువులు మనల నేమిచేయఁజాలరని కేకలువేయుచుఁ దమ యపారానందపారవశ్యమును వెల్లడించిరి. దీనుఁ డొక్కఁడును గానరాఁ డయ్యెను. వస్త్రభూషితుఁడు కాని వాఁడు కనఁబడలేదు. మధురానగరము రామకృష్ణసమాగమ

* ఈకథ హరివంశవిష్ణుపర్వము నలువదైదవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని తెలియందగు.

మునఁ గ్రొత్తవిధముగాఁ బరిణమించెను. సమానవయస్కులగు గోపాలబాలకు లారామకృష్ణుల వీక్షించి పరమానంద సాగరమున మునింగిరి. గోపికలును గోపకులు నపారసుఖము నొందినట్లు ప్రమోదమందిరి. మందమారుతములు వీచి యాపు రంధ్రాముల సేవించి కృతార్థము లయ్యెను. దశదిశలు నిర్మలము లయ్యెను. కృతయుగమున లోకవృత్తి మెట్లుండెనో యట్లే యాకాలమున నలరారెను. అట్టి శుభసమయమున రామకృష్ణులు రథమునుండి యవతరించి నగరమును బ్రవేశించిరి. వసుదేవు నిల్లుచొచ్చి తల్లిదండ్రుల కామోదమును గల్గించిరి. వారిమోముదమ్ములు వికసించి యుండెను. ఆయుధములఁ దదుచితస్థానముల నునిచి యిచ్ఛమెయిఁ దిరుగుచు నందఱఁ గుశల ప్రశ్న ప్రతివచనముల సంతసింపఁ జేయుచుండిరి. వసుదేవునకుఁ దొలుత నమస్కరించి యుగ్రసేను నుచితరీతి గౌరవించి తక్కిన వారి నాదరించి సంతసింపఁ జేసిరి. అవ్వల దేవకీదేవిం గనం బోయి వలగొని నమస్కరించి యామె కానందమును గల్గించిరి. ఉగ్రసేనునింటను గొలఁదికాలముండి యాతనికి హితము లుపదేశించుచు సుఖముగాఁ గొంతకాలము పుచ్చిరి.

## బలభద్రుఁడు యమునానది నాకర్షించుట.

* రామకృష్ణు లిట్లు మధురానగరమునఁ గొంతకాలము సుఖముగాఁ గడపిరి. ఒకానొకదినమున బలదేవుఁడు వ్రజమున గోపకులమైత్రిని స్మరించి వారిఁ జూడఁబోవఁ దలఁచెను. సోదరుఁ డందుల కంగీకరించెను. ఒక్కఁడే నందవ్రజమున కరిగి యందు

* ఈకథ హరివంశ విష్ణుపర్వము నలువదాఱవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడిన దైయుంగఁదగు.

మనోహరములగు సరస్సులను దటాకములను నదులను ము న్ననుభవించినవానినెల్లం గాంచెను. అప్పటి రాముని వేషము వనవిహారోచితముగా నుండెను. యథాపూర్వముగా గోప కులతో సంభాషించెను. వారెల్ల రాతనిరాక కలరి కలిసియుం డిరి. గోపికలు రాఁగా వారితో ముచ్చటలాడుచు వారికి మథురావృత్తాంతములఁ జెప్పుచుఁ గాలము సంతోషముగాఁ బుచ్చుచుండెను. వృద్ధు లారాముని గానవచ్చి యనునయిం చుచు నోరామా! నీకు స్వాగతము. నిన్నుంగాంచి సఫలమ నోరథుల మైతిమి. యదువంశోద్ధారకుఁడవు గదా. నీవు తిరిగి యిక్కడికి వచ్చినందున మాకుఁ గలిగినప్రమోదమునకుఁ బరి మాణము లేనేలేదు. శత్రుభయంకరుఁడ వగునీవు త్రిలోకవి ఖ్యాతుఁడవు. మేమెల్ల నీచే వృద్ధినొందింపఁ బడఁదగినవారము. లోకమున నెల్లప్రాణులును జన్మభూమియం దభిరుచిగలవారు గదా. నీపొత్తున మేము నిర్జరులకుంగూడ మాన్యులమే యైతిమి. ఏలయన మమ్ముంజూడ నీవే యరుదెంచితివి కదా. అదృష్టవశమున మల్లురు వధింపఁబడిరి. కంసుఁడు మడిసెను. మహాత్ముఁడగు నుగ్రసేనుఁ డభిషిక్తుఁ డయ్యెను. సముద్రమున సోదరులగు మీతోఁబోరి పంచజనప్రభృతిరాక్షసులు మడిసి రని వింటిమి. క్షత్రియవీరులెల్ల దండెత్తి రాఁగా మీరిరువురు వారిం బొలియించి హతశేషులఁ బాఱఁదోలితిరనియు వింటిమి. దరదుఁడు మృతినొందినట్లు జరాసంధుఁడు పరాజితుఁడైనట్లు సంతోషవార్త వినఁబడియెను. ఆసంగరరంగమున దివ్యాయుధ ములు పొడసూపెనను నద్భుతవార్తను వినినారము. కరవీర నగరమున సృగాలభూపతిని బొలియించితిరి. ఆతనికుమారుని

రాజ్యమునకుఁ బట్టుకొట్టం జేసితిరి. పౌరుల నాశ్వాసించితిరి. ఈవార్త లనవరతము వినఁబడుచునే యున్నవి. ఈకార్యము లన్నింటిని దీర్చి మధురానగరమును బ్రవేశించితిరి. భూమి దుర్భరభారమును బాసినది. ధర్మము యథాపూర్వముగా నెల కొల్పినది. రాజులెల్లరు వశ్యులైరి. ఇట్టి నీయాగమనమున మాకుంగల్గిన యానందమునకుఁ బరిమితిగలదే. నేఁటికి మేమెల్ల గృతకృత్యుల మైతిమి. అని పలుకు గోపకులఁ గాంచి బల రాముం డిట్లు పలికెను. యాదవులయందు మీరెల్ల నాకుం బరమబంధువులు. ఇందే మా చిన్ననాటిదినములు గడచినవి. ఇందే మాయాటలు చెల్లినవి. మీరెల్ల మమ్మభివృద్ధిం జెందఁ జేసితిరి. మీయిండ్ల భుజించితిమి. మీయాలమందలం బెరిగి తిమి. కావున మీకంటె నధికులగుబంధువులు లేరు. సౌహృ దులు లేరు.

అని యిట్లు బలరాముఁడు గోపకులనడుమఁ గూరు చుండి పలుకుచుండ గోపపత్న్యులెల్ల సంహృష్టహృదయ లైరి. పిదప వనాంతరముల కరిగి రాముఁడు విహరించెను. అత్తఱి వృద్ధగోపకు లారాముసాశయ మెఱుంగువారు కావున వారు ణిం దీసికొని వచ్చిరి. జ్ఞాతులంగూడ శ్వేతవర్ణమగు వారుణీ రసమును రాముఁ డాస్వాదించెను. వన్యములగు మధువులను ఫలములను దెచ్చి రామునకు సమర్పించిరి. మనోహరగంధ మాల్యముల నలంకరించిరి. భక్ష్యముల సమర్పించిరి. అప్పుడు పూచిన కమలములను దెచ్చి యర్చించిరి. వానినెల్ల నలంకరించు కొని ఫలమూలాదుల భక్షించి యారాముఁ డానందసాగర మున నోలలాడెను. కరముల హలము ముసలము వెలుంగఁ

గుండలాద్యాభరణములు భాసిల్ల నారాముని మూర్తి చూడఁ దగియుండెను. వారుణీమదమున రాముని కొడలు తెలియ లేదు. కావున నానరపాణి యమునానదిం గాంచి పావననదీవ తంసమా! స్నానము చేయఁ గోరెదను రమ్ము. రూపమును దాల్చి నాచెంతకుఁ జనుదెమ్ము. అని యాసంకర్షణుఁడు పిల్వఁగా మత్తునిమాటలుగా భావించి యమున పలుకకయుండెను. స్త్రీస్వ భావమున మోహితచిత్తయగుట యామహాత్ముని దర్శింపరాక పోయెను.

ఆవిధముం గాంచి మదమున విజృంభించుచుంట రాముఁ డాగ్రహవ్యగ్రుఁ డయ్యెను. హాలాయుధమును జే ధరించెను. యమునాకర్షణప్రయత్నమున బద్ధాదరుఁ డయ్యెను. హాలమును వంచి నదికిం దగిలించి లాగఁగాఁ బుష్పించియున్న కమలములు కలవిలపా టొందెను. నిర్మలోదకము కల్మషోదక మయ్యెను. వ్యధితాంతరంగయగు వనితామణిని బలిమిమై లాగినట్టు లాక ర్షింపఁగా విహ్వాల జలప్రవాహయై హ్రదసముదయము లల్లల నాడుచుండ హాలాయుధమార్గము ననుసరించి యమునానది ప్రవహింపఁజొచ్చెను. లాంగలము మార్గముంజూపఁగాఁ జేయు నదిలేక యానది విపరీతముగాఁ బ్రవహింపఁ బూనెను. సంకర్ష ణభయమున హృదయము కంపించుచుండ నొంటిఁ గఱకుమాన సులకుం జిక్కి వడవడ వడంకునాతివలె నత్తఱిఁ గన్పట్టెను. తన ప్రచారమును వీడి బృందావనమువైపున కాకర్షింపఁ బడియెను. జలవిహంగములు కొలకొలఁ గూయుచుండ రామా! తెలియక పోయిన నాస్థితిని దలంపుమా యని దీనారావములఁ దనకష్ట మును మొఱ్ఱయిడుకొన్న ట్లుండెను. బృందావనము నతిక్ర

మించి ప్రవాహము లాగా యమున స్త్రీరూపమును దాల్చి రాముని గాంచి యిట్లు పలికెను. నాథా! ప్రసన్నుఁడ వగుము. భీతాత్మ నైతిని. ఇది ప్రతిలోమకర్మ మనంబడును. నాకీలోయ రూపము విపరీతము. రౌహిణేయా! నీవిట్టు లాకర్షింపఁగా నేను స్వమార్గవ్యభిచారిణి నైతిని. సాగరగామినినగు నన్నుం గాంచి సపత్నులు నవ్వుదురు. ఫేనరూపహాసములం జేయుచు న న్నుడికింతురు. నాగమనముతో యవ్యావృత్త మగును. కృష్ణ పూర్వజా! ఇట్టి దీనురాలియందుఁ గరుణ నునుపుము. శిరస్సు వంచి నిన్ను యాచించెదను. మహాబాహూ! మార్గ ముప దేశింపుము. ఎందుఁ బోవ్వుందువు?

అని యమునానదీపురంధ్రి యతికరుణముగాఁ బ్రార్థింపఁగా విని లాంగలాయుధుఁ డమదావిలమానసుండగుట నిట్లు పలికెను. నాలాంగలము చూపినమార్గమున నీభూభాగము నార్ద్రముగాఁ జేయుచుఁ బ్రవహింపుము. ఇదియె నాసందే శము. శాంతినొందుము. భీతిల్లకుము. ఈమార్గముననే సాగర మున కరుగుము. ఈప్రపంచ ముండునంతదాఁక నాయీయ శము వెలయును. నీవింకఁ బొమ్మనిపలుకు బలదేవుని యమునా కర్షణ తదనుగ్రహకార్యములం గాంచి వ్రజవాసులెల్ల మేలు మేలని పొగడిరి. అంత నారాముఁ డానదీసమాకర్షణకార్య మును మాని వ్రజవాసులకు జలము సులభలభ్యము గావించి యంతలో మది మధురానగరమును సంస్మరించి పయనముచేయ నుద్యుక్తుఁ డయ్యెను. వెంటనే కతిపయప్రయాణంబుల మధు రంగాన నేగి యందున్నలోకాధిపతిని సోదరుని శ్రీకృష్ణునిం గాంచెను. ప్రేమాతిశయమునఁ గౌఁగిలించుకొనియెను. హరి

యు లాంగలాయుధునిం గాంచి లేచి యర్ఘ్యాతమాసన మొసంగి మర్యాదచేసెను. కూరుచున్న పిదప జ్యేష్ఠుని వ్రజవాసుల కుశల మడిగెను. గోవుల క్షేమము నడిగెను. బలదేవుఁ డచ్చటి కుశల వార్తలనెల్లం దెలిపెను. వారిసంభాషణములే దివ్యగాథలుగాఁ బరిగణితము లయ్యెను.

మహామతులారా! ఈగాథనుండి యొక్కవిషయము వివరింపఁదగియున్నది. నదిని బలరాముఁడు చెంతకు రమ్మని పిలుచుట యది రాకుండుట. దాన నతఁడు క్రోధావిష్టుఁ డగుట. నాగలిచే దానిని లాగుట. యంత నది స్త్రీరూపమున నగపడి క్షమకూర్పుమనుట. దాన నతఁడు ప్రసన్నుఁడగుట యను నీవిషయములు విన్నంతనే విచిత్రములుగాఁ దోఁచు టయేగాక నమ్మఁదగనివనియుం దోఁచు సామాన్యుల కిట్టికథలు రుచింపవనుటయు స్వభావమేకాని యందు విచిత్రమేమియు లేదు. ఏలన వారిబుద్ధి భగవన్మహిమము నెఱుంగఁ జాలదు. అట్టిపుణ్యము వారు చేసియుండరనుట నిక్కము. విద్యావంతు లుకూడ నమ్మరన్నను విచిత్రము లేదు. వారిచదువు లౌకికము. లోకాతీతవార్తల నెఱుంగఁజాలదు. కాన నది విద్యగాదు. వారు విద్వాంసులు గారు. ఆముష్మికజ్ఞానము గల్గించునదియే విద్య.

శ్రుతి. అంధం తమః ప్రవిశంతి యే అవిద్యా ముపాసతే,
తతో భూయ ఇవ తేత మో యదివిద్యాయాగ్ంరతాః.
అన్యదేవాహుర్విద్యయా అన్యదేవాహు రవిద్యయా,
ఇతి శుశ్రుమ ధీరాణాం యేన స్తద్వ్యాచచక్షిరే. ౧౦

అంధం తమః ప్రవిశంతి యేఽసంభూతి ముపాసతే,
తతో భూయ ఇవ తే యఉసం భూత్యాగ్ం రతాః. ౧౧
అన్య దేవాహు స్సంభవా దన్య దేవాహు రసంభవాత్,
ఇతి శుశ్రుమ ధీరాణాం యేన స్తద్వ్యాచచక్షిరే. ౧౨
సంభూతిం చ వినాశం చ యస్తద్వేదో భయగ్ంసహ,
వినాశేనమృత్యుం తీర్త్వాఽసంభూత్యాఽమృతమశ్నుతే.
ఈశావాస్యోపనిషత్తు.

ఈ యుపనిషద్వాక్యములు విద్యావిద్యల తారతమ్యముల నెఱింగించును. కావునఁ బరమార్థజ్ఞానము కనఁబఱుపనివిద్య విద్య యనంబడదు. భగవత్తత్త్వము నెఱుకపఱచునదియే విద్య యనంబడును. కావున నట్టివిద్య లేనివారలకు భగవచ్ఛక్తి యిట్టిదని బోధపడదు. లౌకికవిషయములం గాంచి వానికి విరుద్ధములగు కార్యము లశక్యములని భావించువారి కలౌకికములగు భగవత్కృత్యములు సర్వథాసర్వదా అసంగతములని తోఁచుట యనఁగా వింతయేమి? లౌకికజ్ఞానముచే నలౌకికజ్ఞానము నలవఱచుకొనుట యసాధ్యమే కాని లౌకికజ్ఞానమైనచో నదియించుక యలౌకికజ్ఞాన మొదవించునని నా విశ్వాసము.

పర్వతము లిసుకదిబ్బలుగ నుండెననియు నవి చిరకాలము వర్షాదులకు గట్టిపడి పాషాణములుగ మాఱెననియు నవియే పర్వతము లనఁబడుననియుఁ గొందఱు చేతులం ద్రిప్పుచుఁ బలుకుచుందురు. సృష్టిపదార్థములలో శిలాసృష్టి యొకటి గలదని వా రెఱుంగరు. నేత్రములకుఁ గనఁబడని ద్వీపాంతర పదార్థములు దివ్యదృష్టిచే నెఱుంగఁదగునన్న జ్ఞానము వారికి

లేదనక తప్పదు. ఏలన వారికి నేత్రములనుండియే చూపు తెలి యును గాని యంతర్దృష్టికలదని వా రెఱుంగరు. ఒకరుచెప్పి నను నమ్మరు. నమ్మునట్లు చేయుశక్తి వారిమదియందుఁ గాన రాదు. కల్గింపరాదాయన్న నది శక్యముకాదు. వారి పూర్వ పుణ్య మందులకుఁ బనికిరాదు. కావున వారు నమ్మినను నమ్మక యున్నను బాధలేదు. భగవచ్ఛక్తి మనబుద్ధిబలమున నెఱుంగ తరముగాదనుటమాత్రము సత్యము.

ప్రకృత మనుసరించెదను. నదులు మనుష్యులు లోనగు ప్రాణికోటి కుపకరించుటకొంకె భగవంతునిచే నిర్మింపఁబడినది. నది స్త్రీరూపము నొందుటెట్లు? అనునదొక గొప్పప్రశ్నము. నదీరూపము దేవతారూపము కాదు. నద్యధిష్ఠానదేవత స్త్రీ. సముద్రాధిష్ఠానదేవత పురుషుఁడు. కావున యమునానది కధి ష్ఠానదేవత యమునా నామముననే పిలువంబడును. బలరామున కాగ్రహమేల కలుగవలయుననఁగా యమునానదీప్రవాహము బృందావనప్రాంతభూభాగముల కుపకరింపఁ జేయవలయుననియే. కల్గెను. కావున నమేయశక్తిసంపన్నుఁడగు నారాముఁడు హలాయుధమున నీడ్చెను. తదధిష్ఠానదేవతయగు యమునఁ భగ వదిచ్ఛ నెఱుంగఁజాలి ప్రత్యక్షమై యేమియాజ్ఞయని ప్రార్థిం చెను. భగవంతున కా కోపనటనము కృపగా మారెను. ఈ మార్గమునఁ బ్రవహింపుమా యని యాజ్ఞచేసెను. నదులకు మాత్రమే కాక వృక్షాదులకుంగూడ నధిష్ఠానదేవతలు గలరని యెఱుంగవలయు. వారి నెఱుంగఁజాలుశక్తి మనకులేదు కావున మనము నమ్ముట లేదు. కాఁబట్టి యట్టిదానిం గాంచుశక్తిని సంపాదింపఁ బ్రయత్నముచేయవలయు. దానికి భగవంతుని

యందు విశ్వాసముండుటయే ప్రధానము. జీవహింసాదుల వదలి సర్వభూతదయ గలుగునట్టిపద్ధతి నాశ్రయించినఁగాని యది లభింపదు. లేకున్న మనల నుద్ధరింపఁజాలని యల్పజ్ఞానము భగవత్తత్త్వము నెఱుంగుమార్గము చూపఁజాలదనుట నిక్కము. ఇంక నీవిషయమును వదలి తరువాతికథను వ్రాసెదను.

## ద్వారకానగర నిర్మాణము.

* పాఠకమహాశయులారా! ఇపుడు మీరు కాలయవనుఁడు దండెత్తివచ్చినట్లు జరాసంధుఁడు పదునెనిమిదవపర్యా

---

* ఈకథ జరాసంధుఁడు పదునెనిమిదవతడవ మధురానగరమును ముట్టడింపఁ దలంచుచుండునంతలో నారదప్రేరితుఁడగు కాలయవనుఁడు దండెత్తి మధుర ముట్టడించుతఱి వ్రాయవలసి యుండెను. హరివంశమునుండి రామకృష్ణులు కరవీరనగరాదులకుం బోవుకథలు వ్రాయ నవకాశములేనని యపుడు వ్రాయ మానితిని. ఈవిషయ మచ్చటనే వ్రాసితిని. ఇపుడు వ్రాయుటసంగతముగా నుండదని యెఱుంగుదు. ఐనను ఇంచుకయవకాశము కల్పించుకొనక తప్పదు. ఇపుడు మీరు కాలయవనుఁడు యుద్ధమునకు రానున్నట్లు భావించి దీనిం బఠింపుఁడు. శంకలుండవు. ద్వారకానిర్మాణకథ భాగవతము ౧౦ స్కం. ఏఁబదియవ యధ్యాయమునుండియుం, విష్ణుపురాణము పంచమాంశము ఇరువదిమూఁడవ యధ్యాయమునుండియుం, బ్రహ్మపురాణము ఎనుబదియెనిమిదవ యధ్యాయమునుండియుం, శ్రీకృష్ణజన్మఖండము నూటమూఁడవ యధ్యాయమునుండియుం వ్రాయఁబడినదని యెఱుంగఁదగు. మఱియు నీకథయే గర్గసంహిత ద్వారకాఖండము తొమ్మిదవయధ్యాయమునఁ గలదు. కాని యది రుక్మిణీకల్యాణానంతరము వ్రాయఁబడినది. దానియందలి తీర్థములు వర్ణింపఁబడినవి. ద్వారకానిర్మాణము తక్కినపురాణముల యందు రుక్మిణీవివాహమునకు ముందే ద్వారక నిర్మించినట్లు కనఁబడియెడిని.

యము దండెత్తి రానున్నయట్లు తలంచి యీకథఁ జదువుఁడు. ఈమాట యింతకుముందే చెప్పఁబడినది కదా. ఇపుడు ద్వారకానగర మీవలికే యున్నదియా. అప్పుడే కాలయవనునిసేనలు మథురను ముట్టడించియుండ శ్రీకృష్ణుఁడు నిర్మింపఁజేసి యందఱి నందుఁజేర్చెనా యనువిషయము చర్చింపఁ దగినది. అఘటనాఘటనసమర్థుఁడు గాన భగవంతుఁ డిచ్ఛామాత్రమున నొక ద్వారకాపురమునే గాక సకలబ్రహ్మాండముల నిర్మింపఁగలఁడన్న నేయాక్షేపము లేదుగాని మనుష్యావతారమున నించుక మానుషకృత్యము ననుసరించినట్లు నటించుట పరమేశ్వరుని యలవాటు కానిచోఁ గాలయవనాదుల నగరమును ముట్టడించుటకుముందే నశింపఁజేయరాదా యన్నప్రశ్నము వచ్చును. ఇట్టివి లక్షలకు మించినపను లొక్కభ్రూభంగమాత్రమునఁ జేయఁగలఁడు గాని మానవత్వము నూనినపుడు తదనుగుణముగాఁ గొన్ని కార్యములు చేయుచు జ్ఞానులకుఁ దనమహిమమును గనఁబఱచుచు నుండుట భగవల్లక్షణము. కావునఁ దదనురూపముగాఁ బ్రవర్తించునని నమ్ముచు నీగాథను బఠింపుఁడు. శంకల కవకాశము కలుగకయుండు.

---

ఈపరిచ్ఛేదమునకేమిగాని యన్నింటిని జేర్చి వ్రాయునపుడు కథావిధానమునకు బాధయొదవకుండ వ్రాయవలయుఁ గాన నట్లు వ్రాసెదను. ద్వారక నిర్మించువిషయమున గర్గసంహితయందలి కధ సొంపుగా నున్నది. దానిని ముందు వ్రాయకయున్నఁ బిదపవ్రాయ ననుకూలింపదు. కాన ముందే వ్రాసెదను. ఈవిషయమును బాలకులు స్మరించుచుఁ గథను జదువవలయునని వేఁడుచున్నాఁడను. నడుమనడుమ తక్కిన పురాణముల కథలఁ గల్పినపుడు తన్నామమును వ్రాసెదను.

బహుళాశ్వుఁ డను రాజచంద్రుఁడు నారదమునింగాంచి మహాత్మా! ముల్లోకములయందు ద్వారకానగరము ప్రఖ్యాతింగాంచినది కదా. భగవంతుఁ డానగరమున నేల నివసించెను? దాన నేయది పరమపవిత్ర మైనది. దాని నిర్మాణమెట్లు? సవిస్తరముగాఁ జెప్పుఁడీ యని ప్రశ్నింప నారదముని రాజేంద్రా! చక్కని ప్రశ్న మొనరించితివి? ద్వారకానగరనిర్మాణమును వచించెద. ఆలకింపుము. మనువంశమున శర్యాతియను రాజేంద్రుఁడు జన్మించెను. చక్రవర్తిసమానుఁడు. ఆ రాజు ధర్మవిధి రాజ్యమును జిరకాలము పాలించెను. ఆభూపతికి నుత్తానబర్హియు, ఆనర్తుఁడు, భూరిషేణుఁడు నను ముప్వురుతనయులు గల్గిరి. ఈ ముప్వురుతనయులు సర్వధర్మముల నెఱింగి పరాక్రమధనులై విఖ్యాతినొందిరి. ఉత్తానబర్హికిఁ దూర్పుభాగము, భూరిషేణునకు దక్షిణభాగమును, ఆనర్తునకుఁ బశ్చిమభాగము నొసంగి వారింగాంచి తనయులారా! ఈభూతలమెల్ల నాచే ధర్మముగాఁ బాలింపఁబడినది. బలము కలిమి నార్జింపఁబడినది. మీరును దీని నిట్లే పాలింపవలయును. అనవుడు నాతనయులలో మధ్యముఁడగు నానర్తుఁడు ధర్మము నాత్మమర్యాదాను రూపము నగువాక్యము నిట్లు తండ్రికిం జెప్పెను. జనకా! ఈ భూమి నీచేతనే పాలింపఁబడలేదు. నీచే నార్జింపఁబడను లేదు. భగవంతుఁడు బలిష్ఠుఁడు. సర్వలోకప్రభువు. ఈభూమి శ్రీకృష్ణమూర్తిది. ఆమహాత్మునిచేతనే పాలింపఁబడుచున్నయది. ఆమహనీయుని తేజస్సుచే సమావృతమై యొప్పు నీలోకము నింకొకఁడు పాలింపఁజాలఁడు. ఆ హరికంటె బలిష్ఠుఁ డెందును లేఁడు. ఆకృష్ణపరమాత్మయే సృజించి పాలించి యంతమునొందిం

చును. హరియే పరంబ్రహ్మ మనంబడు. కాలస్వరూపుఁ డతఁడే. సకలభూతాంతర్యామియన నతఁడే. లోపలనుండి కర్మానుసార మాడించుచున్నవాఁడు. విశ్వమన నాతఁడే. అధియజ్ఞనాముఁ డతఁడే. పరిపూర్ణతముఁ డన్నను నతఁడే. ఆవిష్ణుమూర్తియాజ్ఞకు వెఱచియే వాయువు వీచును. సూర్యుఁడు తపింపఁజేయును. పర్జన్యుఁడు వర్షించుట, మృత్యు వంతమునొందించుట తదిచ్ఛానుసారమే యని యెఱుంగుము. కావున నోతండ్రీ, పరిపూర్ణుఁడై సర్వశక్తియుక్తుఁడగు శ్రీకృష్ణపరమాత్మ నాశ్రయింపుము. అహంకారము మది నిలుపకుము.

అని కుమారుఁడు పలుకఁగా విని యావాక్యములంబట్టి జ్ఞానియగుటకు బదులుగా రోషావిష్టహృదయుఁడై శర్యాతి యిట్లు పలికెను. దుర్మతీ! దూరముగా నుండుము. చెంత నుండు యోగ్యత నీకు లేదు. గురువువలె మాటలాడుచున్నాఁడవు. నీవీ నారాజ్యమున నిలువకుము. కృష్ణరాజ్యముననే నివసింపుము. నీ వేకృష్ణు నారాధించుచున్నవాఁడవో యాతఁడే నీకన్నివిధముల సహాయపడుఁ గాక. నీవు క్రొత్తగా నేమికోరుదువో వానినెల్ల నాభగవంతుఁడే యొసంగును. అని శర్యాతి పలుకఁగా మానవంతుఁడగు నానర్తుఁ డిట్లు బదులుచెప్పెను. తండ్రీ! నీకు నెందు రాజ్యముగలదో యందు నివసింపను. అని పలికి పితృపాలితమగు నారాజ్యమును వదలి సముద్రతీరమున కరిగెను. అందు నియతుఁడై సముద్రజలముల నిలిచి చిరకాలము తపస్సుచేసెను. ప్రేమయుక్తమగు భక్తిభావమున శ్రీహరి నెదనిల్పి భజింపఁగా శ్రీహరియుఁ బ్రత్యక్షమయ్యెను. ప్రత్యక్షదర్శనమిచ్చి వత్సా! వరమడుగుమా యని

యాదరణమునఁ బలికెను. అనర్తుఁడు లేచి నమస్కరించి చేతులు జోడించి భక్తినమ్రాత్మకంధరుఁడై ప్రేమభరంబున నొడలు పరవశము కాఁగా శ్రీకృష్ణా! సంకర్షణా! నీపాదారవిందముల కివె నమస్కారములు. నీమహిమలు లపారములు. వేదములకు వేదాంతములనంబడు నుపనిషత్తులకుం గూడ నెఱుంగఁదరము గానివి. మహాత్మా! నినుంగంటి. ధన్యుఁడనైతి. పితృనిష్కాసితుఁడనై నీశరణు సొచ్చితిని. నాకు నివసింపఁదగిన క్షేత్రభూభాగము ననుగ్రహింపుము. నీయనుగ్రహమున సర్వోత్తమ పదము లభింపఁగలదు. ప్రణతక్లేశహర్తవగు నీకిదె నమస్కరించెదను.

అని యిట్లు పలుకుచు నమస్కరించి లేవకయున్న యానర్తునింగాంచి భక్తవత్సలుండగు భగవంతుఁడు కరుణించి మేఘనాదముం దిరస్కరించువాక్కులతో రాజకుమారకా! ఈలోకమున వేఱొకభూమి కానరాదు. ఏమి చేయమనియెదవు! నీకోరికప్రకారము చేయుచున్నాఁడను. నీభక్తికిం బరితుష్టుఁడనైతిని. స్వర్గలోకమునందుఁగాని వైకుంఠలోకమునందుఁగాని యీభూఖండమునకు శతగుణములు గలభాగము నిచ్చెదను. అని పలికి వైకుంఠమునుండి యించుకభాగము నాకర్షించి భక్తునకొసంగి తత్సంరక్షణార్థము తాను సుదర్శనమును ధరించి సముద్రజలముల నాభాగమును నిల్పి యేవిధములగు బాధలును దానికి లేకయుండునట్లు వరమొసంగి యదృశ్యుఁడయ్యెను. అనర్తుఁడారాజ్యమును బెక్కువేలయేండ్లు పాలించెను. పుత్రపౌత్రులం గలిసి వైకుంఠసంపద ననుభవించుచు నుండెను. ఈ యద్భుతవృత్తాంతము నాలకించి శర్యాతి విస్మితుఁడయ్యెను. ఆ

భూఖండ మానర్తునకు భగవంతునిచేఁ బ్రసాదింపఁబడుటంజేసి యానర్తజనపద మనంబరఁగెను. ఆనర్తునకు రేవతుఁడనువాఁడు కుమారుఁ డయ్యెను. ఆతఁడు శ్రీశైలశృంగమును పెకలించి యానర్తదేశమున స్థాపించెను. ఆపర్వతము రేవతభూపాలస్థాపితము గాన రైవతపర్వతమనుపేరం బ్రసిద్ధం బయ్యెను. రేవతుఁడు రాజై కుశస్థలీపురిని నిర్మించి యం దుండెను. మోక్షద్వారముగా భగవంతుఁడు నిర్మించినకతన నాపురవరము ద్వారవతి యనం బ్రఖ్యాతం బయ్యెను.

విమలాంతఃకరణులారా! ద్వారవతీనిర్మాణమును వింటిరి. భాగవతాదులయందలి కథకు దీనికి నించుక భేదము కలదని ముందే వ్రాసితిని. కాని యీకథ కడుసొంపుగా నున్నది. అది వఱకే సంసిద్ధమగునగరమున కట్టియాపత్తున నందఱం దీసికొని పోయెననుట లోకదృష్టి నరయఁగా యుక్తముగా నున్నయది. ఆచర్చ వలదు. ఈకథయం దొకనూతనవిషయ మిమిడియున్నది. శర్యాతికుమారులకు ముప్పురకు రాజ్యము పంచి యీయఁబూనఁగా రెండవకుమారుఁ డతనిమాటల కంగీకరింపక తూలనాడెను. అనఁగాఁ గర్తృత్వము భగవంతునియం దారోపింపవలయునే కాని తనయం దారోపించుకొనఁ గూడదని కుమారునిభావము.

శ్లో. మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తేమే యుక్తతమా మతాః. ౨
యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. ౬.

తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి న చిరాత్పార్థ మయ్యావేశిత చేతసామ్. ౭

గీతా. ౧౨. అధ్యా.

అను భగవదుక్తి పైవిషయమునే తెలుపుచున్నది. శర్యాతి గర్వించి నాయార్జిత మీరాజ్యమని ప్రల్లదము లాడెను. కుమారుఁ డిది భగవద్దత్తము కాని నీస్వార్జితము కా దనెను. దాన మూర్ఖుఁడగు శర్యాతి కోపగించి యట్లైన క్రొత్తరాజ్యము సంపాదించుకొనుము. శ్రీకృష్ణుఁడే నీకుం గ్రొత్తభూభాగము నియ్యఁగలఁడు. పొమ్మనెను. దానఁ గదలక ధీరస్వాంతుఁడు గాన నానర్తుఁడు శ్రీహరింగూర్చి తపము చేయ సాగరతీరమునకుం బోయెను. నియతుఁడై తపం బొనరించెను. కృష్ణుఁడాతని తపోనిష్ఠకుఁ దనయందుఁ గలవిశ్వాసమునకు మెచ్చుకొని ప్రత్యక్షమై యతనికోరికను దీర్పనెంచి క్రొత్తగా సముద్రజలముల భూఖండమును నిర్మించెను. కావుననే ద్వారక మహాపవిత్రనగరమున ఖ్యాతిం గాంచినది. అది భగవన్నిర్మితమే కాన నద్దానికంటె సుఖాస్పద మింకొకటి గానరాదు. అట్టినగరమునకు మధురావాసుల నందఱిని జేర్చెననుట యుక్తియుక్తముగానే కానంబడియెడిని. కావున భక్తులారా! ద్వారకానగరము మహాలక్ష్మీనివాసార్హము. పుణ్యనిలయము. అందు భక్తలనుద్ధరింపఁ గృష్ణుఁడు నిలిచియుండెను. మర్త్యలోక గోలోకమని దానికిం బేరు. కావున ద్వారకానివాసి శ్రీకృష్ణుని స్మరింపుఁడు. సర్వకార్యములు సాధించువాఁడు భగవంతుఁడే కాని పురుషుఁడుకాఁడని విశ్వసింపుఁడు. అహంభావమును వదలుఁడు. భగవంతుని నమ్మినవారికి సకలవాంఛలు సిద్ధించును. కార్యము

సఫలమగుచో నాప్రయత్నమని నెఱవేఱనిచో దైవమని మాత్రము నుడువరాదు. అట్టివారికి భగవంతుఁడు ప్రసన్నుఁడు కాఁడు. వారొనరించుకర్మములు డాంబికములు కాని సత్కర్మములు గావు. అట్టికర్మములు భగవంతునకుఁ బ్రీతిని గల్గింపఁజాలవు.

శ్లో. మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా,
నిరాశీర్నిర్మమో భూత్వా యుద్ధ్యస్వ విగతజ్వరః. ३०
గీతా. కర్మయోగము.

అన్న భగవదుక్తికి మాఱులేదు. దానిని మఱువరాదు. మఱచిన నుత్తమగతి చేకూరదు. భక్తిస్వాంతులు కానివారల కిది గోచరింపదు. కావున భక్తి ప్రధానముగ సంపాదింపవలయు. దానికై ప్రయత్నింపుఁడు. ఇఁక నీవిషయమును దడవక తర్వాతికథను వ్రాసెదను. అది ద్వారకాపురమహిమమును దెల్పును. అందలి తీర్థరాజముల వెల్లడించును. వానిమహాత్వము నెఱిం గించును. దాన భక్తి కుదురును. అది తరణోపాయమునకు సహాయము. ఇన్నింటికి శ్రద్ధ ప్రధానము. అదిలేకయున్న నేదియు సమకూరదు.

శ్లో. శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరే ణాధిగచ్ఛతి. ३౯
అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి,
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః. ४०
గీత. ४. అ.

అను భగవద్గీతావాక్యము లీయర్థమును దేటపఱచుచున్నవి.

కావున శ్రద్ధాభక్తులు గలిగి భగవచ్ఛేవ చేయుఁడు. ఇఁకొక గథ నాలకింపుఁడు.

## గోమత్యుపాఖ్యానము.

* నారదముని ద్వారకామహిమము నిట్లు వివరింపఁగా విని బహుళాశ్వుఁడు పరమానందకందళితాంతరంగుఁడై మహాత్మా! ద్వారకానగర మతిపావనమనుట తెల్లమయ్యెను. అట్టి నగర సన్నికటమునఁ బరమపవిత్ర తీర్థరాజము లుండును. అందును ముఖ్యతీర్థములం గొన్నింటిని దెలుపుమా యని ప్రార్థింపఁగా నారదముని యిట్లు పలికెను. ప్రభాసతీర్థము మొదలు పెక్కుతీర్థము లందుఁ గలవు. అదియే యీ నగరపరిమాణమును దెలుపును. శతయోజనవిస్తార మీ నగరపరిమాణమని యెఱుంగుము. ఆభూభాగము మోక్షప్రదము. ద్వారకానగరమును దర్శించి భక్తిభావమున శ్రీకృష్ణుని ధ్యానించుమానవుఁడు నారాయణుండగు. అందు మృతినొందిన గార్దభము కూడఁ జతుర్భుజములు గలిగి వైకుంఠమున నుండును. ద్వారకానగర దర్శనశ్రవణ స్తవాదులలో దేనిచేతనైనను ముక్తి లభించును.

ఒకానొకప్పుడు రేవతుఁ డనుభక్తుఁడు ప్రేమానంద సమాకులుఁడై యుండఁగ నతనికి దర్శనమిచ్చి శ్రీహరి యశ్రుముఖుఁ డయ్యెను. ఆహర్షమునకుఁ బరిమాణము లేదనవచ్చు. ఆశ్రీకృష్ణనేత్రారవింద సంభూతహర్ష జలబిందువునుండి యుప్పతిల్లిన నదియే గోమతియనం బ్రఖ్యాతం బయ్యెను. మహానది

* ఈకథ గర్గసంహిత ద్వారకాఖండము పదియవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

యను ప్రథితకీర్తిం గాంచి మించెను. దాని దర్శించినమాత్ర మున బ్రహ్మహత్యాదిదోషములు తొలంగును. ఏమనుష్యుఁ డా గోమతీనదీతీరమునఁ గల భూపరాగమును శిరమున ధరించునో సర్వజన్మకృతపాపములు తొలంగు. రాజేంద్రా! సంశయ మొందకుము. భాస్కరుఁడు మకరరాశియం దుండఁగా మాఘమాసమునఁ బ్రయాగక్షేత్రమున స్నాన మొనరించిన శతాశ్వమేధము లొనరించినపుణ్యము లభించును. గోమతీనదియం దట్టి మాఘమాసమున స్నాన మొనరించిన సహస్రాశ్వమేధము లొనరించిన సుకృతము లభించును. గోమతీమాహాత్మ్యము వచింప నలవిగానిది. గోమతీ చక్రతీర్థాదితీర్థములయందుఁ గల పాషాణములు చక్రత్వము నొందియుండును. (వానియందుఁ జక్రచిహ్నము లుండును.) అవి భగవచ్చక్రముం బోలి పూజింపఁదగినవి. చక్రచిహ్నముగల చక్రతీర్థమున ద్వాదశియందు స్నాన మాచరించినఁ జక్రపాణిలోకనివాసము గలుగు. సకల పాపములు నశించునని చెప్పవలయునా. ఎన్నిజన్మములనుండి వచ్చుచున్న పాతకములన్నియుఁ జక్రతీర్థసోపానములఁ ద్రొక్కినమాత్రమునఁ దొలంగునని యెఱుంగుము.

అనవిని బహుళాశ్వుఁ డిట్లు ప్రశ్నించెను. మునీంద్రా! గోమతీనదియందుఁ గలిగిన చక్రతీర్థము సకలార్థప్రదమని చెప్పితిరి. దానిమహత్వము వినఁగోరెదను. నావిని నవ్వి నారద ముని యిట్లు పలికెను. ఈప్రశ్నమునకు నుత్తరముగా నొక పురాతనేతిహాసమును వచియించెద. అది నీప్రశ్నము సమాధానముగు. పాపనాశముచేయు నితిహాస మదియని తెలియవ లయు. అలకాపురాధిపతియు, నిధినాథుఁడు ప్రభువునగు కుబే

బుఁడు పూర్వకాలమున వైష్ణవమను యాగమున శ్రీహరి నల రింపఁ బూనుకొనెను. కైలాసోత్తమభూభాగమునందు యజ్ఞము విధియుతముగా సాగెను. హవిర్భాగముం గైకొన శ్రీమహావిష్ణువు తానై యచ్చటి కరుదెంచెను. బ్రహ్మా శంక రాదు లరుదెంచిరి. దిక్పాలురందఱు వచ్చిరి. తక్కుంగల దేవ యోనిగణములు చేరిరి. దేవర్షి బ్రహ్మర్షి రాజర్షు లామహా క్రతుదర్శనార్థ మేతెంచిరి. కుబేరునకు నలకూబరుఁ డనుతన యుఁడు కలఁడు. కార్యనిర్వహణమం దతఁడు నియుక్తుఁ డయ్యెను. యజ్ఞరక్షణమునకు వీరభద్రుఁడును, వచ్చినవారి నాదరింప గజాననుఁడును, మరుద్గణములు నియమింపఁ బడిరి. శివకుమారుఁడగు బాహులేయుఁడు సభాపూజను విధిమంత ముగా నొనరించెను. ఘంటానాదుఁడు పార్శ్వమాలియుఁ గుబే రునకు మంత్రులిర్వురు గలరు. సర్వశాస్త్రవేత్తలగు వారిద్దఱు దానాధ్యక్షులుగా నేర్పడిరి. ఇట్టు లాయజ్ఞమహోత్సవము విధితప్పక సాగెను. రాజరాజగు కుబేరుఁ డధ్వరాంతమున నవ భృథస్నానమును గ్రమమునఁ జేసెను. విప్రులకు దక్షిణ లొసం గెను. భగవంతుఁడాయజ్ఞమున సంతృప్తినొందెను.

అట్టితఱి దుర్వాసుఁడు వండియు, ఛత్రియునై యరు దెంచెను. జటలు ధరించియుండెను. క్రోధ మాతనిమోమునఁ జిందులాడుచుండెను. దేహము కృశించియుండెను. పాదుక లాతనిపాదములం దుండెను. మీసములు పెరిగియుండెను. దర్భాసనము, కమండలువు, మృగచర్మము ధరించియుండెను. ఆమునిచంద్రుని గాంచినంతనే పెనుభీతియడరఁ గుబేరుఁడు త్వరపడి యెదురుగాఁబోయి నమస్కరించి విధిమంతముగాఁ

బూజించెను. మునిచంద్రా! నేటికి నాజన్మము కృతకృత్య మయ్యెను. నాయజ్ఞము ఫలించెను. నీరాక నా కత్యంతశుభ దాయకమని వినయము భక్తియుఁ జెనఁగొనఁ బలికెను. మునియుఁ దత్పూజలకలరి కూరుచుండి ధర్మములఁ దెలుపఁబూని ధనాధిపా! నీవు రాజరాజవు. బ్రాహ్మణప్రియుఁడవు. వైష్ణవ క్రతువు నొనరించితివి. విష్ణుమూర్తి సంతుష్టుఁ డయ్యెను. ని న్నింతకు మున్నెన్నఁడు నేను యాచింపలేదు. మహాదాతవగు ని న్నొక్కటి యాచించెదను. నాయాచనను ఫలవంతముగ నొన రింపుము. నీకు మంచివర మిచ్చెదను. నా కోరినదియ్యకున్నఁ దపోబలమున నిన్ను భస్మముగా నొనరింతును. నీయింట ముల్లోకముల వెదకినను లేనినవనిధులు గలవు. వాని నాకిమ్ము. వానికొఱకే వచ్చితిని. అను మునిపతివాక్కులు వినఁబడి సంతసే దానశీలుఁడగు కుబేరుఁడు సంతసమున నట్లే యొసంగి తిని. మునీంద్రా! పరిగ్రహింపుమా యని ప్రార్థించెను. మునియుఁ బరిగ్రహించెను.

అత్తఱి ఘంటానాదపార్శ్వమౌళు లనుమంత్రులిర్వురు లోభమోహితులై యీ బ్రాహ్మణుఁ డొక్కఁడుగదా. నవని ధులంగొని యేమిచేయం గలఁడు? లక్షసువర్ణటంకముల నిమ్ము. సంరక్షణార్థము వృత్తినొసంగుము. అని పలుకఁగా వాని నాల కించి దుర్వాసుఁడు క్రోధమూర్ఛితుఁడై కన్ను లెఱ్ఱవాఱఁగా బ్రహ్మాండము లన్నియు వడంకెను. కుబేరుఁడు ప్రసన్నుఁడవు కమ్మా యని ప్రార్థించుచుఁ బాదములపైఁ బడియెను. అప్పుడు ముని వారినిద్దఱిం గాంచి ఘంటానాదా! మహాలుబ్ధా! దుష్ట బుద్ధివి, ధనగ్రాహివి, కావున నీవు గ్రాహరూపమును దాల్చి

ము. పార్శ్వమాళీ! పాపబుద్ధీ! ధనమదాన్వితా! నీవు గజరూప
మును దాల్పుము. అని యిట్లు వారల కిరువురకు శాపంబొసంగి
కుబేరునుండి నిధులను బరిగ్రహించి సంతుష్టుండై రాజరాజా!
నన్నలరించితివి కావున నాతపః ప్రభావమున నీనవనిధులు
ద్విగుణము లగుం గాక. అనిపలికి తనదారిం బోయెను.

విజ్ఞానధనులారా! ఈకథాభాగమును బఠించితిరి
కదా. దీనినుండి యెఱుగఁదగువిషయమును వినుఁడు. త్రిమూ
ర్తులు యజ్ఞమున కరుదెంచిరి. దిక్పాలకులెల్లరు వచ్చిరి. దేవ
తాభేదములు మహర్షులు వచ్చిరి. యజ్ఞము విధిమంతముగా
సాగెను. ఆయజ్ఞమునం దెంతయో పాల్గొనిరి. శ్రీమన్నారాయ
ణమూర్తి యానందించెను. ఒక్కపర్యాయము త్రిమూర్తుల
దర్శించుభాగ్య మెల్లరకుం గల్గెను. దేవతలను, దిక్పాలకులను,
మహర్షులను జూచునదృష్టము కలిగెను. సకలపాపములు తొలఁ
గవలయుఁ గదా. కాని యెవరెవరికర్మము వారివెంటనుండి
యాయాయిఫలముల ననుభవింపఁ జేయుచుండును. అవభృథ
స్నానానంతర మాచోటికిఁ బిలువనిపేరంటముగా దుర్వాస
ముని వచ్చెను. కుబేరుఁ డాతిథేయవిధుల నాచరించెను. ముని
సంతసించెను. నవనిధుల నడిగెను. ఈయకున్న నిన్ను దహింతు
నుజుమూ యని కుబేరుని హెచ్చరించెను. నవనిధుల నా
కుబేరుఁ డిచ్చెను. అత్తఱి నాకుబేరుని మంత్రులిర్వురు ఈబడు
గున కేల నవనిధులని యుల్లసమాడిరి. ఏల? దుర్వాసుఁడు
శపింపఁగా నీచయోనులం బుట్టుకర్మము వీ రొనరించియు
న్నారు. ఆకర్మము వీరిని బ్రోత్సహించెను. నవనిధులు తమవి
కావు. కుబేరునివి. అతఁడే యిచ్చెను. కాని వీరేల యూరకుం

డురు? కర్మము వీరిని బురికొల్పెను. పరవశులు గాన దాని త్రిప్పులకు లోఁబడిరి. మునీంద్రు నాక్షేపించిరి. తచ్ఛాపము నకు లక్ష్యమైరి. దీనినుండి మన మెఱుంగఁదగిన దేది? హరిహర బ్రహ్మాదులుండినను వారికా శాపఫలమంటకుండఁ దప్పింపఁ జాలకపోయిరి కదా. దీనిభావమేమి! "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" అనువాక్య మపరిహార్యము. అది నిరంకుశము. దాని కడ్డము పల్కఁజాలువారు లేరని సారము. కావునఁ గర్మము బలవత్తరము. దానిత్రిప్పులకు లోఁబడనివాఁ డుండఁడు. రిత్త పోగరుతప్ప సఫలోద్యోగము దానియెదుట నెవ్వఁడును జేయఁజాలఁడు. ఇది నిక్కము. దీనింబట్టి రజోగుణప్రధాన కర్మములు సత్ఫలముల నీఁజాలవనుట సత్యము. అవియే యహంకార మూలకందములు. వాని నాచరించువారికి దుష్ఫలములు గాకమానవు.

"శ్లో. లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమస్స్పృహా,
రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ. ౧౨
కర్మణస్సుకృతస్యాహు స్సాత్వికం నిర్మలం ఫలమ్,
రజసస్తుఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్. ౧౬
సత్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ,
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవచ. ౧౭

గీతాశాస్త్రము. ౧౪. అధ్యాయము.

అను నీగీతావాక్యములు పైయర్థమును దృఢపఱచుచున్నవి. కావున రజోగుణప్రధానకర్మములను మాని సత్వగుణప్రధాన కర్మముల నాచరించిన భగవద్భక్తి కల్గును. దాన ముక్తిమా

ర్గము కనఁబడును. ఆ మార్గమునఁబోయిన భగవద్దర్శన మగును. కావున నామార్గమునఁ బయనముచేయఁ బ్రయత్నింపవలయు. ఇదియే దీనంగల సారతరభావము. ఇఁకఁ దరువాతికథ నాల కింపుఁడు.

## గజగ్రాహములకు శాపవిముక్తి కల్గుట.

* రాజేంద్రా! తరువాతివృత్తాంతము నాలకింపుమని నారదముని యిట్లు పల్కెను. దుర్వాసుఁడు శాపమిచ్చి స్వేచ్ఛగాఁ బోవఁగా కుబేరమంత్రులగు ఘంటానాదపార్శ్వ మాళు లిర్వురు భక్తవత్సలుండగు శ్రీమన్నారాయణమూర్తిని శరణు సొచ్చిరి. వారిదైన్యమెఱింగి కరుణాతరంగితాంతరంగుఁ డయ్యెను. ఇట్లు పలికెను. మంత్రులారా! నన్ను సంతుష్టునిగఁ జేయు యజ్ఞమునందు మీ రిరువురు దుఃఖఫలభాక్కులు రైతిరి. † బ్రాహ్మణవాక్కును దిరస్కరింపఁజాలక యున్నాఁడను. గజగ్రాహములుగా నవతరించిన మీ కేతరుణమున నన్యోన్యసంగరము కలుగునో యప్పుడు నాయనుగ్రహమున విముక్తి మీకుం గలుగఁగలదు. అని వరమిచ్చినంతనే వారిద్దఱు యక్షరూపముల మాని గజగ్రాహములుగా మాఱిరి. కాని జాతిస్మరణము వారికి శ్రీహరికరుణఁ గల్గెను. ఘంటానాదుఁడు గ్రాహరూపమున గోమతీనదియందు నూఱువత్సరము లుండెను. ఆగ్రాహప్రమాణము నూఱుహస్తములంత. అతి

* ఈవిషయము గర్గసంహిత ద్వారకాఖండమునఁ బదునొకండవ యధ్యాయమునుండి గ్రహింపఁ బడినది.

† బ్రాహ్మణానాం వచోఽహం వై దూరీకర్తుం న చ క్షమః॥ అని యమూలము.

భయంకరముగా నది కనఁబడుచుండెను. పార్శ్వమాలి రైవత కాద్రియందు గజేంద్రమై యుండెను. నాలుగుదంతములు గలిగి కాటుకవంటి కాయమలరఁగా నూఱుచేతులప్రమాణము గలిగి యాభూధరకాననసీమల విహరించుచుండెను.

ఒకానొకప్పుడు వైశాఖమాసమున నాగజేంద్రము రైవతాద్రిగహ్వరమునుండి స్నానముచేయుకోరికఁ దనబల గముం గూడి గోమతీనదికిం బోయెను. స్వేచ్ఛగా నందుఁ జాల సేపు స్నానముచేసి శుండాదండమున జలములఁ జల్లిచల్లి కరే ణువులను గలభములను స్నానముచేయించెను. ఆనదియం దున్న మహాగ్రాహము దైవతప్రోత్సాహితమై క్రోధావేశ మున వడివడిఁ బరుగిడి మహానాగపాదమును బట్టుకొనిరెను. అంతియగాక నాగేంద్రమును లోనికిం గానిపోవుకోర్కె నీడ్వ సాగెను. గజరాజును దానిని వెలుపలికి నీడ్వఁబూనెను. కరేణు వులు కలభములునుగూడి దాని నీడ్వఁజాలకుండెను. ఇట్లు లవ్వి రెండును బరస్పరజిగీషువులై పోరాడుచుండ నేఁబదిరెండు వత్సరములు గడచెను. అంతట గజేంద్రము భక్తిభావమున శ్రీహరి స్మరించెను. వేఱొకరక్షకుఁడు లేఁడు. కావుమా! కరుణాసాగరా! మృతినొందనున్నాఁడనని ప్రార్థించెను. శ్రీ కృష్ణా! విజయసఖా! కృష్ణరూపధరా! నీకు నమస్కారము లర్పించువాఁడను. పరమపావనా! పరిపూర్ణానందమయాత్మకా! మహానుభావా! నన్నుఁ గాపాడుము. పాపపాశములనుండి న న్నుద్ధరింపుము. అని యిట్లు గ్రాహగృహీతాంఘ్రియగు నాగ జము ప్రార్థింపఁగా దీనవత్సలుఁడగు భగవంతుఁడు గరుడా రూఢుఁడై వేవేగ వచ్చెను. వాహనమునందుండియే చక్రాయు

థమును బ్రయోగించెను. చక్రము సోఁకకముందే గ్రాహా
వము తెగిపడియెను. పిదప ధ్వనిచేయుచుఁ జక్రము గోమతీనఁ
బ్రవేశించెను. అందలి పాషాణములనెల్లఁ జక్రాకారములుగ
నొనరించెను. కావున నందలి పాషాణము లన్నియుఁ జక్రచిహ
ములుగలవిగ నుండును. దానింబగ్రహించినఁ జక్రదర్శనముఁ
బాపతూలములు పరుగిడినట్లు పాపములు తొలంగును. గ్రాహ
ము శిరస్సు తెగిపడఁగాఁ బూర్వరూపమును దాల్చి వెలింగెన
శ్రీకృష్ణానుగ్రహమున గజరాజును దివ్యరూపమును దాల్చిన
వారిర్వురును బరుగెత్తి శ్రీహరింగాంచి నమస్కరించి వినుతించి
తదాజ్ఞచేఁ బూర్వపదము నొందిరి. దేవదుందుభులు మ్రోసెను
రాజేంద్రా! ఇది చక్రతీర్థమాహాత్మ్యము. దీనిని భక్తిమెయి
వినువారు పఠించువారును జక్రతీర్థస్నానపుణ్యము నొంద
దురు. కరిమకరములకథను స్మరించువారికి దుస్స్వప్నఫలము
లంటవు.

మహామనీషులారా! ఈవిచిత్రగాథనుండి మన మెఱుఁ
గఁదగువిషయము లనేకములు కలవు. భాగవతమున గజేంద్ర
మోక్షణ మనుకథ కలదు. వానింబోలిన దీకథ. ఈ రెండింటికి
భేద మించుకంతయే. సార మొక్కటియే గాని భేదము నాబు
ద్ధికిం గానరాదు. ఇఁక విశేషవిషయము నాలకింపుఁడు. శాప
హతచిత్తులై యాయక్షప్రవరు లిర్వురు చేయునదిలేక యార్త
శరణ్యుఁడగు శ్రీహరిచరణముల వ్రాలిరి. మాగతి యిట్లయ్యెనే
ఏమిచేయం గల్గుదుము. కరుణాసింధూ! దీనబంధూ! అని
మొఱ్ఱపెట్టుకొనిరి. దేవతలమైయుండి తిర్యగ్జంతువులము గావ
లసిన దుస్థితి మాకుం గల్గెనేయని విలపించిరి. దీనిని వారించు

మార్గము తోఁపకయున్నది. నీవుతక్క నింకెవ్వరు మాకుదిక్కు లేరని విన్నవించిరి. ఆర్తత్రాణబిరుదముగల నీమఱుఁగు సొచ్చితిమి. మమ్ము రక్షింపక యెట్లు తప్పించుకొందువో నీపాదారవిందముల వదలము. దీనబాంధవములుగదా యీపాదకమలములని దిట్టతనముచేఁ బ్రార్థించిరి. వారిమొఱ్ఱల భగవంతుఁడాలకించెను. వీరి దుష్కృతమునకు సమానమగు సుకృతమున్నదని యూహించెను. నన్నుం దృప్తుంజేయనెంచిన యీయజ్ఞమున దేహశ్రమముల కోర్చి యందఱ గారవించిన వీరి నుద్ధరింపక తప్పదని తలంచెను. భావిఫలముల నాలోచించెను. కరుణాదృష్టుల వారినలరించి యిట్లు పలికెను. బ్రాహ్మణశాపమును మరలింపఁజాలను కాని కొంతకాలమునకు శాపముక్తి ననుగ్రహింతు ననియె. వారాయానతి నౌదలలం దాల్చి గజగ్రాహము లైరి. శాపముక్తి సమయమునకు గజరాజ మాత్మానుచరులంగూడి స్నానార్థము గోమతీనదికి వచ్చెను. మొసలియున్న తావుననే స్నానముచేయుచుండ నది గజరాజమును బట్టుకొనియెను. ఓపికయుండునంతదనుకఁ బోరాడి యలసి భగవంతుని కేనశరణార్థ యని ప్రార్థింప హరివచ్చి చక్రమున దానింద్రుంచెను. ఈకథాసారమే కర్మ భక్తిమార్గములకుంగల తారతమ్యములఁ దెల్పును.

పాపకర్మానుభవకాలము ముగియఁగనే సత్కర్మము గజరాజమును బురికొల్పెను. గోమతీనదీహ్రదమున మునుఁగవలయునను కోర్కి దానికిం బొడమెను. పరివారములంగూడి యది యాచోటికే పోయి యిచ్ఛావిహారముగా స్నానము చేయుచుండెను. తత్పత్నులు తత్సుతులు చెలరేఁగి హ్రదమును గల

విలపాటొందించెను. దానఁ గనలి మొసలి పరాక్రమించి తన శక్తియెంత? గజరాజశక్తియెంత యని యూహింపక దాని పాదముం బట్టుకొనియెను. రెండును బోరాడెను. సమబలములు గానఁ జిరకాలము పోరాడెను. స్థానబలములేమి గజరాజు తగ్గెను. తనభార్యలుగాని పరివారగజములుగాని యించుకంతయుఁ దోడ్పాటుసూపి యాయాపదనుండి తప్పింపఁజాలవయ్యెను. స్వకర్మముతప్ప నితరకర్మములు తనకుఁ దోడ్పడఁజాలవనుట దీన నిక్కువమయ్యెఁగదా. తనకుఁ దానేగతి. అన్నసామెత దృఢమయ్యెను. సత్కర్మవశమునఁ దనయశక్తత తోఁచును. ఆర్తితి రక్షకుఁడొకఁడు కలఁడన్నమాట మదిఁదట్టును. దాన నాయంతవాఁడు లేఁడన్న యహంకారము నశించును. దాన విజ్ఞానము పొడసూపును. దానిచే భగవత్సేవ కర్తవ్యమనుమోహ జనించును. భక్తి దానఁ గుదురుకొనును. తత్సహాయమున భగవంతుని దివ్యరూపము స్మరించుభాగ్యము కల్గును. తత్స్మరణమున భావిభాగ్యఫలము లెదుర్కొనఁ జూచుచుండును. వానిచే భగవద్దివ్యపాదారవిందదర్శనము కల్గును. దానఁ బరమపదము చేకూరును. కావున నన్నింటికి మూలాధారము కర్మము. అదియే యోగ్యతనుబట్టి యాయాయిమార్గములకుం ద్రిప్పును. తుదకుఁ బరమప్రేమరూపమగు భక్తి లభించినఁగాని భగవత్సేవ లభింపదు. అది గల్గినఁగాని జ్ఞానము దృఢతమముగాఁ జేకూరదు. ఆపద్భక్తి ఫలవంతముకాదని కొందఱందురు. తనయుఁ డెట్టియవివేకుఁడై చేయరానికార్యములు చేయుచున్నను తుదకొక్కసారి మంచికార్యము నొక్కదానిం జేసినచోఁ దండ్రి యానందించినట్లు భగవంతుఁ డాపత్

మయమునందైనను దన్ను స్మరించినఁ దృప్తుండై ఫలము నొసం గును. ఆఫలము నిరంతరభక్తి సాంద్రచిత్తున కలవడునట్టిది కాకపోవచ్చును. ఐనను దన్ను స్మరించినందులకు ఫలము నీయ కపోఁడనుట సిద్ధాంతము.

"శ్లో. స్మరతః పాదకమలమాత్మాన మపి యచ్ఛతి,
కిమ్వర్థకామాన్ భజతో నాత్యభీష్టాన్ జగద్గురుః. ౧౧
శ్రీభాగవతము. ౧౦. స్కం. ౮౦. అధ్యా.

ఈశ్లోకమునకే మహాకవిపోతన:—

మ. కలలోనందను మున్నెఱుంగని మహాకష్టాత్ముఁడైనట్టి దు
ర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ
దలఁపందోడనెవచ్చి యార్తిహరుఁడై తన్నైన నిచ్చున్ సుని
శ్చలభక్తిన్ భజియించువారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్.

అని వ్రాసి తన భక్తిపారవశ్యమును వెల్లడించి కృతార్థుఁ డయ్యెను.

శ్రీభాగవతశ్లోకము పైన నుదాహరింపఁబడిన యభిప్రా యమును వెల్లడించుచున్నది కదా. కావున నేకాలమందైన నహంభావమును మాని జగద్రక్షకుని స్మరించిన ఫలముగలుగు ననుట ధ్రువము. ఎట్టివారికిం గాని యెట్టిసహాయసంపత్సంయు తులకుగాని స్వకృతకర్మఫల మనుభవింపక తప్పదనుట యీ కథనుండి స్పష్టమయ్యెడిని.

భగవంతుఁడు బ్రాహ్మణశాపమును మరలింపఁజాలకపో యెనా అనున దొకప్రశ్నము. ఈప్రశ్నముచేయువారు ప్రా యశః మూర్ఖులని నాభావము. శాపమిచ్చువాఁ డెవఁడు? ఇచ్చిం

చున దేది? ఈ రెంటికి భగవంతుఁడే హేతువు. స్వకర్మమే దుష్ఫలము నిచ్చుచో శాపమునీయ నొకరిని బ్రోత్సహించి తద్ద్వారా ఫలము గుడువంగఁ జేయును. సత్ఫలము నిచ్చుచో నాశీర్వాదరూపముగా వరమునీయ నొకరిని బురికొల్పి తత్ఫలమును గలుగఁజేయును. ఇందు దేనిని భగవంతుఁడు మార్పఁదలఁచును. కర్మము భగవత్స్వరూపము కాదా. తనయాజ్ఞను దామీఱఁ బ్రయత్నించునా. అట్లు చేసిన స్వోక్తివ్యాఘాత దోష మాయనకు రాదా. అట్టిపని పరమేశ్వరుఁడు చేయఁబూనఁడు. కావునఁ బైప్రశ్నము నిరర్థకము. కార్యకారణముల తెలంగెలుంగక చేయుప్రశ్నములకు బదులీయరాదు. కర్మము పరబ్రహ్మస్వరూపమని యెఱింగిన నిట్టిప్రశ్నముల కవకాశము కలుగదు. ఇఁకను బెంచివ్రాయక తర్వాతికథను దెలిపెదను.

## ద్వారకాపురమందలి శంఖోద్ధార తీర్థమహాత్త్వము.

* రాజా! వినుము. శంఖోద్ధారతీర్థమునందు స్వర్ణదానముచేసిన విష్ణువు ప్రీతినందును. దాన సర్వోపద్రవములు నశించును. పూర్వము శ్రీకృష్ణభక్తుఁడగు మహాముని త్రితుఁడను పేరుగల విప్రుఁడు తీర్థయాత్రలఁ జేయుచు నానర్తభూములకు వచ్చెను. అందు నీతీర్థవరమున స్నానముచేసి శ్రీహరిం బూజించెను. ఆపూజయందు సుందరశంఖవరమొకఁడు సర్వలక్షణలక్షితము పూజింపఁబడుచుండఁగాఁ దచ్ఛిష్యుఁడగు కక్షీవంతుఁ డతిలోభమున దానిం దొంగిలించెను. పూజాశంఖము పోఁగా నాత్రితముని క్రుద్ధుఁడై నాపూజాశంఖ మెవరిచే నప

---

* ఈవిషయము గర్గసంహిత ద్వారకాఖండము పండ్రెండవ యధ్యాయమునుండి కైకొనఁబడినది.

హరింపఁబడినదో వాఁడు శంఖమేయగును గాక అని శపించెను. వెంటనే యాకక్షీవంతుఁడు శాపపీడితుఁడై శంఖమే యయ్యెను. అంత కించుకముందు గురుపాదములపైఁబడి స్వామీ నన్నుఁ గాపాడుమా యని విలపించెను. ఆపరిదేవనమున మనస్సు తపింపఁగా నామౌని దుర్మతీ! యేమిచేసితివి? స్తేయదోషఫలము ననుభవింపుము. నామాట వృథగాదు. శ్రీకృష్ణపాదారవిందముల భజింపుము. ఆకరుణానిధియే మోక్షమును బ్రసాదించును. అని పలికి యాదేవముని తనయిచ్ఛం బోయెను. కక్షీవంతుఁడు సరోవరమున శంఖరూపమును దాల్చి పడియెను. కృష్ణకృష్ణయనిపలుకుచు నూఱువత్సరము లుండెను. భక్తవత్సలుండగు భగవంతుఁడు వానిం గృతకృత్యుం జేయ నెంచి యాసరస్తీరమునుండి భయంపడకుమా యని యభయహస్త మిచ్చెను. గజరాజు నుద్ధరించిన ట్లాశంఖరూపధరు నుద్ధరించెను. భగవద్వాక్యమును వినఁగానే సరోవరమునుండి న న్నుద్ధరింపుమా శ్రీకృష్ణాయని యాముని విలపించెను. ఆవిలాపమును విని తనహస్తము నాధారముగాఁ జేసి పైకిఁ దీసెను. తత్స్పర్శనమాత్రమున నాముని దివ్యరూపమును దాల్చి యాశంఖరూపమును వదలి భగవంతునకు నమస్కరించి యంజలింబట్టి వాసుదేవా! గోవిందా! పురుషోత్తమా! దీనవత్సలా! ద్వారకానాథా! పరమేశ్వరా! ధ్రువునకు ధ్రువపద మొసంగితివి. ప్రహ్లాదునియార్తిని దొలఁగించితివి. గజరాజు నుద్ధరించితివి. బలిచక్రవర్తి యింటఁ గావలియుంటివి. ఇంక నెందఱయాపదలనో తొలఁగించితివి. పాండవులయార్తిం బాపితివి. యాదవుల నుద్ధరింప నవతరించితివి. ఇంద్రునిబారినుండి యాభీరులం

గాంచితివి. గురుపుత్త్రులం దెచ్చియిచ్చితివి. జరాసంధనిరోధమునఁ బరితపించు రాజులకు బ్రాపటర్థై నిలిచితివి. నృగమహారాజును శాపవిముక్తునిం జేసితివి. వాసుదేవుఁడనం బ్రఖ్యాతి వహించితివి. సంకర్షణుఁ డనంబరఁగితివి. ప్రద్యుమ్నానిరుద్ధనామములం బ్రఖ్యాతి వహించితివి. లోకములకుఁ దల్లివి. తండ్రివి. బంధువవు. సఖుఁడవు. నీవే విద్యయు ద్రవ్యము నాకు నీవే కాని వేఱొక్కరుఁడు లేఁడు. ఇట్టిమహాత్మునకు నీకు నమస్కరించుచున్న వాఁడను. అని స్తుతించి తదనుమతినొంది దివ్యవిమానారూఢుఁడై యాదవులందఱుఁ జూచుచుండఁగా దశదిశలం దనతేజమున వెలుఁగొందఁజేయుచు దివ్యతేజమున రవిమండలముఁ దిరస్కరించుచు వైష్ణవంబగు దివ్యపదమును జేరెను. మిథిలాధినాథా! శంఖునుద్ధరించిన దేస్థలమునందో ఆస్థలమునందే యున్నసరస్సు నాటంగోలె శంఖోద్ధారమను విఖ్యాతిం గాంచెను. ఈయుపాఖ్యానమును బఠించిన వినిన శంఖోద్ధారతీర్థస్నానఫలము గలుగును. సంశయము లేదు. అని పలికి నారదముని మఱియు నిట్లు ప్రభాసతీర్థమహిమమును జెప్పఁబూని బహుళాశ్వున కిట్లనియెను.

మహామతులారా! కఱిదంతునిచరిత్రమును వింటిరి. ఇది చౌర్యము దుర్గుణములలో మేలుబంతి యనువిషయమును దెలుపును. అందును గురుద్రవ్యాపహరణ మతిశయపాపఫలమునొసంగునని తేటపఱచును. చేయరానికార్యములు పెక్కులు గలవు. అందిది యగ్రగణ్యము. గురుద్రవ్యమును హరించువాఁడు సకలపాపములు చేసినవాఁ డనుట స్పష్టము. గురువనఁగా తండ్రి. పితృసమానుఁ డొక్కఁడు లేఁడు కదా. అట్టిగురు

ద్రవ్యమును లోభముచే హరించువాఁడు మహాపాపాత్ముఁడగు. అట్టివానికి భగవదనుగ్రహ మేలాగు కలిగెనను ప్రశ్నము రావచ్చును. కేవల పాపమే చేసియుండక సుకృతముగూడఁ జేసియుండినచో ననంతరము భగవంతునను గ్రహము కలుగును. కావున నెవ్వఁడుగాని పరద్రవ్యము నపహరింపరాదు. అందును గురుదేవబ్రాహ్మణద్రవ్యముల నపహరించుట మఱెంతపాపము. ప్రతిదోషకార్యమందు నుత్తమమధ్యమాధమభేదములు గలవు.

శ్లో. దేవస్వం బ్రాహ్మణస్వం వా లోభేనోప హినస్తి యః,
స పాపాత్మా పరేలోకే గృధ్రోచ్ఛిష్టేన జీవతి. ౨౬

మనుస్మృతి. ౧౧ అధ్యా.

దొంగిలించుటయే మహాపాపము. అందును గురుదేవద్రవ్యము లనంతపాపఫలముల నొసంగునవి.

శ్లో. నిషేకాదీని కర్మాణి యః కరోతి యథావిధి,
సంభావయతి చాన్నేన స విప్రో గురురుచ్యతే. ౪౨

మను. ౨ అధ్యా.

స గురుర్యః క్రియాస్కృత్వా వేదమస్మై ప్రయచ్ఛతి,
ఉపనీయ దదద్వేద మాచార్య స్స ఉదాహృతః. ౩౪

యాజ్ఞవల్క్యము. ఆచారకాండము.

అని యిట్లు గురులక్షణములు చెప్పఁబడినవి. అట్టి గురుద్రవ్యమును లోభావేశమున హరించుటకంటె గొప్పపాప మేమి గలదు ? అట్టి పాపాత్మునకుంగూడఁ దత్ఫలానుభవానంతరము పూర్వపుణ్యవశమున భగవత్కరుణ గలుగును. దాన ముక్తి లభించును. పుణ్యకర్మమే చేయకయుండినయెడలఁ బాపఫలాను

భవానంతరము పాపిజన్మమే లభించును. మరలమరల నట్లే జన్మించుచు సత్సహవాసము సజ్జనదర్శనమునను పుణ్యకార్యములవలనఁ గ్రమముగా నుత్తమజన్మము లభించును. కావున నించుకయైన స్తేయదోషమును జేయరాదనియు నది చతుర్వర్గ ఫలముల నశింపఁజేయుననియు నీకథ మనకు బోధించుచున్నది. ఇఁక నీవిషయమునఁ బెంచి వ్రాయక తరువాతివిషయమును వ్రాసెదను.

## ప్రభాసతీర్థమహాత్మ్యము.

* రాజా! ప్రభాసతీర్థమాహాత్మ్యమును వివరింతును. శ్రద్ధమెయి నాలకింపుము. అది సర్వపాపహరము. పుణ్యము. తేజోవృద్ధికరము నగు. సింహరాశియందు సూర్యుఁ డుండఁగా గోదావరియందును, గుంభరాశియందు రవియుండఁగా హరక్షేత్రమునందును, గురుక్షేత్రమున సూర్యగ్రహణకాలమునం దును, జంద్రగ్రహణసమయమునఁ గాశియందును, స్నానదానము లొనరించిన నెట్టిపుణ్యములభించునో దానికినూఱంత లధికముగుపుణ్యము ప్రభాసతీర్థమున దినదినస్నానమునఁ గలుగును. మున్ను శశాంకుఁడు దక్షప్రజాపతిశాపమున రాజయక్ష్మరోగము నొంది యీ ప్రభాసతీర్థస్నానమున దానింబాసి పరిశుద్ధుఁ డయ్యెను. అంతియకాక మరలఁ గళాశాలియు నయ్యెను. అందుఁ బడమరనుండి వచ్చి సరస్వతి కలియును. కావున నీతీర్థము మహాపుణ్యప్రదము. పాపాత్ముఁ డందు మునింగినఁ బాపపంకనిర్ముక్తుఁ

* ఈకథయు గర్గసంహిత ద్వారకాఖండము పదుమూఁడవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగవలయు.

డగును. దానితీరమునందు నిర్మలబోధపిప్పలవృక్షము గలదు. దానిక్రిందనే శ్రీకృష్ణుఁ డుద్ధవునకు భాగవతం బుపదేశించెను. కావున నా వృక్షరాజమును దర్శించి స్పృశించి పూజింపవల యును. అందుఁ గూరుచుండి శ్రీమద్భాగవతమును బఠించినను, శ్లోకార్థమునుగాని శ్లోకచతుర్థాంశమునుగాని మౌనియై నియ తుఁడై పఠించినను, అట్టిపుణ్యాత్మునకు వైష్ణవంబగు పరమపదము హస్తగతమనుట నిశ్చితము. అందు భాద్రపదమాస పూర్ణిమ యందును సింహసంక్రమణమునందును భాగవతమును దానము చేసినచో నాతనికిఁ గైవల్యము లభించును. ఎవరు శ్రీభాగ వతపురాణమును వినరో వారిజన్మము వ్యర్థము. వారు భూభా రమునకై జన్మించినట్లే. ఎవరు భాగవతమును వినరో పరమ పురుషుని బూజింపరో దేవతాప్రీత్యర్థము హోమముచే యరో వారిజన్మము వ్యర్థమనక తప్పదు. ద్వారావతియందలి తీర్థరాజమునందును గోమతీనది సముద్రమునఁ గలియుస్థల మందును స్నానముచేయువారలు వైకుంఠమున కరుగుదురు. గంగాసాగరసంగమమందు శతాశ్వమేధము లొనరించినఁ గలు గుపుణ్యమునకు శతగుణపుణ్యము గోమతీసింధుసంగమమున స్నానముచేయం గలుగును. ఈవిషయమున నొకపురాతనేతి హాసము కలదు. దానినాలకించినఁ బాతకరాసులు తొలంగును.

గజపురమున మార్గపతియనుపేరు గలవైశ్యుఁ డుండెను. వాఁడు మహాగౌరవముగలిగి కుబేరసంపదలఁ దులఁదూఁగుచుం డెను. కొంతకాలమున కావైశ్యుఁడు వేశ్యాలోలుఁడై విటగో ష్ఠీవిశారదుం డయ్యెను. ద్యూతక్రీడాసక్తుఁడై లోభమోహ మదాన్వితుం డయ్యెను. అసత్యవాదియై మహాదుష్టుఁ డనంబరఁ

గుచుఁ దుష్కర్మములఁ జేయుచు బ్రాహ్మణులకు దేవపితృవరు లకు ధనమీయక గర్వించెను. హరికథలఁ జెప్పువారలనైన నుండక యాచోటికి దూరముగానుండుట కలవాటుపడెను. పితృసేవను మాని పుత్త్రులకును ధనమీయక వేశ్యాలంపటుఁ డయ్యెను. కళత్రమును త్యజించి యేకాకియై ధనముతో స్వేచ్ఛ గా సుఖించుచుండెను. వేశ్యాసంగతిచే నాతనిధనమునం దర్ధము క్షయించెను. తస్కరులొకకొంత యపహరించిరి. కొంత భూమిదే వియే పెట్టినతావుఁ గనఁబడనీయక యపహరించెను. * పుణ్య ముచే లక్ష్మి వృద్ధినొందును. పాపమున లక్ష్మి నశించును. ఇది ధ్రువము. ఆవేశ్యాసక్తుఁ డిట్లువాసగా నిర్ధనుఁ డయ్యెను. ఆన గరమునందే దొంగతనముసఁ బ్రవర్తింపసాగెను. రాజున కావృ త్తాంతము తెలియఁగనే వానిని బద్ధునిగావించి తనదేశమునుండి వెడలఁ గొట్టెను. అడవులనుండి జీవహింస చేయ నారంభించెను. పండ్రెండువత్సరము లాదేశమున వృష్టిలేకపోయెను. దుర్భిక్ష మాదేశమునఁ బ్రబలెను. కావున నందుండి బ్రదుకఁజాలక యా వైశ్యుఁడు పశ్చిమదిక్కునకుం బయనము సాగించెను. అడవులం బడిపోవుచుండ క్షుధాతురమగు సింహ మొక్కఁ డాతనిఁ గర తలఘాతమునఁ జంపెను. యమదూత లాపాపాత్ముని బాశములం గట్టి కొట్టి తిట్టి యమమార్గమున నాతని నీడ్చుకొనిపోయిరి.

ఆవైశ్యునికళేబర మందుఁ బడియుండ నాహారార్థియై పరిభ్రమించు నొకగ్రద్ద యాశవమును గాంచి యందు వ్రాలి యాతనిచేతియందలిమాంసము నోటఁ గఱచుకొని యాకాశ మునం బఱుగిడుచుఁ దినుచుఁ బోవుచుండ నాకట నకనకంపడు

* పుణ్యేన వర్ధతే లక్ష్మీః పాపేన క్షీయతే ధ్రువమ్ - అని మూలము.

పక్షులన్నియుఁ దానిఁ జుట్టుముట్టగా నొకకోలాహలధ్వని బయలువెడలెను. ఆగ్రద్ధ యాపక్షులు చుట్టుముట్టినను దానిని విడువక పశ్చిమదిక్కునకుఁ బరువిడెను. దానితోడన పరుగిడి మఱొకగృధ్రము తీక్ష్ణతుండమునఁ బొడువ నామాంసము దాని నోటినుండి క్రిందఁబడుచు గోమతీసింధు సంగమస్థలమునఁ బడి యెను. ఆమాంస మాజలముల మునుఁగఁగా నావైశ్యుఁడు మహాపాతకియయ్యు యమపాశములనుండి విముక్తుఁడై చతు ర్భుజముల విరాజిల్లుచు యమదూత లచ్చెరువంది చూచు చుండఁగా విమానమెక్కి శ్రీహరిధామమున కేగెను. కావున గోమతీసింధుసంగమమాహాత్మ్య మత్యద్భుతము. సర్వపాతక హారము. అని పలికి నారదముని మఱియు నిట్లు పలికెను.

## రత్నాకర రైవతకాచలమాహాత్మ్యము.

* భూపాలకా! ద్వారవతీపురపరిసమునకు నలుప్రక్కల నావరించియుండు రత్నాకరమాహాత్మ్యము వినఁదగినది. వైశా ఖపూర్ణిమయందు వ్రతాసక్తిగలమానవుఁడు సాగరమున స్నానముచేసి సద్భక్తిపూజించి యద్దాని తీరంబున రత్నదానము చేసిన నాతనిదేహంబునఁ ద్రిమూర్తులు నివసింతురు. తద్దర్శన మాత్రమున మనుజులు కృతార్థులగుదురు. ఆపుణ్యాత్ముని స్పర్శించినంతన బ్రహ్మహత్యాదిదోషములు తొలఁగు. ఆకృతార్థునిఁ జూచుచు మృతినందినను బాపములు తొలఁగఁ బుణ్యాత్ములగు దురు. ఇంక రైవతకాద్రిప్రభావమును వినుము. ఆపర్వతము సకలపాపములఁ బోఁగొట్టుచు భుక్తిముక్తుల నొసంగుచునుండు.

---

* ఈకథయును గర్గసంహిత ద్వారకాఖండము పదునాల్గవ యధ్యాయ మునుండి గ్రహింపఁబడినది.

గౌతమమునితనయుఁడు మేధావియను విష్ణుభక్తుఁ డొకఁ డుండెను. వింధ్యాచలమునఁ గూర్చుండి యనేకవత్సరములు తపం బొనరించెను. ఆతనిం జూడఁ గోరి యొకముని యరుదెంచెను. ఆముని పే రపాంతరతముఁడని. ఆముని వచ్చినంతన లేచి మర్యాదచేయక తన తపోనిష్ఠయందె తానుండెను. క్రోధమూనివచ్చిన యమ్మౌని యాతనిం గాంచి నీవు పెద్దల బహూకరింపక తపోబలగర్వితుఁడ వైతివి. శైలమువలెఁ గదలకయున్నాఁడవు. కాన నోదుర్మతీ! నీవు శైలమవై యుండుము. అని పలికి యమ్మునిపోవఁ దచ్ఛాపమున మేధావి శ్రీశైలపుత్త్రుఁడై శైలరూపుఁ డయ్యెను. విష్ణుభక్తిప్రభావమున జాతిస్మరణము గలుగుభాగ్యము లభించెను. ఒకప్పుడు నావలననే ద్వారకామాహాత్మ్యమును వినియెను. రైవతరాజుం గానఁబోయి నాచెప్పినట్లు నీయిడుమలఁ జెప్పుము. ఆతఁడు నిరంతరము దీనవత్సలుఁడు. మఱియు బలవంతుఁడు. ఆరైవతుఁడే ప్రసన్నుఁడైనయెడల నిన్నుఁ దీసికొని పోయి హరిపురమున నునుపఁగలఁడు. అని పలికి శ్రీహరిపురమునకు నేఁబోయి రైవతునిమహిమమును నిట్లుపదేశించినాఁడనని విన్నవించితిని. శ్రీహరియు సంతోషించి నీచెప్పినట్లే యాపర్వతము నిందుఁ జేర్చెదనని ప్రతిజ్ఞ చేసెను.అంతట నేను శ్రీశైలముకడ కరిగితిని.కుమారుని సర్వవృత్తాంతమును విన్నవించితిని. శ్రీశైలమంతటఁ బుత్త్రవాత్సల్యము పైకొన సుమేరువును హిమవంతమును గూర్చి యిట్లు విన్నవించెను. పర్వతరాజములారా! నాకు భగవంతుఁ డొకపుత్త్రుని బ్రసాదించెను. పెక్కుమంది పుత్త్రులు లేరు. మహాబలుండగు రైవతరాజు నాకొడుకు నెత్తికొనిపోవఁ బ్రయత్నించువాఁడఁట. కావునఁ బరదేశము

నకుఁ బోవుదు. నాకుఁ బుత్రస్నేహము మిక్కుటము. కావున మీయిరువుర శరణము నొందితిని. మీ రా రైవతమును జయించి నాకుమారు నాకిండు. అని మొఱ్ఱపెట్టుకొనఁగా జాతిసంబంధమును బురస్కరించుకొని లక్షశైలములం గూడి అత్తఱి రైవతభూకాంతుఁడు తనబాహువులబలమున నా పర్వతము నెత్తికొనిపోవఁ దలంచుసమయముననే లక్ష పర్వతపరివృతములై మేరుహిమవంతములు యుద్ధమునకు వచ్చెను. పర్వతరాజములన్నియు శస్త్రాస్త్రములఁ గురియించెను. వానినన్నింటి నారాజేంద్రుఁడు నిశ్శంక విదలించుచు నట్టహాసమును గావించుచు గిరివరకుమారు నెత్తుకొనిపోవుచుండ నా పర్వతములన్నియు ముష్టిప్రహారాదుల నొప్పింప నారంభించెను. ఆ దెబ్బలకు భీతిల్లి యాగిరిని బాఱవైవక యత్తి కొని పోవుచుండ నేను శ్రీహరికడకరిగి రైవతభూకాంతుని దుస్థితిని విన్నవించితిని. భక్తవత్సలుఁడగు నాపరాత్పరుఁడు ఖగపతి నెక్కి యరుదెంచి యంబరముననుండియే తన తేజస్సును భూకాంతునియం దునిచెను. భయంపడకుమా యని యభయహస్త మిచ్చి యంతర్ధానమొందెను. శ్రీకృష్ణుఁ డిట్లంతర్ధానమొందఁగా భగవత్తేజస్సమన్వితుఁడు గావున నొకహస్తమున గిరిని నిలిపి వజ్రసమానమగుముష్టిచే మేరుపర్వతమును గ్రుద్దెను. ఆముష్టిప్రహారమున మేరువు విహ్వలచిత్త మయ్యెను. బాహువేగమున హిమవంతము నదలించెను. తక్కంగలపర్వతములఁ బాదములచేఁ జేవచెడఁజేసెను. వింధ్యాద్రిప్రభృతిపర్వతరాజములు చేష్టలు దక్కియుండెను. చేయునదిలేక వేగంబ యవన్నియుఁ బాఱిపోయెను. ఇట్లు పర్వతముల నోడించి యాశైలమును

బట్టుకొనియే యానరదేశమును జేరి యందునిచెను. రైవత పర్వతమునఁ బ్రఖ్యాతింగాంచఁ జేసెను. హరిభక్తుఁడగు నామేధావి ద్వారకానగరముచెంత భక్తిపరవశుండై యున్నవాఁడు. తద్దర్శనమాత్రంబునఁ బాపములు తొలంగు. యాత్రనొనరించిన సకలాభీష్టంబులు సిద్ధించునని వేఱ చెప్పవలయునా. తత్పర్వతప్రాంతమున బ్రాహ్మణులకు భోజనమిడిన ముక్తి కరతలామలకం బగు. అని పలికి నారదముని మఱియు నిట్లనియె.

ఆర్యమహాశయులారా! ఈకథ విచిత్రముగా నుండును. చదివితిరి కదా. ఆక్షేపించువారలకు మంచియవకాశ మిందుఁ గలదు. పర్వతరూపమును మేధావి ధరించుటకు హేతువు శాపము. దాన నారూపము గల్గెను. శ్రీశైలమునకుఁ దనయుఁ డయ్యెననుటయు, దాని నుద్ధరింప నారదముని రైవత భూకాంతుని శరణుసొరఁదగునని యుపాయము తెల్పుటయు, నావార్త విని యారాజేంద్రుఁడు ప్రయత్నించుటయు, నీవార్త విష్ణుమూర్తికి నారదుఁ డెఱింగించుటయుఁ దన్నుఁగూర్చి తపము చేయుచున్న మేధావి కిట్టి దుర్గతి గలుగఁగా వానినుద్ధరింప నాపురాణపూరుషుఁ డంగీకరించుటయు నీవార్త నెఱింగి శ్రీశైలము హిమవత్సుమేరుపర్వతముల కడకేగి నాయేక పుత్త్రుని రాజు కొనిపోవకయుండఁ గాపాడుఁడీ యని మొఱ్ఱపెట్టుకొనుటయు దాన బంధుప్రీతిం బూని వా రనుచరసమేతులై యరుదెంచుటయు, రైవతరాజు కొండనెత్తుకొని పోవ రాఁగాఁ బర్వతములు మాఱ్కొని పోరుటయు నీ మొదలగు గాథలు చిత్రములుగాను బరిహాసభాజనములుగను దోఁచుట చే నాక్షేపకులకుఁ జక్కనియవకాశము దొరకెననుట నిక్కము.

ఇట్టికథ లుండుటంబట్టియే పురాణములు ప్రమాణములు కావని కొందఱందురు. దీనికి సమాధాన మెట్లని పాఠకులు సంశయింపవచ్చును. చక్కఁగాఁ గూరుచుండి యాలకింపుఁడు.

పురాణములు ప్రమాణములనుట నిక్కము. అం దసంగతప్రసంగములు గలగాథలు లేవు. కాని కథలఁ బఠించినపుడు వానియందలి రహస్యార్థము లేవియని యాలోచింపకుండుట పాఠకులలోపము. కాని పురాణముల లోపము కాదు. అదెట్లుగాదో వివరించెదను. మనకుఁ గనఁబడు నాకారము పర్వతాధిదైవత బాహ్యరూపము. ఈరూపము మాటలాడఁ జాలదు. భూదేవి యీమృత్తుకానట్లే పర్వతదేవతరూప మిదికాదని నమ్మవలయు. ఈయూహగలిగియే సకలగ్రంథములు వ్రాయఁబడినవి. దీనిని మానినచో నేపురాణము నమ్మ వీలుండదు. కావున మనయార్యులభావ మిదియని తొలుదొలుత గమనించి తరువాత గ్రంథపఠనమునకుం బూనవలయు. లేకున్న వానిం జదువరాదు. జిజ్ఞాసువు లిట్లే చేయందగు. శ్రీమద్రామాయణమునందు సుందరకాండమున హనుమంతుఁడు సముద్రమును లంఘించుతఱి,

శ్లో. హిరణ్యనాభో మైనాకో నిశమ్య లవణాంభసః,
ఉత్పపాత జలాత్తూర్ణం మహాద్రుమ లతాయుతః. ౧౦౨
స సాగరజలం భిత్వా బభూవాభ్యుత్థిత స్తదా,
యథా జలధరం భిత్వా దీప్తరశ్మి ర్దివాకరః. ౧౦౩
స మహాత్మా ముహూర్తేన పర్వతస్సలిలావృతః,
దర్శయామాస శృంగాణి సాగరేణ నియోజితః. ౧౦౪

శాతకుంభమయై శ్శృంగై స్సకిన్నరమహోరగైః,
ఆదిత్యోదయ సంకాశై రాలిఖద్భిరివాంబరమ్. ౧౦౫
తస్య జాంబూనదమయై శ్శృంగై స్పద్యస్సముత్థితైః,
ఆకాశం శస్త్రసంకాశ మభవ త్కాంచనప్రభమ్. ౧౦౬
జాతరూపమయై శ్శృంగై ర్భ్రాజమానై స్స్వయంప్రభైః,
ఆదిత్యోదయసంకాశ స్సోఽభవద్గిరిస త్తమః. ౧౦౭
తముత్థిత మసంగేన హనూమానగ్రతస్స్థితమ్,
మధ్యే లవణతోయస్య విఘ్నోఽయ మితి నిశ్చితః. ౧౦౮
... ... ... ... ...
తమాకాశగతం వీర మాకాశే సముపస్థితః,
ప్రీతో హృష్టమనా వాక్య మబ్రవీ త్పర్వతః కపిమ్. ౧౧౧
మానుషం ధారయన్ రూప మాత్మనశ్శిఖరే స్థితః,
దుష్కరం కృతవాన్ కర్మ త్వమిదం వానరో త్తమ. ౧౧౨
౧. సర్గము.

మైనాకపర్వతము సముద్రమునుండి వెలువడి హనూమంతుని యెదుట నిలిచి తనశిఖరముపై మానుషరూపమునఁ గనంబడుచు నిట్లు మాటలాడెను.

పర్వతముల బాహ్యరూపము శిలామయము. అంతరరూపము దేవతాస్వరూపము. కాఁబట్టియే మనవారు పర్వతములను దేవతలుగాఁ బూజింతురు. పర్వతము మాటలాడెననఁగాఁ బర్వతాధిష్ఠానదేవత మాటలాడెనని భావము. పూర్వగ్రంథములయందెల్ల నిట్లే కానఁబడియెడిని. శ్రీమద్రామాయణమునందే యుద్ధకాండమునందు సేతువు గట్టుటకుముందు

రామచంద్రుఁ డాగ్రహించి బాణప్రయోగము చేయఁ బూనఁగా

"శ్లో. తతో మధ్యా త్సముద్రస్య సాగరస్స్వయ ముత్థితః,
ఉదయం హి మహాశైలా న్మేరోరివ దివాకరః. ౧౭
పన్నగై స్సహ దీప్తాస్యై స్సముద్రః ప్రత్యదృశ్యత,
స్నిగ్ధవైదూర్యసంకాశో జాంబూనదవిభూషితః. ౧౮
రక్తమాల్యాంబరధరః పద్మపత్రనిభేక్షణః,
సర్వపుష్పమయీం దివ్యాం శిరసా ధారయ న్స్రజమ్. ౧౯
జాతరూపమయైశ్చైవ తపనీయవిభూషణైః,
ఆత్మజానాం చ రత్నానాం భూషితో భూషణోత్తమైః. ౨౦
ధాతుభి ర్మండితశ్శైలో వివిధై ర్హిమవానివ,
ఏకావలీమధ్యగతం తరళం పాటలప్రభమ్. ౨౧
విపులే నోరసా బిభ్ర త్కౌస్తుభస్య సహోదరమ్,
ఆఘూర్ణితతరంగౌఘః కాళికానిలసంకులః. ౨౨
ఉద్వర్తితమహాగ్రాహ స్సంభ్రాంతోరగరాక్షసః,
దేవతానాం సురూపాణాం నానారూపాభిరీశ్వరః. ౨౩
గంగాసింధుప్రధానాభి రాపగాభి స్సమావృతః,
సాగరస్సమభిక్రమ్య పూర్వమామంత్ర్యవీర్యవాన్. ౨౪
అబ్రవీ త్ప్రాంజలి ర్వాక్యం రాఘవం శరపాణినమ్." ౨౫

౨౨. సర్గము.

సముద్రుఁడు దేవతారూపమున దివ్యాంబరాభరణశోభితుఁడై సకలకుసుమహారముల వెలుఁగొందుచు నదనదీసేవితుఁడై లేచి

యంబరమున నిలువంబడి శ్రీరామునితో నిట్లు పలికెను. ఆర్యు లారా! వింటిరా. సముద్రుఁడు పర్వతుఁడు దేవమానుషరూపముల మాటలాడినట్లు రామాయణము తెల్పుచున్నది. ఇట్లు గ్రంథములఁ బరిశీలింప నెన్నియోదృష్టాంతములు కనుపట్టును. వానింబరికించినఁ బర్వతాదులకు మాఱురూపములు కలవనియు నవి దైవతములనియు వానిఁ దెలిసికొనుట మానవులకుం గష్టమనియు దివ్యదృష్టికలిగినఁగాని వానిం దెలియ సాధ్యము కాదనియుఁ దేటపడియెడిని. అట్టిజ్ఞానము లేనివారికి నన్నియు నసత్యములనియే తోఁచును. అట్టివారికి నిది సత్యము లేయని విశ్వాసముపుట్టింపఁ దరముకాదనఁజాలను గాని చాలకష్టము. ఇఁకఁ బ్రకృతమనుసరించి నాలుగుమాటలు వ్రాసెదను.

ఒకమనుష్యుఁ డీకాలమున వయస్సునఁబోలుపారు వృక్షరాజము నొక్కండే తెచ్చి యవలీలగాఁ దనయింట నునుప నది బ్రదికి యించుకంతయు వాసిచెడక యెప్పటియట్ల యున్నదని యంగీకరించినపుడు పూర్వకాలమునఁ బరమభక్తాగ్రేసరుఁడై తపోనిరతుఁడై యలరారు రైవతభూకాంతుఁడు శాపవశమునఁ బర్వతరూపమును దాల్చియున్న మేధావియను భక్తుని నెత్తుకొనిపోవఁ బ్రయత్నించుట యసంభవము కాదు. అసంగతమనుటయే యసంగతము. తపశ్శక్తిప్రభావ మిట్టిదని యెఱుఁగని వారి నిది నమ్మకముగలుగునట్లు చెప్పుట కష్టతరము. కావునఁ దపశ్శక్తి యత్యద్భుతకార్యములఁ జేయఁజాలునన్న నమ్మకము గలవారలకే యిట్టి పవిత్రచరిత్రములు పనికివచ్చును. ఇతరులకుఁ గాకమ్మ పిచ్చుకమ్మకథలు పనికివచ్చును. పర్వతములు యుద్ధ

మునకు వచ్చెనన్నమాటకును నైయట్లే సమాధాన మూహిం
చుకొనఁ దగు. వృక్షాదులకుంగూడ నధిదైవతములు గలరను
మాట నమ్మకతప్పదు. ఇపుడిపుడు యంత్రబలముల వృక్షములకు
మనుష్యులవలె సుఖదుఃఖములు గలవని తెలిసికొనుటయే గాక
యెల్లరకుం దెల్లమగునట్లు చూపుచున్నట్లు వినుచున్నారము
కదా ఇంకను గొంతకాలమునకుఁ బర్వతములకుంగూడ సుఖదుః
ఖములు మనుష్యులకంటె నధికముగాఁ గలవని తెలియ
వచ్చును. అప్పుడును నమ్మనిమూర్ఖులు కొంద ఉండకపోరు.
మనపురాణములయందలి ప్రతివిషయము నిట్లే క్రమముగా
ననుభవమునకు రాఁగా నపుడు పురాణము లెట్టిమహాత్ములచే
వ్రాయఁబడినవో యందలివిషయము లెంతయద్భుతావహములో
తెలియఁబడును. అంతదనుక సామాన్యులు నమ్మకయున్నను
సాధువులు నమ్ముచునే యుందురు. ఇపుడట్టివారు నమ్ముటయే
చాలునని సంతసింతము. ముందుముం దెల్లవారు నమ్మునట్లు
సమయము సుముఖమై రాఁగా మఱింత యానందింతము. మన
కిపుడు కనంబడుపర్వతములన్నియు మహామునులకు నెలవులైన
వియే. కాని యందున్న మహామునుల దర్శించుభాగ్యము లేని
మనము పర్వతగుహాలు సర్పనివాసములుగాఁ బరిగణించుచు
న్నారము. అతీంద్రియజ్ఞానముగలవారు మనలంగాంచి పరితపిం
చుచుఁ గలికాల మెపుడు గడచునా యని యాశించుచుందురు.
ఆముష్మికజ్ఞాన భూరుహభూరికుఠార మీకలికాలము. ఇట్టికట్ట
డికాలమునఁ దపోనిరతి లేకున్నను భగవన్నామసంకీర్తనమునైనఁ
జేసి కృతార్థులమగుట మంచిది. ఇఁక నీవిషయమునఁ దడవు
చేయక దీనితర్వాతి భగవచ్చరిత్రమును వ్రాయఁబూనెదను.

సత్యాన్వేషణతత్పరులారా! ద్వారకానగరనిర్మాణమను శీర్షికక్రింద గర్గసంహితనుండి కొంతగ్రంథము వ్రాసెదనని తెల్పియుంటిని. అట్లే వ్రాసితిని. దానింబట్టి ద్వారకానగరమంతకుముందే నిర్మింపఁబడినట్లు తెల్లమగును. భాగవతాదిగ్రంథములయం దించుకభేదముగా సముద్రుఁడిగి నగరము నిర్మించినట్లు కనుపట్టెడిని. అదేల వ్రాసితినంగా నగరమునఁగల తీర్థములమహిమములు తెలియవలయుననియే వ్రాసితి. ఇపుడు మరల భాగవతాదిపురాణముల ననుసరించి వ్రాసెదను. పునరుక్తితాదోషము రాదాయనిమాత్రము ప్రశ్నింపకుఁడు. బహుపురాణముల నొకచోటఁ జేర్చుటయనఁ గప్పలను ద్రాసునను నిచి తూఁచినట్టిదియే. ప్రతిపురాణ మొక్కవిషయమును బ్రధానముగాఁ గైకొని తక్కినవిషయములను అంగములుగా భావించి తెలుపును. వానినన్నింటిని నొక్కతావునఁ గూర్చి వ్రాయునపుడు ముందువెనుకలుగా నుండుతావుల నించుకభేదము రాక మానదు. కావునఁ బాఠకులోపికమైఁ బఠింపవలయునేగాని యిది ముందే యేల వ్రాయలేదని ప్రశ్నింపక యన్నింటిని సమరసముచేసికొని పఠింపవలయును. అదియే చక్కనిసన్మార్గము. కావున నిపుడు కాలయవనుఁడు దండెత్తి వచ్చి నగరమును ముట్టడించినట్లును జరాసంధుఁడు పదునెనిమిదవపర్యాయము మహాబలములంగూడి రా సిద్ధముగనున్నట్లును భావించి యీకథను బఠింపుఁడు. అన్నియుఁ జక్కఁగా నుండును. మరల ద్వారకానిర్మాణ మేలయనిమాత్రము బెదరకుఁడు. శాంతముననే మీమనస్సులఁ జోటును గల్పింపుఁడు. ఇఁకఁ గథ వినుఁడు.

## శ్రీకృష్ణుఁడు మథురానగరవాసుల ద్వారకకుం జేర్చుట.

* మ్లేచ్ఛబలములు మథురానగరమును ముట్టడించెను. రాజుల యాచారములకును మ్లేచ్ఛులయాచారములకును జాల భేదము కలదు. కావున మ్లేచ్ఛులవలనఁ జాలబాధలు గలుగఁ గలవన్న వెనుభీతి నగరవాసులకుం గల్గెను. ఆబాలగోపాలము చేష్టలు దక్కి ముందేమిగతి కానున్నదో యని కలవరపడసాగిరి. యాదవవీరులందఱు పదునేడుపర్యాయములు జరాసంధుని దాడికింజిక్కి ప్రాణముల రక్షావని కర్పించితిమి. మరల మాగధుఁడు రానుండఁగా నడుమ వీఁడొకఁడు వచ్చెనేయని మర్యాదలుమాని యోజింపసాగిరి. పురంధ్రులు మర్యాదకై ప్రాణముల బలవంతముగా వీడనుండిరి. వసుదేవాది యాదవవృద్ధులందఱు శ్రీకృష్ణుని బలదేవుని జూడవచ్చి ముందేమి చేయఁదగునని యడిగిరి. భగవంతుఁడు రామునింగూడి వటమూలమునఁ గూరుచుండి యించుక యోజించి కార్య మిదిగదాయని నిశ్చయించి సాగరమును విశ్వకర్మను గరుడుని సంస్మరించెను. స్మరించినంతన వారెల్లఁ బొడసూపిరి. అంతదనుకఁగల గోపవేషమును ద్యజించి రాజవేషమును ధరించెను. అప్పుడు తొలు దొలుతఁ జక్రమరుదెంచి శ్రీకృష్ణకరకమలము నలంకరించెను.

---

* ఈవిషయము శ్రీభాగవతము ౧౦ స్కం. ౫౦ వ యధ్యాయము నుండియు, బ్రహ్మపురాణము ఏనుబదెనిమిదవ యధ్యాయమునుండియు, విష్ణుపురాణము పంచమాంశము నిరువదిమూఁడవ యధ్యాయమునుండియుఁ, శ్రీకృష్ణజన్మఖండము నూటమూఁడవ యధ్యాయమునుండియు వ్రాయఁబడునని యెఱుఁగఁదగు. ఇందుఁ గథాభాగ మెందు మిక్కిలి వ్రాయఁబడునో దానిని బ్రధానముగాఁ జేసికొని వ్రాయుచుఁ దక్కినవానిని గలిపి వ్రాసెదను.

దానికే సుదర్శనమను దివ్యనామము కలదు. అది కోటిసూర్య ప్రభాభాసమానము. వైరివిమర్దనమే దాని ప్రధానకృత్యము. దాని నేయస్త్రములు మరలింపఁజాలవు. అప్రతిహతమని దానికి బిరుదనామము కలదు. రత్నయానముంగొని గరుత్మంతుఁడు పాఁడసూపెను. శిష్యసహితుఁడై విశ్వకర్మ యరుదెంచి ప్రాంజలియై యెదుట నిలిచెను. లవణసాగరము దేహము కంపింప రూపమూని వచ్చి దివ్యపాదారవిందములకుఁ బ్రణమిల్లి నిలిచెను. శ్రీకృష్ణమూర్తి సుస్మితవక్త్రుఁడై వారింగాంచి ప్రేమరసపూరితభాషణముల నిట్లు పలికెను. సాగరా! నీయందు స్థలముంకావలయును. అది శతయోజనపరిమితముగ నుండఁదగు. ఒక్కనగరము నిర్మింప నది యావశ్యక మయ్యెను. ఆస్థలము శాశ్వతముగా నుండనక్కఱలేదు. మరల నీకే యొసంగెదను. కొంతకాలమే యది స్థలరూపమున నుండఁదగు. పిదప జలరూపము నొందసచ్చును. అని పలికి విశ్వకర్మను గాంచి దేవశిల్పివరా! యాదవజనులు నివసింప నొకనగరమును నిర్మింపుము. అది త్రిలోకనగరావతంసముగా నుండవలయు. చూచువారలకు నయనానందప్రదమై కాంతాజనములకుఁ గమనీయతమంబై యోగులకు గమ్యంబై మునులకు శరణ్యంబై పామరులకు దర్శనీయంబై యలరారవలయును. భక్తులు దానింజూడ వాంఛింపవలయు. అది వైకుంఠమును మించియుండవలయును. పుణ్యపూరుషు లందుండి స్వర్గవాసమును గోరరాదు. అని పలికి గరుడుని ప్రక్క మరల వినతానందనా! రేయింబగళ్లు విశ్వకర్మకు సాక్షాత్కార మొసంగుచుండుము. ద్వారకానగరము నిర్మించినంతదనుక నాతనికిఁ బొడసూపుచుండుము.

* ఇట్లు శ్రీహరి పలుకఁగానే వారెల్ల నానతి నొదలలఁ దాల్చి యట్లే యొనరింతుము. అని ప్రార్థించి వీడుకోల్పడసిరి. చక్రముమాత్రము సన్నిధి నెడఁబాయక యుండెను. విశ్వకర్మ యుఁ బడమటి దిక్కునకుం బోయి యందలి లవణోదధియందు స్థలము వెలయుటం గాంచి విస్మితుఁడై భగవదాజ్ఞ కచ్చెరువం దుచుఁ దత్సంకల్పశక్తి యెట్టిదో కనుఁగొన శక్యముగాదుగదా యని తలంచుచు శిష్యసహితుఁడై నగరమును గట్ట నారంభిం చెను. యక్షులు లోనగు దేవయోనివిశేషు లనంబడువారెల్ల హిమాలయప్రభృతి దివ్యస్థలములనుండి సకలరత్నములం గొనితెచ్చి విశ్వకర్మ కొసంగుచుండిరి. శిల్పులెల్ల దివానిశము లను భేదముమాని నగరనిర్మాణమున బద్ధకంకణులై యుండిరి. ఏడులక్షలయక్షులు కుబేరప్రేరితులై నగరనిర్మాణమున విశ్వ కర్మకుఁ దోడ్పడుచుండిరి. శంకరప్రేరితులగు బేతాలకూశ్మాండ నామకులు లక్షలకొలంది యాపనికై సాయపడిరి. శైలకుమారి యాజ్ఞాపింప దానవులు బ్రహ్మరాక్షసులు నసంఖ్యలుగా సాయ పడిరి. యాదవులవనితలకు శ్రీకృష్ణపత్నులకు వసుదేవాదు లకుఁ దక్కుంగల బంధువులకును దగినగృహములు నిర్మింపఁ బడియెను. చుట్టు నుద్యానములు సర్వర్తుకుసుమములచేతను

---

* దృశ్యతే యత్ర హి త్వాష్ట్రం విజ్ఞానం శిల్పనైపుణం, రథ్యాచత్వర వీథిభిర్యథా వాస్తు వినిర్మితం, సురద్రుమలతోద్యాన విచిత్రో పవనాన్వి తమ్ = అని శ్రీభాగవతము. ఇందు ద్వాదశయోజనపరిమితదుర్గము నిర్మించి నట్లు గలదు. ఇతి సంచింత్య గోవిందో యోజనాని మహోదధిం, యయాచే ద్వాదశ పురీం ద్వారకాం తత్రనిర్మమే = అని బ్రహ్మపురాణమునఁ గలదు. శ్రీకృష్ణజన్మఖండమున శతయోజనములని గలదు. భేదమింతియే.

ఫలములచేతను సంభరితములై యపూర్వంబడియెను. యాదవ వీరులకును బంధుజనులకును దగినగృహములు కనుపట్టుచుండ విశాలములై వీథులొప్పుచుండ నందందు రచ్చకొట్టములు వెలయుచుండ సంగీతశాలలు తనరారుచుండ రాజగృహవరములు నేత్రపర్వమొనర్చుచుండ నాద్వారకానగరము చూడం జూడ మనోహరముగా నుండెను.

## గృహవృక్షములు, తత్ఫలములు.

ఇట్లు విశ్వకర్మ పురవరమును నిర్మించి భగవంతుని గానంబోయి మహాత్మా! నగరము నిర్మించితిని. ఉద్యానములు వెలయించితి. అందు నేయేవృక్షములు నీకుం బ్రియములో ఏయే భూరుహములు సకలజనులకు శుభములు గల్గింప నునుపవలయునో యెఱిగింపుము. మఱియు నేయేవృక్షముల నేయే దిక్కుల నునుపవలయునో యనుగ్రహింపుము. గృహములింకను నిర్మింపవలయునేని వానియున్నతిని దెల్పుము. ప్రాకారములు పరిఖలు లోనగువాని ప్రమాణ మెంతయుండవలయునని నీవు కోరుదువు? అంతియగాక యింక నేయేవిధముల నేయే గృహములు లోనగునవి నిర్మింపవలయునో వానిపద్ధతులం దెల్పుము. అని ప్రార్థింప శ్రీహరి పరమదయాంతరంగుఁడు కావున నిట్లు పలికెను. ఆశ్రమమునందు గృహస్థులకు నారికేళ వృక్షములు శుభప్రదములగు. శిబిరములం దీశాన్యభాగమునను దూర్పునందును నారికేళము పుత్త్రప్రదమగును. తరురాజమేదిక్కుననున్నను మంగళప్రదమే యగును. తీయమామిడి చెట్టు తూర్పుదిక్కున నున్న గృహస్థులకు సంపత్ప్రదము. సురకారమనువృక్ష మేదిక్కుననున్నను భాగ్యమునిచ్చునని యెఱుం

గుము. ఇంతియగాదు. బిల్వవృక్షము, పనసచెట్టు, జంబీరద్రుమము, బదరీతరువు నను నీ నాలుగును గృహమునకుఁ దూర్పునందున్న సంతానప్రదము లగు. దక్షిణభాగమందున్న ధనమునిచ్చును. తక్కినతావులనున్న సంపత్ప్రదములగు. కావున నీనాలుగు నుండఁదగినవి. నేరేడుచెట్టు, దాడిమీవృక్షము, అరఁటిచెట్టు, ఆమ్రాతకము (అంబాళమనుచెట్టు) ఈ నాలుగు గృహమునకుఁ దూర్పుగానుండిన సద్బంధులాభము గల్గును. దక్షిణమందున్న మిత్రలాభము గల్గును. ఈనాలుగు ఏదిక్కుననున్న శుభప్రదములే కావున నివి ముఖ్యములని తెలియందగును. సువాకమనుచెట్టు దక్షిణపశ్చిమదిక్కులందు సుఖప్రదమగు. ఈశాన్యమునందు సంతోషమును గల్గించును. ఎల్లదిక్కులయందును జంపకవృక్షము శుభముల నిచ్చునది. సొర, అతి కూశ్మాండము, మాయాంబువు, మోఁదుగు, ఖర్జూరియుఁ, గర్కటియు నను నీయవి శిబిరమున మంగళకరములు. వాస్తూకకారబిల్వము వార్తాకము గృహమున నెందున్నను శుభము కలుగును. సర్వదిక్కులందును లతాఫలము శుభముఁల నొసంగునని నమ్ముము. దేవశిల్పివరా! ప్రశస్తవృక్షముల నెఱింగించితిని. ఇఁక నిషిద్ధవృక్షముల నాలకింపుము. వనమున నుండఁదగు వృక్షములు శిబిరమునందు నంతఃపురమునందును నిషిద్ధములేయగును. వటవృక్ష మింటనుండరాదు. ఉన్నచో నాయింటికి చోరభీతి గలుగు. నగరములయందు వటవృక్షము దర్శనీయము. శుభమునుగూడ నిచ్చును. గృహమునందు నగరమందును శాల్మలీవృక్షము (బూరుగుచెట్టు) నిషిద్ధము. పురమునందు నది యుండరాదు. అది రాజులకు సదా దుఃఖముఁను

గల్గించును. గ్రామమునందుఁ బల్లియలందు నది నిషిద్ధముగాదు. చింతచెట్టు నింట నునుపరాదు. ప్రయత్నపూర్వకముగా దానిని ద్రుంచివేయసలయును. నూఱుచింతచెట్లుండిన ధనహానియు సంతానహానియుఁ గల్గును. అది శిబిరమున మిక్కిలి నిషిద్ధము. నగరమున సామాన్యనిషిద్ధములలో నొకటియగు. పల్లియలందును గ్రామములం దది నిషిద్ధముకాదు. చణకాదిధాన్యవృక్షములు మంచి ఫలముల నొసంగును. చెఱకుచెట్టు శుభముల నొసంగును. అశోక కదంబశిరీషవృక్షములు మంగళకరములు. కావున నింట నుండఁదగినవి. పసపుచెట్టు కొంత శుభమును గల్గించును. అల్లముచెట్టు నష్టే. కరకవృక్షము మంచిది. గ్రామనగరములయందుఁ దప్పక యుండఁదగును. ఆమలకి ప్రభృతులు తప్పక వేయఁదగినవి వానినుండి గొప్పలాభములు గలవు.

గజములయు నశ్వములయు నస్థులింటనుండుట మంచిది. ఉచ్చైశ్శ్రవము నస్థులు గృహమున స్థాపించిన విశేషశుభములు కలుగుచుండుననుట ధ్రువము. తక్కినజంతువుల యెముకలు గృహముననున్న జననాశము గల్గును. వానరులయు, నరులయు, గర్దభములయు, కుక్కుటములయు, సృగాలములయు, మార్జారములయునస్థు లింట నుండరాదు. భేటకసూకరము లనుమృగములయస్థు లింట స్థాపించిన శుభము కలుగును. ఈశాన్యమునందుఁ దూర్పుభాగమునఁ బశ్చిమోత్తరములయందు జలవసతిఁ ద్రవ్వుట మంచిది. తక్కినభాగములనఁగా నాగ్నేయదక్షిణనిఋఋతి భాగములయందు వాపీకూపములఁ ద్రవ్వరాదు. వెడల్పు పొడవు సమానముగనుండున ట్లిల్లు గట్టరాదు.

చతురస్రగృహము వాసార్హము కాదు. గృహస్థులకు ద్రవ్య నాశము గల్గును. దీర్ఘప్రస్థము పనికిరాదు. పరిమితియం దత్యు చ్చము పనికిరాదు. దానిపై నేత్రచిహ్నము లుండరాదు. అట్టి వి లేకుండ నిల్లుకట్టుట మంచిది. పాషాణరహితముగాఁ గట్టిన యిల్లు నరులకు ఫలశూన్యతను గల్పించును. గృహద్వారము రెండుహస్తములకుఁ దగ్గినవెడల్పుగలిగి పొడవు మూఁడు హస్తములకు మించక యుండవలయును. ప్రాకారమున కిట్లే యుండవలయునని శాస్త్రమర్యాద. గృహమధ్యభాగము నిమ్నోన్నతములుగఁ గట్టరాదు. అది మంచిదిగాదు. చతుర శ్రమై చంద్రవేధమై యలరుగృహము మంగళముల కాలయం బగును. సూర్యవేధగృహము శుభము కాదు. సూర్యవేధప్రాం గణముకూడ శుభము గల్గింపదు. శిబిరాభ్యంతరమునందుఁ దులసీవృక్షమును స్థాపించి పెంచుట చాలమంచిది. ధనపుత్రు లనొసంగుచు హరిభక్తిని గల్గించును. తెల్లవాఱుజామునఁ దులసీవృక్షమును దర్శించిన సువర్ణదానఫల మబ్బును.

## గృహముల నుండఁదగులతలు.

మాలతియు యూధికయుఁ గుందము (మొల్ల) మాధ వియు, (బండిగురువిందతీఁగె) కేతకియు, నగేశ్వరవృక్షము, మల్లికాలతయు, కాంచనలతయు (సంపెగ), పొగడచెట్టు, నను నివి గృహముల నునిచి పెంచుట మేలు. అపరాజితయను లత శుభము లిచ్చును. (విష్ణుక్రాంత కపరాజితయనుపేరు గలదు) ఉద్యానముల నది మిక్కిలిమంచిది. గృహములయందు దానిని బూర్వోత్తరభాగములయం దుంచుటమేలు. పదాఱుహస్తము లకుమించిన యెత్తుగల్గునట్లు గృహము కట్టరాదు. ఇరువదిహస్త

ములకు మించిన యెత్తుగల్గునట్లు ప్రాకారము గట్టఁగూడదు. సూత్రధారుఁడు, తైలముదీయువాఁడు, కంసాలి, పీరకుఁడు, వీధిమొదటఁగాని, గ్రామము నడుమగాని నివసింపరాదు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య సచ్ఛూద్రులను,భట్టును,వైద్యుని,జ్యోతిష్కుని,బుష్పకారుని శిబిరాంతికమున నివసింపఁజేయుట తగినది. ప్రస్థభూమియందుఁ బరిఖామానము నూఱుహస్తము లుండఁదగు. శిబిరములకుఁ జుట్టునుండు పరిఖామానము దశహస్తము లుండవచ్చు. పరిఖాద్వారము సంకేతపూర్వకముగ నుండవలయు. అది శత్రువుల కగమ్యమై మిత్రులకు సులభగమ్యమై యుండఁదగు. సదా జలపూరితమై యుండుటొప్పు.

శాల్మలి, తింత్రిణీ, హింతాలము, నింబము, సిందువార ముంబరము, ధత్తూరము, వటవృక్షము, ఆముదపుఁజెట్టునను వీని కఱ్ఱలు గృహముకట్టుట కెప్పుడు నుపయోగింపరాదు. వజ్రహస్తమగువృక్షము వజ్రహస్తమగుకొండ (పిడుగుపడిన చెట్టు కొండరాయి) గృహకర్మమున కుపయోగింపరాదు. ఉపయోగించినఁ బుత్త్రదారధనాదుల నవి హరించునని బ్రహ్మ మున్ను చెప్పెను. ఓ దేవశిల్పీ! ఇది లోకానుగ్రహార్థము చెప్పితిని. నీవు ద్వారకానగరమును దారుసంబంధములేకయుండఁ గట్టుము. ఇదియే పరమ శుభముహూర్తము. వత్సా! పోయి నగరము సమగ్రముగా నిర్మింపుము. అని భగవంతుఁ డాజ్ఞాపింపఁ బక్షివాహనసహాయమున ద్వారక కతివేగంబపోయి సముద్రము చెంతనున్న వటమూలమున నారేయి సుఖనిద్ర చేసి స్వప్నమున మనోహరముగా నలరారు ద్వారవతింగాంచి తనకు శ్రీకృష్ణుఁ డుపదేశించినట్లే సకలలక్షణముల నిర్మింపఁబడియున్న నగరోత్త

మమును గాంచెను. శిల్పులందఱు విశ్వకర్మను బరిహాసించుచుం డిరి. గరుత్మంతుని గరుత్మంతులెందఱో పరిహాసించుచుండిరి. మేల్కాంచి గరుత్మద్విశ్వకర్మలు కనము లజ్జించిరి. అతిమనోహ రమై ద్వారకానగర మలరుచుండెను. బ్రహ్మాదులనగరములఁ దిరస్కరించి యా ద్వారకానగరము సుఖనిధానమై యుండెను. రత్నకాంతులు సూర్యు నాచ్ఛాదించుచుండెను.

మహాశయులారా! ఈ ద్వారకానగరనిర్మాణపద్ధతిని బఠించితిరి. దీనింబరికింపఁగా నేదో పుక్కిటిపురాణముగాఁ దోఁచును. పిల్లలకుఁజెల్పు నసత్యకథయనియుఁ దోఁచును. ద్వారకానగరము విశ్వకర్మ కట్టుటయేమి? సముద్రము చోటి చ్చుటేమి? కృష్ణుఁడు సంకల్పించుటేమి? గృహాములు కట్టు టేమి? ఉద్యానములువేయుట యందును జెట్లు మిన్నంటునట్లు పెరుగుటయను నీలోనగువిషయములు సత్యహీనములుగాఁ దోఁపకమానవు. గృహాములు ప్రాకారములు ఇంతలో సిద్ధమ గుటెట్లైనఁ గంటిమాయనియు నూహకుఁ దగులకమానదు. ఇట్టియూహాలుకలుగుట విచిత్రముమాత్రముకాదు. కాన మను ష్యమాత్రుఁడుకాక యాజ్ఞాపించువాఁడు శ్రీహరియగు శ్రీకృ ష్ణపరబ్రహ్మమనిమాత్ర మూహించిన నీయూహాలు పటాపంచలై యెగిరిపోవును. సకలబ్రహ్మాండములను మనస్సంకల్పమాత్ర మున సృజించి సూర్యుని దేజఃప్రదాతగా నిర్మించి లోకోద్ధర ణమున కనువగురీతి నెందఱనోదేవతల సృష్టిచేసినపరాత్పరునకు నగరనిర్మాణము తుచ్ఛతమమగు కార్యముకాక గొప్పదగునా? ప్రతిప్రాణికి నేయేసమయమున నేయే మేలుకీడులు గలుగవల

యునో వానినెల్ల నొకక్షణమైనను దప్పకయుండ లభించున ట్లొక్కకట్టడిచేసి దానియం దేమాత్రము మార్పులుగలుగనట్లు కట్టుపాటుచేసిన భగవంతున కీ తుచ్ఛనగరనిర్మాణము గొప్పకార్యమా? శ్రీకృష్ణుఁడు భగవంతుఁడు కాఁడన్నచో నీనగరనిర్మాణము రిత్తయనవచ్చును. కావున సంకల్పమాత్రమున ననేక కోట్ల బ్రహ్మాండములు సకలప్రాణివితతములై యుండునట్టు లమర్చి ప్రతిప్రాణికిని జీవనమును గల్పించి మాయచే వాని నెల్ల నాచ్ఛాదించి సంసారము శాశ్వతమనుభ్రమాహాను దృష్టాంతములచేఁ గల్పించి వానియందే మునిఁగి తేలుచుండునట్లుచేసి తనయద్భుతశక్తిని బ్రహ్మాదులే నెఱుంగకయుండ నలరారు మహాత్మునకు జగదీశ్వరుఁడుగు బురాణపూరుషునకు నఘటనసంఘటన సమర్థున కీసాగరమున భూమిని గల్పించుట, యందొక పురము నిర్మింప విశ్వకర్మ కాజ్ఞాపించుట, దానిప్రకారము నగరము నిర్మింపఁబడుట యను నీకార్య మత్యల్పతమమనక తప్పదు. కావున భగవంతుఁడు శ్రీకృష్ణుఁ డనుమాటను మాత్రము మఱువకుఁడు. అన్నియు సరిపడును. ఇంకను దీనిని బెంచి వ్రాయక మహాకవిపోతన మూలమున లేకయున్నను సందర్భోచితముగా వ్రాసినపద్యముల నుదాహరించుచున్నాఁడను. దాన నీశంకలు తొలంగును.

క. ఆపీట నుండువారికి
భావింపఁగ లేవు క్షుత్పిపాసాదులు త
ద్గోవింద కృపావశమున
దేవప్రతిమాను లగుచు దీపింతు రిలన్.

సీ. ఆసక్తి కృష్ణముఖావలోకనమంద
హరిపాదసేవనమంద చింత
వెఱపు నారాయణవిముఖకార్యములంద
పారవశ్యము విష్ణుభక్తియంద
బాష్పనిర్గతి చక్రిపద్యసంస్తుతులంద
పక్షపాతము శార్ఙ్గిభక్తులంద
లేమి గోవిందాన్యలీలాచరణమంద
శ్రమము గోవిందపూజనములంద
తే. బంధ మచ్యుతేతరదుష్టపదములంద
జ్వరము మాధవవిరహితక్షణమునంద
మచ్చుగము లీశకైంకర్యమతములంద
నరవరోత్తమ వినుము తన్నాగరులకు.
క. దర్పించి చేసి పురము స
మర్పించెను విశ్వకర్మ మంగళగుణసం
తర్పితగహ్వరికిని గురు
దర్పితదుఃఖప్రవాహతరికిఁ హరికిన్.
ఇంక నీవిషయమునఁ బెంపునొందించి వ్రాయుటమాని మాని
కథాశేషమును వ్రాసెదను.

—మథురానగరవాసుల శ్రీహరి ద్వారకాపురికిం జేర్చుట.—

* ద్వారకానగర మీరీతి సత్యద్భుతముగా నిర్మింపఁ

---

* ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండము నూటనాల్గవయధ్యాయము నుండి సంగ్రహింపఁ బడినది. తక్కినపురాణములలో ముందువ్రాసిన యధ్యాయములయందే యీకథ గలదు.

బడియెను. భగవత్సంకల్పమునకుఁ బ్రతిబంధకము లుండవు కదా. క్షణమాత్రము సురాసురులు సాయపడి భగవత్సంకల్ప ప్రేరితులై యాకార్యమున సామాన్యముగాఁ ద్రిలోకాలం కారభూతముగా నెఱవేర్చి భగవత్కరుణకుం బాత్రులైరి. ఇట్టి నగరనిర్మాణము క్రొత్తది. భగవంతుఁ డందుఁ బ్రవేశింప నున్నవాఁడు. ఆనగరము త్రిలోకపావనము. సురాసురాది భూతగణములు కలిసి యీవఱ కేనగరము నింతవేగముగా నిర్మించినదియే లేదు. కావున నత్యద్భుతమహిమము గలదనుట కేశంక లుండవు. అట్టినగరమును జూడ వేడుకపడి సత్యలోకమునుండి శారదంగూడి చతురాననుఁడును, కైలాసమునుండి పార్వతీపరమేశ్వరులును, అనంతధర్ములును, హుతాశనుఁడును, కుబేరవరుణులును, యమపవమానులును, మహేంద్రుఁడు చంద్రుఁడు నేకాదశరుద్రులు ద్వాదశాదిత్యులును దిక్కులంగల దేవతలును వారలంగూడి దేవర్షులును వారిరాక నెఱింగి బ్రహ్మర్షులును వారితోడ రాజర్షులు వీరు వారననేల? ముల్లోకముల యందుఁగల యుత్తమచరిత్రులందఱు ద్వారకానగరసందర్శనార్థమరుదెంచిరి. ద్వారకానగరమున వెలయు శ్రీకృష్ణపరమాత్మను బలరాముని దర్శింప వేంచేసిరి. తొలుదొలుత వటమహీరుహమును దర్శించిరి. అదియే భగవంతునకు శాశ్వతస్థానము. పరమేశ్వరునకు నిర్వ్యాకపారదశయందు విశ్రాంతి నిచ్చున దావృక్షరాజమే. వృక్షరాజమనుపేరు దానికే చెల్లును. అందే ప్రళయకాలమున సర్వేశ్వరుఁ డంగుష్ఠమాత్రశరీరుఁడై సకల బ్రహ్మాండములు బీజరూపమునఁ దనయందిమిడి యభేదరూపమున నుండఁగా నిర్మలసాగరజలముల వటపత్రమున యోగ

నిద్రాపరాయణుండై సర్వేశ్వరుడు శయనించు. అనఁగాఁ బాలసముద్రమున శేషశాయియై యుండునని భావమని కొందఱందురు. యోగనిద్రాపరాయణత్వమునఁ బరుండునని దానిలో నొకరహస్యము గలదు. అత్తఱుణమున భగవంతునిరూపము వర్ణింపఁ దరముగానిది. శరీరధారియై యున్న వాఁడన్నచో నది మహాప్రళయమే కాదు. అత్తఱి సర్వేశ్వరునకు రూపమేలేదు. సర్వత్ర యంధకారము నిండియుండ జలమయమై సర్వప్రదేశములుండ నందు నల్పస్థలమున జ్యోతిస్స్వరూపుఁడై విరాట్పురుషుఁడు తనయిచ్ఛాశక్తి నిరావ్యయపారస్థితిం గాంచి తనయందభేదరూపమున నుండఁగా యోగనిద్రయనఁగాఁ దన్ను దా ధ్యానించుకార్యమున నిమగ్నుఁడై యుండునని సారము. లోకములన్నియుఁ దత్కుక్షి నున్నవనఁగా రూపనామక్రియాశూన్యములై తదిచ్ఛాచ్ఛాదితములై యవ్యక్తరూపము నున్నవని భావము. మరల నేయేజీవుఁ డేయేరూపమున నేయేకర్మముల నాచరింపఁదగునో యావిషయములం దెల్పుపట్టిక యెందున్న దనఁగా నది సర్వేశ్వరుని యిచ్ఛారూపమున నున్నది. దాని పద్ధతు లిట్టివని తెలుపుసూత్రము లెవ్వరికిని దెలియవు. ఒక్కయక్షరమైనఁ దప్పకుండ మరల సాగును. ఈపద్ధతు లెవ్వరికిని దెలియఁజాలవు. భగవంతునిపద్ధతు లిట్టివి. ఈయీకార్యముల నిట్లిట్లు చేయును. ఈకార్య మిన్నిగడియలకు సాగును. అని తెలిసినవా రుందురని యెవ్వరేనన్న వారికంటె మూర్ఖులు లేదనుటయే సమాధానము. వారియిచ్ఛయెట్టిదో ఏకార్య మేతరుణమున నెట్లు చేయఁబూనునో వేదాదులకే తెలియనపుడు మన కేమి తెలియఁగలదు? ఇంక నీచర్చను జాలింతును. ఇది యపా

రము. అమేయము. అపరిమితము. తుద కగమ్యము. కావున నించుకమచ్చునకు నాలుగుమాటలు వ్రాసితిని.

వటవృక్షమును బ్రహ్మాదిదేవవర్యులు కాంచి తన్మూలమున స్వాత్మారాముఁడై యుండు పరమేశ్వరుని వినుతించిరి. ఆకాశమునుండి విమానముల దింపిరి. ద్వారకానగరమును సందర్శించిరి. అది మిగుల మనోహరముగా నుండెను. దానిం జూడ నపుడున్న కన్నులు వారికిఁ జాలవు సకలరత్నములు రూపవంతములై యందు వెలసియున్న ట్లుండెను. నాల్గుప్రక్కలు సమములుగా నుండునట్లు నిర్మింపఁబడినందునఁ జతురశ్రపురమనఁ దగియుండెను. దానిచుట్టును బరిఖాసప్తకము గంభీరమై దుర్గమమై యొప్పుచుండెను. ప్రాకారనవకము కనుపట్టుచుండెను. క్రీడాసరోవరము లసంఖ్యలనఁ దగియుండెను. అందుఁ బుష్పించినకమలములు వాని నాశ్రయించి మధువ్రతములు వానిచెంతఁ దరంగగృహముల నుయ్యాలలూఁగు జలవిహంగమములు. నగరమునలుప్రక్కలఁ బుష్పోద్యానపంక్తులు సర్వర్తుకుసుమాఢ్యములై వెలయుచుండెను. వానినుండి సకలసురభికుసుమపరాగములఁ బొరలి పొరలి మందమలయానిలబాలకుఁడు నగరముపైఁ బొలయుచుండఁగా నా సుఖమేమని వర్ణింపవచ్చు? ఆవాతమున నగరమంతయుఁ బరిమళించుచున్న ట్లుండెను. వివిధమనోహరదర్శన కిసలయకుసుమసత్ఫలభరితభూరుహము లసంఖ్యలుగా నందుండెను. మందిరముల లెక్కింప శక్యమా? రత్నగృహములని పేర్కొనఁదగిన వెన్నియో యం దుండెను. తోరణద్వారకవాటములు లోనగునవి రత్ననిర్మితములే కాని దారునిర్మితములు గావు. ఇట్లు చేయఁ

దగునని విశ్వకర్మతో శ్రీకృష్ణుఁడే చెప్పియుండెను గదా. అట్టి నగరోత్తమమును దర్శించి కృతకృత్యాస్స్మః అని వారెల్లఁ గేలుమోడ్చిరి.

* అంత బలదేవుఁడు ధ్యానస్థితుఁడై లాంగలియు నను జుఁడు భగవంతుఁడు తానాట యాదవులనందఱ నుగ్రసేనుని స్మరించెను. దేవకీవసుదేవులను నందయశోదలను గోపాలకులను గోపికలను మునీంద్రులను రాజేంద్రులను గంధర్వులను గిన్నరులను రాఁ దగునని తలంచెను. బలరాముఁడు స్మరించినంతనే యోగమాయాప్రభావమున నందయశోదలు, దేవకీవసుదేవులు, కుంతింగూడి పాండవులు, గంధర్వకిన్నరవిద్యాధరులు, విద్యాధరీ కిన్నరీసమూహములు, నర్తకీగణమనంబడు నప్సరస్సమూహము, గాయకులు, వాద్యభాండకులు, భిక్షుకులు, భాండకులు, భట్టులు, జ్యోతిశ్శాస్త్రజ్ఞులు, నానాదేశపాలకులు, వైద్యులు, తక్కుంగల మానవశ్రేష్ఠులు, సన్న్యాసులు, అవధూతలు, యతులు, బ్రహ్మచారులు, మునులు లోనగువారెల్ల వచ్చి చేరిరి. మునులశిష్యులు వేలసంఖ్యలుగా నరుదెంచిరి. సనక సనందన సనత్కుమార సనాతనప్రముఖులు విచ్చేసిరి. అందు సనత్కుమారుఁడు దిగంబరుఁడు. జ్ఞానులలో జ్ఞాని. గురువులకు గురువు. పంచవర్షప్రాయుఁడు. ఆయనకడ బ్రహ్మజిజ్ఞాసువులగుశిష్యులు పెక్కండ్రు గలరు. దుర్వాసుఁడు పెక్కుమంది శిష్యులంగూడి తటాలున వచ్చెను. కశ్యపముని బ్రహ్మసాంతే

---

* ప్రసన్న వదనో దేవో లాంగలీ భగవానజః, సస్మార యదువంశానాం సమూహ ముగ్రసేనకమ్-అని మూలము.

వాసిగాఁడై సంతసమున వచ్చెను. వాల్మీకియు వేంచేసెను. గౌతమ బృహస్పతి శుక్ర భరద్వాజాంగిరోవసిష్ఠప్రచేతసులు శిష్యబృందములం గూడి యరుదెంచిరి. పులస్త్యాగస్త్య పులహ క్రతుమునులు, అత్రి భృగుమరీచి శతానందులు, ఋష్యశృంగుఁడు, విభాండకుఁడు, పాణిని కాత్యాయనులు, యాజ్ఞవల్క్యుఁడు, వ్యాసుఁడు, కులపురోహితుఁ డగుగర్గముని, గాలవుఁడు, సౌభరియు, లోమశుఁడు, మార్కండేయుఁడు, సాందీపని, దేవలుఁడు, పంచశిఖుఁడు లోనగువారెల్ల శిష్యప్రశిష్య సహితులై వచ్చిరి. పరశురాముఁడు వేడుకంజూడ వేంచేసెను. భీష్మాదులు దయచేసిరి. దుర్యోధనాదులు తద్బంధువులు వచ్చిరి.

ఇట్లు మహోత్సవదర్శనార్థ మరుదెంచినవారి నెల్లరం గాంచి భగవంతుఁ డానందపారవశ్యమున మోమొకవింత కాంతిఁజెలువార నందఱను ద్వారకానగర ప్రవేశోత్సవమునఁ బాల్గొనుఁడని యానతిచ్చెను. నాతండ్రి లోనగువారెల్లఁ బ్రవేశింతురు. తక్కుంగల యాదవులందఱు మధురానగరమునకుం బోవఁగలరు. అనవుడు నుగ్రసేనుఁడు భయాకులుఁడై యిట్లు పలికెను. వాసుదేవా! నేను మధురానగరమునకుఁ బోనొల్లను. సర్వతీర్థస్వరూపిణియై దైవపితృకర్మముల కర్హయగు నీపురి నెడఁబాయఁ జాలను. పవిత్రదేశమున నెవ్వఁడు పితరులకుఁ దర్పణాంజలి యిడునో యాజలాంజలి పితరులకుఁ దృప్తినొసంగును. అనిపలుకు నుగ్రసేను భావమెఱింగి శ్రీహరి యిట్లు పలికెను. ఆర్యా! ద్వారకానగరమునకన్నఁ దీర్థ ముత్తమము లేదు. సర్వతీర్థములకంటె నీపుర ముత్తమము. బహుపుణ్యప్రదము. దానిం బ్రవేశించినంతన మానవులకుఁ బునర్జన్మ

భయము లేదు. ద్వారకయందుఁ జేయుదానము దేవపితృపూజనములు తీర్థమునః జేయుపుణ్యములకంటె. జతుర్గుణితపుణ్యము నొసంగును. గంగాదులకంటె నత్యుత్తమము. బ్రహ్మాదులం గలిసి సర్వయాదవులు పరివేష్టించి రాఁగా మహార్షులు తోడు సూప రాజభవనమును బ్రవేశింపుము. అమరావతిని దేవేంద్రుని దిరస్కరింతువు గాక. సుధర్మాస్థానమున నివసింపుము. మాహేంద్రముహూర్తమరుదెంచెడిని. జంబూద్వీపమునఁ గల రాజులెల్లరు నీకుం గప్పమొసంగి సామంతరాజు లగుదురు. ధన సంపదలఁ గుబేరుఁడు నీచే జయింపఁబడుఁ గాక. తేజస్సున భాస్కరుఁడు, సంపదలచే నింద్రుఁడు, యుద్ధమున దేవతలు నీచే జయింపఁబడఁ గలరు. నీతపస్సు మునులతపస్సును మించఁగలదు. వ్రతము సఫలమగును.ఉగ్రసేనసమానుఁడగురాజు పుట్టియుండ లేదు. పుట్టబోఁడు. ఇపుడు లేఁడు. అనుప్రఖ్యాతిని గాంచఁ గలవు. నీసభయందు భగవంతుఁ డగుబలదేవుఁ డుండఁగలఁడు. ప్రపంచ మాతనిసహస్రశీర్షముల నిలిచియున్నయది. అట్టిభూభారము నీయొక్కశిరముపై నిపుడు నిలిచియున్నయది. బల దేవుఁ డనంతుఁ డనంబడు. ఆతనిబలము గుణములు ననంతములు కావున ననంతుఁ డనువే రామహాత్మునకుం గల్గెను. శంకరుఁడు గాక తక్కినరుద్రులు వసువష్టకము ద్వాదశాదిత్యులు దేవతాన్వితుఁ డగుమహేంద్రుఁడు నిన్ను జయింపఁజాలరనుట నిక్కము. అని శ్రీకృష్ణుఁడు పలుకగా విని యుగ్రసేనుఁడు సుప్రసన్నుఁడై ద్వారకామధ్యభాగమున నున్న స్వాలయమున కత్యుత్సాహమున నరిగెను. అందు సహస్రసంఖ్యాకులు ద్వారపాలకు లుండిరి. శూలాయుధహస్తులై వారు భయంకరాకార

ముల నలంకరించుండిరి. ఆలు పక్ష్యలు గడచిపోవంగా నందు నభ్యంతరగృహ ముండెను. అందు నవరత్నమంటపము లెన్నియో యుండెను. రథగజహయపదాతుల సంఖ్య యింతయని వచింపరానిదై యుండెను.

దానినడుమ రత్నసింహాసన మమర్పంబడి యుండెను. వస్త్రపరివేష్టితమై రత్నకాంతుల దిక్కుల వెలుంగం జేయుచు రత్నపీఠమనోహరమై తేజఃపుంజమై యసమానమై యలరారు చుండెను. ఉగ్రసేనుండు సర్వయాదవ సురాసురమునిగణములం గూడి పురముం బ్రవేశించి తోలుదొలుత శంఖనాదము మనోహరముగా వినిరియెను. దుందుభిధ్వనుల నాలకించెను. మునుల వేదమంత్రధ్వనుల శ్రోత్రపేయములుగా నొనరించెను. ఉగ్రసేనుండు మందిరమును బ్రవేశింపంగనే ద్వారకానగరమునకు యోగమాయ మధురాపురమునం గలవారినెల్లం దెచ్చి ద్వారకాపురమును జేర్చెను. అపుడు ద్వారక బృందారకపురమును మించియుండెను. బలదేవ వాసుదేవాదు లుగ్రసేను నిరంకమునం గడునలరి లేచి నిలిచిరి. తక్కుంగల దేవతలందఱు లేచి రాజును గౌరవించిరి. మునులయు దేవతలయు నాజ్ఞలందలందాల్చి కులగురువగు గర్గమునియానతిం దిలకించి సింహాసనమునం గూరుచుండెను. గర్గమునియుం దక్కుంగల మహామునులంగూడి సప్తతీర్థతోయములచే నుగ్రసేను నభిషేకించెను. వేదమంత్రధ్వను లంబరమును బ్రతిధ్వనింపం జేసినవి. వరుణుండా పట్టాభిషేకంబుతటి వహ్నిశుద్ధమగు వస్త్రయుగ్మము నొసంగెను. మహాబలుండగు బలదేవుం డాతరుణమునం బారిజాతకసుమమాలిక నొసంగెను. రత్నచ్ఛత్రమును గూడ నిచ్చెను.

బ్రహ్మ కమండలువును గటాక్షించెను. మహేశ్వరుఁడు శూల మును బార్వతి రత్నమాల్యమును మాలతీహారమును, దక్కుం గల దేవతలు మునులు రాజేంద్రులు సిద్ధపుంగవులు యథో చితపారితోషికముల నిచ్చి దీవించిరి. వసుదేవుఁడు శ్వేత చామరము ననుగ్రహించెను. అయ్యవి వాయువు శ్రీకృష్ణున కిచ్చియుండెను. నందుఁడు సురభి యనుపేరుగల కామధేనువు నిచ్చెను. యశోదయు దేవకియు నాతనికి రత్నహారముల నొసంగిరి. అక్రూరుఁడు ఛత్రము బట్టెను. ఆకార్యము నీకుఁదగునని శ్రీహరి యాజ్ఞాపించెను. శ్రీహరి రత్నదర్ప ణమును ధరించి యుగ్రసేను నెదుటనుండెను. భట్టు లుగ్ర సేనమహారాజును వినుతించిరి. బ్రాహ్మణు లాశీర్వదించిరి. దేవ తలు మునులు జయాశిషయముల నొసంగిరి. రాజాక్షణమున బ్రాహ్మణులకు భూరిదక్షిణల నొసంగెను. క్రమముగా వచ్చిన వారినెల్ల యథోచితముగా సత్కరింప వారెల్లఁ బరమానంద కందళితహృదయులై తమతమనివాసములకుం బోయిరి. శ్రీహ రినిదర్శించి మహర్షులు కృతార్థులమైతిమని తలంచుచుఁ దమయా శ్రమములకు నిష్క్రమింప నరిగిరి. మఱుదిన మాసుధర్మ యనుసభ భగవదాజ్ఞచే దేవలోకమునకుం గొనిపోవఁ బడియెను.

భక్తాగ్రగణ్యులారా! శ్రీభాగవతాదిగ్రంథములయం దీగాథ యించుకభేదముగాఁ గనుపట్టెడిని.

శ్లో. తత్ర యోగప్రభావేన నీత్వా సర్వజనం హరిః,
ప్రత్యాగత్యాథ రామేణ కృష్ణస్సచునుమంత్రితః.

అనిమాత్రమే శ్రీభాగవతమునఁ గలదు. ఉగ్రసేనపట్టాభిషేక మీవఱకే కంసవధానంతరము మధురానగరమున జరగెను.

మరల ద్వారకానగరప్రవేశకాలమున శుభకార్యము సాగిన ట్లుండుటంబట్టి శుభశకునమున కుదాహరణమగునని యిట వ్రాసితిని. మథురానగరవాస్తవ్యులనందఱ నొక్కక్షణకాలమునఁ దనయోగప్రభావమున ననఁగా యోగాభ్యాసప్రభావమున నందఱిం జేర్చెనని యర్థముచెప్పుట కేవలావివేకము. తన యోగమాయామాహాత్మ్యమున నని యర్థము చెప్పవలయును. యోగమాయయే యింతకుమున్ను గర్భసంకర్షణము భగవదాజ్ఞం జేసినది కదా. ఆమహామాయ యిపుడు మథురావాసులనందఱ క్షణకాలమునఁ జేర్చెననుటలో విచిత్రమేమాత్రము నాకుం గానరాదు. ఇన్నిలోకముల నిన్నిజంతువుల నిన్నితరుగుల్మలతాదుల నొక్కసారి క్షణకాలమున నిర్మించు మహాప్రకృతి కీజనులఁ దోడ్కొనిపోయి ద్వారకలో దింపుట విచిత్రమేమియు లేదు. భగవతిమహిమము నెఱుంగఁజాలని దుష్కర్ములకుఁ దెలియరాదన్నను జిత్రము లేదు.

"ప్రణంతుం స్తోతుం వా కథమకృతపుణ్యాః ప్రభవతి?"

అని శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారు తెలిపియే యున్నారు. మహామాయామహాత్వ మెట్టిదో యా జగజ్జననికిఁ బరమాత్మకుఁ గలసంబంధమెట్టిదో కనుఁగొననేఱనివారికిఁ బ్రపంచమునఁ దెలియఁదగిన దేదియో నే నారయఁజాలకున్నవాఁడను. అట్టి జగజ్జనయిత్రి కీకార్య మత్యల్పముగా నుండును. ఇందుఁ గలసారమేమనఁగా నాలకింపుఁడు. ఉగ్రసేనునకుఁ బట్టాభిషేకోత్సవము జరపి తాను జూచుచుండెననుటలోఁ గలభావమేమి? తాను సర్వసాక్షియని లోకులకుం దెల్పుటయే యనక తప్పదు. ఏకార్య మేరీతిగా సాగింపఁదగునో యాకార్యమా

రీతిగా సాగించినంగాని బాగుండదని యామహానుభావుం డెఱుం గును. భగవంతు నాశ్రయించినవారికి నే సహాయములేకున్నను సర్వకార్యములు సిద్ధించుననియు, నదిలేనివారి కెన్నిసహాయ సంపదలున్నను ఫలింపక చెడుననియు దీనినుండి మన మెఱుంగ వచ్చును. కంసున కెందఱో రాజులు బాసటలై యుండిరి. ఏమి లాభముకలిగినది? దిక్కులేనిచావు గల్గెను. ఏవిధమైన సహాయ ములేని యుగ్రసేనునకు భగవత్కరుణచే సర్వదిక్పాలకులసమ క్షమునం బూజ్యభంగిం బట్టాభిషేకోత్సవము సాగినది. ఇదియే పైంజెప్పినన్యాయమును సమర్థించును గదా. కాంబట్టి మాను షసహాయము భగవత్సహాయములేక ఫలింపదనియు దైవసహా యము మనుష్యసహాయములేక ఫలింపదనియు దీనిసారములు. ఇద్దాని నెఱుంగుటయే ప్రధానము. దీనినెఱింగి భగవంతుని నమ్మి యహంకరణమును మానిన నాపరాత్పరుండే యాతని రక్షించును. ఇంకం దరువాతికథను దెలిపెదను.

ఒకప్పు డుగ్రసేనుండు శ్రీకృష్ణునిం గాంచి మథుర పితృ ప్రభృతు లున్నతావు. దానియం దభిమాన మునుచుట న్యాయ్యము. అట్టితావున నొనరించిన పితృకర్మములు పితరు లకుం బ్రీతినిచ్చును. లేనిచోటం జేసినశ్రాద్ధములు నిష్ఫల ము లగు. యత్కించిత్ఫలముల నొసంగునన్న ననవచ్చును. పైతృకస్థలమునం జేసినవి సంపూర్ణఫలముల నొసంగం గలవు. పుత్రపౌత్రకళత్రములకంటెం బిత్రార్జితస్థల ముత్తమము. ప్రాణ ములకంటెం బ్రియతమము. పైతృకభూమి దుర్లభ మనవచ్చును. తల్లిదండ్రులకంటె నుత్తమమనవలయు. దైవపితృకర్మము లందుం జేయంబడునేని మిగుల ఫలించును. ఇతరస్థలముల నొనరించిన

దానాదు లింతటిఫలము నీఁజాలవు. ఎవఁడు పైతృకభూమిమరణించునో వాఁడు తీర్థరాజమున మృతినందిన ఫలమెట్టిది లభించునో అట్టిదాని నొందఁగలఁడు. పితృఖాతోదకము గంగాతుల్యము. అందు భక్తియుక్తుఁడై స్నానమొనరించిన గంగాస్నానపుణ్యము నొందఁగలఁడు. పితృతర్పణముచేసిన నక్షయఫలము గలుగు. పితరు లధ్ధాన సంతృప్తు లగుదురు. పైతృకభూమి జన్మభూమియే యైనచో ద్విగుణఫలము గలుగుననుట నిస్సంశయము. సత్పురుషులకు దాసభూమి పైతృకభూమితో సమానము. అని పలికి తన మనోభిప్రాయమును దెలుప హరి మథురాపురము పురాణప్రసిద్ధము గాన నందుండుట మేలుకదాయను నుగ్రసేనుని భావమెఱింగి మహారాజా! ఈనగరము సాక్షాత్కైవల్యమని నమ్ముము. ఇందున్న తీర్థములన్నియు గంగాతీర్థతుల్యములు. ఇందలి వృక్షము లన్నియు వృక్షరాజతుల్యములు. ఇందలిసరస్సులు మహాఫలప్రదములు. కావున సర్వవిధముల నీనగరము భూలోకసత్యలోక మనవలయునని పెక్కురీతుల సమాధానము చెప్పి హృష్టాత్మునిగా నొనరించెను.

మహామతులారా! ఈ సంభాషణమున నొక్కవిశేషము గలదు.

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ."

అన్నసూక్తి కీకథయే దృష్టాంత మనవచ్చును. తండ్రి తాతలున్న స్థలము మహాఫలప్రదము. ఏలయనఁగా నందుఁ దండ్రి తాత ముత్తాత లోనగువారు సకలకర్మముల నాచరించి యుందురు. అట్టికావున సాధారణముగా నెల్లర కభిమానము గల్గును. అందొనరించుకర్మములు సత్ఫలముల నొసంగు. ఏలన నందుఁగుదు

రు మనోదృఢత్వము వేఱొకతావునఁ గుదురుట దుర్లభము. దృఢభక్తికుదిరిన నంతకంటెఁ గావలసిన దేమున్నది? అది లేకున్న నే కర్మము లేమిచేసిన నేమిలాభము? కావున జన్మభూమి తల్లి వంటిదని పెద్దలు చెప్పిరి. పితృసమార్జితక్షేత్ర మత్యంతపరిశుద్ధము. దానిని మించినక్షేత్రము కాదు. అనఁగా నెందు మనస్సు పావనత గాంచునో యాస్థలముకంటె నుత్తమోత్తమము కానరాదనుట నిక్కము. కాఁబట్టియే మనపూర్వులు

"శ్లో. స్వస్థానవేషభాషాభిమతాస్సంతో నసప్రలుబ్ధధియః"

అని వక్కాణించిరి. స్వస్థానము, స్వభాష, స్వవేషము మూఁడు నివిముఖ్యములని మనపూర్వులభావము వీనిని వీడెఁబుచ్చిన మర్యాద కలుగదు. కావున స్వస్థానవేషభాషలయం దభిమానము నుపఁదగునని దీనిసారము. ఇఁక నరువాతి శ్రీకృష్ణచరిత్రము నాలకింపుఁడు.

## బలభద్రవివాహము.

* ద్వారకానగరనిర్మాణానంతరము మథురానగరవాసుల నందుఁజేర్చుటయుఁ గాలయవనునితోఁ బోరాడ శ్రీకృష్ణుఁ డొక్కరుండె నిరాయుధుఁడై యరుగుటయు వాఁడు మార్గానరాఁగాఁ బరుగిడి పర్వతకందరము సొచ్చుటయు నం దదృశ్యుఁ డగుటయుఁ గాలయవనుఁడు ముచుకుందుఁ డందు శయనించి యుండఁగా నతఁడే శ్రీహరియని కాలఁదన్నుటయు నతఁ డులికి లేచి చూచుఁడుఁ గాలయవనుఁడు మండిపోవుటయు లోనగు

* ఇయ్యది గర్గసంహిత ద్వారకాఖండము మూఁడవయధ్యాయము నుండియుఁ బ్రహ్మపురాణము తొంబదియవయధ్యాయమునుండియుఁ సంగ్రహింపఁబడినదని యెఱుంగఁదగు.

కథల నీవలకే పఠించితిరి కదా. తరువాత రాముఁడు సకలయాదవులకు సంతోషము గలిగించుచు శ్రీహరిం గూడి సుఖముగా నుండెను. కావున నామహాత్ముని వివాహమును వ్రాసి యావల శ్రీకృష్ణవివాహకథను వ్రాసెదను. సూర్యవంశసంభూతుఁడై మహాత్ముఁడను విఖ్యాతింగాంచిన యానర్తభూపాలుఁ డుండెను. సముద్రమున నూతనభూభాగము కల్పింపఁబడి యారాజుపేరనే యది యానర్తదేశమనం బరఁగెను. ఆ యానర్తునికుమారుఁడు రైవతుఁడు. అతఁడు చక్రవర్తి. ప్రఖ్యాతిగాంచిన సద్గుణాకరుఁడు. అతఁ డాదేశమునఁ గుశస్థలీపురమును నిర్మించుకొని యందుండి రాజ్యము చేయుచుండెను. ఆరైవతునకు నూర్వురు కుమారులు నొక్కకొమరితయుఁ గల్గిరి. ఆకొండికపేరు రేవతి. ఆకుమారికకుఁ దగినవరుఁడు కావలయునని తోఁచినపుడు తండ్రి సర్వోత్తముఁడై చిరంజీవియై సద్గుణాకరుఁడై యలరువానిం బరికించుచుండెను. ఆకన్యయుఁ దనకనురూపుఁ డగువరుఁడు కావలెననియే కోరుచుండెను. ఒకానొకపుడు దివ్యస్యందనము నెక్కి తనకుమారిక నందునెక్కించుకొని రైవతుఁడు భూసంచారము చేయుచుండెను. మహాతపశ్శాలి గావున నిచ్ఛపాడుమ బ్రహ్మలోకమునకు యోగబలమునఁ బోయెను. బ్రహ్మదేవునిం గాంచి యీయుత్తమగుణవతి కనుగుణుఁ డగుభర్త యెందుఁ గలఁడో యడుగవలయుననియే యారాజు సత్యలోకమునకుఁ బోయెను. కాని సందలరారు పరమేష్ఠిం గాంచి నమస్కరించెను. పరబ్రహ్మగుణముల వినుతించుచుఁ దనవాంఛ తెలుప సమయము నిరీక్షించు చుండెను. ఆరాజుమనస్సునఁ గల యాశయ మాత్మజ్ఞానమున నెఱింగి బ్రహ్మయు నేమో యడుగఁ

బూన నారాజచంద్రుఁ డిట్లు పలికెను * పరమేష్ఠీ! పురాణ పురుషుఁడవు. జగదంకురభూమివి. పరిపూర్ణుఁడవు. పరమేశ్వరుఁడవు. పారమేష్ఠ్యధామమున నున్నవాఁడవు. సృష్టిపాలనసంహారములు నీయధీనములే. నీకు వేదములు ముఖము. ధర్మము హృదయము. అధర్మము పృష్ఠము. జ్ఞానము బుద్ధి వేదాంగము లంగములు. సమస్తము నీదేహమయముగా నున్నయది. కరతలామలకముగా విశ్వమును నిర్మించుచున్నాఁడవు. ఏప్రాణి నెందైనను సారథి రథికునిం గొనిపోవునట్లు తీసికొనిపోవ నేర్తువు. అద్వితీయుఁడ వగునీవే సర్వకార్యములను జేయుచున్నాఁడవు. నీవు సర్వలోకపితామహుఁడవు. ఇట్టినిన్ను సందర్శించితిని. కృతకృత్యుఁడ నైతిని. సకలబ్రహ్మాండముల నొక్కపర్యాయము చూడఁగలవు. కావున నాయీకుమారిక కను రూపుఁ డగువరుని దెల్పుము.

అని రైవతుఁడు ప్రశ్నింప సర్వదర్శనుఁడగు నాపరమేష్ఠి చిఱునవ్వునఁ దనయుల్లాసమును దెల్పుచు నిట్లు పలికెను. రాజా! నీవిందున్న యీక్షణమునకే ప్రపంచమునఁ బెక్కుయుగములు గతించినవి. ఇపుడు మర్త్యలోకమున నీకొడుకులు వారి పుత్త్రులు బంధువులు లేరు. వారు లేకుండుటే కాదు. వారివంశము లున్నట్లు కనఁబడదు. కావున నీయుత్తమకన్యారత్నమును గొనిచని మహాత్ముఁడై పురాణపురుషుఁడై సకలగుణరత్నాకరుఁడునగు బలదేవున కొసంగి కృతకృత్యుఁడవు గమ్ము. ఇపుడు భూలోకమున గోలోకనాయకు లిరువురుగాఁ బ్రకాశించుచున్న

---

* స్థితస్సదా ధామని పారమేష్ఠ్యే సృజస్యలంపాసి చ హింససిదమ్॥ అని మూలము.

వారు. వారు పరిపూర్ణులు. శాశ్వతులు. పురాణపురుషులు. భూభారహరణార్థ మవతరించిరి. బలదేవుఁడని శ్రీకృష్ణుఁడని వారిపేరులు. అసంఖ్య బ్రహ్మాండనాయకులు. వసుదేవుతనయు లనఁబడుచున్నవారు. భక్తవత్సలులగు వారిద్దఱు ద్వారకానగరమున నిపుడుండి బంధువులఁ బ్రమోదపరవశులం జేయుచు భక్తుల నుద్ధరించుచు మునులకు ముక్తి నొసంగుచు నరాతులఁ ద్రుంచుచు ధర్మము నుద్ధరించుచు నధర్మము నిర్మూలించుచు నున్నవారు. అని నలువ పలుకఁగావిని రైవతుఁ డచ్చెరువందుచు సముద్రాంతర్భాగమునఁ ద్రిలోకసుందరముగా నలరు ద్వారకానగరమున కేతెంచెను. అవి సకల సంపత్సమృద్ధము. అద్దాని దర్శించి యందు వేంచేసియున్న పరాత్పరుని బలదేవునిం గాంచి బ్రహ్మశాసనమున నరుదెంచితినని విన్నవించి కన్యక నొసంగి పరిగ్రహింపుమా యని ప్రార్థించి. బ్రహ్మదత్తము లగురత్నములఁ గానుకపెట్టెను. అత్తరుణమున ద్వారకానగరమున మహోత్సవము సాగెను. సంకర్షణుఁ డాకన్యారత్నమును గ్రహించి పరమానందభరితుఁ డయ్యెను. బలదేవవివాహ కథ యిది పరమపవిత్రము. దీనింబఠించిన సకలపాపములు తొలంగును.

మహానుభావులారా! ఈకథయందున్న విశేషాంశముల నించుక యాలకింపుఁడు. రైవతుఁడు త్రిలోకసుందరియగు తన కొమరితం గాంచి యనురూపవరుం దేఁ జింతించెను.

"కన్యాపితృత్వం దుఃఖాయ."

అను శ్రీరామాయణోక్తి యందఱ కెఱుకపడనిది కాదు కదా. ఈడువచ్చినకన్యకను దగిన వరున కొసంగి తనకృత్యము నిర్వ

హించితినన్న యానందమును గాంచుట తండ్రికి స్వభావమే గాని విచిత్రము కాదు. యోగము నభ్యసించినవాఁడు కావున వియద్గమన మారాజేంద్రునకు దుర్గమము కాదు కావున బ్రహ్మలోకమున కేగెను. ఇది శక్యమాయని కొంద ఱూహింప వచ్చు. ప్రశ్నింపను వచ్చును. అట్టివారికి యోగాభ్యాస మన నెట్టిదో తన్మహిమ మెంతయద్భుతావహమో తెలియదు. వారు బహిరంగముగా యోగమునుగుఱించి యుపన్యసించి మెప్పును బొందు నీకాలపుఁ గపటయోగుల మాటలుమాత్రమే విన్న వారౌట నిట్టిశంకలు వారికిం గల్గినవి. అంతియగాని యభ్యాస పరులసహవాసము వారికి నుండదు. ఆకాశగమనము యోగు లకు సులభమే కాని దుర్లభము కాదు. యోగుల మనిపించు కొను డాంబికులకు ధూమశకటమార్గమే యోగఫలము కాని యోగుల కంతగ్రహచారము పట్టదు. సర్వశక్తులు యోగుల కలవడును. ఆశంకల కవకాశ మీయకుఁడు. బ్రహ్మలోకమున కరిగి శతానందుని దర్శించి తనవాంఛితమును దెలుప నా మహాత్ముఁ డాలోచించి బలదేవునకిమ్మని యాజ్ఞాపించె. అంతియ గాక నీవిటనున్న యీముహూర్తకాలమున భూలోకమునఁ గొన్నియుగములు గడిచినవి. కావున నీకుమారులు లోనగువా రిపుడు లేరనియు నాదేశించెను. యదువంశమున సోదరులుగా నిరువురు గలరు. అందు నగ్రజుం డగురామున కిమ్మనియెను. బ్రహ్మయానతి శిరమునఁ దాల్చి భూలోకమున కవతరించి ద్వారకానగరమున వేంచేసియున్న యప్పరమేశ్వరునకు రాము నకు నొసంగి తాఁ దపస్సునకుం బోయెను. ఇం దొక్కసంశయము గలదు. రేవతికి వయస్సెంత? బలరామునకు వయస్సెంత? బ్రహ్మ

మర్త్యలోకమునఁ గొన్నియుగములు గడచినవనియేఁ గదా. అంతకాల మామెకు ముదిమి రాకుండుటకు బ్రహ్మాయాశిషములే కారణ మనవచ్చును. కాని తనకంటె నెన్నియోవేలయంతలు పెద్దదియగు నాముద్దియను రాముఁ డెట్లు తనకుద్దియని యంగీకరించెను? ఇది శాస్త్రసిద్ధమగు వివాహమా. ఆకాలమున నిప్పటినియమములే లేవా. ఏమిసమాధానమని ప్రశ్నింపఁగలరు.

శ్లో. అవిప్లుత బ్రహ్మచర్యో లక్షణ్యాం స్త్రియముద్వహేత్,
అనన్యపూర్వికాం కాంతామసపిండాం యవీయసీమ్. ౫౨
అరోగిణీం భ్రాతృమతీ మసమానార్ష గోత్రజామ్

యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాండము.

యవీయసీమ్. వయసా ప్రమాణతశ్చ న్యూనా ముద్వహేత్. పరిణయే త్స్వగృహ్యోక్తవిధినా. అని విజ్ఞానేశ్వరకృతమితాక్షరవ్యాఖ్యా.

శ్లో. నోద్వహే త్కపిలాం కన్యాం నాధికాంగీం న రోగిణీమ్,
నాలోమికాం నాతిలోమాం న వాచాటాం న పింగలామ్.

మనుస్మృతి. 3 అధ్యా.

నాధికాంగీమ్ = అనుటచే వయస్సుచేతను ప్రమాణముచేతను దనకంటెఁ బెద్దదగుకన్యకను బెండ్లియాడరాదని భావము.

ఇట్లు స్మృతులు ఘోషించుచుండఁగా ధర్మసంస్థాపనార్థ మవతరించిన రాముఁడు శాస్త్రవిరుద్ధముగా నొకముదుసలిస్త్రీని వివాహమాడుట న్యాయమా యని ప్రశ్నింపరాదు. ఓపికమై నాలకింపుఁడు. మనుజులయాయు స్సత్యల్పము. వీనికొంటకే

స్మృతులేర్పడినవి. వనితలకు వయస్సు త్వరగా నశించును. పురుషుల కట్లుగాదు. ఆకారణముననే వరునకన్నఁ గన్యక యల్ప వయస్సుగలదిగా నుండవలయునన్న నియమ మేర్పడినది. పెక్కునియమములేర్పఱచి మానవుల యాయుస్సునుగాపాడ మహర్షులు ప్రయత్నించిరి. వివాహనియమముల నేర్పఱచిరి. ఋతుకాలనియమములం బాటింపుఁడని శాసించిరి. ఋతుకాలనియమముల నుల్లంఘించిన మహాపాతకమని శాసించిరి. వారి వమృతవాక్కులు గావున నట్లే జరగును. అనఁగా మానవుఁడు బ్రహ్మచర్యమున నెక్కుడు కాలము గడపవలయునన్న భావముననే యిన్ని విధులు. ఆనియమమున నెంతకాలముండిన నంతయాయుస్సు వృద్ధియగు. లేకున్న నశించు. గృహస్థులకుం గూడ భార్యాభిగమననియమములు పెక్కులుగలవు. వానింబాటింపక మానవయతి గాదు. దానఁ గీడుమూడుట నియతము.

శ్లో. ఋతు స్స్వాభావిక స్త్రీణాం రాత్రయ ష్షోడశస్మృతాః,
చతుర్భిరితరై స్సార్ధమహోభిస్సద్విగర్హితైః. ४६
తాసామాద్యాశ్చతస్రస్తు నిందితైకాదశీచ యా,
త్రయోదశీ చ శేషాస్తు ప్రశస్తా దశరాత్రయః. ४७
యుగ్మాసు పుత్రా జాయంతే స్త్రియోఽయుగ్మాసు రాత్రిషు,
తస్మా ద్యుగ్మాసు పుత్రార్థీ సంవిశేదార్తవే స్త్రియమ్. ४८
నింద్యాస్వష్టాసు చాన్యాసు స్త్రియో రాత్రిషు వర్జయన్,
బ్రహ్మచార్యేవ భవతి యత్రతత్రాశ్రమే వసన్. ५०

మనుస్మృతి. 3 అధ్యాయము.

నింద్యాసు పూర్వోక్తాసు షట్సు రాత్రిషు అన్యాసు చ నింద్యా

స్వపి యాసుకాసుచిదిష్టాసు స్త్రియో వర్జయన్ ద్వే రాత్రీ అవ శిష్టే పర్వవర్జితే వ్రజన్ అఖండబ్రహ్మచార్యేవ భవతి = అని కుల్లూకభట్టు.

చూచితిరా. రజోదర్శనాదిగాఁ బదాఱుదినములు మాత్రమే ఋతుకాల మనఁబడును. అందుఁ దొలినాలుగుదినములు వర్జ్యములు. పదునొకండవదిన మట్టిదియే. పదుమూఁడవదియు నిషిద్ధదినమే.తక్కినవి పదిరాత్రులు. వానియందే కలయిక పనికి వచ్చును. అందును సరి బేసి యనునియమము గలదు. పుత్రార్థి యగువాఁడు బేసిరాత్రులయందే భార్య ననుగమింపఁదగు. పుత్రికార్థియగువాఁడు సరిసంఖ్య యగు రాత్రులయందే యనుగమింపవచ్చు. కాఁగా మాసమున నైదుదినములే మిగిలినవి. అందు సంక్రాంత్యమాపూర్ణిమాష్టమీప్రభృతి నిషిద్ధతిథులు పనికిరావు. కావునఁ బురుషునకు స్వేచ్ఛ యెక్కడిది? ఈ నియమము లేల? బ్రహ్మచర్యమును గాపాడుటకొఱకే. కాముకున కాయుస్సు నశించును. ఏసంకల్పములు ఫలింపవు. ఫలించిన నవి యత్యల్పఫలప్రదములగు. కాఁబట్టియే భగవద్గీతాశాస్త్రము నందు నిట్లు చెప్పఁబడినది.

శ్లో. యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః,
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః.

౪ అ. ౧౯.

కామసంకల్పవర్జితాః కామై స్తత్కారణైస్సంకల్పైశ్చ వర్జితాః. ముధైవ చేష్టామాత్రా అనుష్ఠీయంతే. అని శంకరభాష్యము. కామపూర్వకసంకల్పము లనఁగాఁ గామము సిద్ధించుటకుగాఁ జేయుసంకల్పములు నిష్ఫలములు, దుష్ఫలములు. కావున

వానిని వదలవలయునని భావము. వీనినన్నింటిని బరిశీలించిన వివాహము దేవపితృకార్యనిర్వహణమునకనియు నతిథిపూజాదులకనియు నందు నుచితరీతిఁ గామేచ్ఛమైఁ బ్రవర్తించి పుత్త్రులం బడయందగుననియు మనుస్మృతిభావమనుట స్పష్టము కదా. మఱియు,

శ్లో. లోకానంత్యం దివః ప్రాప్తిః పుత్రపౌత్రప్రపౌత్రకైః,
యస్మాత్తస్మాత్ స్త్రియస్సేవ్యాః కర్తవ్యాశ్చ సురక్షితాః.
షోడశర్తునిశాస్స్త్రీణాం తస్మిన్ యుగ్మాసు సంవిశేత్,
బ్రహ్మచార్యేవ పర్వాణ్యాద్యాశ్చతస్రస్తు వర్జయేత్.
ఏవం గచ్ఛన్ స్త్రియం క్షామాం
మఘాం మూలం చ వర్జయేత్,
సుస్థ ఇందౌ సకృత్పుత్రం
లక్షణ్యం జనయేత్పుమాన్.

యాజ్ఞవల్క్యస్మృతి.

సకృ దేకస్యాం రాత్రౌ నద్విస్త్రిర్వా. తతో లక్షణైర్యుక్తం పుత్రం జనయతి పుమాన్ అప్రతిహతపుంస్త్వః=అని మితాక్షరావ్యాఖ్య.

అనఁగా భార్య ననుగమింపఁదగిన నైదురాత్రులయందు నొకరాత్రియందే యని నిర్దేశించుటయం దెంత యుదారార్థము కలదో యోజింపుఁడు. ఐదురాత్రులయందు విధికలదని దానిఁ బాటింపరాదు. సత్పుత్త్రుని జనియింపఁ జేయఁజాలఁడు కావున బ్రహ్మచర్యనియమమునుండి విధి తప్పక ప్రవర్తింపవలయునని స్మృతి హెచ్చరించుచున్నది. లోకమున స్త్రీజన మధి

కము కాఁగూడదని దీని యంతరార్థము. స్త్రీజనము వృద్ధిఁబొ నచోఁ బాప మధికమగునని సారము. ఈ యభిప్రాయము పూర్వుల కనుభవమునఁ గలదు కనుకనే,

శ్లో. అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః. ౪౧
సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ,
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః. ౪౨
దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః,
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. ౪౩
ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన,
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ. ౪౪
అహోబత! మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్,
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః. ౪౫

భగవద్గీత. ౧ అధ్యా.

అని యర్జునుఁడు భీతిల్లెను. స్త్రీలు పతివ్రతలు కారేని వర్ణసంకరమగునని కదా దీనిభావము. ఈవిషయమునే,

శ్లో. లోకానంత్యం దివః ప్రాప్తిః అనుయాజ్ఞవల్క్య స్మృతి బలపఱచుచున్నది. ఏలయనఁగా వర్ణాచారము లన్నియు స్త్రీలయధీనమున నున్నవి. వృక్షమునకు మూలము లెట్లు ముఖ్యములో ఆచారముల కట్లు స్త్రీలు ముఖ్యులు. వర్ణాశ్రమాచారధర్మములు వారినుండియే వర్ధిల్లవలయును. ఏకాలమునఁ బాపము వృద్ధియగునో ఆకాలమున స్త్రీలమనోవృత్తులు

మాఱిన వనుకొనక తప్పదని భగవద్గీత సెూచ్చరించుచున్నది దీని కుపబలమును,

శ్లో. యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః,
యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః.
శోచంతి జామయో యత్ర వినశ్యత్యాశు తత్కులమ్,
న శోచంతి తు యత్రైతా వర్ధతే తద్ధి సర్వదా. ౫౭
జామయో యాని గేహాని శపంత్యప్రతిపూజితాః,
తాని కృత్యా హతానీవ వినశ్యంతి సమంతతః. ౫౮
తస్మాదేతాస్సదా పూజ్యా భూషణాచ్ఛాదనాశనైః,
భూతికామైర్నరైర్నిత్యం సత్కారేషూత్సవేషు చ. ౫౯
సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవచ,
యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువమ్. ౬౦

అని మనుస్మృతి మూఁడవయధ్యాయము గలిగించుచున్నయది. బ్రహ్మచర్యము ప్రధాన మని చెప్పుట కింత వ్రాయవలసి వచ్చినది. స్త్రీలమూలమునఁ గులాచారములు నిలుచునను టకు నింత వ్రాయవలసి వచ్చినది.

ఆర్యులారా! ఈ నియమము లన్నియు మానవులకుఁ గాని దేవతలకుఁ గావు. వయస్సునఁ జిన్నది యగుకన్యను వరింపవలయు నన్ననియమము బలదేవునకుఁ బనికిరాదు. రామకృష్ణులు సామాన్యమానవు లన్నభావము గలవారల కిది తప్పుగనే తోఁచును. వారికి జన్మమరణములు లేవు. లోకదృష్టికి జన్మమరణము లున్నయట్లగపడునుగాని దివ్యదృష్టిఁ బరిశీలింప వారికి జననమరణములు లేవు. వారికంటె వయస్సునఁ బెద్దయనఁ

దగు స్త్రీ యెందు నుండదు. కాఁబట్టి యిట్టిశంకలకు మనస్సున
నవకాశమీయక చక్కనిమార్గమునఁ దదారాధనతత్పరు లగు
టయే తరణోపాయము. ఇంక నీవిషయమున నింతకంటె బెంచి
వ్రాయ. నుతర్వాతి భగవత్కథను వినుపింతును. శ్రద్ధాభక్తుల
నాలకింపుఁడు. దానికి ముందు భగవద్దివ్యనామపారాయణమును
జేయుఁడు.

శ్లో. స్తోకస్తోకనిరుధ్యమానమృదులప్రస్యందిమందస్మితం
ప్రేమోద్భేదనిరర్గళప్రసృమరప్రవ్యక్తరోమోద్గమమ్,
శ్రోతృశ్రోత్రమనోహరవ్రజవధూలీలామిథోజల్పితం
మిథ్యాస్వాప ముపాస్మహే భగవతః క్రీడానిమీలద్దృశః.

శ్లో. పర్యాచితామృతరసాని పదార్థభంగి
వల్గూని వల్గితవిశాలవిలోచనాని,
బాల్యాధికాని మదపల్లవభావితాని
భావే లుఠంతి సుదృశాం తవ జల్పితాని. 33

శ్రీకృష్ణకర్ణామృతము. ౧ ఆశ్వాసము.

మహామనీషులారా! గోకులమును వదలి శ్రీకృష్ణమూర్తి మధురాపురమున కరిగి యచ్చట భూభారహరణమునకై యవతరించిన తనకృత్యము నించుక నిర్వహించెను. అందుండియే జరాసంధాదులఁ దూలించెను. కాలయవనుం బోడవడంగఁజేసెను. యోగమాయాప్రభావమును గనఁబఱచుటపొంటె మధురానగరవాసులనెల్ల ద్వారకాపురికిం జేర్చెను. కాలయవనునివలన బాధ పడుదురని ద్వారకకుం జేర్చెనని కొందఱందురు. అది మిగులఁ బొరపాటు. నిరాయుధుఁడై కాలయవనుఁ బరిమార్చిన మహాత్మునకు మధురావాసులఁ గాపాడుట కష్టమని

చెప్పుటకంటె నవివేకము వేఱొకటి లేదు. ద్వారకానగరమున నుండి యనేకసుఖముల ననుభవించి యందే మృతినొందఁదగిన జీవులు పెక్కండ్రు గలరు. వారెల్లఁ బ్రభాసతీర్థముకడ నొక్క సారిగా మృతినొందఁ దగువారు కావుననే సర్వజ్ఞుఁడు గావున శ్రీహరి ముందు జరగఁబోవు నాటకమునకు రంగస్థలముగా ద్వారకను నిర్మించెను. ఏయేజీవులు యాదవవీరులచేఁ బ్రభాస తీర్థముదాపున నిర్నిమిత్తముగా మృతినొందఁ దగుదురో వారెల్ల ద్వారకకుఁ జేర్పఁబడిరి. అంతియగాని దూరమాలో చింపక కాలయవనునిబారిఁ బడకుండఁ దప్పింపఁజాలక కాదని యెఱుంగుట బుద్ధిమల్లక్షణము. ఇంతదనుక భగవంతుఁడు బ్రహ్మచర్యవ్రతమును ననుష్ఠింపఁ దగుధర్మముల నడపెను. ఇఁక గృహస్థాశ్రమమును స్వీకరించినట్లు నటింపవలయును. తన కొఱకై కాచియున్న నారీమణులను వివాహము చేసికొని వారివలనఁ బడయఁదగిన కుమారులం బడసి వారిచేఁ జేయింపఁ దగుకార్యములఁ జేయించి లోకరక్షణకృత్యమున మేటియను విఖ్యాతిం గాంచి భూభారమును హరింపఁ దలంపుగొనియెను. అందుఁ దొలుత బలరాముని వివాహవృత్తాంతమును వింటిరి కదా. ఇఁక శ్రీకృష్ణునివివాహవృత్తాంతము నాలకింపుఁడు.

శ్రీకృష్ణపరమాత్మకు హృదయేశ్వరి రాధయని యీవఱకే పెక్కుతావుల వ్రాసితిని. చిన్నతనమునందే వారిద్దఱకు వివాహము సాగెను గదా. శాపకారణమునఁ బరస్పరవియోగము కొన్నిసంవత్సరములు సాగవలయును! అందులకే వేఱుగా నున్నవారు. ప్రతినిశయందు దర్శన మిత్తునని శ్రీకృష్ణపరమాత్మ గోకులమునుండి మథురానగరమున కరుగుతరుణ

మున మాటయిచ్చినవృత్తాంతమును స్మరింపుఁడు. ఆశాపమును బాటింపవలయును. గనుకనే యిపుడు మనుష్యకాంతల వివాహము చేసికొనఁదలఁచెను. ఆపత్నులయందు రుక్మిణీకన్య యగ్రపత్ని. ఆవృత్తాంతమే మీ రెఱుంగఁదగును. రుక్మిణియే లక్ష్మియని రాధ పత్నియే గాదని ఒకానొకగోపిక యని కొందఱు పలుకుదురు. కాని వారియజ్ఞానమునకుఁ బరిమితియే లేదు. వారింకను గృష్ణమహిమము నెఱుంగఁజాలుపుణ్యమును జేయవలయునని నాయాశయము. శ్రీభాగవతమున రాధప్రస్తావమే లేదు. కావున రాధ పత్నిగాదు. అని వాదించువారు కొందఱు గలరు. వారియోగ్యత భూనభోంతరములు నిండిన దనవచ్చును. మొదట భాగవతమున గోలోకవృత్తాంతము కలదా. ఆసన్నమృత్యు వగుపరీక్షిత్తునకు భగవత్కథలను గొన్నింటిని దెలిపి ముక్తికిం బోవునట్లు చేయఁదలంచు శుక యోగికి శ్రీకృష్ణచరిత్రమునంతయుఁ జెప్పునవకాశ మెక్కడిది? రాధాచరిత్రము నారంభించిన నేడుదినములు చాలునా? కావున నాపనికిం బూనక భక్తి కనుకూలములగు నాలుగుకథలను జెప్పెను. అట్టికావున రాధప్రస్తావము లేకపోయినచో బాధయేమి? రాధామహిమమును దెలుపుటకై ప్రత్యేకముగా నొకపురాణము కలదు. అదియే బ్రహ్మవైవర్తము. బ్రహ్మవైవర్తము నారదము పద్మపురాణము దేవీభాగవతము లోనగు మహాపురాణములు గర్గసంహితయు నాగమశాస్త్రము రాధామహిమమును వేనోళ్లఁ గొనియాడుచుండును. శ్రీభాగవతమునం దట్టిమహిమము రుక్మిణివిషయమునఁ జెప్పఁబడినదా? ఇపు డాగొడవ యేటికిఁగాని రుక్మిణీవివాహఘట్టమున భాగవత

మున నేయేరహస్యములు గలవో వెదఁజల్లెదను. అత్తటి రాధా మహిమము నించుక వ్రాసెదను. ఈరెండింటికిం గలతార తమ్యములఁ బరీక్షింపుఁడు. నిష్పక్షపాతబుద్ధిఁ బరికింపుఁడు. తత్త్వ మెఱుంగనగు. కేవల నామధారులమాటలకు లొంగకుఁడు. వారు కుటుంబభరులు. దేవతాచోరులు. వారిపేరు నమ్ముకొని బ్రదుకువారు. కావున వారివాదమును విశ్వసింపకుఁడు భగవంతుఁడొసంగినబుద్ధి యందఱకుం గలదు. దాని నించుక యుపయోగింపుఁడు. విషయము తెల్లమగును.

ఆర్యమహాశయులారా! నే నిపుడు రాధయెక్కువయనియు రుక్మిణి తక్కువయనియు వ్రాయఁబూనినవాఁడను గాను. విష్ణుపత్నులందఱు మహాలక్ష్మీరూపముల ధరించువారే యని నావిశ్వాసము. కావున రుక్మిణి యుపాఖ్యానము వ్రాయునపుడు పక్షపాత మూనవలసినయవసరము నాకు లేదు. వాదమునకై నాలుగుమాటలు వ్రాయుదును. రాధాదేవియం దెంతభక్తి నాకుం గలదో రుక్మిణియం దంతభక్తియే కలదు. దుర్వాదనిరాకరణార్థమై వ్రాయుదునే గాని పక్షపాతబుద్ధిచేఁ గాదని త్రికరణశుద్ధిగా నమ్ముఁడు. ఇఁకఁ గథ వినుఁడు. ఈకథ యన్నిపురాణములయందుఁ గలదు. రుక్మిణీచరిత్రము గొంత శ్రీకృష్ణజన్మఖండమునఁ గలదు. అది యితరపురాణముల యంతగా వర్ణింపఁబడలేదు. కావునఁ దొలుదొలుత దానిని వ్రాసెదను. తరువాతికథయగు స్వయంవరవృత్తాంతము నన్నింటిని బరికించి వ్రాసెదను.

## శ్రీరుక్మిణీకల్యాణ కథ.

* విదర్భదేశమున మహాబలపరాక్రమధనుఁడగు భీష్మకుఁ డను రాజేంద్రుఁడు గలఁడు. పుణ్యాత్ముఁడని సత్యశీలుఁడని నారాయణాంశసంభూతుఁడని మహాదాతయని యాభీష్మకు నెల్లవారును వినుతింతురు. ధర్మవేత్తయై సద్గుణవరిష్ఠుఁడై సర్వజనపూజితుఁడై యతఁడు రాజ్య మేలుచుండును. ఆ రాజచంద్రునకు రుక్మిణి యనుకొమరిత గలదు. ఈకన్యకయే కొండిక. అయిదుగురు కొడుకులుగలరు. అందఱిలో రుక్మి పెద్దవాఁడు. రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మమాలి నామకులు వరుసగా నాతనియనుజులు. రుక్మిణి యందఱకుం గడపట జన్మించిన సోదరి. ఆమెసౌందర్య మసమానము. రామామణి యన వలయునే కాని వేఱొకకందు గలదని చెప్ప శక్యమే కాదు. క్రమక్రమముగా బాల్యముజాఱి యాచోట యౌవనము ప్రవేశించి తాండవమాడసాగెను. రత్నాభరణభూషితయై యుండును గాని భూషణముల కామె యవయవములు భూషణములుగా నుండెను. ఆమెదేహచ్ఛాయ బంగారమునకు వన్నె దెచ్చుచుండెను. మహాలక్ష్మియే యామె యనవచ్చును. తేజస్సీరూపమును ధరించెనా యని యనుమానింపఁ దగియుండును. శుద్ధసత్త్వస్వరూపిణి యని వినుతింతురు. సత్యరూపశీల మామె కుగ్గుతోఁ బెట్టినది. ఓర్పు, అంతరింద్రియనిగ్రహము లోనగు మహాసుగుణము లామెయందుఁ గనుపట్టు. ఇంద్రాణిని వరుణ

---

* ఇది శ్రీకృష్ణజన్మఖండము నూటమైదవయధ్యాయమునుండి పరిగ్రహింపఁబడినది. భాగవతాదులనుండి యీకథ కనుబంధముగాఁ గైకొనఁబడునని యెఱుంగందగు.

పత్నిని గుబేరనారీమణిని సూర్యకళత్రమును రోహిణిని మఱి యు లోకమున విఖ్యాతినొందిన నారీరత్నముల నీమెసౌంద ర్యము తృణముగా భావించుచుండును. ఇంతయేల? త్రిలోక ములఁ గల యందగత్తియ లీరుక్మిణీసౌందర్యమునఁ బదాఱవ పాలునకు సాటి రా రనవచ్చును. చంద్రకళవలె నాకన్యక దిన దినప్రవర్ధమాన యగుచుండెను. ఇప్పట్టున శ్రీభాగవతము నందు

రుక్మిణ్యేషాం స్వసా సతీ. ౨౨

సోపశ్రుత్య ముకుందస్య రూపవీర్యగుణశ్రియః.

అని మాత్రమే కనుపట్టెడిని. రుక్మిణి బాల్యవయస్సులను వర్ణిం చు శ్లోకపాదమైనను భాగవతమునఁ గనుపట్టదు. కాని మహాకవి పోతన యితరపురాణములఁ బరికించి కాఁబోలు పద్యరత్నముల వ్రాసెను. వాని నిట వ్రాయకపోరాదు.

సీ. పేర్వేరబొమ్మల పెండ్లిండ్లు చేయుచు
        నబలలతోడ వీయంబులందు
    గుజ్జనగూళ్లను గొమరొప్ప నండించి
        చెలులకుఁ బెట్టించుఁ జెలువు మెఱసి
    రమణీయమందిరారామదేశంబులఁ
        బువ్వుఁదీఁగెలకును బ్రోదిపెట్టు
    సదమలమణిమయసౌధభాగంబుల
        లీలతో భర్మడోలికలనూఁగు
    తే. బాలికలతోడఁ జెలరేఁగి బంతులాడు
        శారికాకీరపంక్తికిఁ జదువుచెప్పు

బర్హిసంఘములకు మురిపములు గఱపు
మదమరాళంబులకుఁ జూపు మందగతులు.

అని బాల్యమును దెలిపి యంత నిలువక మహాకవి,

సీ. దేవకీసుతుకోర్కి తీఁగెలువీడంగ
వెలఁదికి వ్రైదీఁగె వీడఁదొడఁగెఁ
గమలనాభునిచిత్తకమలంబు వికసింపఁ
గాంతి నింతికి ముఖకమల మొప్పె
మధువిరోధికి లోన మదనాగ్ని పొడసూపఁ
బోలఁతికిఁ జనుదోయి పొడవుచూపె
శౌరికి ధైర్యంబు సన్నమై డయ్యంగ
జలజాక్షిమధ్యంబు సన్నమయ్యె

ఆ. హరికిఁ బ్రేమబంధ మధికంబుగాఁ గేశ
బంధ మధిక మగుచు బాల కమరెఁ
బద్మనయనువలనఁ బ్రమదంబు నిండార
నెలఁత యౌవనంబు నిండియుండె.

అని వయఃప్రాదుర్భావమును మూలావిరుద్ధమైనను లోకజ్ఞా
నాతిశయమున వర్ణించి

"సోపశ్రుత్య ముకుందస్య రూపవీర్యగుణశ్రియః"

అనుమూలము ననుసరించి వ్రాయుచు "ఉపశ్రుత్య" అను
పదమునకుఁ గలసంపూర్ణార్థమును జెప్పఁబూని శ్రీపోతన

క. తనతండ్రిగేహమునకుం
జనుదెంచుచున్న యతిథిజనులవలనఁ గృ
ష్ణునిరూపబలగుణాదులు
విని కృష్ణుఁడు దనకుఁ దగినవిభుఁడని తలఁచెన్.

అని వ్రాసిరి. దీనిమూలము సంపూర్ణముగాఁ గలదు.

"గృహాగతైర్గీయమానాస్తం మేనే సదృశం పతిమ్."

లోకజ్ఞాన మిట్లుండవలయుఁ గదా.

ఇట్లు నవయౌవనస్ఫురిత యగుపుత్త్రికం గాంచి యా భీష్మకరాజచంద్రుఁడు మదిలో నిట్లు చింతించెను. ఈబాలిక స్వవయస్సముచితవిలాసములం దేలుచున్నది. సర్వాంగసుందరి. చంద్రకళం బోలును. శరత్పార్వణచంద్రనిభానన యగును. నేత్రసౌందర్య మపారము. వివాహయోగ్యమగు సమయ మిదియే. ఇప్పుడిప్పుడు బాల్యము వదలినజాడ కనఁబడియెడిని. లజ్జచే మోము వంచుకొనుచు నాతోడను మాటలాడును. కావున నావంశమున కీకన్యక యలంకారము. ఇట్టి యీ కులాలంకారమును దగినవరున కొసంగి కృతకృత్యుఁడను గావలయు. ధర్మము నిర్వహించుట నావిధి. అని యూహించి యొకానొక దినమున నేకాంతమునఁ గూరుచుండి కుమారులు విప్రోత్తములు తనచెంతకు రాఁగాఁ గూరుచుండ నియోగించి కుమారకులారా! విప్రప్రవరులారా! పుత్త్రికకు వివాహోచితకాలము వచ్చినది. ఆమెకుఁ దగినవరు నెవరిని వరింతును! ఆతఁడు కన్యక కన్నివిధములఁ దగియుండవలయును. మునిపుత్త్రుని గోరుదునా? లేక దేవపుత్త్రుని గోరుదునా? లేక రాజేంద్రతనయుని వాంఛింతునా? మీభావమును దెల్పుఁడు. ఇఁకఁ దడవుచేయక వివాహము చేయవలయును. నాకుమారిక దినదినప్రవర్ధమాన యగుచున్నది. రూపమునందును సద్గుణములయందును మెప్పు గాంచినది. నవయౌవనస్ఫురితుని వరుని బరికింపుఁడు. ఆవరుఁడు వయఃప్రధానుఁడు మాత్రమే గాక ధర్మశీలుఁడు, సత్యసం

ధుఁడు, నారాయణపరాయణుఁడు, వేదవేదాంగవేత్త, పండి తుఁడు, సుందరాకారుఁడు, శుభలక్షణలక్షితుఁడు, శాంతము, మనోనిగ్రహము గలవాఁడు, క్షమావంతుఁడు, సుగుణభూషి తుఁడు, చిరంజీవియునై యుండవలయును. మహాకులప్రసూ తుఁడు కావలయు. సర్వవిధములఁ బ్రతిష్ఠగలవాఁడుగా నుండ వలయును. రాజపుత్త్రునే మీ రంగీకరించినచోఁ బూర్వోక్త గుణములుమాత్రమే కాక రణశాస్త్రవిశారదుఁడుగా నుండ వలయును. మహారథుఁడు. ప్రతాపనిధి. రణాంగణమున స్థిరుఁ డై యుండువాఁడుగా నుండవలె తప్పదు. ఇట్టివానిని బరి కించి నాకుఁ దెల్పుఁడు. దేవపుత్త్రుని బరికింతురేని యిన్నిసద్గు ణములు గలిగియుండువానిగా నరయుఁడు. మునిపుత్త్రుని వాంఛింతురేని పూర్వోక్తసద్గుణములును విశేషించి చతుర్వేద విశారదత్వము గలిగియుండునట్లు చూడుఁడు. మఱియు లలిత వాక్కులుగలిగి విచారజ్ఞుఁడై సర్వసిద్ధాంతముల నిష్ణాతుఁడై యుండఁదగు. అని పలికి యపుడేవచ్చిన కుమారికను గాంచి యిట్లు ప్రశ్నించెను.

భీష్మకుఁ డిట్టులడుగఁ బురోహితునిపుత్త్రుఁ డిట్లు పలికెను. ఆతఁడు గౌతమముని కుమారుఁడు. శతానందనాముఁడు. వేద వేదాంతపారగుఁడు. ఆప్తుఁడు. ప్రవక్త. విజ్ఞుఁడు. ధర్మవేత్త. కులపురోహితుఁడు. సర్వకర్మనిష్ణాతుఁడు. కావునఁ జక్కఁగా నాలోచించి లలితవాక్కుల నిట్లు రాజుతోఁ బలికెను. రాజేం ద్రా! సర్వధర్మముల నెఱింగినప్రోడవు. ధర్మశాస్త్రపండితుఁ డవు. ఐనను బురాతనాఖ్యానము వేదప్రతిపాదితము గలదు. దాని నెఱింగించెద ఆకర్ణింపుము. భూభారహరణార్థము నారా

యణమూర్తి తానుగా భూలోకమున వసుదేవునకుఁ దన యుఁడై యవతరించెను. ఆతఁడు పరిపూర్ణప్రకాశుఁడు. సర్వ బ్రహ్మాండనాయకుఁడు. సృష్టికర్తకు సృష్టికర్త. బ్రహ్మాదిబృందారక బృందవందితచరణారవిందుఁడు. జ్యోతిస్స్వరూపుఁడు. భక్తాను గ్రహాకల్పితవిగ్రహుఁడు. సర్వప్రాణులకుఁ బరమాత్మ. ప్రకృత్యా తీతుఁడు. నిర్లిప్తుఁడు. నిరీహుఁడు. సర్వకర్మసాక్షి. అట్టి శ్రీకృష్ణ మూర్తికి నీకుమారిక నిమ్ము. పరిపూర్ణప్రకాశుఁ డట్టిపరం జ్యోతి దొరకుట కష్టము కదా. ఆ పరమపురుషునకుఁ గన్యాదా నము చేసితివేని నూఱుగురుపితరులం గూడి గోలోకమునకుఁ బోవఁగలవు. సారూప్యముక్తి నొందుము. పరమేశ్వరప్రీత్యర్థ మీకన్యక నొసంగుము. విశ్వగురువునకు నీవు గురువవగుదువు. కాన సర్వపూజ్యుఁడ వగుదువు. సర్వస్వము దక్షిణా నిమ్ము. మహాలక్ష్మిసింబోలు రుక్మిణి నొసంగుము. భగవంతునకీకానుక సర్పించి జన్మఖండనము చేయవలయును. ఇది విధాతలిఖించిన సంబంధము. సర్వసమ్మతము. ద్వారకానగరమున శ్రీకృష్ణుఁ డున్నవాఁడు. వారికడకు శీఘ్రంబ దూతననుపుము. త్వరగాఁ బయనము చేయఁ బ్రయత్నింపుము. సర్వప్రాణిసమ్మతమగు ముహూర్తమును నిర్ణయింపుము. భక్తానుగ్రహము పొంటె నిష్టరూపమును ధరించును. అట్టిపరమాత్మను రప్పింపుము. ధ్యాననిష్ఠ కుదురుటకై రూపమును ధరించును. తద్దర్శనమా త్రమున నీకుఁ బునర్జన్మభయము తొలఁగును. ఆపురాణపూరు షుని మాహాత్మ్యమును వేదములు నాలుగు తెలిసికొనఁజాలక తల్లడిల్లుచున్నవి. సత్పురుషు లెఱుంగఁజాలరు. సిద్ధేంద్రులు, మునీంద్రులు, బ్రహ్మాదిదేవతలు, తత్స్వరూపవిభూతి నెఱుంగఁ

జాలకయే యున్నారు. ధ్యాననిష్ణాతు లగుయోగీంద్రులా పరాత్పరుని మహిమమును దెలిసికొనఁజాలక తల్లడిల్లుచున్న వారు. సరస్వతియే యోజింపఁజాలక యున్నది. ఇఁక శాస్త్రములమాట చెప్పనేటికి ? సహస్రవక్త్రుఁడగు శేషువు, పంచవక్త్రుఁడగు సదాశివుఁడు, చతుర్ముఖుఁడగు బ్రహ్మయు, షణ్ముఖుఁడగు కుమారస్వామియు, ఋషులు, మునులు, భక్తులు, పరమవైష్ణవులు, భగవన్మహిమము నెఱుంగఁజాలక నుతించు నవకాశములేక ధ్యానింపఁజాలక యున్నవారు. యోగులు ధ్యానింపనొక్కరూపమును దాల్చును. వారారూపమును ధ్యానించుచుఁ దరింతురు. రాజచూడామణీ! నేను బాలుఁడను. భగవద్గుణములను వర్ణింపఁ జాలువాఁడనా?

అని శతానందుఁడు పలుకఁగా విని ప్రఫుల్లవదనారవిందుఁడై భీష్మకనరపాలుఁడు వేగంబలేచి యాతనిఁ గౌఁగిలించుకొనియెను. నానారత్నాంబరములఁ గానుకగా నిచ్చెను. ఇట్టి సంబంధమును దెలిపితివి కదా. నీఋణమెట్లు తీర్చుకొందునని యనేకభూషణములను గోవులను గరితురగముల నిచ్చి బహూకరించెను. అందున్న బంధువులంద ఱిది తగినదని సంభావించిరి. రుక్మిణియు సుస్మితమునఁ దనమనోభావమును వెల్లడించెను. రాజదియెటింగి సర్వభంగుల నీచుట్టఱికము తగియున్నదనియెను. కాని యాసభలోనున్న యువరాజు రుక్మి వారి ప్రయత్నానందములకు నసంతృప్తినొంది యిది తగనిపనియని వారించెను. మహోగ్రహవ్యగ్రమతియై కన్నులెఱ్ఱవాఱఁ బెదవు లల్లలనాడ ముఖము జేవురింప ధర్మము నశింపఁ జిత్తము చంచలతంగాంచఁ దండ్రిం గాంచి యిట్లు పలికెను. నిలువంబడి యతఁడు మాట

లాడుచుండ నెల్లరు నిశ్చేష్టులై యుండిరి. రాజేంద్రా! నావ చనము నాలకింపుము. అది మనకు మేలైనది. జనసమ్మతమైనది. భిక్షుకులయు, లోభులయుఁ, గ్రోధావిష్టచిత్తులయు, నర్తక వైశ్యభట్టులయు, యాచకులయుఁ, గాయస్థులయు, భిక్షువు లయు, వాక్యములఁ బాటింపరాదు. అది సర్వదా యసత్యసహి తమై యుండును. ఘటకులు, నాటకులు, స్త్రీలుబ్ధులగు కాము కులు,దరిద్రులు,మూర్ఖులు, స్తుతిపూర్వముగఁ బల్కుచుందురు. కాలయవనుఁడు మధురపై దండెత్తిపోవ నాతని నెదుర్కొనఁ జాలక యుపాయమున నెచ్చటికో కొనిపోయి కృత్రిమమార్గ మునఁ జంపించి తద్ద్రవ్యమును గృష్ణుఁడు గైకొనియెను. యవన ద్రవ్యమున నిపుడు ద్వారకయందుఁ గృష్ణుఁడు ధనవంతుఁడని పేరొందెను. జరాసంధుని దాడి కోర్వఁజాలకయే సాగరాంత రమున నిల్లు కట్టుకొనియెను. నేనో జరాసంధుల నూర్వుర నైనను వధించి విలాసమున జయశ్రీ నార్జింపఁగలను. తక్కిన ముక్కుడులరాజుల లెక్కింపనేల? దుర్వాసుఁడు నాకు గురువు. వారియనుగ్రహమున విద్యల నభ్యసించితి. రణశాస్త్రవిశార దుఁడను. అట్టిశక్తి నాకుఁ గలదు కావునఁ బ్రపంచమునెల్ల నోడింపఁజాలుదును.నాకుసమానులుగ వచింపఁదగువారు పరశు రాముఁడు. శిశుపాలుఁడు. అందు శిశుపాలుఁడు నాకుఁ బరమ మిత్రుఁడు.స్వర్గమును జయింప నిపుడతఁడు కోరుచున్నవాఁడు. నేను శతమఖుని దవ్వులములను క్షణమున గెలువఁజాలు దును. దుర్బలుఁడగు జరాసంధు నోడించి కృష్ణుఁడు జయశాలి యని విఱ్ఱవీఁగుచున్నవాఁడు. ఆకృష్ణుఁడే నాసోదరిని వివాహ మాడఁగోరి యీనగరమున కరుగుదెంచినచో యమమందిర

మున కనిపెదను. నందుఁడు వైశ్యుఁడు. తత్పుత్త్రుఁ డగు కృష్ణుఁడు గోవులఁ గాచుకొనువాఁడు. ప్రత్యక్షముగా జారుఁడు. గోపికాలోలుఁడు. గోపాలకుల యుచ్ఛిష్టమును భుజించువాఁడు. దేవతలకుఁ దగిన మనరుక్మిణిని బాణిగ్రహణ మొనరింపఁ దగినవాఁడా? ఇంచుక యాలోచింపుము. అట్టి నీచవంశజనితుఁడగు కృష్ణునకుఁ దనయారత్నము నీ బ్రాహ్మణ బ్రువుఁడు భిక్షుఁడు చెప్పినమాటల నుబ్బి యీఁదలంతువా? ఏమిది ? ఆశ్చర్యముగ నున్నది. రాజేంద్రా! ఈవిషయమున బుద్ధిహీనుఁడవై తివనక తప్పదు. యాచకునిమాటలను లోఁబడితివి. కృష్ణుఁడు రాజపుత్త్రుఁడు కాఁడు. శూరుఁడు కాఁడు. కులీనుఁడును గాఁడు. పరిశుద్ధుఁడు కాఁడు. దాతయుఁ గాఁడు. ధనాఢ్యుఁడు కాఁడు. యోగ్యుఁడు కాఁడు. జితేంద్రియుఁడు కాఁడు. అట్టివానికిఁ గన్యక నీయఁదలంచుట పాడియా? ఎవ్వఁడైన నంగీకరించునా? బంధువులు పిదప నవ్వకుందురా ?

నామాటను బాటింపుము. సుపుత్త్రుఁడై కులీనుఁడై విఖ్యాతిం గాంచియున్న శిశుపాలున కొసంగుము. బలమున శంకరు మెప్పించినవాఁడు. రాజేంద్రతనూభవుఁడు. కావున నతఁడే మనరుక్మిణికిఁ దగినవాఁడు. ఇపుడే నానాదేశాధీశ్వరులం బిలువనంపుము. బంధువులను మునులను శుభలేఖల నంపి బిలువనంపుము. వివాహ మతివైభవమున నొనరింపుము. సకలపదార్థముల సంగ్రహించి యెల్లరు తనియున ట్లన్నదానము చేసి బహుమానపురస్సరముగా సాగనంపుము. ఇట్లు చేసిన మనకుఁ గొప్పఖ్యాతి కల్గును. బంధువు లానందింతురు. మహర్షు లానందింతురు. కులదేవతలు హర్షింతురు. మన కెల్లవిధముల గౌరవము

గల్గును. అని పలుకు కుమారునిమాటలఁ బురోహితునిం గూడి యాలకించి తలయూఁచెను. * రుక్మిణి యామాటలకుఁ బరితపించెను. అన్నయుద్దేశము మరల్పరాదని యెఱింగెను. శిశుపాలున కీయఁదలంచినచో నాకోరిక యెట్లు సఫలమగునా యని యూహించెను. నావాంఛ నెఱవేఱనిచో జీవించుటయు వ్యర్థము కదా యని నిశ్చయించెను. వివాహమాడిన శ్రీకృష్ణుని. తప్పినచో మృతినంగీకరించుట తప్పదని నిర్ణయించుకొనియెను.

కుండిననగరమున వృత్తాంత మించుకనిలిపి ద్వారకా

---

* ఇటనుండి యీకథ మార్పునొందినది. శ్రీకృష్ణజన్మఖండప్రకారము భీష్మకుఁడు కొడుకుమాట నిరాకరించి శ్రీకృష్ణునికొఱకు శుభలేఖనంపుట తదాగమనము చెప్పవలయును. భాగవతాదుల ప్రకారము రుక్మిణి విప్రునిం బంపుట కృష్ణాగమనము చెప్పవలయును. కావున నిట నన్నియుఁ గలిపి వ్రాయవలయును గాన రుక్మిణీసందేశమును వ్రాసి పిదప దీనిని గలుపుచు వ్రాసెద. శ్రీభాగవతము ౧౦ స్కం. ౫౨ వ యధ్యాయమునుండియు, హరివంశము విష్ణుపర్వము ౪౭ వ యధ్యాయమునుండియు, బ్రహ్మపురాణము ౯౧ వ అధ్యాయమునుండియు, విష్ణుపురాణము ౫ వ అంశము ౨౬ వ యధ్యాయమునుండియు, గర్గసంహిత ద్వారకాఖండము ౫ వ అధ్యాయమునుండియు సంగ్రహింపఁబడినదని యెఱుంగవలయు. రుక్మిణీసందేశము చాల గ్రంథములలోఁ గన్పట్టెడిని. కావునఁ బూర్వోక్తకథ కించుకభేదము గాఁ గనఁబడినను బాధయుండదని నాభావము. కన్యాదానము భీష్మకుఁడే శ్రీకృష్ణమూర్తి కొనరించినట్లు శ్రీకృష్ణజన్మఖండమునఁ గలదు. తదనుగుణముగా గథయందు మార్పులుగలవు. తక్కుంగల గ్రంథములరీతి వేఱు. అన్నింటిని గలిపి యొక ప్రణాళిక నిర్ణయించుకొని వ్రాయుదును. ఇంచుక లోపము లున్నను మన్నించవలయును.

వృత్తాంతము నూహింతము. రుక్మిణి సకలసుగుణమండిత యనియు, బుద్ధిలక్షణౌదార్యరూపశీలాశ్రయయనియు,నాలకించి పెండ్లియాడఁదగినదని తలంచెను. కాని యావిషయ మషడ క్షీణముగా నుంచెను. బలభద్రునకుఁ దప్ప నితరుల కెవ్వరికిం దెలియదు. పలువురు రుక్మిణినిగూర్చి యపుడపుడు కృష్ణ సభాంగణమునఁ బ్రశంసించుచుండుటయు శ్రీహరి యాప్రశంసావాక్యములఁ జెవియొగ్గి యాలకించుటయు జరగుచుండెను. ఇట్లు శ్రీకృష్ణునియొక్కయు రుక్మిణియొక్కయుఁ జిత్తములను బ్రీతిలత బంధించెను. ఆలతాబంధ మితరులకన్నులకుఁ గనఁబడునది కాదు. దాని నెఱుంగఁజాలువా రెవ్వరో కొందఱే కాని యందఱకుఁ దెలియదు. స్నేహాలత ప్రీతిలత యనుపేరులఁ గవులు దీనినే వాడుదురు. లతాత్వారోపణము దూరస్థితి దీనిని బాధింపదనుటకే యని ప్రాయికముగాఁ బండితులభావము. ఇది సర్వజనాంగీకారమును గాంచినవిషయము. ఈస్నేహాలత రుక్మిణీవాసుదేవుల మనస్సుల నంటినపుడు దానిని వదలింపఁ బ్రయత్నించువాఁ డెట్టిఫలమునొందునో మును ముందు తెలియఁగలదు. భగవదిచ్ఛకు మాఱొడ్డినిలుచుట యనఁగా నాపదలపాలగుటకు సిద్ధపడువాఁడే యని సారము.

ఇట్లు పరస్పరప్రేమము విధివశమునఁ గల్గెను. కాని భగవంతునిమదిఁ గలవిలపాటు లేదు. కాని త్రికాలవేత్తృత్వము లేనికతన రుక్మిణి కెంతో మనశ్చింత కల్గెను. రుక్మమాటల కార్తిహెచ్చెను. దాన సంశయములు పొడమెను. వానిఁ దొలఁగించుకొనుశక్తి కలుగకపోయెను. కావునఁ గర్తవ్యమేమని యూహింపసాగెను. ఈపట్టున శ్రీభాగవతమునందు,

శ్లో. తదవేత్యా సితాపాంగీ వైదర్భీ దుర్మనా భృశమ్,
విచింత్యాప్తం ద్విజం కంచి త్కృష్ణాయ ప్రాహిణోద్ధ్రుతమ్.

అనిమాత్రమే కనుపట్టెడిని. తెనుఁగున మహాకవి యీఘట్టమున స్వకపోలకల్పనముల నొకమెఱుఁగు తెచ్చిపెట్టిరి. వానిం జూడుఁడు.

ఉ. అన్నతలంపుఁ దా నెఱిఁగి యన్నవనీరజగంధి లోన నా
పన్నతనొంది యాప్తుఁడగు బ్రాహ్మణు నొక్కనిఁ జీరి గర్వసం
ఛన్నుఁడు రుక్మి నేఁడు ననుఁజైద్యున కిచ్చెదనంచు నున్నవాఁ
డెన్నివిధంబులం జని బుధేశ్వర చక్రికి విన్నవింపవే.

అని వ్రాసి యంతతోఁ దృప్తినొందక యొకవచనమునందు "అని కొన్నిరహస్యవచనంబులు చెప్పిన న్విని బ్రాహ్మణుండు" అని వ్రాసెను. దీనిచేఁ గథాంశమునకు బాధలేదు గాని అంతఃపురమునం దున్నకన్యక యావఱి కెన్నఁడెఱుంగని పరపురుషుని కడకు దూతనంపుటయ కాక రహస్యములు కొన్ని చెప్పిపంపుట మర్యాదను మీఱినట్లుగాదా యనుశంక కవకాశ మిచ్చుచున్నదిగదా యని కొందఱందురు. రుక్మిణిమనస్సున శ్రీహరి శ్రీమన్నారాయణమూర్తిగానే భావించియుండునా? లేక యొకానొక సుందరాకారునిగా భావించియుండునా యని యాలోచింపవలయును. పోతనగారిభావమున రుక్మిణి గతాగతజనుల వలన విన్నవిషయములం బట్టిచూడఁగా సామాన్యమానవుఁడు కాఁడనియు నమానుషచర్యలంబట్టి భగవంతుఁడనియు భావించియుండుననియే గాని వేఱొక్కపద్ధతి గాదు. ఈభావము నీక్రిందిపద్యమున వెలిఁబుచ్చిరి.

క. అయ్యా కొడుకువిచారము
లయ్యయు వారింపఁజాలఁ డటుగాకుండన్
నెయ్యమెఱిఁగించి చీరుము
చయ్యన నిజసేవకానుసారిన్ శౌరిన్.

ఈపద్యమున నిజసేవకానుసారిన్ అన్నవిశేషణమును బట్టి తన్నాశ్రయించినవారి నుద్ధరించునట్టి యనునర్థము తేటపడును. కావున భగవంతునికడ విన్నవించుట యెట్టి స్త్రీలకుఁగాని మర్యాదకు భంగముకాదనియు జగత్పిత గావున నంతఃపుర కాంతలకును నతనికడ మర్యాదగాఁ బ్రవర్తించుట యనఁగాఁ దమకుంగల యాపత్తులం దెలుపుకొనుటయనియు నూహింపఁ దగువిషయము. కాఁబట్టి మూలవిరుద్ధమైనను బద్యభాగము మూలార్థమును బోషించుచు భక్తిని దేటపఱచుచున్నదని యెఱుంగవలయు. ఇట్టిశంకలకుఁ జోటీయక తరువాతికథను బఠింపుఁడు.

రుక్మిణి తనకాప్తుఁడగు బ్రాహ్మణుని బిలిచి తనయుదంత మంతయు నుచితరీతిని దెల్పి త్వరగ నరిగి కార్యము పండించుకొని రమ్మని యభ్యర్థించి పంపెను. విశ్వాసపాత్రుఁడగు నా విప్ర ప్రవరుఁడు త్వరపడి ద్వారకకుం బోయెను. ద్వారకానగరమును నేత్రపర్వముగఁ గాంచి కరము హర్షించి కృతార్థోఽస్మి యని యూహించెను. ఆనగరము సాక్షాద్గోలోకమనియే ధ్యానించెను. భగవద్దర్శనము దొరకుననియు దాన ముక్తి కరతలామలకమనియుఁ దలపోసెను. వీథులవెంబడిపోవుచు నంబరమును ముద్దిడుకొనున ట్లున్నతములగు మాడుగులఁ దిలకించి యచ్చెరువందెను. భగవంతుఁడు వేంచేసియుండు సౌధమును

దర్శించెను. ప్రతీహారులకుఁ దనరాకఁ దెలిపి యార్యులారా! నారాక శ్రీగోపాలకృష్ణునకుఁ దెలుపుఁడీ యని వినయమునఁ బలికెను. వారు మిగుల శాంతచిత్తులు. ఉదారాశయులు. కరుణాపరతంత్రులు. భగవత్సేవానిరతులు. కాఁబట్టి యావిప్రుని రాక వెంటనే శ్రీహరికి విన్నవించిరి. మురారియు ముందే యాలోచించుచుండువాఁడు కావునఁ బ్రవేశపెట్టుఁడని యానతిచ్చెను. దయచేయుఁడి బ్రాహ్మణోత్తమా! ఎంతధన్యుఁడవో కాని పరమపురుషుఁ డేకాంతమండపమునఁ గూరుచుండి నీరాకకై కాచియున్నవాఁడు. వేంచేయుమా యని విన్నవించిరి. బ్రాహ్మణుని యానందమునకు మేర యున్నదనవచ్చునా? పరమానందభరమున వడివడిఁ బ్రవేశించి యందు రత్నసింహాసనమునఁ గూరుచున్న యాదిపూరుషుని భగవంతుని బ్రహ్మణ్యదేవుని గాంచెను. "పెండ్లికొడుకవు గమ్మని దీవించెను." అన్న బ్రాహ్మణాశీర్వాదము పోతనగారి యాశయమే గాని వ్యాసభావము కాదు.

శ్రీకృష్ణుఁడు లీలామానుషవిగ్రహుఁడయ్యు లోకాచారములఁ బాటించువాఁడై లోకులకు మర్యాదలఁ దెలుపఁబూని

"యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః."

యన్నసోక్తి కుదాహరణముగా రత్నసింహాసనమునుండి తటాలున దిగి యావిప్రోత్తముని నిజాసనమునఁ గూరుచుండఁ జేసెను. ఈతావునఁ బోతనగారు "బ్రాహ్మణుం గూరుచుండ నియోగించి" యని వ్రాసిరి. మూలమునందు,

"దృష్ట్వా బ్రహ్మణ్యదేవ స్తమవరుహ్య నిజాసనే,
ఉపవేశ్యార్హయాంచక్రే యథాత్మానం దివౌకసః."

అని కనుపట్టెడిని. స్వాసనమునఁ గూరుచుండఁ జేసెననుటయే చమత్కారము. ఏలమానిరో పోతనభావము తెలియకున్నది.

ఇట్లు నిజాసనమునఁ గూరుచుండఁజేసి తనకు దేవతలు భక్తియుక్తులై యెట్లు పూజింతురో అట్లే విధిప్రకారము పూజించెను. భుజింపఁ బ్రార్థించెను. విప్రుఁడు కృష్ణమూర్తి గృహమున భుజించెను. తాంబూలచర్వణము చేసి కూరుచుండెను. సాధువులకుఁ బరమగతియగు శ్రీహరి విప్రునిపాదములఁ దనకరారవిందముల నొత్తుచు నించుకయుఁ దొ్వరలేక స్వస్థచిత్తుఁడై యిట్లు ప్రశ్నించెను.

ఈఘట్టమున మూల మెట్లున్నదో తెలుపక తప్పదు.

శ్లో. కచ్చిద్ద్విజవరశ్రేష్ఠ ధర్మస్తే వృద్ధసమ్మతః,
వర్తతే నాతికృచ్ఛ్రేణ సంతుష్టమనసస్సదా. 30
సంతుష్టో యది వర్తేత బ్రాహ్మణో యేనకేనచిత్,
అహీయమానస్స్వద్ధర్మాత్సహ్యస్యాఖిలకామధుక్.
అసంతుష్టో సకృల్లోకా నాప్నోత్యపి సురేశ్వరః,
అకించనోపి సంతుష్ట శ్శేతే సర్వాంగవిజ్వరః. 32
విప్రాన్ స్వలాభసంతుష్టాన్
సాధూన్ భూతసహృత్తమాన్,
నిరహంకారిణశ్శాంతాన్
నమస్యే శిరసాసకృత్. 33

శ్రీభాగవతము ౧౦ స్కం. ౫౦ అధ్యాయము.

వ్యా. సధర్మోఽస్య బ్రాహ్మణస్య అఖిలకామదోగ్ధా భవతి యద్వా, స బ్రాహ్మణోఽస్య విశ్వస్య అఖిలకామధుగితి లోకానాప్నోతి. లోకాల్లోకాంతరం పర్యటన్ నైకత్ర నిర్వృతః తిష్ఠతీత్యర్థః. నాప్నోతీతి పాఠే సురేశ్వరోఽపి భూమానాం లోకానాప్నోతి. ఉత్తమాన్ లోకాన్ ప్రాప్తోఽపి అప్రాప్త ఇతి క్లిశ్యతీత్యర్థః. శేతే సుఖమాస్త ఇత్యర్థః. తదేవాహ సర్వేష్వంగేషు వాక్పాణ్యాదిషు విజ్వరః తాపరహితః. స్వలాభః స్వతఏవ ప్రాప్తోలాభః. ఆత్మలాభోవా. తేన సంతుష్టాన్ పూర్ణాన్ సాధూన్ స్వధర్మనిష్ఠాన్.

అని శ్రీధరాచార్యులు.

ఈభాగమునం దెనుఁగున మహాకవిపోతన యెంతయుఁ జను త్కృతిఁ జూపెను. ఆపద్యముల వ్రాయక తప్పదు.

సీ. జగతీసురేశ్వర ! సంతోషచిత్తుండ
వై యున్న నీధర్మ మతిసులభము
వృద్ధసమ్మత మిది పిత్త మెయ్యదియైనఁ
బ్రాపింప హర్షించు బ్రాహ్మణుండు
తనధర్మమునసుండుఁ దరలఁ డాధర్మంబు
గోరిక లతనికిఁ గురియుచుండు
సంతోషి గాఁడేని శక్రుఁడైన నశించు
నిర్ధనుండైనను నిద్రపోవు
ఆ. సంతసించెనేని సర్వభూతసుహృత్త
ములకుఁ బ్రాప్తలాభముదితమాన
సులకు శాంతులకును సుజనులకును గర్వ
హీనులకును వినతు లేనొనర్తు.

అని వ్రాసిరి. ఈపద్యము పూర్వశ్లోకముల యన్నింటియర్థమును బోధింపఁజాలదు కాని తత్సారమునుమాత్రము చక్కఁగాఁ దెలుపును. ఛాయవలెనుండునని నాభావము. వ్యాఖ్యవలెనుండఁజాలదు ఎంతయో పెంచి వ్రాయవలసియుండును. స్మృతిఘట్టములందే వ్యాఖ్యానము వ్రాసినట్లు తెలుఁగున భావము శతవిధములఁ గుంభితము గావింపవలసినది. సారముమాత్రము వ్రాయుట చాలదని నాభావము. ఇందలిభావము స్మృతుల భావమువంటిది. ఈప్రశ్నరూపమున భగవంతుఁడు బ్రాహ్మణుఁడన నెట్టివాఁడు? లోకమున నెట్టివాఁడు సుఖి? అను విషయము రత్నముల లక్షణములఁ దెల్పెను. ప్రశ్నభావము నాలకింపుఁడు.

ఓ బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! నీధర్మము వృద్ధసమ్మతమైనది. ద్రవ్యమేమాత్రము లభించినను సంతుష్టినొందుట బ్రాహ్మణధర్మమగును. సదా సంతోషమెవనిమనస్సుననుండునో యాతఁడే బ్రాహ్మణధర్మముగలవాఁ డనఁబడును. ఏమాత్రము ద్రవ్యములభించినను సంతుష్టుఁడై యెవ్వఁడుండునో, ఎవ్వఁడు తన కులధర్మమునుండి పరిభ్రష్టుఁడు కాఁడో, ఆధర్మమే యాతని కఖిలకామముల నొసంగును. అట్టిబ్రాహ్మణునివలనఁ బ్రపంచమున కెంతయో మేలుగలుగును. అసంతుష్టుఁ డయ్యెనేని త్రిలోకాధిపతియగు దేవేంద్రుఁడైనను బలుమాఱు పుట్టుచుఁ జచ్చుచుఁ బుణ్యలోకముల నొందుచు నింక నుత్తమలోకముల నొందఁగోరుచుఁ బరిభ్రమించుచుండును. సంతుష్టుఁ డయ్యెనేని నిర్ధనుండైనను హాయిగా నిద్రపోవును. సర్వాంగములయందించుకంతయుఁ దాపరహితుం డగును. ఏబ్రాహ్మణులు స్వలాభమున సంతుష్టులుగ నుందురో సాధువులగుదురో

సర్వభూతదయాపరులగుదురో అహంకారవర్జితులగుదురో శాంతధనులుగ నుందురో అట్టిబ్రాహ్మణులం గూర్చి పెక్కుసారులు నమస్కరించువాఁడను. ఆర్యా! నీయందట్టి లక్షణములన్నియు మూర్తీభవించి యున్నవి. నిన్నుఁజూడ సంతుష్టుఁడనని తోఁచెను. కావున నీకిదె మరలమరల నమస్కరించుచున్నాఁడను. అని పలికి మందహాసము మోమునఁ జిందులాడ మఱియు నిట్లు ప్రశ్నించెను.

బ్రాహ్మణప్రవరా! నీకుఁ గుశలమే కదా. ఏరాజుపరిపాలనమున నీనివాసము గలదు? ఆరాజువలనఁ బ్రజలెల్ల సుఖములను గాంతురుకాదే. ప్రజలను బిడ్డలవలెఁ బాలించు రాజు రాజ్యముననేకదా మీా నివాసము. ఆరాజు నాకుఁ బ్రియుఁడని యెఱుంగుము. ఏనగరమునుండి దుర్గమంబగు నాయీనివాసమున కరుదెంచితివి? ఏమికోరి యింతప్రయాసపడి వచ్చితివి? చెప్పఁదగినవిషయమైనఁ జెప్పుము. దానినొనరించి నీయిష్టమును దీర్చెదను. అని యిట్లు పరమేశ్వరుఁడు మహోదరణంబున నడుగ లీలామానుషవిగ్రహుఁడగు నాకృష్ణునకుఁ దన వృత్తాంతము నిట్లు చెప్పెను. మహాపురుషా! విదర్భదేశము గలదు. తదధినాయకుఁడు భీష్మకుఁడు. ఆభూనాయకునకుఁ బుత్త్రులపిదప నొక్కకుమారిక జనించెను. ఆమెయే రుక్మిణి. పుత్త్రులున్నను గుమారికను బుత్త్రికగా నారాజు భావించువాఁడు. ఆరుక్మిణి నీకుఁ గింకరిగాఁ గాంక్షించినది. ఆమెను వివాహప్రయత్నము జనకుఁడు సాగింపఁ దద్విషయమున నీకొకసందేశము మనవిచేయ నన్నంపినది. ఆసందేశ ముద్వాహమంగళము. ఆకుమారిక నాయందు విశ్వాసముకలది. కావున

నామెపంపఁగా నొకశుభసందేశమును గొనివచ్చినాఁడను. ఆసందేశమును విన్నవింతును. దాని నాకర్ణించి యనంతరము చేయఁదగుననితోఁచిన కార్యమును సాగింపుము. ఆమెపుత్తెంచిన వాక్యరత్నము లివియే. ఈఘట్టమున మూలము వ్రాయక తప్పదు.

శ్లో. శ్రుత్వా గుణాన్ భువనసుందర శృణ్వతాం తే
నిర్విశ్య కర్ణవివరై ర్హరతోఽంగతాపమ్,
రూపం దృశాం దృశిమతా మఖిలార్థలాభం
త్వయ్యచ్యుతా విశతి చిత్తమపత్రపం మే. ౯
కా త్వా ముకుంద మహతీ కులరూపశీల
విద్యావయోద్రవిణధామభి రాత్మతుల్యమ్,
ధీరాపతిం కులవతీ న వృణీత కన్యా
కాలే నృసింహ నరలోకమనోభిరామమ్. ౪౦
తన్మే భవాన్ ఖలు వృతః పతిరంగజాయా
మాత్మార్పితశ్చ భవతోఽత్ర విభో విధేహి,
మా వీరభాగ మభిమర్శతు చైద్య ఆరా
ద్గోమాయువ న్మృగపతే ర్బలి మంబుజాక్ష. ౪౧
పూర్తేష్టదత్తనియమవ్రతదేవవిప్ర
గుర్వర్చనాదిభి రలం భగవాన్ పరేశ,
ఆరాధితో యది గదాగ్రజ ఏత్య పాణిం
గృహ్ణాతు మేన దమఘోషసుతాదయోఽన్యే. ౪౨
శ్వో భావిని త్వ మజితోద్వహనే విదర్భాన్
గుప్త స్సమేత్య పృతనాపతిభిః పరీతః,

నిర్మథ్య చైద్యమగధేశబలం ప్రసహ్య
మాం రాక్షసేన విధినోద్వహ వీర్యశుల్కామ్. ౪౩

అంతఃపురాంతర చరామ నిహత్య బంధూ
న్త్వా ముద్వహే కథమితి ప్రవదా మ్యుపాయమ్,
పూర్వేద్యు రస్తి మహతీ కులదేవయాత్రా
యస్యాం బహి ర్నవవధూ ర్గిరిజా ముపేయాత్. ౪౪

యస్యాంఘ్రిపంకజరజ స్స్నపనం మహాంతో
వాంఛం త్యుమాపతి రివాత్మతమోపహత్యై,
యర్హ్యంబుజాక్ష నలభేయ భవత్ప్రసాదం
జహ్యామసూ న్వ్రతకృశా న్శతజన్మభిస్స్యాత్. ౪౫

శ్రీభాగవతమున రుక్మిణీసందేశ మీశ్లోకములచేఁ జెప్పఁబడినది. ఇందుఁ బ్రథమశ్లోకమునఁ గలయర్థమును మహాకవిపోతన చమత్కారముగా నొకపద్యమున వివరించి తన భక్త్యతిశయతను వెల్లడించెను. శ్లోకార్థము నెన్నిభంగుల నూర్చినో స్పష్టము కాఁగలదు. దానిచే నా భక్తశిఖామణి తాత్పర్యము బోధపడఁగలదు.

సీ. ఏనీగుణములు కర్ణేంద్రియంబులు సోఁక
దేహతాపంబులు దీఱిపోవు
నేనీశుభాకార మీక్షింపఁ గన్నుల
కఖిలార్థలాభంబు లమరుచుండు
నేనీచరణసేవ లేప్రొద్దుఁ జేసిన
భువనోన్నతత్వంబుఁ బొందఁగలుగు

నేనీలసన్నామ మేప్రార్ధభక్తితోఁ
దడవిన బంధసంతతులు వాయు

తే. నట్టి నీయందు నాచిత్త మనవరతము
నచ్చియున్నది నీయాన నానలేదు
కరుణఁజూడుము కంసారి ఖలవిదారి
శ్రీయుతాకార మానినీచిత్తచోర.

ముందీ సీసపద్యమునర్థ మించుక విమర్శింపఁ దగియున్నది. రుక్మిణి లక్ష్మియనియే భావించి కవి పద్యముచెప్పెనే గాని స్త్రీ మాత్రమని భావించి కాదనవలయు. ఈయర్థము పై నాలుగు పాదములు వెల్లడించుచెడిని. గీతపద్యమునఁ గవిభావము సుంత తగ్గినది. యతిబాధకై కాఁబోలు "నానలేదు" అని పల్కెను. నీయాన = నీతోడు. నానలేదు=సిగ్గులేదు. ఈపల్కులు నీకుం దెల్పుటకు సిగ్గుపడకున్నదానవని కవిభావమని యూహింపక తప్పదు. నానలేదను వాక్యము రసపుష్టిని గల్పింపకుండుటయే గాక యుదారాశయము నల్పముగాఁ జేయుచున్నది. అంత్య ప్రాసముల కాశపడినందున నాల్గవపాదమునందలి కడపటివిశే షణమగు మానినీచిత్తచోర యనునది యపార్థమును గల్పింపఁ జూచువారల కవకాశ మిచ్చుచున్నది. ఇది కేవల సౌందర్యవిషయమునఁ జెప్పఁదగిన పదము. ఈపద్యమునందు భక్తిరసమే మూర్తీభవించి యున్నది. స్త్రీలచిత్తమును దొంగి లించువాఁడా యనఁగా స్త్రీలకుఁ గామమును గొలుపువాఁడా యనికాని, స్త్రీలందఱు మోహింపంజేయఁజాలు సుందరా కారుఁడా యనికాని యర్థమును జెప్పవలయును. పెద్దలు దీనిని భక్తిరసముగా నర్థముచెప్పి సాధింపఁగలరు గాని సామాన్య

దృష్టి కీవిశేషణము పద్యమున మూర్తీభవించియున్న భక్తిరస మును బాడుచేయుచున్నదని నాయాశయము. ఏలయన నిట్టి తావులనే యాక్షేపించువారు లక్ష్యములం జూపి యాక్షేపిం తురు. శ్రీకృష్ణపరబ్రహ్మమునందు దోషముల నారోపింతురు. మూలమును వెనుకువా రరుదుగ నుందురు. పద్యములనే పఠించువారు పెక్కండ్రుందురు. వారెల్ల నిట్టివాక్యములం జూపి కృష్ణస్వభావ మిదియని యుల్లసమాడుదురు. భక్తుల కిట్టితావుల నించుకంతయు నేవకల్గదనుట నిక్కము. పామరు లెట్లన్న నేమి కొఱంతయన రాదు. లోకమున నపవాదము కల్గఁ గూడదు కదా. కావుననే యిట్టితావులఁ గన్నులుగలిగి కవి జాగరూకుఁడై మెలఁగవలయు. రామచరిత్రమువంటిది కాక శ్రీకృష్ణదివ్యచారిత్రము కళంకములపాలై యున్నది. ప్రాయశః ఇట్టి ఘట్టములఁ గలవిషయములనే చూపుచు నాక్షేపించు వారు పెక్కండ్రు కలరని నాయనుభవమున నెఱింగితిని. పోతన యంటిభక్తుని దృష్టికేమియుఁ దుచ్ఛవిషయములు గోచరింప వనుట సిద్ధాంతము. కాని పామరుల కవకాశము తెచ్చిపెట్టిన ట్లగునే యని విచారించుచున్నాఁడను. ఇఁక భాగవతభావ మే మోగాఁ జిత్తగింపుఁడు.

## రుక్మిణి శ్రీహరికిఁ బంపినసందేశము.

జగత్సుందరాకారా! నాశరహితా! పరమపురుషా! నీ యనంతకల్యాణగుణములను వినియున్నాను. ఆగుణములు కర్ణ వివరములద్వారా ప్రవేశించి యంగతాపమును దొలఁగించినవి. వినువారలకు సకలసంతోషములఁ గలిగించునవి కదా నీగుణ ములు. చతుష్కంతులకు నీరూపదర్శనము సకల పురుషార్థ

లాభము. అట్టి నీరూపమును గుణములను జక్కఁగా నాలకించి నాచిత్తము నీయందుఁ బ్రవేశించుచున్నది. చిత్త మపత్రప ముగా నున్నది. ముకుందా! కులరూపవిద్యావయోధనధామ ముల నాత్మతుల్యుఁడ వగు నిన్ను సత్కులమునఁ బుట్టి గుణ ములచే గొప్పతనమును వహించిన యేకాంతామణి కోరకుం డును? నరలోక మనోభిరాముఁడవు కదా. పరమపురుషుఁడవు కదా. నీవంటిపతి దొరకుట దుర్లభము కాని నిన్నుఁగోరుట సర్వస్త్రీసహజము. వివాహకాలమునందు నీవార్త వినఁబడిన నో రెల్లరు నిన్ను వివాహమాడఁ గోరుదురు. సర్వలోకాధినా యకా! అట్టికారణములవలన నిన్ను భర్తగా వరించితిని. నాయాత్మను నీకర్పించితిని. కావున నీ వరుదెంచి నాయందు భార్యయనుభావము నుంచి కాపాడుము. త్రిలోకవీరుఁడవగు నీకుఁ జేరిన నన్ను శిశుపాలహీనకుఁడు వచ్చి స్పృశింపకుండుఁ గాక. ఓ యంబుజాక్షా! సింహముభాగమును నక్క హరింపఁ జూచుచందమున నీభార్య నగునన్ను నీచుఁడగు శిశుపాలుఁ డపహరింపఁ జూచుచున్నాఁడు. ఇట్టియాపద నాకుఁ గలుగక యుండఁ గాపాడుము. ఈశ్లోకమునకు మహాకవిపోతన చక్కని పద్యమును వ్రాసెను.

ఉ. శ్రీయుతమూర్తి యోపురుషసింహమసింహము పాలిసొమ్ము
గో, వాయువు గోరుచందమున మత్తుఁడు చైద్యుఁడు నీ
పద్మాంబుజ, ధ్యాయినినైన నన్ను వడిఁ దాఁ గొనిపోయెద
నంచు నున్నవాఁ, డాయధమాధముం దెలిసి గఁ డద్భుత
మైన భవత్ప్రతాపముఁ.

మూలార్థమేగాక విశేషముగాఁ జమత్కారమును సూచించు నర్థము పద్యమున నిమిడియున్నయది. తర్వాతిభావ మాలకింపుఁడు.

త్రోవలలో బావులు త్రవ్వించుట చెఱువులు కట్టించుట లోనగు పూర్తమనుధర్మము, అగ్నిహోత్రార్చనాదిరూపమగు నిష్టాఖ్యధర్మము, హిరణ్యాది దానరూపమగుధర్మము, తీర్థయాత్రాదిరూపమగు నియమరూపధర్మమును, కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతరూపధర్మము, విప్రగురుదేవతార్చనరూపమగుధర్మమును దొలిజన్మముల నెపుడైనను జేసియుంటినేని గదాగ్రజా! కల్యాణమూర్తీ! దయచేసి నన్నుఁ బాణిగ్రహణము చేయుము తుచ్ఛులగు శిశుపాలాదులు నన్నుఁ గేల్ పట్టఁజాలక పోవుదురుగాక. ప్రార్థించి బంధువులందఱు శిశుపాలునకిచ్చిన నిన్ను నిపుడు నే నేమిచేయ వచ్చునని యూహింతువేమో నాప్రార్థన నాలకింపుమని మరల రుక్మిణి ప్రార్థించుచున్నది. త్రిలోకవిజయశీలా! శ్రీకృష్ణా! రేపు సాగనున్న వివాహకార్యమునకు నెవరికిఁ గనఁబడక యుండ వచ్చి నీవెనుకఁ జతురంగబలముల రాఁబనిచి విదర్భరాజధానియందు శిశుపాలజరాసంధాది దుర్మదరాజవీరులఁ జిందఱవందఱగాఁ జేసి బలవంతముగా నన్ను రాక్షసవివాహవిధిఁ బరిణయము గమ్ము. నేను వీర్యశుల్కను గాన నట్టిపద్ధతిఁ బెండ్లియాడుట న్యాయము. పరమపురుషా! అంతఃపురమున నున్న నన్ను బంధువులఁ బొలియింపక యెట్లు వివాహమాడ వచ్చునని శంకింతువేమో యొకయుపాయము చెప్పెదను. వివాహమునకు ముందుదినమే మాకుఁ గులదేవతయగు గౌరీదేవిఁ

బూజించుటకై పురమునకు వెలుపలనుండు దేవాలయమునకుఁ బోవుట మాయింటియాచారము. ఆమర్యాదనుబాటింప నేను నంతఃపురము వెలువడి నగరబాహ్యప్రదేశమున కరుదెంతును. అదియే శుభసమయము. అంబికాదేవాలయమునుండియే నన్నుఁ గొనిపోవుట మంచిది. శ్రీకృష్ణా! మఱొక్కవిన్నపము. ఈయుపాయ మనర్థావహము. ఇదేల? శిశుపాలుఁడు కులగుణరూపాదులచేఁ బ్రఖ్యాతినొందినవాఁడే. అతని వరింపఁ గూడదా యని యూహింతువేమో నామనోనిశ్చయము నెఱిఁగించెద. ఆలకింపుము. ఓ కమలాక్షా! నీ పాదారవిందరజస్స్నానమొనరింప నీశ్వరుఁడు కోరునట్లు సాధువులు కోరుదురు. అట్టి సకలలోకపూజ్యచరణారవిందుఁడవగు నీయనుగ్రహమును బడయఁ బాత్రురాలను గానిచో వ్రతోపవాసాదులచేఁ గృశించి ప్రాణముల వదలెదను. ఈజన్మమునందే కాదు. ఇట్లు నూఱుజన్మములందు నిన్నుఁ గాంక్షించుచుఁ బ్రాణముల వదలెదను. నూఱుజన్మములకైన నీప్రసాదము నాకుఁ గలుగకపోవునా. ఈ యర్థముగల శ్లోకమునకు మహాకవిపోతన,

మ. ఘను లాత్మీయతమోనివృత్తికొఱకై గౌరీశుమర్యాద నె
వ్వనిపాదాంబుజతోయమందు మునుఁగన్ వాంఛింతు రే
నట్టి నీ, యనుకంపన్ విలసింపనేని వ్రతచర్యన్ నూఱు
జన్మంబులన్, నినుఁ జింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్
నిక్కంబు ప్రాణేశ్వరా.

అని వ్రాసి యింతతోఁ దృప్తినొందఁజాలక

సీ. ప్రాణేశ! నీమంజుభాషలు వినలేని
ఘ్రాణరంధ్రంబుల కలిమియేల?

పురుషరత్నమ నిన్నుఁ నీవు భోగింపఁగాలేని
తనులతవలని సౌందర్యమేల?
భువనమోహన నిన్నుఁ జూడఁగానఁగాలేని
చక్షురింద్రియముల సత్వమేల?
దయిత నీయధరామృతం బానఁగాలేని
జిహ్వకు ఫలరససిద్ధియేల!
ఆ. నీరజాతనయన నీవనమాలికా
గంధ మబ్బలేని ఘ్రాణమేల?
ధన్యచరిత నీకు దాస్యంబు చేయని
జన్మమేల? యెన్ని జన్మములకు.

అని స్వభర్తృత్కర్షమునఁ జెప్పి కృతకృత్యుఁ డయ్యెను.

ఇట్లు రుక్మిణీసందేశమును విన్నవించి యావిప్రప్రవరుఁడు మహానుభావా! నాయందలి విశ్వాసమున రుక్మిణి రహస్యముగా నీకుఁ దెలుపుమన్నవార్తల విన్నవించితిని. వీని నాలకించినపిదప దేవర చిత్తమున కెట్లు సమ్మతమగునో యట్లు చేయుము.

దీని తర్వాతివిషయమును బోతనగారు బ్రాహ్మణుఁడు రుక్మిణీసౌందర్యమును వర్ణించి కృష్ణున కతిశయప్రీతిని గల్పించి నట్లు చెప్పిరి. ఆవిషయమున నాలుగుమాటలు వ్రాయవలసి యుండి యాపద్యముల వ్రాసెను.

"సువర్ణనంబుగా మఱియు నిట్లనియె."

సీ. పల్లవవైభవాస్పదములు పదములు
కనకరంభాతిరస్కారము లూరు

లరుణప్రభామనోహరములు కరములు
కంబుసౌందర్యమంగళము గళము
మహితభావాభావమధ్యంబు మధ్యంబు
చతురుత్సవదాయి చన్నుదోయి
పరిహసితార్ధేందుపటలంబు నిటలంబు
జితమత్తమధుకరశ్రేణి వేణి
ఆ. భావజాశుగముల ప్రాపులు చూపులు
కుసుమశరునివింటికొమలు బొమలు
చిత్తతోషణములు చెలువభాషణములు
జలజనయనముఖము చంద్రసఖము.

ఉ. ఆరయెలనాగ నీకుఁ దగు నంగన నంగనకుం దగుదీవు మా యుపా
ధ్యాయులయాన పెండ్లియగుఁ దప్పదు జాడ్యములేల నీవు
నీ, త్రోయమువారిఁ గూడుకొని తోయరుహాసనఁ దెత్తుఁ
గాని వి,చ్చేయుము శత్రులకా సుఖము చేయుము చేయు
ము శోభనంబిలక్.

అని వ్రాసిరి. ఈ రెండుపద్యములకు మూలము కవియూహయే గాని శ్రీభాగవతమున గాదు. ఇందు మొదటిపద్యమున రుక్మిణి దేహము వర్ణింపఁ బడినది. అందును రహస్యసందేశము గొని వచ్చిన బ్రాహ్మణుఁడు తద్రహస్యవార్తలం దెల్పి తమచిత్తమునఁ గార్యమాలోచింపుఁడని చెప్పినట్లు మూలమున నుండఁగాఁ దెనుఁగున బ్రాహ్మణుఁడు రుక్మిణియవయవములు వర్ణించినట్లు చెప్పఁబడినది. అందును "కనకరంభాతిరస్కారు లూరువులు. చతురుత్సవదాయి చన్నుదోయి" యను నీరెండుమాటలసహ్యాకరములుగా నున్నవి. బ్రాహ్మణునినోట మూలవిరుద్ధ

ముగా వర్ణనము చెప్పించియుండరాదు. అందును రుక్మిణి యూహవులు పొలిండ్లు వర్ణించినట్లు చెప్పింపరాదు. ఇది యేవను గల్గించుచున్నది. ఏల యిట్టిది చెప్పవలెనో తెలిసికొనఁజాలకు న్నవాఁడ. రెండవపద్యమున నాశీర్వాదము చేసినట్లు చెప్పుట యంత యసంగతముగా తోచనవలయును గాని సీసపద్యము సందర్భానుసారముగా నుండకుండుటయే గాక యేవగింపు కల్గించుచున్నది. వారి మనోభావ మేమో తెలియఁజాలను. అట్లు వ్రాయుట యుక్తమేయన్న భావముగలవా రద్దానిని శిరసావహింపవచ్చును. వారినిగూడ నేను ప్రార్థించెదను ఆ క్షేపకులకంటెఁబడినఁ జెట్టు వాటిల్లకుండునా యనుసందియము నన్నింకను బాధించుచున్నది. ఈవిషయమును వదలి కథను గుఱించి నాలుగుమాటలు వ్రాసెదను.

మహాశయులారా! రుక్మిణి శ్రీకృష్ణునకు విన్నవింప బ్రాహ్మణునిమూలమున బంపినసందేశము శ్రీభాగవతము నందును గర్గసంహితయందును గలదు. బ్రహ్మ విష్ణుపురాణ ములయం దీవిషయమే లేదు. మఱియు నీవివాహకథ యించుకఁగాఁ జెప్పఁబడినది. హరివంశమున రుక్మిణిసందేశము లేదు. కావున భాగవతము ననుసరించియే యీభాగము వ్రాయఁబడినది. గర్గసంహితయందు రుక్మిణీసందేశవార్త చమ త్కారముగా నున్నది. కావున దానిని ముందు వ్రాసెదను. ప్రకృతము భాగవతానుసారముగా వ్రాసిన యీభాగము నుండి నేర్చుకొనఁదగినవిషయ మేమియని యించుక విమర్శింప వలయును. రుక్మిణి భీష్మకునకుఁ గడపటికొమరిక. రుక్మిప్రభృ తులు పుత్త్రులు. వారి యనుజాతయగు రుక్మిణిని వయస్సాఁరి

తను గాంచి భీష్మకుఁడు వివాహముఁజేయుట యుచితమని యెంచి పుత్త్రులను బురోహితులను సుమంత్రులం బిలిపించి సంబంధవిషయమై ప్రశ్నింపఁ బురోహితుండగు శతానందుఁడు శ్రీకృష్ణుని మహిమమును దెలియంజెప్పి యాతఁ పరమపూరుషున కిచ్చుట తగినదని హిత ముపదేశించెను. [illegible] దనిరి తానంద మందెను. రుక్మి కృష్ణుని దూషించి శిశుపాలుని భూషించి యతనికేయిచ్చుట మన కులగౌరవమునకుఁ దగినదని తెల్పెను. ఇంతవరకు శ్రీకృష్ణజన్మఖండమునకు శ్రీభాగవతమునకుం బోలికగలదు. ఇటనుండి వేఱుమార్గములఁ బ్రోక్తమవి. రుక్మిణి తనయన్న భావ మెఱింగి తండ్రి యతనియభిప్రాయమునకు విరుద్ధముగా నడువఁజాలఁడని యాలోచించి యాలసించినఁ గార్యము చెడునని తలంచి యేమిచేయుటకుం దోఁపక క్షణమైన నాలసించిన వివాహదినము సమీపించునని యూహించి తనమేలుగోరిన బ్రాహ్మణు నొక్కరునిం బిలిచి యొరులెఱుంగకుండ శ్రీహరికిం దెల్పఁదగుమాటలం జెల్పిపంపెను. కృష్ణుఁడు రుక్మిణికిం బ్రోత్త పురుషుఁడు. బంధుత్వముకూడ నంతకుముందు లేదు. [illegible] స్త్రీజాదులు కర్ణాకర్ణికగా నాకర్ణించియే యుండుననుకొనవచ్చును. అట్టిపురుషునకు వార్తనుబంపుట మర్యాదయేనా? అంతఃపురకన్యక కిదితగునా? ఆసందేశమును విని యీకన్యకకు మర్యాదయే తెలియదని కృష్ణుఁ దూహింపవచ్చును గదా! అను ప్రశ్నము వచ్చును. ఈప్రశ్నమునకు బదులుచెప్పుటయు గొప్పవిషయము కాదు. చాల యోజింపవలసినదియు లేదు. రుక్మిణిపంపిన సందేశ మెట్టిది? అని తొలుదొలుత నాలోచింపవలయును. కేవల కామాతిరేకతను బోధించునా? భక్త్యతిశ

యమును బోధించునా యుసి. కాముకురాలగు నింతిపల్కు లెట్లుండును ? భక్తిగల పురంధ్రిమాట లెట్లుండును? అని కూడ యోజింపవలయును "శ్రుత్వాగుణాన్ భువనసుందర శృణ్వతాం తే నిర్విశ్య కర్ణవివరైః హరతో౽ఙ్గతాపం" అనునది తుదగాఁగలవాక్యము నర్థము నాలోచింపఁ గాముకియనియుఁ బురంధ్రియనియుఁ గూడ నర్థమిచ్చును. అనఁగాఁ గాముకీపురంధ్రులకు నివి సమానముగనే యర్థమిచ్చుమాట లిందుఁగలవు. ఇంతటితోఁ దృప్తిచెంద రాదు. అచ్యుతయనుసంబుద్ధి యుపయోగింపఁబడినది. "దృశిమతా మఖిలార్థలాభమ్" అనువాక్యము నాలోచింపుఁడు. అచ్యుత యని ప్రియునిబిలుచుట లోకసహజము కాదు. భగవద్విషయముననే యుపయోగించు పదమది. అంతియకాని పరమేశ్వరా! ఆపదుద్ధారకా! అచ్యుతా! సర్వేశ్వరా యనుపదములు కామాసక్తిలగు నారీమణుల పదసమూహంబులనుండి యేకవియు నీవఱకుఁ జెప్పింపలేదు. కావున రుక్మిణి భగవంతుఁడనియే భావించిన దనక తప్పదు. ఇంకను బరికింపుము. "ముకుంద, కులరూపశీల విద్యావయోద్రవిణధామభి రాత్మతుల్యమ్ - నరలోకమనోభిరామమ్" అనువాక్యములఁ బరికింపఁ గేవల కామాసక్తిగల కాంత యూహించుభావము గాక లోకోత్తరగుణశిష్టుఁ డను నర్థము తేలెడిని. ఇట్టివాక్యములను భక్తిశీలములు గలసాధ్వి పలుకునే కాని కామినీతిలకము చెప్పునట్టివి కావు. "వీరభాగం చైద్యః మాభిమర్శతు" అనువాక్యము మర్యాద ప్రధానముగాఁ గలకాంతామతల్లిక పల్కునదియే. దీనిచేఁ గులగౌరవాదులు ప్రధానములే కాని కేవలరూపము ప్రధానము కాదని స్పష్టమగు. "భగవాన్ పరేశ" అను నీ రెండుసంబుద్ధులును

జ్ఞానులు వచింపఁదగునది కావున: కేవల భక్తిభావముకల సీమంతినియని ఘంటాపథముగఁ జెప్పవచ్చును. "పూర్తేష్టదత్త నియమవ్రతదేవవిప్రగుర్వర్చనాదిభిరలమ్" అను సీవాక్యము తొలిజన్మముల నెందైనను వీనిలోఁ గొన్నిగాని యన్నియుఁ గాని చేసియుండినచో "ఆరాధితో యది గదాగ్రజ ఏత్య పాణిం గృహ్ణాతు" అను సీవాక్యము నీవు భర్తవగుట సంభవించునను భావమును గనఁబఱచెడిని. ఇట్టు లీఘట్టమున నేమాట నూహించినను రుక్మిణి భక్తిభావముగల నారీమణి యనియే స్పష్టమగును. కావున భగవంతుఁడని శ్రీహరిని నమ్మినది గావునఁ దనవార్తను బ్రాహ్మణుఁ డెఱిఁగింపఁగా సకలజ్ఞుఁడు గావునఁ దనమనోభావ మెఱుంగకపోఁడని నమ్మినది.

రుక్మిణి పంపినబ్రాహ్మణుఁడు ద్వారకకుం బోవుట కెంత కాలము పట్టును? "శ్వోభావిని" యనఁగా రేపు జరగఁబోవు వివాహమునకనుట సరిపడునా! ఒక్కదినమునఁ బోఁదగునంత దూరమున ద్వారక యున్నదా! యని ప్రశ్నింపఁ గొందఱు పూనుదురు. ఇందు "శ్వః" అనునది యుపలక్షణవిధిచేఁ ద్వరగా వివాహము సాగఁబోవుననుసత్యమును దెల్పెడినని గ్రహించిన నీప్రశ్నమునకవకాశము లేదు. "గుప్తస్సమేత్య" అని యేల చెప్పవలెనన్న నీరాక ముందే తెలిసిన నన్నిదినముననే పాణిగ్రహణమునఁ బరిగ్రహింపుమా యని శిశుపాలుని ద్వరపెట్టుదురేమో యనుశంకను దెలుపును. "రాక్షసేన విధినోద్వహ" అనుదానింబట్టి నీమహిమ నెఱుంగని మూర్ఖులుండినపుడు యుద్ధముకాక తప్పదు కావున యుద్ధమునందు నన్నుఁ గొనిపొమ్మని రుక్మిణిభావమని గ్రహింపవచ్చును. "వీర్యశుల్కామ్" అనుటం

దలంపఁ బ్రతాపమును గనఁబఱుపవలయునే గాని నీమహిమ నెఱుంగఁజాలువా రిట లేరనుభావము కనుపట్టును.

శ్లో. హత్వా ఛిత్వా చ భిత్వా చ క్రోశంతీం రుదతీం గృహాత్,
ప్రసహ్య కన్యాహరణం రాక్షసో విధిరుచ్యతే. 33

మనుస్మృతి. 3 అ.

అనేన కన్యాయామనిచ్ఛోక్తా. గాంధర్వాద్వివేకార్థమ్. అని కుల్లూకభట్టు.

బ్రాహ్మో దైవస్తథైవార్షః ప్రాజాపత్య స్తథాసురః,
గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచ శ్చాష్టమోఽధమః. ౨౧
షడానుపూర్వ్యా విప్రస్య క్షత్రస్య చతురోఽవరాన్,
విట్శూద్రయోస్తు తానేవ విద్యా ద్ధర్మ్యా నరాక్షసాన్. ౨౩
చతురో బ్రాహ్మణస్యాద్యాన్ ప్రశస్తాన్ కవయో విదుః,
రాక్షసం క్షత్రియస్యైక మాసురం వైశ్యశూద్రయోః. ౨౪
పంచానాం తు త్రయో ధర్మ్యా ద్వావధర్మ్యౌ స్మృతావిహ,
పైశాచ శ్చాసురశ్చైవ నకర్తవ్యౌ కదాచన. ౨౫

అత్ర యం వర్ణం ప్రతి యస్యవివాహస్య విధినిషేధౌ తస్యతం ప్రతివికల్పః, సచ విహితాసంభవే బోద్ధవ్యః = అని కుల్లూకభట్టు.

శ్లో. అనిందితైః స్త్రీవివాహైరనింద్యా భవతి ప్రజా,
నిందితై ర్నిందితా నృణాం తస్మాన్నింద్యాన్ వివర్జయేత్.

మనుస్మృతి. 3 అ.

ఇట్టినియమముగల రాక్షసవివాహవిధి నన్నుఁ గొనిపొమ్మా యని రుక్మిణి చెప్పుటంజేసి మాతృపితృభ్రాతృప్రముఖులకుఁ

దెలియకుండఁ దాఁ జెప్పిపంపుట యప్రకాశ్యమని భావము. క్షత్రియులకుమాత్రమే రాక్షసవివాహము చెప్పఁబడినది కనుక దాని నంగీకరింపుమని రుక్మిణితాత్పర్యమని మనము గ్రహింప వచ్చును.

శ్లో. ఆసురో ద్రవిణాదానాద్గాంధర్వస్సమయాన్మిథః,
రాక్షసో యుద్ధహరణాత్పైశాచః కన్యకాచ్ఛలాత్. ౬౧
యాజ్ఞవల్క్యస్మృతి.

ఇట్లు వివాహభేదము లుండుటంబట్టి క్షత్రియోచితమైనదియుఁ దనకపకీర్తిని గల్పింపనిదియు నగుపద్ధతిని బెండ్లియాడుమని రుక్మిణి భావము. కావున నంతఃపురకాంత చేయఁదగినపద్ధతిం బూని రుక్మిణి సందేశ మంపలేదని యెఱుంగునది. ఈసందేశమున నీతిబాహ్యవిషయలేశము లేదనియుఁ గన్యకామర్యాదను బాడుచేయుభాగ మిసుమంతయుఁ గానరాదనియుఁ దెలియందగు.

ఇఁకఁ గృష్ణమూర్తి బ్రాహ్మణునిఁ గుశలప్రశ్న మొనరించినవిషయమును బరికింతము. బ్రాహ్మణధర్మము సంతుష్టి. అదిలేనిచో సద్వృత్తి వదలినట్లేయగు. ఇదియే వృద్ధసమ్మతమగు సదాచారము. ఆధర్మమే సకలకామముల వర్షించును. అనఁగా సర్వార్థము లాతనికిం గల్గును. సుఖియనఁగా సంతుష్టిగలవాఁడే. సర్వాంగతాపము లసంతుష్టివలనఁ గలుగు. సర్వాంగ సుఖములు సంతుష్టివలన నొదవు. యదృచ్ఛాలాభసంతుష్టులై సాధువులై సర్వభూతదయాపరులై యహంకారములేక శాంతముగలిగియుండు బ్రాహ్మణులకుఁ బెక్కుసారులు నమస్కరింతును. అనుటచే బ్రాహ్మణులకు విశేషించి యాశ లేకుండుట,

ప్రాప్తించినదానితో సంతృప్తినొందుట, యనునివియే ప్రధాన ధర్మములని భగవంతుని భావము. ఈవిషయము భగవద్గీతల యందుఁ గూడ శ్రీహరిచేఁ జెప్పఁబడినది.

శ్లో. యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః,
సమస్సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే.

౪ అ. ౨౨.

అప్రార్థితోపనతో లాభో యదృచ్ఛాలాభః తేన సంతుష్టః సంజాతాలంప్రత్యయః. అని భాష్యము. సంతుష్టుఁడు కాని బ్రాహ్మణుఁడు సంతుష్టుఁడగు క్షత్రియుఁడు నశింతురని ప్రాచీనోక్తి గలదు.

అసంతుష్టా ద్విజా నష్టా స్సంతుష్టా ఇవ పార్థివాః. అని. దీనినే భగవంతుఁడు కుశలప్రశ్నరూపమున ననువదించెను. సంతుష్టియనునది యింద్రియవ్యాపారోపరతిం దెల్పును. పూర్వకర్మ ప్రతిఫలరూపముగా నెంత నెవరికి లభించునో దాన వాఁడు తృప్తినొందునేని వానికిఁ గర్మసిద్ధాంతము బోధపడినట్లు తెలిసికొనవచ్చును. అది లేదేని కర్మస్వరూపము వాఁ డెఱుంగఁ జాలఁడని గ్రహింపవచ్చును.

శ్లో. కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్,
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్. ౧౫
ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః,
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ సజీవతి. ౧౬
యస్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే. ౧౭

గీత. 3 అధ్యాయము.

ఈ గీతావాక్యములు పై యర్థమును వెల్లడించుచున్నయవి. కావున నో విప్రుఁడా! నిన్నుఁ జూడఁగా వృద్ధసమ్మతమగు బ్రాహ్మణకులసదాచార మగుసంతుష్టి పొడకట్టుచున్నది. నీకు నమస్కరింతుననఁగా నీవాంఛితములు నెఱవేఱునని స్వాభిప్రాయమును దెలిపెననియుఁ గర్మసిద్ధాంతము తెలిసినఁగాని సదాచారముల తెఱంగెఱుంగ శక్యముకాదనియుఁ, గర్మజ్ఞుఁడు బ్రహ్మస్వరూపమే యనియు నెఱుంగఁ దగును. ఇట్లు లీవిషయము సదాచారములను దెలుపుచు భగవచ్ఛక్తిని బోధించుచు భగవత్ప్రీతికిఁ బాత్రుఁ డెవ్వఁడనువిషయమును సిద్ధాంతమును జేయఁజాలి యున్నది. ఇఁకఁ దంపతికథను వ్రాయవలయును. కాని గర్గసంహితయందు రుక్మిణి విప్రప్రవరునిద్వారా యొక సందేశము వ్రాసిపంపినట్లు గలదు. దానిం దెలుపుట యిప్పుడవసరము కాదనరాదు. దానిం దెలుపుచున్నాఁడను. ఇతరపురాణములయం దీవృత్తాంతము లేదని ముందే వ్రాసితినిగదా.

బ్రాహ్మణుఁడు రుక్మిణిసందేశమును గొని భగవద్దర్శనము లభించునన్న విశ్వాసమున వడివడిఁ బోయి శ్రీకృష్ణునిం గాంచి రుక్మిణిసందేశము నిట్లు తదుక్తప్రకారమే పల్కెను.

శ్లో. స్వస్తి శ్రీకారపంచాఢ్యే నిత్యానందమహోదధౌ,
శ్రీమద్దివ్యగుణైః పూర్ణే కోటిశో నతయో మమ. ౧౧
శమత్రాస్తు చ తత్రాస్తు తతస్త్వత్పత్ర మాగతమ్,
నారదోక్తేన వచసా జ్ఞాతోఽసి ప్రకృతేః పరః. ౧౨
సర్వం జానాసి సర్వజ్ఞ తదా వక్ష్యే వచో రహః,
వీరభాగం తు మాం విద్ధి త్వం గృహాణ మహామతే. ౧౩

మా చైద్యః ప్రతిగృహ్ణీయాద్ వృథా సింహబలిం మృగః,
కథం త్వా ముద్వహే ద్దుర్గే స్థితామితి చ తచ్ఛృణు. ౧౮
పూర్వేద్యుః కులదేవ్యాస్తు యాత్రాస్తి గ్రామతో బహిః,
ఆగమిష్యా మ్యహం యత్ర తత్ర మాం త్వం గృహాణ భోః.

అని దీనింబట్టి యాలోచింపఁగా రుక్మిణిభావము శ్రీభాగవతాభిప్రాయమునే వెల్లడించుచున్నది. అంతియకాక "శ్రీమద్దివ్యగుణైః పూర్ణే" అనుదానింబట్టి శ్రీకృష్ణుని సర్వగుణపూర్ణునిగా నెంచఁగా భగవంతుఁడగు శ్రీమన్నారాయణమూర్తిగా భావించినట్లే స్పష్టమగు. సర్వగుణపూర్ణుఁడు భగవంతుఁడుతప్ప వేఱొకఁ డుండఁ రాదు. కనుక రుక్మిణి భగవంతుని బ్రార్థించు విషయమున సిగ్గునొందఁ బనిలేదని తలంచియే సర్వజ్ఞుఁడని యెఱింగియుఁ గనప్రయత్నము చేయకుండుట పాడిగాదని నిశ్చయించి "సర్వం జానాసి సర్వజ్ఞ" యని తెలిపి యినను విన్నవించుచున్నదానవని మనవిచేసెను. కావున రుక్మిణీసందేశము కులస్త్రీలకు నీతిబాహ్యము కాదనియు, భగవద్విషయమున లోకాచారములఁ బాటింప నవసరములేదనియు నామె మాటలంబట్టియే శ్రీకృష్ణుఁడు భగవంతుఁడని స్పష్టమగుననియుఁ దెలియందగును. ఇఁకఁ దరువాతికథను జిత్తగింపుఁడు.

హరివంశమునుబట్టి యీకథ యించుక మార్పునొందినది శ్రీకృష్ణాదులు కొలువుకూటమునఁ గూరుచుండి లోకవృత్తము నరయుచుండ లోకప్రవృత్తులం దెలుపుమానవులు కొందఱరుదెంచి కృతాతిథేయులై శ్రీకృష్ణా! జనార్దనా! లోకమునఁ గలరాజులందఱు కుండిననగరమునకుఁ బోవుచున్నారు. కుండిననగరేశ్వరున కొకకొమరిత గలదు. ఆరుక్మిణికి

స్వయంవరము సాగుచున్నది. ఎల్లవారు నందుఁ జేరుచున్నారు. శిబిరములు నిర్మింపఁబడుచున్నవి. ఈరాజులందఱు యుద్ధమును గోరువారలే. మదించియున్నవారు. చతురంగబలములంగూడి పోవుచున్నవారు. కావున నందు సంగరము చక్కఁగా సాగును. అని చెప్పఁగా శ్రీహరి భవిష్యద్విషయముల నాలోచించి చతురంగబలములఁ గూడి కుండినసగరమునకుఁ బోయిన ట్లున్నది. దీని తరువాతికథను బ్రయాణకథను వ్రాయునపుడు వ్రాసెదను. కథావిధాన భిన్నిమార్పుల నొందినదని తెలుపుటకే యీవిషయమును వ్రాసితిని. దీని తరువాతికథను రుక్మిణీసందేశమున కనుబంధముగా వ్రాసెదను. కాన సమన్వయము చేసికొనునపుడు భాగవతానుబంధమని తలంపవలయును.

* శ్రీకృష్ణుఁడా బ్రాహ్మణుఁ డిట్లు రుక్మిణివార్తలం దెలుపఁగాఁ బరమానందమంది తన హస్తారవిందమున బ్రాహ్మణుని హస్తమునుబట్టుకొని నవ్వుచు నిట్లు బదులు చెప్పెను. బ్రాహ్మణోత్తమా! నాయందు మనస్సునిలిపి రుక్మిణి యెట్లు నిద్దురగాక కలవిలపాటొందుచున్నదో యట్లే తదధీనమానసుఁడనై నేనును నిద్దురపట్టక చింతాకులమానసుఁడనై యున్నాఁడను.

శ్లో. యథా వినిద్రా మచ్చిత్తా రుక్మిణీ రుచిరాననా,
తథాహమపి తచ్చిత్తో నిద్రాం చ న లభే నిశి.

అని భాగవతము.

---

ఈకథ శ్రీభాగవతము ౧౦ స్కం. ౫౨ అధ్యాయమునుండి గ్రహింపఁ బడినది. తక్కినపురాణములయందుఁ బూర్వము తెల్పిన యధ్యాయములయందలి కథ పూర్తికానందున వానినుండియే గ్రహింపఁబడునని యెఱుఁగవలయు.

దీనికిఁ బద్యము.

ఉ. కన్నియమీఁద నాతలఁపు గాఢము కూరకు రాదు రేయి
నా, కెన్నఁడు నావివాహము సహింపక రుక్మి దలంచు కీడు
నే, మున్నె యెఱుంగుదుఁ బరులమూఁక వధించి కుమారిఁ
దెత్తు వి,ద్వన్నుత మ్రానుద్రచ్చి నవవహ్నిశిఖన్ వడిఁ
దెచ్చుకైవడిన్.

ఇందు మొదటిపాదమున నీ శ్లోకార్థమంతయు నిమిడియున్నది. కాని శ్లోకమునఁ గలయర్థచమత్కృతి యిందుఁ గనఁబడకున్నది.

ఆర్యా! రుక్మిణి సంతాపము నెఱుంగుదును. రుక్మిణి యన్నయగు రుక్మి నాయందలిద్వేషమున నాకొసంగ నిశ్చయించిన తండ్రిప్రయత్నమును వారించెను. ఆవిషయము నెఱుంగుదును. అందుఁ జేరిననీచరాజులఁ జెండాడి యానెలఁతను దెచ్చెదను. రుక్మిణి సదా మదధీనమానసయై యున్నయది. పవిత్రాంగియగు నామెను దారువునుండి పవిత్రాగ్నిశిఖను గ్రహించినట్లు నే నాయనవద్యాంగిని బరిగ్రహించెదను. అని పలికి బ్రాహ్మణుని పుయిలోటమును దొలఁగించి నేఁటికి మూఁడవ దినమురాత్రి రుక్మిణివివాహమని తెలిసికొని

[ఉద్వాహర్క్షం స విజ్ఞాయ రుక్మిణ్యా మధుసూదనః = అనిమూలము. పరశ్వో రాత్రౌ వివాహనక్షత్రమితి జ్ఞాత్వా=అని వ్యాఖ్య. ఇట నక్షత్రమని వ్యాఖ్య గావున లగ్నమని యర్థము గ్రహింపఁదగు. మూలమున ఋక్షమనియే యున్నది. ఋక్షమనఁగా రాశియనియు నర్థము కలదు.]

దారుకుఁడు సారథిగాన నాతనిం జీరి శీఘ్రింబ తే రాయితము చేయుము. అని యాజ్ఞాపించెను. దారుకుఁడును భగవదాజ్ఞను మౌళిందాల్చి సైన్యసుగ్రీవ మేఘపుష్పవలాహకములను నాజా నేయంబులం బూన్చినస్యందనమును సంసిద్ధము చేసితెచ్చి యునిచి హరిదర్శించి ప్రాంజలియై తనప్రయత్నమును విన్న వించెను. శ్రీగోపాలకృష్ణుఁడు బ్రాహ్మణునింగూడి తేరెక్కి రథ వేగమునకు నాత్మ మెచ్చుకొనుచు నా రాత్రియందే యానర్త దేశములుగడచి మఱుదినము విదర్భదేశముం జొచ్చెను.

కుండినపురాధిపతి యగుభీష్మకుఁడు పుత్త్రస్నేహవశంగ తుఁడు కావున శిశుపాలునకుఁ గన్నియ నీయఁబూని వివా హోచితసుహోత్సవములు సేయించెను. రాజవీథులఁ బరిమళో దకములు చల్లఁబడి యుండెను. చతుష్పథములు, ఇతరమార్గ ములు సైసేయఁబడి యుండెను. విచిత్రధ్వజపతాకలు తోరణ ములు చక్కఁగాఁ గట్టఁబడియుండెను. పూలహారములు కట్టఁ బడియుండెను. గంధోదకములు చల్లుటఁ బరిమళములు గుబులు కొను చుండెను. స్త్రీపురుషు లెల్లరు విమలాంబరాభరణముల నలంకృతులై యుండిరి. జానపదు లామహోత్సవమును గాంచ నరుదెంచి క్రిక్కిరిసియుండిరి. సౌధములయందంతట నగరు ధూపములు పరిమళముల నొప్పారునట్లు వేయఁబడుచుండెను. ఈరీతి నగరమంతయు నలంకృతమై యుండెను. పురాలంకా రము కాగా భీష్మకుఁడు పితృదేవతలఁ బూజించి విప్రుల కన్న మిడి విధివంతముగాఁ జేయఁదగు కృత్యములఁ దీర్చి స్వస్తివా చనము చేయించి సర్వకార్యములు తీర్చి వివాహము చేయ సిద్ధముగ నుండెను.

రుక్మిణిని వివాహదినమున మంగళస్నానము చేయించి శుభావహకృత్యముల నామె యభ్యుదయమును గోరి చేయించి నూతనామూల్యాంబరద్వయము ధరింపఁజేసి రత్నమయాభరణముల నలంకరింపఁ బంచి ఋగ్యజుస్సామాథర్వమంత్రముల రక్షాబంధనము చేయించెను. పురోహితుఁ డథర్వమంత్రముల నుపగ్రహమగు నట్టివిధిచే నలరించెను. గ్రహశాంత్యర్థము హోమకర్మము నడపెను. హిరణ్యమును, రజతము, వస్త్రములను, బెల్లముగలిపిన నూవులను, ధేనువులను, సద్బ్రాహ్మణులకొసంగి రాజు తనతనయ కభివృద్ధిగలుగఁ బ్రార్థించెను. ఇవ్విధముననే చేదిదేశాధిపతియగు దమఘోషుఁడు తన తనయుఁడగు శిశుపాలునకు మంత్రజ్ఞులగు బ్రాహ్మణులచే నభ్యుదయోచితకృత్యముల నొనరించెను. మంగళకృత్యములు పూర్ణములు కాఁగా శిశుపాలుఁడు మదధారల భూతలంబును దడపు దంతావళేంద్రసంతతులును, హేమమాలికాభూషితస్యందనంబులును, రత్నాభరణపరిభూషితాజానేయసమూహములును, బదాతులును, బరివేష్టించి రాఁగా రుక్మిణిని బరిణయవిధిచేఁ బరిగ్రహింప సకల బంధురాజులంగూడి కుండినపత్తనమున కరిగెను. సభాముఖమున రుక్మిణీ వివాహవిషయమున జరగిన సంవాదమును భీష్మకుఁడు రుక్మిణిని కృష్ణునకీయ నంగీకరించుటయు లోనగువార్తల నాలకించి యీవివాహసమయమున నెన్నియో విఘ్నములు గలుగును గాన వానినెల్ల నివారించి వివాహము నిర్విఘ్నముగా శిశుపాలునకుఁ జేయించి యాతనిం బ్రీతునింజేసి విరోధులరుదెంచిన పరాజితులం గావించి యవక్రవిక్రమమును జూపి లోకవిఖ్యాతిని గాంచుకోరిక సాల్వుఁడు జరా

సంధుఁడు దంతవక్త్రుఁడు విదూరథుఁడు పౌండ్రకవాసుదేవుఁడు లోనగు శిశుపాలపక్షమున నభినివేశముగల రాజులందఱు వేన వేలుగా యాదవులఁ బొలియించి శ్రీకృష్ణరామాదులం బాఱఁ దోలి జయము శిశుపాలునకు సమకూర్చి పోవఁదలంచుచు వచ్చిరి. * రామకృష్ణులయందుఁ గలద్వేషము తమ్ముం బురికొల్పఁగా రుక్మిణిని సాధించి శిశుపాలునకుం గూర్పఁగోరియుఁ గృష్ణుఁడువచ్చి కన్యకను హరించునేని తత్సహాయార్థము యాదవుల చతురంగబలము లరుదెంచునేని వారిని మార్కొందము. శిశుపాలునకుఁ దోడుపడుదము. అని నిశ్చయించి మనస్సులు యుద్ధాభిలాషాతురములు కాఁగా మఱికొందఱు రాజులరుదెంచిరి. ఇట్లు వివాహార్థ మరుదెంచిన శిశుపాలపక్ష భూపాలకుల చే నాకుండిననగరమంతయు సంభృతమై చూడఁజూడ వేడుకగా నుండెను. నగరశృంగారమును వివాహమహోత్సవమును జూడనేతెంచు జానపదులసంఖ్య యింతయని వచింప ఫణిపతి కేని భాషాపతికే నశక్యమన నింకఁ దక్కుంగలవారిమాట యిట నేటికి? భూమి యీనినట్లే యుండెనని చెప్పుటకన్న వేఱుపలుకు వచింప వలవికాకుండెను. అట్టితఱి శ్రీకృష్ణుఁడు బ్రాహ్మణుంగూడి కుండినపురమును గాంచెను.

† లోకవృత్తాంతజ్ఞు లిట్లు శ్రీహరికిఁ గుండిననగరము సకల రాజేంద్రమండితమని తెలుపఁగా విని శ్రీకృష్ణుఁడు పయనముచేయనెంచుజాడఁ గనఁబఱుప నెఱింగి భోజకులాలంకార

---

* యద్యాగత్య హరేత్కృష్ణో రామాద్యైర్యదుభిర్వృతః, యోత్స్యామస్సహితాస్తేన ఇతి నిశ్చితమానసాః = అని శ్రీభాగవత మూలము.

† ఇటనుండి హరివంశానుసారము కథను వ్రాసెదను.

భూతుఁడగు సుగ్రసేనుఁడు శ్రీకృష్ణునితోఁ గలవిలపాటొం దుచు నిట్లు పలికెను. శ్రీకృష్ణా! యదుకులానందవర్ధనా! నామాట యించుక యాలకింపుము. నీవు లేకున్న మేమెల్ల ననాథులము. నీవున్న మేము సనాథులము. పురుషునితో సంయోగవియోగములుగల పురంధ్రివలె నిన్నుఁగూడిన విడిచిన సనాథానాథనామములు మాకుఁ జెల్లు. నీవు చెంతనుండిన నింద్రునింగూడి ముప్పదిమూఁడుకోట్లు దేవతలు మాపై నెత్తివచ్చినను భీతిల్లువారము కాము. నీ వేయేచోట్లకు విజయార్థివై పోవుదువో మే మాయాతావుల కరుదెంతుము. మమ్ముఁ బిలుచుకొనియే పొమ్ము. అంతియకాని మమ్ము వదలి నీవుపోయిన మేమిట నుండఁజాలము. ఈమాట దివ్యచిత్తమున నవధరింపుమః. అనుటయు శ్రీహరి చిఱునవ్వునఁ దన యుత్సాహమును దెలుపుచు మహారాజా! నీయిష్టానుసారమన్నికార్యములు చేయవచ్చును. నీయిష్టమును దెలిపిన నేను నట్లేచేయ నంగీకరింతును. సంశయింపకుము. అని పలికి యాతని సమ్మతింపఁజేసి రథమునెక్కి కుండినపురమునకుఁ జనియెను. సూర్యుఁడు పశ్చిమాద్రిమాటునకుం బోవుచుఁ బ్రతాపమును జూపక తనయరుణత్వమును దేహముచేఁ దెలుపుచుండఁగా నా కుండినసగరమును జొచ్చెను. రాజమార్గము భూపాలకసాంద్రములై యిసుకచల్లినఁ గ్రిందఁబడునవకాశము లేనట్టు లుండెను. అదొక రంగమండపముగా రాజులు నాటకపాత్రములవలె నొప్పుచుండిరి. అట్టి వివాహమండపమును గాంచుచు శ్రీహరి రాజమార్గమునఁ బోవుచుండెను. అప్పటి శ్రీకృష్ణునాకారము సకలరాజలక్షణలక్షితమై పరరాజభయంకరమై పరమపురుష

లక్షణములుగలిగి విచిత్రతమముగ మెఱయుచుండెను. అపుడు భగవంతుఁడు మనసుచే వైనతేయుని స్మరించెను. భగవన్మానసమునఁ దననామము స్మరింపఁబడఁగనే తనకొఱ కవసరముగలిగెఁగదాయను మహానందమునఁ దనపూర్వరూపమును వదలి సుఖలక్ష్యమగు నాకారమును ధరించి శ్రీకృష్ణుని చెంత నిలిచెను. గరుత్మంతుఁడు రాఁగానే తత్పక్షవాతసంచలితదేహులై మానవులు క్రిందఁబడిరి. పడియు నిలువఁజాలక దొరలాడిరి. దుష్టుల మానసములు గరుడదర్శనమున నురగములవలెఁ జంచలత నొందెను. ఆవిధమును గాంచి గరుత్మంతుఁ డరుగుదెంచెనని తలంచెను. దివ్యమాల్యముల ధరించి యతఁ డొప్పుచుండెను. గరుడుఁడు శ్రీహరిపాదాబ్జములకు వందన మాచరించి తనరాక విన్నవించెను. తనకు ధ్వజవాహనరూపముల నొంపరాయిక మైత్రినెఱపు గరుడునిం గాంచి మధుసూదనుఁ డిట్లు పలికెను. పక్షిరాజా! నీకు స్వాగతము. నీరాక నాకపరిమితానందము నొసంగెను. నీవు భీష్మకునింటఁ బ్రచ్ఛన్నవృత్తి నుండుము. నే నచ్చటికి కరుదెంతును. స్వయంవరమును గనిపెట్టియుందును. అందుఁ జతురంగబలసమేతులగు రాజులెల్లఁ గూడుదురు. ఆవలివృత్తాంత మెఱుకపడఁ గలదు. అని పలికి యతనిం బంపి యథాపూర్వముగాఁ దానును బయనము సాగించుచుండెను. కృష్ణమూర్తి నగరప్రవేశము చేయఁగనే ప్రజలెల్లఁ బ్రముదితమానసులైరి. రాజులెల్లఁ దమతమ దివ్యాయుధముల ధరించి బలముల హెచ్చరించి కడుజాగరూకులై యుండిరి. శ్రీకృష్ణపరమాత్మ తననగరమున కరుదెంచుట విని నీతిశాస్త్రవేత్తయగు భీష్మకుఁడు సబహుమానముగఁ బరాత్పరునెదుర్కొని పాద్య

ము నర్ఘ్యము నాచమనము లోనగు నాతిథేయము లొనరించి తానే సత్కరించి ధన్యోఽస్మి యని ప్రార్థించి తనపురమును బ్రవేశింపఁ జేసెను. కృష్ణాగమనము నూహించియే దివ్యమందిరము నలవరించియుండెను గాన నందు విడియించి యుచితము ర్యాదల నలరించెను. సకలసంభారసంభృతమగు నా రమ్యహర్మ్యమున శ్రీహరి సుఖముగ నివసించెను. భీష్మకుఁ డొనరించిన స్నేహపూర్ణసత్కారమునకు మది నానందించెను.

మహామనీషులారా! బ్రాహ్మణునిమాటల నాలకించి శ్రీహరి బదులుచెప్పినవిషయము పరమరహస్యార్థము గలది. దాని నించుక యాలకింపుఁడు.

శ్లో. యథా వినిద్రా మచ్చిత్తా రుక్మిణీ రుచిరాననా,
తథాహ మపి తచ్చిత్తో నిద్రాం చ న లభే నిశి.

అని భగవంతుఁడు విప్రునితోఁ దెల్పెను. మదధీనచిత్తయై సంతోషమున నోలలాడు ముఖముగలిగిన రుక్మిణి యెట్లు నిద్రగాంచకయున్నదో తదధీనమానసుఁడనై నేను రాత్రుల యందు నిద్రపోవుట లేదు. అనఁగా ననన్యగతికయై రుక్మిణి నన్నే తలంచుచు నన్నే స్మరించుచు నన్నే వినుతించుచు నిద్ర మానియున్నదో యట్లే నేనును సర్వాంతర్యామినగుటఁ దచ్చిత్తము నాకళయే గనుక నిద్రపోవుట లేదనునభిప్రాయమును దెలిపెను. రుచిరాననా! అనఁగా భగవన్నామసంకీర్తనమే ముఖమునకు రుచిరతయని గ్రహింపఁ దగును. రాత్రులయందు నిద్రపోవకుండుటకుం గారణము నామపారాయణ రూపధ్యానాదులుగాక వే తేముండును? అట్టిరుక్మిణిని గాపాడుదునని

భగవంతుని యాశయము. ఈయర్థమును శ్రీహరియే గీతా శాస్త్రమునందు నిర్వచించి యున్నాఁడు.

శ్లో. యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. ౧౧
౪ అధ్యాయము.

యే యథా యేన ప్రకారేణ యేన ప్రయోజనేన యత్ఫలార్థితయా మాం ప్రపద్యంతే తాం స్తథైవ తత్ఫలదానేన భజామి. అనుగృహ్ణామి, అహం ఇత్యేతత్, తేషాం మోక్షం ప్రత్యనర్థిత్వాత్. న హ్యేకస్య ముముక్షుత్వం ఫలార్థిత్వం చ యుగపత్సంభవతి. అతో యే ఫలార్థినః తాన్ తత్ఫలదానేన, యే యథోక్తకారిణ స్త్వఫలార్థినో ముముక్షవశ్చ తాన్ జ్ఞానప్రదానేన. యే జ్ఞానినః సన్న్యాసినో ముముక్షవశ్చ తాన్ మోక్ష ప్రదానేన తథా ఆర్తాన్ ఆర్తిహరణేన, ఇత్యేవం యథా ప్రపద్యంతే యేతాం స్తథైవ భజామీత్యర్థః. తం యథా యథోపాసతే తం తమేవ ఫలం లభతే = ఇతి శ్రుతేః. నపునః రాగద్వేషనిమిత్తం మోహనిమిత్తం వా కంచిద్భజామి. సర్వథాఽపి సర్వావస్థస్య మమేశ్వరస్య వర్త్మ మార్గమనువర్తంతే మనుష్యాః. యత్ఫలార్థితయా యస్మిన్ కర్మణి అధికృతాః యేప్రవర్తంతే తే మనుష్యాః అత్ర ఉచ్యంతే హే పార్థ సర్వశః సర్వప్రకారైః. అని శంకరభాష్యము.

ఈశ్లోకార్థమును దిలకించితిరి గదా. ఎవ్వరేయేఫలము నపేక్షించి నన్ను సేవింతురో వారి కాయాఫలముల నిచ్చి

కాపాడుదును. అనఁగా రుక్మిణి యనన్యచిత్తయై నన్ను సేవించుచున్నది. నాచిత్తము తదధీనముగ నున్నది. కావున నీవు రా నక్కఱలేకయే నే నరుదెంచి యామెకైంకర్యము నంగీకరింతును. నీవేల వచ్చితివయ్యా యని నవ్వునఁ దెలిపెను. అనఁగా నన్ను సామాన్యమానవునిగా భావించితివి కాని సర్వాంతర్యామినని యెఱుంగవైతివి గదాయని తెలుపుటకే ప్రహాసఙ్ అను పద ముపయోగింపఁ బడినది. ఐనను దప్పకయరుదెంచి యామెను బరిగ్రహింతును. రుక్మిణి లక్ష్మ్యంశసంభూతురాలని నే నెఱుఁగనా? నాసహవాసము కలుగమి నామెయందున్న జ్ఞానభానుఁడు వికసింపలేదు. క్రమముగా వికసించునట్లు చేసెదనని శ్రీకృష్ణునిభావమని మన మూహింపవలయును.

ఇంతియకాక శ్రీహరి రుక్మిణిని గైకొని ద్వారకకు వత్తును. అని చెప్పుచు నుదాహరణముగా

"మత్పరా మనవద్యాంగీ మేధసోఽగ్నిశిఖామివ." అని చెప్పెను. యజ్ఞమునందు లౌకికాగ్నిని బరిగ్రహింపక అశ్వత్థము శమీవృక్షము అను వీనిదారువులం దెచ్చి చిలుకుదురు. పరస్పరసంఘర్షణమువలనఁ బరిశుద్ధాలౌకికాగ్ని జనించును. అదియే యజ్ఞీయాగ్ని యనఁబడు. అనఁగా దారువులనుండి యగ్నిని దెచ్చునట్లు రాజలోకమును మథించి యనఁగా దుర్బుద్ధులను మాపి రుక్మిణిని దెచ్చెదను. రుక్మిణి స్వకీయదుర్వారతేజస్సునడంచుకొని యొకానొక రాజపుత్త్రికగా నున్నది. దారువులయం దగ్ని యిమిడియుండి పైనఁ గనఁబడక తెలివిగలవారు శ్రమించి తీసినఁగాని పైకిరానియట్లు తనమహిమము నెఱింగినవారికే తప్ప నితరులకెఱుంగరాని మహత్తరతేజమున

నలరారుచున్నది. ఆవిషయ మెఱుంగఁజాలక యల్పమతు లాక్రమింపఁ బూనిరి. అట్టివారిననఁగా మాతృభావమునఁ బూజింపకయుండువారి నడంచి తెచ్చెదను. రుక్మిణి యాదిశక్తి. లోకజననియునగు ప్రకృతి. ఆమెమహిమము నెవ్వరు నెఱుంగఁ జాలరు. మదభిన్నమూర్తిగాన నే నెఱుంగుదును. ఇతరాధృష్య మహిమము గలరుక్మిణిని దెచ్చుటకింతగా నీవు చెప్పవల యునా? నేనేవచ్చి తెచ్చెదనని శ్రీకృష్ణుని యాశయమని తెలి యఁదగు. ఈయర్థము శ్రీశంకరభగవత్పాదాచార్యులుగారు సూక్ష్మముగ సౌందర్యలహరియందుఁ దేటపఱచిరి.

శ్లో. తటిల్లేఖా తన్వీం తపనశశివైశ్వానరమయీం
నిషణ్ణాం షణ్ణామప్యుపరి కమలానాం తవకళామ్,
మహాపద్మాటవ్యాం మృదితమలమాయేన మనసా
మహాంతః పశ్యంతో దధతి పరమానందలహరీమ్. ౨౧

తటిల్లేఖా విద్యుల్లేఖా తద్వత్తన్వీం దీర్ఘాసూక్ష్మా. జ్యోతిర్మయీ క్షణప్రభాచ స్థిరసౌదామిన్యాః. క్షణప్రభాత్వం ఆజ్ఞాచక్రే క్షణమాత్రదర్శనాత్ అని వ్యాఖ్య.

తపనశశివైశ్వానరమయీమ్. అనఁగా యోగులకు సూ ర్యస్వరూపిణియు, భక్తులకుఁ జంద్రస్వరూపిణియుఁ, క్రూరుల కగ్నిస్వరూపిణియు నని రహస్యము. యోగులు సూర్యమండ లాంతర్జ్యోతి నుపాసింతురు. భక్తులు భగవత్తనువును ధ్యానిం తురు. దుష్టు లవిరెఱుంగ నశింపఁజేయఁ బూనుదురు. కావున వారివారి కట్టియట్టిరూపములఁ దాల్చునని భావము.

శ్రుతి. "హిరణ్యప్రాకారామార్ద్రాం
జ్వలంతీం తృప్తాం తర్పయంతీమ్".

అను శ్రుతి ప్రకృతిరూప మగ్నిశిఖతోఁ బోల్చినది. ఈయర్థముసే శ్రీకృష్ణమూర్తి యించుక తెలిపి విప్రుని మనశ్చింతను బాపెను. రుక్మిణి నిదురింపనపుడు నేనును నిదురింప నవఁగా మాయిరువురకు భేదమే లేదుగానఁ దదానందము తచ్చింతయు నాకు నట్లే కలుగునని తనభావమును స్పష్టపఱచెను. దీనింబట్టి రుక్మిణి యనుపేరుఁ దాల్చి మూలప్రకృతియు, శ్రీకృష్ణనామమున సర్వేశ్వరుఁడును, భూమికిం గలకష్టముల సంహరింప నవతరించిరని సారము. ఇట్టిమహాలక్ష్మిని అంతఃపురకాంతానుచితసందేశ మనువ్యాజమున నాక్షేపించుట మహాపాపము గాక మఱేమగును? లోకాచారమునుబట్టియు దోషము లేదనక తప్పదు. మనసునఁ గామించినభర్తను వదలి మఱొకనిఁగోరుట సాధ్వీలక్షణము గాదు. తొలుదొలుత రుక్మిణి శ్రీహరిని గోరెను. ఏనాఁడుకోరెనో ఆనాఁడే భర్తయయ్యెను. అన్న యింకొకనికీయఁ బ్రయత్నించెను. ఇపుడు రుక్మిణి చేయవలసిన దేమి? తనభావము తా వలచినపురుషునకుం దెలిపి యాపురుషునిం బడయుటయో లేకున్న మృతినొందుటయో యీరెండు సాధనములే కలవుగాని వే ఱుపాయము కానరాదు. మనస్సునందే పెక్కుమందిపై వాంఛనిలుపుట వ్యభిచారమనఁబడును. ఒకప్పుడు తాఁ గోరినపురుషుఁ డంగీకరింపకయున్న నేమిగతి యని కొందఱు ప్రశ్నింపవచ్చును. కాని యీప్రశ్న మట్టిమతులకే తోఁచును. దృఢచిత్తయగువనిత వాంఛ నెఱవేఱనిచోఁ గలుగనేకలుగదు. భగవంతుఁడు సర్వజ్ఞుఁడు గాని మన

వలె నల్పతమజ్ఞుఁడు కాఁడు కావున సాధ్వియగు స్త్రీచిత్తమున భర్తృవిషయమున నెఱవేఱనివాంఛను బుట్టింపఁడు. పతివ్రత కానికాంతకు క్షణవిలక్షణము లగునూహాలు పుట్టుచుండును. కావున నిట్టియాక్షేపణముల కిట నవకాశమే లేదు. ఇంక నీవిష యమును బెంచివ్రాయక తరువాతివిషయమును వ్రాసెదను.

మహామతులారా! శ్రీభాగవతమున నీ తరువాతికథ బలభద్రాదుల యాగమనము, రుక్మిణి తాఁబంపినబ్రాహ్మ ణుఁడు కృష్ణునిం దోడ్కొనిరా నందులకుఁ జింతించుట యను రీతిగా వ్రాయఁబడినది. హరివంశమున నీనడుమ వ్రాయఁ దగినభాగములు కొన్ని చెప్పఁబడినవి. గర్గసంహితయు నీకథ నీరీతిగానే తెల్పెను. భాగవతము ననుసరించి వ్రాసినహరివంశ మునఁ గలకథల కవకాశము కలుగదు. కానఁ దదనుసారముగా నీకథ నిపుడు వ్రాసెద.

## రాజులు కలవరపడుట.

* శ్రీకృష్ణుఁడు గరుత్మత్సహాయుఁడై కుండిననగరమును బ్రవేశించినవార్త తెలియఁగనే రాజులందఱు కలవరపడసాగిరి. వారిచిత్తములయం దొకమార్పు విచిత్రముగాఁ గలిగెను. కావున నంద ఱొకచోటఁ జేరిరి. తమతమబాహుబలములఁ దలంచుకొనిరి. ఆలోచింప సమర్థులు గావున మంత్రాలయమునఁ గూడిరి. నీతిశాస్త్రముల నెఱింగినంతదనుక స్మరించిరి. వారు గూడినతావు భీష్మకునిసభయే. అది హేమపరిష్కృతముగ నుండెను. అందుఁ బెక్కుసింహాసనము లమర్పఁబడి యుండెను.

* ఈకథ హరివంశము విష్ణుపర్వము నలువదెనిమిదవయధ్యాయము నుండి సంగ్రహింపఁ బడినదని యెఱుంగునది.

విచిత్రాస్తరణము లమర్పఁబడి యుండెను. ఆమహాసభం బ్రవేశించి యుచితాసనముల నాసీను లైరి. దానింజూడ నాతరుణమున దేవతలచే నిండియుండు దేవసభవలె నుండెను వారి నడుమ మహాబలపరాక్రమసమగ్రుఁడగు జరాసంధుఁ డుండెను. మహాతేజమున నలరు నాజరాసంధుఁడు దేవేంద్రుఁడు దేవతలకు హితముపదేశించుచందమున రాజులం గలయంబరికించి యిట్లు పలికెను. రాజులారా! నాభావమును వినుఁడు. భీష్మకుఁడు మతిమంతుఁడు. బుద్ధిచే నాలోచించి నేఁ జెప్పుచున్నాఁడను. కృష్ణుఁడనువాఁడు కలఁడుకదా. వసుదేవతనయుఁడని ప్రసిద్ధిగలదు. బలశాలి. వైనతేయసహాయమున నీ కుండిననగరమునకరుదెంచెను. కన్యామణిని బరిగ్రహింపఁబూనియే వచ్చినాఁడు. యాదవులు కొందఱ అతనివెంట వచ్చిరి. కన్యకనుబడయఁ దప్పక ప్రయత్నించును. ఇట్టితఱి నీత్యనుగుణ మగునుపాయ మేది? అది మన మేలునకు హేతువు కావలయును. బలాబలముల నాలోచించి రాజశ్రేష్ఠులగు మీరెల్ల హితాహితకృత్యముల నిర్ణయింపుఁడు. రామకృష్ణు లిరువురు పాదచారులు. మిగుల బలశాలురు. వైనతేయునిగాక వారినిద్దఱిని గోమంతమనుపర్వతమునందు మహాఘోరమగుయుద్ధమున నలయించితిని. మీకు నీవిషయము కొంత తెలిసియుండవచ్చును. వృష్ణియాదవభోజాంధకబలంబులం గూడి యుద్ధముచేయునపు డది యెట్టియుద్ధమగునో యాలోచింపుఁడు. అందును గన్యార్థము ప్రయత్నించుతఱి గరుడసహాయుఁడగు విష్ణునిమాఱ్కొని యుద్ధము చేయ శక్రాదిత్రిదశోత్తములు వచ్చినను వారితోడ్పాటు గలిగినను ఎవ్వఁడు చేయఁగలఁడు? భీష్మకుఁడు కన్యకనీయనిచో

బలవంతముగాఁ బరిగ్రహింపఁ గలఁడు. అట్టితఁడె దేవతలుగూడ నీతనికిఁ దోడ్పడుదురు. పూర్వము మహాప్రళయమున భూమి జలాభ్యంతరమున విలీనము కాఁగా విష్ణువు శక్తి మెఱయ వారాహరూపమును దాల్చి యుద్ధరించెనని విందుము కదా. అత్తరుణముననే హిరణ్యాక్షుఁ డెదుర్కొని పోరి మడిసెను. అతని యన్నయగు హిరణ్యకశిపుఁడు మహాబలపరాక్రమముల నార్జించి బ్రహ్మచే దేవాదిభూతములచే మృతిలేకయుండ వరములను సంపాదించి వెలయుచుండ భూమ్యాకాశములయందుఁ గాక రేయింబవళ్లయందుఁ గాక శుష్కార్ద్రపదార్థములచేఁ గాక ముల్లోకములయం దపరాజితుఁడైన దానవేంద్రుని నరసింహరూపమును ధరించి విష్ణువు వధించెనని విన్నారము కదా. విష్ణువే కశ్యపమునివరునకుఁ దనయుఁడై యుద్భవించి వామనుఁడను పేరునఁ బ్రసిద్ధినిగాంచి యదితిని దల్లిగాఁ బిలుచుచు వృద్ధాసురచక్రవర్తి బలిని సత్యపాశబద్ధుని జేసి పాతాళమునకుఁ బాఱఁదోలెను గదా. కార్తవీర్యుఁడు భుజవీర్యధుర్యుఁడు. సహస్రబాహువు. దత్తాత్రేయప్రసాదమునను రాజ్యమదమునను విఱ్ఱవీఁగి యెదురులేకయుండఁగా జమదగ్నిమునికిని రేణుకాదేవికిని దనయుఁడై త్రేతాద్వాపరములనడుమ శస్త్రధారులలో మేటియనువిఖ్యాతిం గాంచి పరశురాముఁ డనుపేర వజ్రసంకాశమగు పరశువను మహాయుధమున సప్తద్వీపేశ్వరుఁడగుభూపాలుని నొకానొకవ్యాజమున విష్ణువేకదా వధించెను. ఇక్ష్వాకుకులమున దశరథమహారాజపుత్త్రుఁడు రాముఁడు త్రైలోక్యవిజయుఁ డగురావణుని గూల్చెఁగాదే. పూర్వము కృతయుగమునఁ దారకాదిమహాదానవులు వరదానగర్వితులై ఘోర

సంగ్రామ మొనరింప శ్రీమహావిష్ణువు అష్టభుజవిరాజితుఁడై గరుడవాహనారూఢుఁడై యసురలనెల్లఁ బొలియించెను. కాలనేమియను దానవేంద్రుఁడు శక్రునకును భయప్రదుఁడై యుండఁగా నాతనిఁ జక్రాయుధమున వధించినది శ్రీవిష్ణుమూర్తియే కాదే. విశ్వరూపుఁ డగువిష్ణువు మహాయోగప్రభావమున నెందఱురక్కసులనో వధించెను.

ఇప్పు డీకృష్ణుఁడే వనమున ధేనువులఁ గాచుచు వనచరులగు ప్రలంబాదిదానవులఁ జంపెను. అరిష్టుఁడు, ధేనుకుఁడు,శకునియుఁ,గేశియు, యమళార్జునములు,కువలయాపీడదంతావళము, చాణూరముష్టికులు, బలవదగ్రగణ్యుఁ డగుకంసుఁడు గోపవేషమును ధరించిన యీకృష్ణునిచే విలాసమాత్రముగఁ జంపఁబడిరి. ఇట్టి యనేకకృత్యములు వ్యాజమును దేనినోకల్పించి విష్ణువు చేసెను. చేయనున్నాఁడు. కావుననే నేను మీకెల్ల హితముపదేశించు చున్నాఁడను. ఇన్నింటిని బరికించిచూడఁగా నీకృష్ణుఁడు విష్ణువేయని నమ్మెదను. అసురులం బొలియింప సురలకు హితము చేకూర్ప నవతరించినాఁడని నాభావము. ఇతఁడే జగత్కారణుఁడు. పురాణపురుషుఁడు. నారాయణుఁడు. సర్వభూతములకు సృష్టికర్త. వ్యక్తావ్యక్తరూపుఁడు. సనాతనుఁడు. సర్వలోకముల కద్రుశ్యుఁడు. సర్వలోక నమస్కృతుఁడు. అనాది మధ్యనిధనుఁడు. క్షరమని, అక్షరమని, శాశ్వతమని చెప్పఁబడు తత్త్వ మీకృష్ణుఁడే. సచరాచరము లీతని జయింపఁజాలవు. త్రివిక్రముఁడు, త్రిలోకపతి, త్రిదశేంద్రావినాశకుఁడు అని నా దృఢవిశ్వాసము. ఈయభిప్రాయము మథురాయుద్ధమున నాకుఁ గలిగినది. కులీనులై పరాక్రమధనులగు

రాజేంద్రుల కెవ్వనికేని గరుడవాహనము కలదా. కావున నేఁడు విశేషించి జనార్దనుఁడు కన్యార్థమునఁ బరాక్రమము చూపఁగలఁడు. అట్టితఁడే నీగరుడునిముం దేరాజు నిలిచి పరాక్రమము చూపఁగలఁడు? స్వయంవరము చాటించినందున శ్రీకృష్ణుఁడు తానై వచ్చినాఁడు. ఈతని రాకచేతనే మనకనర్థము వాటిల్లినది. మీరు నీవిషయము నాలోచించి యేమి చేయఁదగునని యూహించి యేది యెట్లుచేసిన న్యాయమో యది యట్లు చేయఁబూనుఁడు.

అని యిట్లు మగధనాథుఁడగు జరాసంధుఁడు పలుకఁగా మహాప్రాజ్ఞుఁ డగుసునీథభూపాలుఁ డిట్లు పలికెను. భూపాలశేఖరులారా! మగధనాథుఁడు చక్కఁగాఁ జెప్పెను. మహాయుద్ధమున సాగఁబోవువిషయములనుగూడఁ దెలియఁ జేసెను. గోమంతపర్వతముకడఁ జేసినయుద్ధ మతిఘోరము. అనేక చతురంగబలము లందు హతములైనవి. ఈ సేనలన్నియుఁ జక్రలాంగలాయుధజనితాగ్నిజ్వాలలచే భస్మములుగాఁ జేయఁబడిన వనుట కావంతయు సంశయము లేదు. కావుననే యీమాగధుఁడు రాఁగలకార్యమును జింతించి రాజులకు మహాభీతిప్రదమగుసంగరము సాగునని యుపదేశించెను. భూచరులగు రామకృష్ణులు సంగరమొనరించుచుండ రాజసేనలకు మృత్యుప్రాయులుగాఁ దోఁచుచుండిరి కదా. ఇపుడు సుపర్ణుని యాగమనమును వింటిరికదా. ఆతని పక్షవిక్షేపవాతముల నంబరచరులు తూలిపోయిరి. సముద్రములు కలగుండుపడినవి. పర్వతములల్లాడినది. భూమి గడగడ వడఁకినది. మేమెల్ల భీతిల్లి యకాండప్రళయమా యని యూహించితిమి. ఎప్పుడు గరుడవాహ

నారాధుఁడై శ్రీకృష్ణుఁడు యుద్ధముచేయునో మనము కాదు దేవతలైన రణాంగణమున నిలువఁజాలరు. రాజులకు స్వయం వరమనునది మహానందవివర్ధనము. అనుభావముననే దీనిని బూర్వులు నిర్ణయించిరి. అది సంతోషప్రదము. ఆరుక్మిణి స్వయంవరమండపమున మఱొకని వరించునేని శ్రీహరితో యుద్ధము కాకమానదు. అప్పు డాతనిమార్గోనఁ దరము గాదు. స్వయంవరమున నీదోషముగలదని తెలుపుటకుఁ గాఁ బోలు శ్రీకృష్ణుఁడు వచ్చెను. మనముకూడ వచ్చితిమి. కృష్ణాగ మనము రాజుల కనర్థప్రదము. కన్యాహేతువువలన జరాసం ధుఁడు చెప్పినట్లు మహాపదలు రాజులకు మూడనున్నవి. అని పలికి సునీథుఁ డూరకుండెను.

సాధుమతులారా! జరాసంధసునీథుల యభిప్రాయ మును వింటిరికదా. దీనింగూర్చి వ్రాయఁదగువిషయములు విశే షించి లేవనవచ్చును. కాని యొక్కరహస్యము కలదు. కృష్ణా గమనమున రాజుల కాందోళనము కలిగెను. దాన నందఱొక చోటఁ జేరిరి. అందు గోపాలకృష్ణునిపై సహజద్వేషముగల జరాసంధుఁడే కృష్ణమహిమము నుపన్యసించెను. పదునెనిమిది తడవలు చతురంగబలములం గూడి యుద్ధమున కరుదెంచి మధుర ముట్టడించి యోడిపోయిన జరాసంధుఁడే యిప్పుడుప న్యాసకుఁడు. దీనిభావమేమి? భగవంతుఁడని తెలిసి యుద్ధమున జయింపఁజాలమని స్వానుభవమున నెఱింగియుండియు మరల మార్గోనఁబూను టేలొకో యనఁగా. కర్మము వారిఁ బ్రోత్స హింపఁగాఁ దదున్మత్తులై యొడలెఱుంగక భగవంతుఁ డను భావమును మాని శత్రువుగా భావించి పోరి మడియుచుండిరి.

మృతినొందునట్టిగాని బాధల ననుభవించునట్టిగాని కాలము కానితఱి భగవంతుఁ డనుస్మృతి గల్గును. మరలఁ గర్మము ప్రోత్సహింపఁగా మనస్సులు మాఱుచుండును. జీవులందఱు కర్మపాశములకుఁ జిక్కి యది త్రిప్పినట్లెల్లఁ దిరుగుచునుందురు. అంతియకాని తమశక్తివలన నేకార్యము నెవ్వఁడు చేయఁజాలఁడని దీనిరహస్యము. దీనిని జక్కఁగా మది నిలిపి స్మరించుచున్నయెడల నహంకారము కర్తృత్వరూపమగునది నశించును. దాన భక్తిజ్ఞానములు పొడసూపు. వానిచే భగవత్సేవ పరమగతికి మూలమనుతలంపు లుదయించు. ఇదియ యిందలిరహస్యము. దీనినెఱుంగుటమాత్రము చాలదు. స్వానుభవమునకుఁ దెచ్చుకొనవలయు. ఇంక నీకథనుండి కొన్నివిషయములను విమర్శింపక తరువాతికథను విన్నవింతును.

## రాజులు పరస్పరము సంభాషించుట.

* ఇట్లు సునీథుఁడు పలుకఁగా విని కరూశదేశాధిపతియగుదంతవక్త్రుఁడు యిట్లు పలికెను. భూపాలవీరులారా! జరాసంధమహీపాలుఁడు సునీథరాజచంద్రుఁడు పలికినపలుకులు మనకు హితములనియే తలంచెదను. కాని నాయాశయమును దెలుపుచున్నాఁడను. వారియందు ద్వేషముచేతఁగాని యహంకారముచేతఁగాని చెప్పఁబూనను. విజయలాభము నాకుఁ గల్గవలయుననియుఁ గాదు. వారి యమృతవాక్కులను దూషింపఁబూనితినని భావింపవలదు. వారివాక్కులు నీతిశాస్త్రసారభూతములు. అయినను నా యెఱింగినంతఁదనుక నీతిశాస్త్రము నను

* ఈకథ హరివంశము విష్ణుపర్వము నలువదితొమ్మిదవయధ్యాయము నుండి వ్రాయఁబడినదని యెఱుంగునది.

సరించియే చెప్పెదను. మీరెల్ల నాలకించి సమ్మతమే నంగీకరింపుఁడు. అసమ్మతమేఁ త్యజింపుఁడు. నీతిశాస్త్రసారము నిట్టి మహారాజసభయందుఁ జెప్ప నెవరికిఁ దరమగును? మీకుఁ దెలిసిన విషయములనే స్మరణమునకుఁ దేఁ బలుకువాఁడను.

ఈనగరమునకు మనమెల్ల నెట్లరుగుదెంచితిమో కృష్ణుఁడు నట్లే వచ్చెను. దీన దోషమేమి? మనమందఱము కల వెలపాటొంద నవసర మేమి? ఎల్లరువచ్చుటకుఁ గన్యయే హేతువు? మనమెల్లఁ గలిసియే గోమంతపర్వతమున రామ కృష్ణుల నరికట్టఁ దలంచి యుద్ధముచేసితిమి. ఆయుద్ధదోషము నేల చెప్పఁగూడదు? వీ రిరువురు వనవాసముచేయుచు వీరు లనఁబడుచుండిరి. దేవర్షియగు నారదవాక్యానుసారము బృందావనతటములఁ దిరుగుచుండిరి. కంసుఁడు వారిని వధింపఁ బూని పిలువఁబంచెను. ద్వారమునం దొకమదద్విరదము నునిచి దానిచేఁ జంపింపఁ జూచెను. కాని వారే దానిం బొలియించి ప్రవేశించిరి. స్వవీర్యము నాశ్రయించియే రంగమండపమున గతాసువువలెఁ గూరుచున్న కంసుని వధించెను. వయసునఁ బెద్ద వారమగు మనమెల్ల నారోపింపఁ దగుదోష మిందేమి కలదు? మనమచటికిఁ గృష్ణు నిరోధింపఁబూనియే పోతిమి. సేనాసన్నాహాదులం గాంచి సోదరులిద్దఱు గోమంతమునకుఁ బాఱిపోయిరి. మధురానగరమును యాదవబలమును వదలిపోయిరి. అంతటను బోనీయక మనము వారిం దఱుముకొని పోతిమి. అపుడు వా రప్రాప్తయౌవనులు.మనతో సమానముగా యుద్ధమునకు రారైరి. అప్పటికిని వారిని వదలక క్షత్త్రధర్మము నుద్దీపింపఁజేయఁ బర్వతమును గాల్చితిమి. మనతోఁ గృష్ణుఁడు

ప్రతియుద్ధము చేయఁడయ్యె. కావున నాయుద్ధమున వారిద్ద ఱిని దూషింప నవకాశము లేదు. మన మెందెందుఁ బోవుదు మో యందందు సంగరము ప్రత్యక్షమగును. ప్రీత్యర్థము కృష్ణునితో మాటలాడుదము. ఈనగరమునకుఁ గలహమును గోరి కృష్ణుఁడు రాఁ డయ్యెను. కన్యార్థము వచ్చినవాఁడు. ఎవ రితో యుద్ధముచేయును? మర్త్యలోకమున నవతరించిన మహా పురుషుఁడు గాని ప్రాకృతుఁడుమాత్రము కాఁడు. దేవతోత్త ముఁడగు పురుషోత్తముఁడె శ్రీకృష్ణుఁడు. దేవతలకుఁ గర్త. లోకనిర్మాణమునకుఁ గారణ మీతఁడే. కృష్ణునకు మూఢబుద్ధి లేదు. ఈర్ష్య లేదు. మత్సరము లేదు. కృష్ణుఁడు స్తబ్ధుఁడు కాఁడు. బలహీనుఁడు కాఁడు. ఆర్తుఁడు కాఁడు. అంతియ కాక మీఁదు మిక్కిలి ప్రణతార్తిహరుఁడు. ఈకృష్ణుఁడు సర్వలోక ప్రభువు. దేవుఁడు. దేవదేవుఁడు. గరుడసహితుఁడై వచ్చిన వాఁడు. కన్యాస్వయంవరహేతువును బూనివచ్చినాఁడు. సర్వా స్త్రసహితుఁడై శత్రునాశనాగ్రహము పోవుచుండును. ఇది శుభ యాత్ర. మనప్రీత్యర్థమె వచ్చినాఁడని తలంపఁజను. యదు వృష్ణిభోజాంధకప్రభృతివీరులం గూడి వచ్చియున్నాఁడు. కావున నర్ఘ్యపాద్యాదులగు పూజాద్రవ్యములఁ బూజింపవల యును. మనమెల్లఁ గేశవుని బూజింతము. అంతియ కాక శ్రీకృ ష్ణునిగూడి నివసింతము. సంతాపము లుండవు. భయము గలు గదు. సర్వవిధముల సుఖసమృద్ధులే కలుగును.

అని యిట్లు బుద్ధిమదగ్రగణ్యుఁ డగుదంతవక్త్రుఁడు పలు కఁగా విని వక్తలలో మేటియని పేరుగాంచిన శాల్వుఁడు రాజ పుంగవులం గాంచి యిట్లు భాషించెను. రాజేంద్రులారా!

మనము భయపడవలసినంతయవసరము నాకుఁ దోఁపకయున్న యది. శస్త్రాస్త్రములఁ దాల్పుఁడు. కృష్ణునకు భయంపడి యత నితో సంధింపవలయునని నాభావము కాదు. పరుని స్తుతించి లాభమేమి? మనబలశౌర్యముల దూషించుకొననేల? క్షత్రి యధర్మమున నిలిచియున్న రాజుల కిది న్యాయముకాదు. మీ రంద ఱుత్కృష్టరాజవంశముల జనించితిరి. కులవర్ధనులని పేరు సంపాదించితిరి. అట్టి మీ కెల్ల నీచపురుషులకుఁ గలుగఁదగిన యీ యల్పబుద్ధి యేలకలిగెనో తెలియఁ జాలకున్నాఁడను. ఈకృష్ణుఁడు సనాతనుఁడని, ఆదిదేవుఁడని, సర్వదేవాదిదేవుఁ డని, నిర్జరేంద్రప్రభుఁడని, నారాయణపరాయణుఁడని నే నెఱుంగుదును. వైకుంఠుఁడని, చరాచరగురువనియు నెఱుంగు దును. దేవకీగర్భమునుండి యవతరించిన సర్వలోకనమస్కృ తుఁడనియు నెఱుంగుదు. కంసభూపాలుని వధియించి భూభార మును బాప మనవంటిభూపాలకులఁ బొలియింప లోకమును ధర్మపద్ధతిఁ బొదలునట్లు రక్షింప నవతరించినవాఁడు విష్ణువని నేను మున్నె యెఱుంగుదును. సంగ్రామరంగమున భగవంతుఁ డగు శ్రీకృష్ణుని మారొ్కని చక్రమహాయుధజ్వాలాదగ్ధాం గులై సుఖధామమునకుం బోవుదము. తత్వము నే నెఱుం గుదు. భూపాలకులారా! ఆలకింపుఁడు. కాల మాసన్నము కాఁగా మనుజులయాయువు క్షీణించును. * కాల మాసన్న ముకాదేని జంతువు మృతిని గాంచదు. కాలము సమీపింప బ్రదుకుటయును లేదు. ఈసిద్ధాంతమును మది నిలుపుకొని యెవఁడుగాని భయపడరాదు. భగవంతుఁడగు నీశ్రీహరి తప

---

* నాకాలే మ్రియతే కశ్చిత్ప్రాప్తే కాలేన జీవతి-అని మూలము.

స్సు నశింపఁగా దానవులఁ బోలియుంచును. ఎవ రెవరి కెప్పు డెపుడు కాల మాసన్నమగునో భగవంతునకుఁ దెలియును. మహాబలుఁడై యవధ్యుఁడు నగు బలిచక్రవర్తిని బంధించి పాతాళ లోకమున నుండునట్లు చేసినవాఁ డీకృష్ణుఁడే. ఈ మొదలగు విష్ణు చేష్టితములు నే నెఱుంగుదును. కావున మీరు యుద్ధమును గుఱించి భయపడరాదు యుద్ధార్థియై శ్రీహరి యిచ్చటికి రాలేదు. ఎవని కెవ్వరికవ్యక్త భార్య గావలసినో వాని నాపా వరించును. కావున మది భీతి నునుపక సుఖముండుదము.

ఇట్లు రాజు లెల్లఁ దోఁచినచందమున సంభాషించుచు నొకరికొక రుపదేశించుచునుండ నాసభలోఁ గూరుచుండిన భీష్మకుఁడు పుత్త్రునివలనిస్నేహమున నొరెత్తి యొక్క మాట యుఁ జెప్పఁడయ్యె. తన తొలికొడుకగు రుక్మి మహాబలపరా క్రమోపేతుఁ డనియు, భార్గవాస్త్రాభిరతుఁ డనియు, రణప్ర చండాతిరథుఁడనియు మదినమ్మి నిశ్చయముగానుండి యింకనైన మాటలాడకయున్న మర్యాదకాదని తలంచి యిట్లు పలికెను. నాకొడుకు బలదర్పితుఁడై కృష్ణుని జెరికిం గొనఁడు. రణమున నిత్యాభిమానము గలవాఁడు. ఎవ్వరికైనను భయంపడఁడు. శ్రీకృష్ణుని బాహుపరాక్రమమునకు నిలువఁజాలఁడు. ఇందు లకు సందియ మించుకంతయు లేదు. మహాపురుషవిగ్రహము సాఁగఁగలదు. ద్వేషియు నహంకారమునుగల నాకుమారుఁ డెట్లు జీవింపఁగలఁడు ? శ్రీకృష్ణునివలన నాకొడుకు ప్రాణములు నశించునని తలంచెదను. పుత్త్రికాకారణమున జ్యేష్ఠపుత్త్రుని, చిత్రపంతోషవర్ధనుని శ్రీకృష్ణునితో యుద్ధముచేయనిమ్మని యె ట్లూరకుందును. ఈతనిమాట విని నేనెట్లు మార్కొందును ?

నారాయణమూర్తిని దర్శించి నాకొడుకు వరముడుగ నిచ్చియుం డెడు. మూఢుఁడు. మదోన్మత్తుఁడు. సంగ్రామమున వెనుకతిరుగువాఁడు కాఁడు. తూలరాశి యగ్నివలన భస్మమైనట్లు నాకొడుకు మృతినొందఁ గలఁడు. కరవీరపురాధిపతి శృగాలుఁడు చిత్రయోధియు బలశాలియు నగు శ్రీకృష్ణునిచే క్షణమున భస్మరాశి యయ్యెను శ్రీహరి బృందావనమున నివసించెను. గోవర్ధముఁ నెత్తి యేడుదినము లొకహస్తమున నిలిపినాఁడు. దుష్కరకర్మము లెన్నియో యొనరించెను. వానిం దలఁచుకొనిన నామన స్సడలుచున్నది. శచీపతి దేవతలంగూడివచ్చి యభిషేకించి యుపేంద్రుఁడవని పొగడెను. యమునాహ్రదమునఁ గాళీయఫణిపతి విషాగ్నిజ్వాలల విజృంభిఁగుచుఁ గాలాంతకసమప్రభుఁ డైయుండ నవలీలగా మదమడంచెను. కేశి యనుదానవుఁడు హయరూపముననుండి హరిచేఁ జంపఁబడియెను. సాందీపనికుమారుఁడు సాగరమునఁ జిరకాలమునకు ముందే నశించెను. ఆబాలునిహరించిన పంచజనుఁ డనుదానవుని శ్రీహరి చంపి యమమందిరమునుండి కుమారుని దెచ్చియిచ్చి సాందీపనిని సంతోషపఱచెను. గోమంతమున జరగిన మహాసంగ్రామమున సోదరు లిరువురు చూపిన విచిత్రపరాక్రమమున మాచతురంగబలములు భస్మములయ్యెఁ గదా. ఈయుద్ధము దేవదానవాదులకుం జేయ నశక్యమైనది. ఆపరాక్రమమును దలంచుకొన్న నామనస్సు కలవిలపా టొందుచున్నది. వాసుదేవునివంటి మహాత్ము నీవఱకీలోకమునఁ జూడలేదు. నేను వినను లేదు. దంతవక్త్రుఁ డీవిధమును జక్కఁగా నిర్వచించెను.

నాకొడుకునకు బుద్ధిచెప్పి యోగ్యమైనాని జేయఁదగినకార్యమును జేసెదను.

అని పలికి భీష్మకుఁడు బలాబలములను విచారించి శ్రీకృష్ణుని సమ్మతింపఁజేయఁబోవ నూహించెను. పెక్కుమంది నీతిశాస్త్రవేత్తలం గూడి సూతమాగధవందిజనులు పరివేష్టించి రాఁగాఁ దెల్లవాఱుజామునఁ జేయఁదగిన యుషఃకాలికకృత్యములం దీర్చి పయనముచేయ సిద్ధముగా నుండెను. రాజులు మేల్కాంచి కార్యములం దీర్చి తమతమవిడుదుల సుఖముగా నుండిరి. మఱికొందఱు కృష్ణపరాక్రమోద్యోగముల నాలకించి జ్వరపీడితులుపోలెఁ దపించుచుండిరి. కొందఱూఱటం గాంచక యేమిచేయను దోఁపక యుండిరి. నృపతులకుం గల్గిన మనోభేదము నెఱింగి భీష్మకభూపాలుఁడు చిత్తము కలవిలంపడఁగా నరదేవసమాజమునకుఁ బోధింపఁబోయెను. పెండ్లికిం బిలువంబోయిన దూతలెల్ల మఱలెంచి తమకృత్యములను రాజునకు నివేదించిరి.

మహామతులారా! ఇం దొక్క విషయము చక్కఁగా విచారింపఁ దగినది. దంతవక్త్రుఁడు శ్రీకృష్ణునకుఁ గలశత్రువులలోఁ బ్రధానుఁడని మన మెఱుంగుదుము. ఆతనియుపన్యాసమును వింటిరి. కేవలజ్ఞానులు వచించినట్లు లున్నవికదా. ఏల యిట్లు పలికెను? అను ప్రశ్నము రాకమానునా. సమాధానమేమి? వినుఁడు సురాసురులు భగవదాజ్ఞానుసారమే ధరణి నవతరించిరి. భూభారము హరింపవలయును గానఁ బరస్పరద్వేషమూనిరి. రెండుపక్షములు గాకయున్న యుద్ధములు పొసఁగవు. అవి కలిగినఁగాని యనేకమానవు లొక్కచో మృతిఁ

గాంచరు. అది సిద్ధించినఁగాని భూభారము తగ్గదు. ఈ తత్త్వ మెఱుంగక మనమొక్కపక్షము నాక్షేపించి వేఱొకపక్షమును ప్రేమింతుము. అది పొరపాటు. రెండుచేతులు కలిసినఁగాని చప్పు డుప్పతిల్లనట్లు రెండుపక్షములుగా మానవులు చీలినఁగాని కార్యము సాగదు. అందులకేకదా భగవంతుఁ డవతరించెను. ఆయనకు సాయముచేయుఁబొంటె దేవదానవు లవతరించి పోరాడుదురు. వారింగూడి మానవులు పెక్కండ్రు సంగరమునఁ జత్తురు. అవతారకార్యము సఫలమగును. దాన లోకమునకు మేలు చేకూరును. ఇందు దూషింపఁదగినవారు దేవతలా, దానవులా, ఎవ్వరును గారు. వీరు ద్వేషింపకయున్న లోకమునకు నుపకారము కలుగదు. మనయుపకారమునకై పాటుపడినవారిని మనమాక్షేపించుట యుక్తమో యయుక్తమో తీర్మానింప మీకే వదలుచున్నాఁడను. ఈ విషయము శ్రీకృష్ణమూర్తి భగవద్గీతాశాస్త్రమునం దిట్లు తేఁటగాఁ దెల్పెను.

శ్లో. అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత. ౧౮
య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్,
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే. ౧౯

న జాయతే మ్రియతే వా కదాచిన్నాయం
భూత్వా భవితావా న భూయః.
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. ౨౦
వేదావినాశినం సత్యం య ఏన మజమవ్యయమ్,
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్. ౨౧

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ. ౨౨
నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః,
న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః. ౨౩
అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ,
నిత్యస్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః. ౨౪
అవ్యక్తోఽయమచింత్యోఽయమవికార్యోఽయముచ్యతే,
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి. ౨౫
అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతం,
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి. ౨౬
జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హతి. ౨౭
అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా. ౨౮
ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః
ఆశ్చర్యవచ్చైన మన్యశ్శృణోతి
శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్. ౨౯

౨ అధ్యాయము.

ఈవాక్యములంబట్టి యొకరినొకరు ద్వేషింపనుగాని ప్రేమింపను గాని స్వతంత్రులు కారనియుఁ బరమాత్మయే జీర్ణతనువులఁ

ద్వేషించుననియు నందులకుఁ గొన్ని హేతువులఁ గల్పించుననియు నొకరినొకరు చంపుకొనుట కల్లయనియు నదియు నొక వ్యాజముగాఁ గల్పించి భగవంతుఁ డాతనువులఁ బాయుననియు సారము గ్రహింపఁదగును. ఈరీతినుండఁగా దంతవక్త్రాదుల దూషించుట యెట్లు? మఱొకరిని భూషించు టెట్లు? ఇన్నింటికిఁ గర్త పరమేశ్వరుఁడు కాని మఱొకఁడు కాఁడు. కావున శిశుపాలాదులు భగవత్కార్యమునకు సాయబడఁ బుట్టినవారే కాని వేఱుకారణమునఁ గాదు. జ్ఞాను లీవిషయము నెఱింగినవారు కావున లోకప్రవృత్తికి విముఖులగుదురు. జ్ఞానహీనులగువారు శత్రుమిత్రత్వములఁ బాటించి లోకవృత్తమున మునిఁగి తేలుచుందురు. భేదమింతయే యని యెఱుంగుటయే యీకథాపఠన ఫలము. ఇఁకఁ దర్వాతికథను బఠింపుఁడు.

మహాశయులారా! దీనితరువాత హరివంశమున నున్న కథ భాగవతకథ కతివిరుద్ధము. కావున దీనిని నిలిపి రుక్మిణివృత్తాంతమును వ్రాసెదను. పిమ్మట హరివంశకథను గలుపుచు వ్రాసెదను. క్రొత్తగాథలను సంగ్రహించి వ్రాయుచు రుక్మిణీ కల్యాణమును బూర్తిచేసెదను.

### రుక్మిణి కృష్ణాగమనమును గోరి పరితపించుట.

* శ్రీకృష్ణుఁడు భాగవతమురీతిగా నింకను గుండినపురమును జేరలేదనియు మార్గమున వచ్చుచున్నాఁడనియు నూ

---

* ఈభాగము శ్రీభాగవతము ౧౦ స్కం.౫౩ అధ్యాయము ౨౧ వ శ్లోకమునుండి తరువాతివిషయముగా వ్రాయఁబడినదని యెఱుంగునది. గర్గ భాగవతమున నీవిషయము సూక్ష్మముగఁ జెప్పఁబడినది గాని దీనియందే యది యంతర్భూతమని యెఱుంగవలయు.

షించి యీభాగమును జదువవలయును. రుక్మిణి బ్రాహ్మణుని శ్రీకృష్ణునిచెంతకుం బంపినదాదిగాఁ దదేకాగ్రచిత్తయై తదాగమనమును బ్రతీక్షించుచుండెను. కాని బ్రాహ్మణుఁడు కాని శ్రీకృష్ణుఁడుకాని కనఁబడలేదు. వివాహమున కవకాశ మొక్క రాత్రియే యున్నది. అని మనంబునఁ దలంచి యేకాంతమునఁ గూరుచుండి యదృష్టహీనురాల నగునాకు వివాహకాలమునకు నడుమ నొకరాత్రియే యవకాశ మున్నది. పంకజాక్షుఁడు నావలచిన శ్రీకృష్ణుఁడు రాఁ డయ్యెను. కారణ మేమని యెఱుంగఁజాలక యున్నాను. నేఁ బంపిన సందేశహరుఁ డగుబ్రాహ్మణుఁడును రాఁడాయె ? ఇంతదనుక నా ద్విజప్రవరుజాడయే తెలియలేదు. కృష్ణుఁడు రాఁదలఁచియే నేను బంపినబ్రాహ్మణునిం బంపలేదు. అట్లుగాక నావృత్తాంతము జుగుప్సను బుట్టింపఁగా మానుకొనెనో. వచ్చినపని విఫలమయ్యెనే యని యీబ్రాహ్మణుఁడును రాఁజాలకపోయెనా యేమి? ఏది నిర్ణయించుటకు నవకాశము లేకున్నది. నాభార్యాత్వము నంగీకరించునో శ్రీహరి యంగీకరింపఁడో. అదృష్టహీనురాల నగునాకుఁ దండ్రియు ననుకూలుఁడు కాకున్నవాఁడు. పరమేశ్వరుఁడు నాయందుఁ దయగలవాఁడుగా లేఁడు. భగవతి పరమేశ్వరి గిరిజాదేవియు నాకుఁ బ్రసన్నురాలు గాలేదు.

ఈఘట్టమున మూలమున కనుకూలింపకున్నను శ్రీపోతనగారి పద్యరత్నము లనవద్యములుగా నున్నవి. వాని నిందుఁ బొందుపఱుపక తప్పదు.

శా. లగ్నం బెల్లి వివాహముం గదిసె నేలారాఁడు గోవిందుఁ
డు, దిగ్నంబయ్యెడి మానసంబు వినెనో వృత్తాంతముం

బ్రాహ్మణుం, డగ్నిద్యోతనుఁ డేటికిందడసె నాయత్నంబు సిద్ధించునో, భగ్నంబై చనునో విరించికృత మెబ్భంగిం బ్రవర్తించునో.

మ. ఘనుఁడా భూసురుఁ డేగెనో నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో, విని కృష్ణుం డిదితప్పుగాఁ దలఁచెనో విచ్చేసెనో యీశ్వరుం, డనుకూలింపఁ దలంచునో తలపఁడో యార్యామహాదేవియుఁన్, ననురక్షింప నెఱుంగునో యెఱుఁగదో నాభాగ్య మెట్లున్నదో.

అని వితర్కించుచు.

ఉ. పోఁడను బ్రాహ్మణుండు యదుపుంగవువీటికి వాసుదేవుఁ డున్, రాఁడను నింకఁబోయి హరి రమ్మనిచీరెడు నిష్టబంధుఁ డున్, లేఁడను రుక్మికిం దగవు లేదిటఁ జైద్యున కిత్తునంచు ను, న్నాఁడను గౌరికీశ్వరికి నావలనం గృపలేదు నేఁడనున్.

(ఈపద్యము స్వకపోలకల్పితము.)

ఉ. చెప్పదు తల్లికిన్ దలఁపుఁజిక్కు దిశల్ దరహాసచంద్రికం గప్పదు వక్త్రతామరసగంధసమాగతభృంగసంగమున్ రొప్పదు నిద్రఁగైకొన దురోజపరస్పరసక్తహారముల్ విప్పదు కృష్ణమార్గగతవీక్షణపంక్తులు ద్రిప్ప దెప్పుడున్.

(ఇదియుఁ బైయట్లే)

చ. తుడువదు కన్నులన్ వెడలుతోయకణంబులు కొప్పుఁ జక్కఁగా, ముడువదు నెచ్చెలిం గదిసి ముచ్చటకుం జన దన్న మేమియుం, గుడువదు నీరముంగొనదు కూరిమిఁ గీరముఁ జేరి పద్యమున్, నొడువదు వల్లకీగుణవినోదము చేయదు డాయదన్యులన్.

(ఇద్దానికి మూలము వారిమనస్సే.)

సీ. మృగనాభి యలఁదదు మృగరాజమధ్యమ
జలములనాడదు జలజగంధి
ముకురంబుఁ జూడదు ముకురసన్నిభముఖి
పువ్వులు దుఱుమదు పువ్వుఁబోఁడి
వనకేళిఁగోరదు వనజాతలోచన
హంసంబుఁ బెంపదు హంసగమన
లతలఁబోషింపదు లతికాలలితదేహ
తొడవులు తొడవదు తొడవుతొడవు

ఆ. తిలక మిడదు నుదుటఁ దిలకినీతిలకంబు
కమలగృహముఁ జొరదు కమలహస్త
గారవించి తన్నుఁ గరుణఁగైకొన వన
మాలిరాఁడు తగవుమాలి యనుచు.

ఈపద్యమునందు నొకచమత్కారము పోతనగారు కల్పించిరి. ఇందుఁ బేర్కొనినపనుల జేయనందులకుఁ గారణము వనమాలి తన్ను గారవించి కరుణఁ గైకొనరాఁడని తెల్లమగును. దాని కింగారణము తగవుమాలి అనుచు. అని చెప్పఁబడినది. దీనిరహస్యార్థమేమనఁగా, భగవంతునికిఁ బత్నిసగుటకే యవతరించి నిరంతరము హరిపదారవిందములనే తలంచుచు మనోవాక్కాయములను త్రికరణముల నొరులఁ దలంపక మనశ్చింతలఁ బొగులుచున్న నన్ను, దుర్విదగ్ధుఁడై మాయన్న నీచతముఁడగు శిశుపాలున కిచ్చి రొల్లియే వివాహము చేయనుండఁగా శిశుపాలుఁడు జరాసంధాదులం గూడి పురమునకు వచ్చియుండఁగా నిఁక నేమిగతియని మరణతుల్యావస్థలో నున్ననన్ను ఎన్ని

జన్మములను నీవు ధరించిన నన్ని జన్మములలో రూపాంతరముల నామాంతరముల నిన్నే సేవించుననన్నుఁ గరుణచేత గారవించి వనమాలి పాణిగ్రహణముచేయ నేలరాఁడని చేయఁదగుపనుల నెల్ల మానెనని కవితల్లజుని భావమైనట్టు కనుపట్టు. ఎంతటి మంచియాలోచన మిందున్నది? సెబాసని మెచ్చవచ్చుఁ గదా యీసద్భావమునకు.

ఇంకను దృప్తినొందక మహాకవి రుక్మిణికిఁ గృష్ణదర్శనముకామిఁ గలిగిన పరితాపమును వర్ణింపఁబూని

మ. మలఁగున్ మెల్లనిగాలికిన్ బటురటన్మత్తద్విరేఫాళికిన్
దలఁగున్ గోయిలమ్రోఁతకై యలఁగు నుద్యత్కీరసంభా
షలం, గలఁగున్ వెన్నెలవేఁడిమిన్నలఁగు మాకందాంకు
రచ్ఛాయకుం, దొలఁగుం గొమ్మ మనోభవానలశిఖాదో
దూయమానాంగి యై.

అని పలికి యించుక తృప్తినొందిరి. ఈఘట్టమున నాలుగుమాటలు వ్రాయక తప్పినది కాదు. రుక్మిణి కాసమయముననున్న చింతలో మదనానలవేదనల కవకాశమును గల్పించుట. తద్గుణముల వర్ణించుట సరసముగాదని నాభావము. ఇదియుక్తమే యనుపెద్ద లుండిన వారికి నమస్కారము. తాఁ బంపినబ్రాహ్మణుఁడు పోయెనో లేదో ఆమెమది స్థిరపడలేదు. భగవంతుఁడు వచ్చునో రాఁడో తెలియఁబడలేదు. ఇదిట్లుండఁగా నగరమునకుఁ దన్ను బలవంతముగనైన వివాహము చేసికొనఁ గోరి మహాబలములఁ గూడి మిత్రులగు రాజాధిరాజులం గూడి శిశుపాలుఁడు వచ్చియున్నాఁడు. రేపే వివాహమునకు నిశ్చయింపఁబడినలగ్నము. ఈరాత్రియొక్కటియే నడుమ నున్నది.

ఈస్థితియం దున్నరుక్మిణికి నందును మహాగుణశాలినికి మదన తాపము గలిగినట్లు వర్ణించుట యుక్తమే యని నాయల్పబుద్ధికిం దోఁపలేదు. ఇంకను దీనిం దడవక తరువాతికథకుఁ బోవుచున్నాఁడను.

ద్వారకానగరమునందలి వృత్తాంత మేమని యించుక విచారింతము.

శ్లో. శ్రుత్వైతద్భగవాన్ రామో విపక్షీయనృపోద్యమం,
కృష్ణం చైకం గతం హర్తుం కన్యాం కలహశంకితః. ౧౯
బలేన మహతా సార్ధం భ్రాతృస్నేహపరిప్లుతః,
త్వరితః కుండినం ప్రాయా ద్గజాశ్వరథపత్తిభిః. ౨౦

అని మూలము.

సర్వజ్ఞుఁడగు బలరాముఁడు శిశుపాలాదులవృత్తాంత మెఱింగి శ్రీకృష్ణుఁ డొక్కఁడే రుక్మిణిని దేఁ గుండిననగరమునకుం బోయెను. అందు జరాసంధాదులును జేరిరని వింటిని. కలహము కాక తప్పదు. అని యూహించి భ్రాతృస్నేహపూరితాంతఃకరణుఁడు గావునఁ జతురంగబలములం గూడి త్వరపడి కుండిననగరమునకుఁ బ్రయాణము సాగించెను. ఈసైన్యములు వెనుక వచ్చుచుండఁగా శ్రీకృష్ణుఁడు దారుక సారథియై విప్రోత్తమునింగూడి కుండినమ్మును జేరెను. శ్రీకృష్ణుఁడు నగరమును బ్రవేశింపఁగనే చింతాకులమానసయగు రుక్మిణీదేవికి శుభనిమిత్తములు తోఁచెను. వామభాగమునందలి యూరువు బాహువు నేత్రము శ్రీకృష్ణునిరాకఁ దెలుపుచుఁ గంపించినవి. ఆమెమనము సకించుక యూరటగల్గెను. ఈశుభనిమిత్తములకు ఫలము

తోడనే కల్గుంగాక యని యామె భగవంతుని శ్రీకృష్ణునే ప్రార్థించెను.

ఆసమయమున ద్వారకనుండి విప్రప్రవరుఁ డరుదెంచి యంతఃపురమున నున్నరుక్మిణిం గాంచెను. ఆమెయు సంప్రహర్షముఖుఁడగు నాభూసురుం గాంచి కార్యంబు పండించుకొనియే వచ్చెనని యెఱింగి ప్రసన్నాస్యయై చిఱునగవు మోము నదోఁప నెదురుగాఁ బోయి ప్రశ్నింప నాభూసురుండు శుభవృత్తాంతమును జెప్పఁబూని యిట్లు పలికెను. రుక్మిణీ! నీయదృష్టము ఫలించెను. శ్రీహరి నీవాక్కులను విశ్వసించెను. నిన్నుఁ బెండ్లియాడ సమ్మతించెను. ఇదె వచ్చెను. తప్పక నిన్నుఁ దోడ్కొని పోఁగలఁడు. అనుమాటలు శ్రుతివివరములఁ జొరఁగా రుక్మిణి హృష్టమానసయై తన కిట్టికట్టడికాలమున నుత్కృష్టోపకారము చేసినందులకై ప్రత్యుపకారము నేమిచేయుదునా యని యాలోచించి వేఱొండుతోఁపమి నమస్కరించెను. అంతియ కాక బహుమానమున సత్కరించెను. ఆవిప్రుఁడు సంతృప్తుఁడయ్యెను. ఈఘట్టమునందు,

"శ్లో. తమాగతం సమజ్ఞాయ వైదర్భీ హృష్టమానసా,

న పశ్యంతీ బ్రాహ్మణాయ ప్రియమన్యం ననామ సా." 30

అని మూలము కలదు. "తదుచితం ప్రియమపరం న పశ్యంతీతి తథా, కేవలం ననామ పశ్చా ద్బహు దదావిత్యర్థః. యద్వా మాం శ్రియం యే నమంతి తే తావత్సర్వసంపదా మాస్పదా భవంతి. కిం పునర్మయి ప్రణతాయామితి. తతోఽధికమన్య త్ప్రియం న పశ్యంతీ ననామేతి." అని వ్యాఖ్య.

తనకుఁ జేసినమహోపకారమునకుఁ దగినబదులు చేయఁ గనఁబడమి నమస్కరించి పిదప విశేషద్రవ్య మిచ్చెను. లేక, మహాలక్ష్మినగు నాకెవరు నమస్కరింతురో వా రఖిలసంపదలఁ దులఁదూఁగు చుందురు. నేనే నమస్కరించినచో నాచేత నమస్కరింపఁబడినవారలకు భాగ్యము లబ్బునని చెప్పనేల యని నమస్కరించెను. అని వ్యాఖ్యాతభావము.

ఈశ్లోకమునకుఁ దెనుఁగున మహాకవి

"మ. జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నాసందేశముం జెప్పి నీ
నిలువం బెట్టితి నీకృపన్ బ్రదికితిన్ నీయంతపుణ్యాత్ము లెవ్వల్
గలరే దీనికి నీకుఁ బ్రత్యుపకృతిన్ గావింప నేనేర నం
జలిఁ గావించెద భూసురాన్వయమణీ సద్బంధుచింతామణీ."

అను పద్యమువ్రాసి మూలార్థమునకు మెఱుఁగుపెట్టిరి. ఎంత బాగుగా నున్నది! సద్బంధుచింతామణీ భూసురాన్వయమణీ యన్న యీ రెండువిశేషణములు రెండులక్షల సువర్ణటంకముల విలువకు మించినవి. "వ్యసనేషు చ బాంధవాన్" అన్న నీతిని బాటించి నీబ్రాహ్మణత్వమును నిలువఁబెట్టుకొంటివి. చింతామణివంటి బంధువుఁడవు. అని నుడివెను. ఇదియే సరస కవిత్వమనఁగా. గణములు నింపుట కాదు. ఇఁకఁ గథవంక మరలుఁడు.

బలరాముఁడు సేనలతో శ్రీకృష్ణునిం గలిసికొనియె. సాయంకాలమునకు రామకృష్ణులు కుండినేనగరమును బ్రవేశించిరి. అంతట రామకృష్ణులు తన దుహితృవివాహమునకు వచ్చుటెఱింగి భీష్మకుఁడు సపరివారుఁడై యెదురుచని విధ్యుక్తమర్యాదలఁ బూజించి తోడితెచ్చి తూర్యఘోషంబులు చెలంగ దివ్య

సౌధమున విడియించెను. ఆరేయి వారందు సుఖనిద్ర చేసిరి. రుక్మిణిచిత్తము చింతాదూర మయ్యెను. శ్రీహరి కుండినసగరమును బ్రవేశించువార్త యెట్లో తెలియఁగాఁ బౌరులెల్లరు శ్రీకృష్ణుని దివ్యమంగళవిగ్రహముం గాంచి పరమానందభరితులై తన్ముఖపంకజమునందే చూపు నిలిపి యీమహానుభావుఁడే మనరుక్మిణికిం దగినవరుఁడు. ఈయనకే మనరుక్మిణి తగినకన్యక. పరస్పరసంబంధ మిట్లుండవలదా యని యెల్లరుఁ బల్కుచుండిరి. బ్రహ్మదేవుఁడు దంపతుల నిట్లు గూర్చుఁగావుననే సృష్టికర్త యనుటకుఁ దగినవాఁడని మఱికొందఱు పలుకసాగిరి. ఈవాక్కుల నాలకించుచు శ్రీహరి విడిదికిం బోయెను.

ఆర్యులారా! ఇంతదనుక నన్నిపురాణముల భేదములఁ జూపుచుఁ గృష్ణుఁడు కుండిననగరమును బ్రవేశించినంతదనుకఁ గథను వ్రాసితిని. పరస్పరభేదములఁ బాటింపక యెట్లో కథ నడుపుచున్నాఁడను. ఇంచుక లోపము లున్న క్షమింతురుగాక. ఇఁకముందు భాగవతము ననుసరించి వ్రాయ వలనుపడదు. కావున నింక రాజవృత్తాంతమును వ్రాసెదను. విరుద్ధకథలఁ గలుపునపుడు కలిగినలోపముల మన్నింప మీరే కర్తలు.

—— శ్రీకృష్ణున కభిషేకోత్సవమును జేయుట. ——

* భగవంతుఁడు కుండిననగరమును జేరెనని విని జనమేజయుఁ డించుక సంశయము కలిగెను. కాన నిట్లు ప్రశ్నించెను. వైశంపాయనమునివర్యా! కంసుని వధించి రాజ్యము నిమ్మంట

---

* ఈకథ హరివంశ విష్ణుపర్వము పేఁబదియవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

కము గావించి కృష్ణుఁడేల పట్టాభిషిక్తుఁడు కాలేదు ! నృపాసీనార్హ మగుసింహాసనమున నేల కూరుచుండలేదు. కన్యార్థియై కుండిననగరమునకు రాఁగా నంభ్రైన రాజులు సభామండపమును జేరినపుడు నృపాసనములయం దెల్లరు గూడినపుడు కృష్ణుని బిలువలేదే ? ఏల ? వినతాకుమారుఁ డగుగరుత్మంతుఁడు మహాబలపరాక్రమసమగ్రుఁ డయ్యుఁ గేవల శాంతునిపోలిక నుండఁ గారణ మేమి ? ఈసంశయములఁ దీర్పుమా యని ప్రార్థించెను. ఈప్రశ్నమునకు బదులు చెప్పఁబూని వైశంపాయనుఁ డిట్లు బదులుచెప్పెను. రాజా ! వినుము. ఏక్షణమున శ్రీహరి కుండిననగరమును బ్రవేశించెనో యాక్షణముననే క్రథకైశికుఁడు మనస్సున నాలోచించెను. నాకుఁ దెలిసినవిషయము నీరాజన్యులకుఁ దెలిపెదను. శ్రీకృష్ణుని దర్శించినంత సకలపాపంబులు తొలంగును. దివ్యకల్యాణగుణములను దిలకించితిని. ఇంతకంటెఁ బూజ్యుఁ డింకొకరుఁ డెవ్వఁడు కలఁడు ? ఈలోకమునఁ గాదు, ముల్లోకములయందును లేఁడు. త్రిలోకనాయకుఁడై జనార్దనుఁడై కమలపత్రాక్షుఁడై యలరారుభగవంతుఁడు మననగరమున కరుదెంచినపుడు వారి కేమిసత్కారము చేయఁగల్గితిమి ? పాత్ర మింటికరుదెంచినపు డూరకుండుట న్యాయము కాదు. అని సోదరులగు క్రథకైశికు లిర్వు రాలోచించి స్వకీయరాజ్యము నీయఁ దలంచి దృఢమనస్కులై శ్రీకృష్ణుసన్నిధికిం బోయిరి. విదర్భాధిపతు లగుసోదరు లిట్టు లాహరిమందిరమున కరిగి శిరసులు ధరణిసోఁక నమస్కరించి మహాత్మా ! మాజన్మము సఫలమైనది. మాయశస్సు నిర్మలమైనది. మాపితరులు నేఁటికిఁ దృప్తులైరి. మీరు మాగృహమునకు దయచేసినందున మాయాయువులు

పవిత్రమైనది. ఛత్రచామర ధ్వజబలసింహాసనములు, సమృద్ధ కోశము కుండిననగరము మీకుఁ దగినవి. ఉపేంద్రుఁడ వగు నిన్ను దేవేంద్రుఁ డభిషేకించెను. ఈస్వల్పరాజ్యమందు మే మిరువురము మి మ్మభిషేకింపఁ దలంచినారము. మే మిరువురము చేసిన యీసత్కారము బలవంతులగు జరాసంధాదులుకూడ మార్పఁజాలరు. మగధదేశాధిపతియు మహాద్యుతియు నగుజరా సంధుఁడు మీకు శత్రువు. నృపుల కభయహస్తయు నొసం గుచు నీకథను జెల్పుచుండును. శ్రీహరి కూరుచుండనిచో నీసిం హాసన మపవిత్రము. ఈనగరము శూన్యప్రాయము. రాజ సభలో నరపతులందఱు సింహాసనముల నలంకరించియుండఁగాఁ గన్యార్థియై వచ్చిన శ్రీహరి యీ నీచాసనమున నెట్లు కూరుచుం డును? ఇట్లు జరాసంధుఁడు పలుకఁగా విని భీష్మకరాజు మాయి ర్వురతో నాలోచించి కలహశాంతిని గోరి నిన్ను సేవింపనున్నాఁ డు. ఈయుత్తమమందిరము మీకొఱ కేర్పఱచియున్నాఁడు.

మహాత్మా! నీవు దేవతలలో నుత్తముఁడవు. సర్వలోక నమస్కృతుఁడవు. ఈమర్త్యలోకమున మానుషత్వమూని జనించితివి కావున రాజత్వ మూనుము. నీవిందుల కంగీకరించిన నిందు రాఁగలకష్టములు తొలఁగును. మహాతేజా! రేపుద యము సింహాసనము నధిష్ఠింపుము. మాయీప్రార్థనము చెల్లించి సింహాసనమెక్కిన నీ రాజులందఱు తమంతన తమ దరుగుదురు. దేవశాసనమును బూని వీరినెల్ల సాగనంపెదము. అని పలికి దేవతాధీశునకు నమస్కరించి దోసిలొగ్గి ప్రార్థింపఁగా నట్లే యని యంగీకరించెను. భగవంతునొద్ద సెలవుఁగొని దేవశాస నము గైకొని రాజసమాజమున కరిగి కైశికుఁ డిట్లు పల్కెను.

రాజేంద్రులారా! వృత్తాంతమంతయు నీకు స్పష్టము కదా. వైనతేయుం గూడి యచ్యుతుఁ డతిథిరూపమున వచ్చెఁగదా. వచ్చినభగవంతుని గాంచి మహాపాత్రము దొరకెనని యానందించి భీష్మకరాజు వాసుదేవున కీరాజ్యమునంతయు సమర్పించెను. ఇదియే తనధర్మమని తలంచెను. ఈయాసనవర్యమునఁ గూరుచుండుమా యని ప్రార్థించునంతలో నంతరిక్షమునుండి యశరీరిణి వాక్కొక్కటి వినఁబడియెను. రాజా! యీయాసనము నీయఁదగదు. ఇది నీవెక్కినది. ఇట్టియల్పాసనము భగవంతునకుఁ దగదు. ఈపరమేశ్వరునకుఁ దగినది సర్వరత్నవిభూషితమగు నీయాసనము. ఇది హేమపరిష్కృతము. విశ్వకర్మనిర్మితము. దేవేంద్రునిచేఁ బంపఁబడినది. సింహచిహ్నము లిందుఁగలవు.

ఈదివ్యసింహాసనమునఁ గూరుచున్న చరాచరనమస్కృతుఁ డగుభగవంతు నభిషేకింపుఁడు. రాజేంద్రులందఱును గలిసి యీయభిషేకోత్సవమును సాగింతురు గాక. కన్యాకారణమున నీ కుండినగరమునకు శ్రీహరి విచ్చేసెను. ఎవ్వఁడే నీయుత్సవమునకు రానిచో వాఁడు వధ్యుఁడగు. నిధులయంశసంభవములగు నీ యెనిమిదికలశములఁ జూడుఁడు. ఇవి యక్షయములు. రాజరాజగు కుబేరునిచేఁ బంపఁబడినవి. దివ్యములు. కాంచనరత్నాఢ్యములు. భగవంతుని యభిషేకార్థము పంపఁబడినవి. రాజేంద్రులారా! ఇదియే మహేంద్రునిసందేశము. మీయెదుట విన్నవించితిని. ఇంకను రాఁదగినరాజులఁ బిలువనంపి యభిషేకింతురుగాక. అని యీమాటలు పలికి దేవదూత వెళ్లెను. ఆయాసనము బాలార్కసదృశాభమై మెఱయుచున్నది. ఆమహేంద్రుని

యాజ్ఞానుసారము మి మ్మందఱ నేను బ్రోత్సహించుచున్నాఁడను. ఇంద్రుని శాసనము దుర్నివార్యతమము. ఇతరుల ప్రార్థన మక్కఱలేకయే తానై యీవార్త నంపినాఁడు. మీరెల్లరు తదాసనవర్యమును జూడఁదగుదురు. అది భూలోకదుర్లభము. ఆకసమునుండి సింహాసనస్థుఁ డగుశ్రీహరిని దేవత లభిషేకింతురు. ఆయద్భుతమును జూచితిమేని సకలపాపములు నశించును. మనము పరిశుద్ధుల మగుదుము. దేవాదిదేవుఁడై విష్ణుమూర్తి యగుశ్రీకృష్ణు నభిషేకించుమహోత్సవమును గన్నులారఁ జూడఁబోవుదము. భయంపడవలదు. మే మిరువురము మీకొఱకు శ్రీహరిని దర్శించి విన్నవించితిమి. రాజులకెల్ల నభయదాన మొసంగెను. శ్రీకృష్ణుఁడు పరిశుద్ధస్వభావుఁడు. ఎవరియందును ద్వేషముకలవాఁడు కాఁడు. జరాసంధుని యందా దేవదేవున కించుకంతయు రోషము లేదు. ఇంకఁ జేయఁదగినకార్యమున్న నాలోచింపుఁడు.

అని యిట్లు నైశికుఁడు పలుకుచుండునంతలో నంబరము నుండి మేఘగంభీరగర్జనమునుబోలిన యొకానొకధ్వని యిట్లు వీతెంచెను. అధ్వనిచే దిక్కులన్నియుఁ బ్రతిధ్వనించెను. అది మహేంద్రశాసనమున నుప్పతిల్లినది. ఆవాక్కుపల్కుచున్న చిత్రాంగదుఁ డాకాశమున నుండెను. అతఁ డిట్లు పల్కెను. త్రిలోకాధిపతి యగుదేవేంద్రుఁడు ప్రజాపాలనహేతువుచే మీకెల్ల నిట్టు లాజ్ఞసేయుచున్నవాఁడు. ఆయాజ్ఞ మీ హితముకొఱకే. మీకు భయప్రదాతయై శత్రువగు కృష్ణునింగూడి యిందువసించుట మీకు మేలు కాదు. ప్రీతిగలవారలై మీమీ రాష్ట్రముల నుండుఁడు. శ్రీకృష్ణుఁడు ప్రణతార్తిహరుఁడు. ప్రతి.

పతుల కంతకుఁడు. కావున నీకృష్ణునిం బ్రార్థించి సుప్రసన్నుం గావించి విగతజ్వరులై యుండుఁడు. మనుష్యులలో నరపతులు దేవతలు. రాజులలో దేవత లుత్తములు. సురలలో నింద్రుఁడధి కుఁడు. శక్రునకుఁగూడ జనార్దనుఁడు పూజ్యుఁడు. ఈకృష్ణుఁడే విష్ణువు. ప్రభువు. దేవతలకు దేవత. మనుష్యలోకమున నరరూప మున హరి యవతరించెను. లోకములయం దెల్లయెడల నజే యుఁడు. దేవదానవ మానవనమస్కృతుఁడు. కుమారస్వామిం గూడిన శంకరునకుం గూడఁ బూజ్యుఁడు. అట్టి దేవాదిదేవునకు మహాత్ముఁడగు కేశవునకు దేవతలం గూడి యభిషేకోత్సవము సాగించుటకంటె మీరు కోరఁదగినవాంఛ లేమియున్నవి ? దేవ తలకు రాజేంద్రుల నభిషేకించునధికారము లేదు. కావుననే నభిషేకింపను. ఇది రాజులయధికారము. ఇది రాజమందిరము. కావున మీరెల్లఁ గ్రథకైశికులం గూడి యాలోచించి శాస్త్ర సరణిని జేయఁదగుకార్యమును జేయుఁడు. ఇది మీరు భగ వంతుని బ్రతిసంధించుకాలము. అని మీమేలుగోరి దేవేంద్రుఁ డీవార్తను బంపెను. నేను వచ్చి మీకుఁ దెల్పితిని. విదర్భనగర మున సింహాసనమునెక్క శ్రీకృష్ణుఁ డంగీకరించెను. రాజేంద్ర త్వమునొంద ననుమతించెను. క్రథకైశికులం గూడి రాజులగు మీరెల్ల రీమహోత్సవమును సాగింపుఁడు. ముందీకార్యమొన రించి స్వయంవరమునకు రండు. అని చిత్రాంగదుఁడు పలుక జరాసంధుఁడు,సునీథుఁడు,మహారథుఁ డగురుక్మియు,శాల్వుఁడు, సౌభపతియు నను నీనల్వురు రాజసత్తములు రాజులంగూర్చి రంగమండపము శూన్యముగ నుండరాదు గావున నిందే మీ రెల్లఁ గూరుచుండుఁడు. అని పలికి యింద్రునాజ్ఞ నాలించి

ప్రయాణముచేయ నూహించిరి. కొందఱు జరాసంధునిచే ననుమతింబడసి భీష్మకుని ముందిడుకొని స్వబలములంగూడి ప్రయాణము చేయనెంచిరి.

భీష్మకుఁడు స్వబలములంగూడి రాజులు వెంటరాఁగాఁ బరితప్తమగుమనస్సుతో నేచోటఁ గైశికునిగృహము గలదో యందు భగవంతుఁ డుండినందున నచ్చటికిఁ బోయెను. ఆమందిరము పతాకాధ్వజమాలికలం జెన్నొందుచుండెను. అందమర్పఁబడిన దేవసభ కన్నులపండువుగా నుండెను. దానిరత్నప్రభలు దిక్కులఁ బిక్కటిల్లఁ జేయుచుండెను. దేవతాధ్వజములం తమర్పఁబడియుండెను. ఆపతాకలకు దేవతాంబరములు కట్టఁబడియుండెను. దివ్యాభరణభూషితలైయాసభ ముద్దులు మూటగట్టుచుండెను. కల్పప్రసూనమాలికలు దానిపై వ్రేలాడుచుండెను. దేవలోకపరిమళవస్తువుల నా మందిరమెల్ల గుబులుకొనుచుండెను. విమానయానారూఢులై దేవతలు దాని చుట్టు సేవించుచుండిరి. అచ్చరలు గంధర్వ కిన్నరకింపురుషులు లోనగు దేవతాభేదములను ప్రఖ్యాతిఁ గాంచినవారెల్ల దానిని సేవించుచుండిరి. దివ్యవిమానమున వసించి శక్రుఁడు సభస్థలమున నందఱకు దర్శనమిచ్చుచుండెను. దిక్పాలకులెల్లఁ దమతమదిక్కుల నిల్చియుండిరి. గానము నాట్యము వాద్యము ననునివి మనోహరములై వినఁబడుచుండెను. ఆనాదముల నాలకించి విస్మయోత్ఫుల్లనయనులై రాజులాసభాంగణమును బ్రవేశించిరి. కైశికభూపాలుఁడు సవినయమున నెదురు వచ్చి భీష్మకుని బూజించి ప్రవేశింపఁ జేసెను. రాజులనందఱ యథోక్తమర్యాదలఁ జేర్చెను. రాజులందఱు వచ్చుట విని

శ్రీకృష్ణుఁడు మంగళద్రవ్యపూజితపాదాంబుజాతుఁడై బయలు వెడలెను. దివినున్న దేవతలమృతవృష్టినిబోలు పుష్పవృష్టిం గురియించిరి. దివ్యోదకముల నభిషేకించిరి. రాజులంగూడి భీష్మక క్రథకైశికు లాహరిం బూజించిరి. జనార్దనుఁ డగ్ర్యాసనమునఁ గూరుచుండెను. యాదవులనంపటి రాజులెల్ల గారవించిరి. వైనతేయుఁ డత్తఱిణమునఁ గామరూపియౌట మనుజాకృతిం దాల్చియుండెను. శ్రీహరికి దక్షిణపార్శ్వమున సేవార్థము నిలిచియుండెను. క్రథకైశికు లిరువురు వామపార్శ్వమున నుండిరి. ఆప్రక్కననే సాత్యకిప్రభృతి యదువృష్ణిభోజాంధకవీరు లుండిరి. వారినడుమ శ్రీకృష్ణుఁడు దేవతాబృందాంతరమున దేవేంద్రుంబోలి కూరుచుండి యుండెను. రాజులెల్ల నాగోపాలకృష్ణునకు నమస్కరించి తమతమయాసనములఁ గూరుచుండిరి. కైశికుఁడు మహాప్రాజ్ఞుఁడు కావున సర్వశాస్త్రార్థవిద్వర్యుఁడౌట యథాన్యాయముగా శ్రీహరిం బూజించి యిట్లు పలికెను. మహాప్రభూ! మానుషమాత్రుఁడవని యెంచుటచే మీమహిమము నెఱుంగఁజాలమైతిమి. నిన్ను విరోధింపఁ దలంచితిమి. ఈ మాయపరాధమును క్షమింపుము. అని విన్నవింప శ్రీకృష్ణుఁ డిట్లు బదులుచెప్పెను. కైశికా! నాకెవరియందును విరోధము లేదు. విశేషించి కులధర్మము ననువర్తించు రాజుల విషయమై పగ పొడుమనే పొడమదు. యుద్ధముచేయుటయే రాజధర్మము. పరాఙ్ముఖత్వ మధర్మము. అందువలన నాకుఁ గోపముకలుగ నవకాశమే లేదు. రాజు లీవిషయమున శంకింప నవసరముకూడ లేదు. జరిగినది జరిగిపోయినది. ఎవరు మృతులైరో వారు స్వర్గమున సుఖమున్నవారు. రాజధర్మ మిదియే.

కదా. పుట్టినవారికెల్ల మరణము నిశ్చయము. కావున మృతులంగూర్చి చింతింపకుఁడు. మేము క్షమింపవలయునని మీరు కోరుదురేని విరోధములేక యుండుఁడు. అని కలికి రాజుల నూఱడిల్లఁజేసి మధుసూదనుఁడు కైశికునిం దిలకించుచుండెను. ఇంతలో నయకోవిదుం డగుభీష్మకుఁడు శ్రీకృష్ణునిం బూజించి యిట్లు ప్రార్థించెను.

మహాశయులారా! ఈకథ విచిత్రముగాఁ గనఁబడక తప్పదు. వివాహార్థమై కృష్ణమూర్తి కుండిననగరమును బ్రవేశించుట యెవ్వరికిని ఇష్టములేదు. భీష్మకునకుఁ బ్రీతికరముగా నున్నను బుత్రవశంగతుఁడు కావున నతఁ డేభావమును సాధుమార్గమునఁ జూపఁజాలఁడు. శిశుపాలున కీయఁదలంచియే నగరమును శృంగారింపఁ బంచెను. రుక్మిణిని భూషణాదుల నలంకరించి పెండ్లికూఁతుఁ గావించెను. బంధువులనంపఁటఁ బిలువం బంచెను. సేనల సన్నద్ధములుగాఁ గావించి రుక్మి యమితోత్సాహమున విఱ్ఱవీఁగుచుండెను. జరాసంధాదులు శిశుపాలపక్షము నవలంబించి యాదవులు వచ్చినఁ బాఱఁదోలి రుక్మిణికిని శిశుపాలునకు దాంపత్యము గూర్పఁ జతురంగబలములం గూడి వచ్చిరి. ఇట్టితఱి రుక్మిణ్యనుమోదమునకుఁ బాత్రుఁ డగుబ్రాహ్మణుఁ డొక్కరుఁడు పోయి రుక్మిణీసందేశమును శ్రీహరికిం దెలుపఁగా నందులకు సమ్మతించి హరి చనుదెంచెను. ఇంటికి వచ్చినబంధువును బూజింపకున్న లోకాచారమునకు విరుద్ధమని లోనఁ బ్రీతి యంతగాలేకున్నను భీష్మకుఁడు శ్రీకృష్ణుం బూజించి విడిది చూపించెను. ఇట్టితఱి శ్రీకృష్ణునకు జరాసంధాదులందఱు సమ్మతింప నభిషేకోత్సవము జరపిరన్న, వింతగా

నుండకపోవునా? అంతియకాక యసంగతముగ నుండకమానునా? దీనినెట్లు సరిపెట్టుట? అని కొందఱూహింతురేమో! ఇంచుక యోగ్యమై నాలకింపుఁడు. అన్నియుఁ జక్కఁగానున్న యట్లే తోఁచును. త్వరపడి యాగ్రహావేశమునఁ బరిశీలింపక యాక్షేపించిన నన్నియు నసంగతములుగాఁ దోఁచును. కావునఁ గథాసారమును వినఁగోరిన నించుక శ్రద్ధవహింపుఁడు. రుక్మిణీకల్యాణము భాగవతమునను; ఇంచుక తదనుగుణముగా గర్గసంహితయందును జెప్పఁబడినపద్ధతు లితరపురాణములయందు హరివంశమునందును గానరావు. రుక్మిణీసందేశము ఈ రెండు గ్రంథములయందే చెప్పఁబడినది. హరివంశమున నీవివాహ మత్యద్భుతముగా వర్ణింపఁబడినది. భాగవతమునుబట్టి యాలోచించిన రుక్మిణి లక్ష్మియనుభావము స్పష్టముగాఁ గానరాదు. ఈవివాహమునందు శ్రీకృష్ణపరాక్రమమే యగపడును. రాధ గోపికయని, రుక్మిణి మహాలక్ష్మియని వాదించువారలకు భాగవతమున రుక్మిణి మహిమములు లేకుండుట హృదయశల్యముగాఁ దోఁచకమానదు. రాధప్రస్తావము భాగవతమున లేదే యని వాదించుటతప్ప రుక్మిణియందు లోకోత్తరశక్తు లున్నయట్టిదృష్టాంతములు భాగవతమునుండి వారు చెప్పఁజాలరు. అక్కారణమున భాగవత మీవిషయమునఁ జప్పిడిగా నున్నదనక తప్పదు. పురాణాంతరముల నీకథ విచిత్రముగా వర్ణింపఁబడినది. రుక్మిణిసందేశము పంపలేదు. భగవంతుఁడే రాఁగల కార్యముల నాలోచించి తానే పయనమయ్యెనని చెప్పఁబడుట యుక్తముగనే యున్నది. సీతావిషయమున రామాయణమున నత్యద్భుతపాతివ్రత్యమహిమములు వర్ణింపఁబడినవో యామె

మహాత్మ్యయే యని యెట్లు రామాయణమునుండి తేలునో యట్లు భాగవతమున వ్రాయఁబడిన యీకథలనుబట్టి రుక్మిణి మహిమములు తేలవు. కావున నితరపురాణముల కథలను గలుపుచు భగవత్పత్నులందఱు లక్ష్మీదేవ్యంశసంభూతలే యను నావిశ్వాసమును దృఢపఱుపఁ బూనితిని. లేనిమహిమములఁ గల్పింపఁజాలను. అంతటియోగ్యతయు నాకు లేదు. ఉన్నకథలనుబట్టియే నాభావమును నాలుగుపంక్తులలో వ్రాసెదను. రుక్మిణికంటె రాధాదేవి యతిశయమహిమము కలదనుదుర్భావము నాకు లేదు. ప్రకృతి యనేకనామరూపముల విలసిల్లు. పరమపురుషుఁ డనేకరూపనామముల విలసిల్లును. భగవంతున కొక్కటియే నివాసస్థల మనువాదమున నేఁ జేరను. భక్తులు సేవింపఁ బెక్కులోకములఁ బెక్కురూపములఁ బెక్కునామములఁ బ్రకృతిపురుషు లుందురు. వారియం దుచ్చనీచత్వముల నారోపించుట వెఱ్ఱితనము గాక మఱేమిటి? అట్లుకాకుండ నావాదమునకు దౌర్బల్యము లేదని యబ్బురపడుచున్నాఁడను. నాభావమున రుక్మిణి వైకుంఠముననలరు మహాలక్ష్మియని, రాధాదేవి గోలోకవాసినియగు పరదేవత యనియు వీరికి భేదము లేదనియు, భక్తులు సేవించుపొంటె నెన్నియో లోకముల వెలయుచుందురనియు, నం దుత్తమమధ్యమాధమభావములఁ గల్పించుట పాపహేతువనియు, నొక్కకర్మము చేసినవారే పెక్కుమంది యుండరనియుఁ గావున వారివారికిఁ దగినట్లు సేవార్థమై భగవద్రూపములు కల్పింపఁబడియెననియునై యున్నది. పురాణములనన్నింటిని పరిశీలించినచో నిట్టిభావ మెల్లరకుఁ దోఁపక పోదు. కావున హరివంశమునఁ గలకథకును భాగవతమునఁ

గలకథకును భేదమేలయని ప్రశ్నింపరాదు. భగవత్సేవ చేయు మార్గము లనేకములు. భగవద్గుణములు లనేకములు. భగవత్కథ లనేకములు. కావున వాని నొక్కొక్కరీతి నొక్కొక్క పురాణము వచించును. ఏల యిట్లుండవలయునని యాక్షేపించువారు భక్తిశూన్యులు. ఉత్తమకన్య తా వలచినపతిని బడయుటకై యిట్టి ప్రయత్నములు చేయవలయునను నీతిని దెల్పుటకు భాగవతము పూనుకొన్నది. హరివంశాదులు భగవన్మహిమమును శత్రువులుగూడఁ బొగడుదురు. కర్మబద్ధులై మరల ద్వేషింతురు. అని కర్మసిద్ధాంతమును విశేషించి తెలుపఁ బూనుకొన్నవి. ఇట్లులుండ వీనికిఁ బరస్పరభేదములు గలవనుట పురాణతత్త్వ మెఱుంగకుండుటయే గాక వేఱొక కారణమునఁ గాదు. కాఁబట్టి యిట్టిశంకల కవకాశమీయక యేకాగ్రచిత్తమున భగవత్కథలం బఠించి కృతకృత్యులు గావలయును. శుష్కవాదములకుఁ బూనరాదు. దానఁ గాలము వ్యర్థముచేసినట్ల యగు. విశేషించి దుర్విషయముగాఁ గాలముగడపినట్టులు నగు. కావున నల్పాయుర్దాయము గలమానవు లిట్లు వ్యర్థముగాఁ గాలముగడపుట చాలనీచము. కాఁబట్టి భగవద్భక్తిగలిగి కథయం దేమినీతిగలదని గ్రహించి దానియం దెంతమాత్రము మన మనుష్ఠానమున ననుసరింపఁగలమని యూహించి యట్లుచేయఁ బ్రయత్నింపవలయునే గాని యిది మార్గము కాదు. ఇఁక నీకథాసారము వినుఁడు.

కుండినపురమునకు స్వామి చేరఁగనే భగవత్సందర్శనము నకుఁ బ్రతిఫలము గలుగవలయును గనుకఁ గ్రథకైశికాదులకు భక్తికుదిరెను. జరాసంధాదులు తత్సమయమున శ్రీహరిని

మారెక్కినఁజాలమని నిరుత్సాహులై యుండిరికదా. ఆకల్యాణ సమయమున జరగఁబోవుయుద్ధమున మృతినొందఁ గల రాజులు పెక్కుమంది లేకుండిరి. వారు యుద్ధసన్నద్ధులయియే వచ్చి యుండిరి. వారిప్రయత్నము మానుటెట్లు? అని భగవంతుఁ డాలోచించెను. ఒకయద్భుతమును సంకల్పమాత్రమున నడ పెను. ఆసంకల్ప మమోఘము కదా. వెంటనే చిత్రాంగదుఁ డను దేవదూత యరుదెంచి రాజులకెల్ల నింద్రునిశాసనమును వినిపించెను. రాజులు ప్రతివత్సర మింద్రపూజ చేయుదురు. అది విజయము నాపాదించునట్టిది. అద్దాని కధిపతియగు నింద్ర నియాజ్ఞయన్న రాజులందఱు భయపడుదురు. కావున నింద్ర నియాజ్ఞ వచ్చెను. త్వరపడి రాజులెల్ల నీపట్టాభిషేకోత్సవ మునఁ బాల్గొనవలెను. లేకున్న వధ్యులగుదురు. శ్రేయస్సును గోరు వా రఖిలలోకరక్షకుఁడగు శ్రీకృష్ణునిపట్టాభిషేకోత్సవ మునఁ బాల్గొనుఁడు. అనునదియే యింద్రునిశాసనము. దాని నాలకించినంతనే మర్యాదచే విజ్ఞులగు నల్వురుతప్పఁ దక్కం గలవారెల్ల నాయభిషేకమున కరిగిరని దీనిభావము.

ఆసమయమున భగవదుక్తులు పరిశీలింపఁదగినవి. వాని యర్థమును మది నిలుపుకొనవలయును.

శ్లో. "తేషాం కిం హేతునా కోపః కర్తవ్య స్త్వవనీశ్వరాః,
యద్గతం తదతిక్రాంతం యే మృతా స్తే దివంగతాః. ౮౬
ఏష ధర్మో నృలోకేఽస్మిన్ జాయంతే చ మ్రియంతి చ
తస్మాదశోచ్యం భవతాం మృతార్థే చ నరాధిపాః. ౮౭
క్షంతవ్యం రోచతేఽస్మాకం వీతవైరా భవంతు తే."

హరివంశము.

వింటిరిగదా శ్రీకృష్ణోపదేశములు. వీనియర్థ మీవఱకే వ్రాసి తినిగాన మరల వ్రాయఁబూనను. వీనికంటె ముందున్న శ్లోకములం బరికింపుఁడు.

శ్లో. "న మే ద్వైరం ప్రవసతి ఏకాహామపి కైశిక,
విశేషేణ నరేంద్రాణాం క్షత్రధర్మేఽవతిష్ఠతాం
యోద్ధవ్యమితి ధర్మేణ అధర్మే తు పరాఙ్ముఖమ్." ౮౫

వీని సారమేమి? నేను సర్వసముఁడను. నాకు మిత్రుఁడుగాని శత్రువుగాని లేఁడు. ఎల్లరు నాకు సమానులే. కోపప్రసాదము లకుఁ గారణము జీవుల గుణదోషములుకాని నేనుగాను. గతించినవిషయములకుఁ జింతించి లాభము లేదు. నాచే హతులగువారల కనంతసుఖములు గలుగును. గడచినసంగరమున హతులగువారెల్ల నిపుడు స్వర్గసుఖముల ననుభవించుచున్నవారు. నన్ను క్షమింప వేఁడనేల? మీమనసుల ద్వైరము వదలుఁడు. అదియే నేను క్షమించుటయన. అనఁగా నెవరిమనసులలో నామీఁద వైరములేదో వారెల్ల నాదయకుఁ బాత్రులు. వారు విశేషించి ప్రార్థింప నక్కఱలేదు. మరణమునుగుఱించి చింతింప నక్కఱలేదు. అది స్వభావము. క్షత్రియధర్మము యుద్ధము. దాని మానరాదు. మానినఁ గులద్రోహు లగుదురు. అనునదియే దీనిసారము. ఈనీతి గీతాశాస్త్రమునందు.

శ్లో. "ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన,
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ.
౪౪. అధ్యా. ౧.

జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి."

౨౭. అధ్యా. ౨.

అని భగవంతుఁడే చెప్పెను. కావున భగవద్దయకుఁ బాత్రుఁడు కాఁదగువాఁడు నిర్వైరుఁడే యనియు, నది లేకయున్నఁ బరమేశ్వరానుగ్రహమునకుఁ బాత్రుఁడు కాఁడనియుఁ దేటపడియె డిని. ఇంతమాత్ర మీకథనుండి గ్రహింపఁదగినది. ఇంకను దీనిం బెంచి వ్రాయఁబూనక తర్వాతికథను వ్రాసెదను.

## శ్రీకృష్ణాభిషేకోత్సవము.

* ఇట్లు శ్రీకృష్ణపరమాత్మ మాటలాడఁగా విని భీష్మకుఁడు భక్తియుక్తుఁడై భగవంతునిఁ బూజించి యిట్లు విన్నవించెను. మహానుభావా! శ్రీకృష్ణా! నాపుత్త్రుఁ డగురుక్మి బాలభావమునఁ దనతోఁబుట్టువును స్వయంవరమహోత్సవమున వివాహముచేయ నిశ్చయించెను. కాని నాకది సమ్మతము కాదు. నేనును బుత్త్రవశంగతమానసుఁడనగుట మిగుల బాలత్వమూనియే యతఁడు చెప్పినట్లచేయ నంగీకరించితిని. నాకొమరిత స్వయంవరమున నొక్కనిం దిలకించి వరింపఁగలదు. నాకొడుకొనరించిన దుర్నయమున నిన్నుఁ బ్రార్థించుచున్నాఁడను. దేవేశా! నన్ననుగ్రహింపుము. ప్రసాదభాసురముఖుఁడవు కమ్ము. అని ప్రార్థింప విని శ్రీకృష్ణుఁ డిట్లు బదులుచెప్పెను. ఛేలతనమున నీకొడుకు రాజులనందఱను బురికొలిపెను. ఎపుడు పెద్దవాఁడగును? ఈయవినయ మెట్టులడంగును? పూర్వకర్మసమార్జితైశ్వర్యము

* ఈకథయుం హరివంశ విష్ణుపర్వము ఏఁబదియొకఁడవయధ్యాయము నుండి గ్రహింపఁబడినదని యెఱుంగునది.

గలసూర్యచంద్రవంశసంభూతు లగు రాజులనెల్ల దుర్నయపరుల నుగా నొనరించిన గలుగు సదర్థము లెట్టివో తలంపుము. ఈలోకమున రాజులు సత్కులప్రసూతులు. ఒక్క రాజునెదుట సజ్ఞానమున నొక్క వితథవాక్కు నెవ్వఁడు చెప్పునో యట్టివాఁ డీలోకమున నుండఁడు. దండవహ్ని యతనిం గాల్చును. ఇది రాజులమర్యాదయని నాయభిప్రాయము. లోకధర్మము ననుసరించి మున్ను బ్రహ్మదేవుఁ డొకగీతమును జదివెను. అదియే పైఁ జెప్పినధర్మము. నీకొడుకు రాజై యుండియు నరేంద్రులమ్రోల నిలువంబడి యిట్టి కట్టడిపలుకు పలుకం జెల్లునే? తదనుగుణముగా రంగమండపము సిద్ధము చేయుట న్యాయమా? అద్ది నీ కెట్లు తెలియకపోయెను! అని యొకసంశయము నామదిఁ గలదు. తదర్థమై యరుదెంచిన సూర్యశీతాంశుతుల్యతేజస్కు లగు రాజులను యథావిధిఁ బూజించితివి. నీనగరమెల్ల రథాశ్వసంకులమైనది. అట్టిచోట నిట్టిప్రయత్నము సాగుచున్నదని నీవెట్లెఱుంగవైతివి? కొడుకుదుండగముల నెఱుంగననుట నమ్మఁదగునా? చతురంగబలములం గూడి వసుధాధిపతులు వచ్చుటేల యని విషాదము నీకుం గలుగలేదే. నాకీవిషయము దెలియదనుట నామది సంశయమును గల్గించుచున్నది. సామాన్యముగా నాలోచింప నాయాగమనము నీకుం బ్రియము కాదని తలంతును. అందులకే యితరక్షితిపతుల కొనరించినట్టి యాతిథ్యము పాత్రమగు నా కొసంగవైతివి. పాత్రభూతులగు నరపతులకే కన్యక నిమ్ము. అపాత్రుఁడనగు నాకేల? నావచ్చిన దోషముచేఁ గన్యక నేల యియ్యకుండవలనో తెలియఁజాలక యున్నాఁడను. కన్యాదానవిఘ్నము నాచరించినవానికి నరకము

గల్గును. అని ధర్మవిదులు పలుకుదురు. రాజోత్తములిట్లే యుద్ఘోషింతురు. అందులకే రంగమండపమున నేఁ బ్రవేశింపకున్నాఁడను. నీవు తగిన ట్లాతిథ్యమొసంగనందున నీయింటికిని రాలేదు. రాజేంద్రా! సిగ్గుచే నభిభూతుఁడ నగురాజునుగాని మీవంటి కులీనుఁడనా. నాసేనలకు నిలువనీడయని యీ విదర్భనగరమున నున్నాఁడను. మాసోదరుల కీకైశికుఁడు విధిమంతముగాఁ బూజ లొనరించెను. ప్రియాతిథి మాకితఁడే. పూర్వము గిరుడకేశవులు ఇంద్రపూజితులై స్వర్గముననున్న యట్లు కైశికపూజితులమై యిందు మే మిరువురము సోదరుల మున్నారము.

అని యిట్లు కేశవుఁడు పలుకఁగాఁ దదాగ్రజచోదితుఁడై కృష్ణోక్తశ్లక్ష్ణవాగుదకములచేఁ దడుపఁబడి శమితాగ్నివలె నించుక యాఱడిల్లి భీష్మకుఁ డిట్లు శ్రీహరింగాంచి పలికెను. దేవాదిదేవా! ప్రసన్నుఁడవు కమ్ము. లోకేశ్వరా! నన్నుఁ గాపాడుము. లోకశాసనా! న న్నుద్ధరింపుము. అజ్ఞానాంధకారావిష్టుని నన్ను జ్ఞానచక్షుఃప్రదానమునఁ గాపాడుము. ఈ మానవశరీరము మాంసచక్షువులు గలది. దాన నీతత్త్వమెఱుంగఁజాలకుంటిని. నాప్రభృతులంద ఱిట్టివారే. విచారింపక యొనరించినకర్మములు చక్కనిఫలము నీఁజాలవు. దేవతలకుం గూడ దైవతమ వగునిన్ను శరణుచొచ్చినారము. కావున నాదృష్టి చక్కఁగాఁ దత్త్వము నెఱుంగఁజాలును గాక. నాయొనరించిన కార్యములెట్టివో తెలిసికొనుఁ గాక. సిద్ధింపనికార్యమునైనను విచక్షణు లగుమానవులు నయోపేతమైనచో ఫలమొసంగునదియే యని చేయుదురు. మహాసేనాపతియు నట్లే

యొనరించి కృతకృత్యుఁ డయ్యెఁగదా. నిన్ను సర్వేశ్వరుని శరణముగా భావించిననేను భయమునొందఁ బనియెఁకలేదని తలంపఁజను. నేఁ జేయఁదలంచినకార్యము నించుక యవధరింపుము. స్వయంవరమునఁ బార్థివులఁ కీయఁబూనను. కావునఁ గోప ముపసంహారింపుము. ప్రసన్నుఁడ వగుము. అని భీష్మకుఁడు ప్రాంజలియై పలుక శ్రీకృష్ణుఁ డిట్లు బదులుచెప్పెను.

ఏల యీమాటలు? మహామతిమంతుఁడవుకదా నీవు. నాకన్య నీయనని పలికితివి. ఎవఁడు ని న్నాజ్ఞాపించువాఁడు? కన్యక నీతని కీయఁగూడదని చెప్ప రాదు. ఇష్టుఁ డాయనియుఁ బలుక రాదు. రుక్మిణి దివ్యమూర్తి నాకు సంబంధించినందులకుఁ గారణము గలదు. వినుము. మున్ను మేరుపర్వతశిఖరమున నుపవిష్టులై దేవతలాలోచించి తమతమయంశముల భూలోకమున నవతరింపఁ జేసిరి. అత్తఱి నీరుక్మిణియు నీపతిని మర్త్యలోకమునఁ బుట్టి యనుసరింపుమని పంపిరి. మనుజలోకమునఁ గుండిననగరమున భీష్మకభూపాలుని భాగ్యగర్భమున నవతరింపుము. అని శచీపతి పలికెను. కావున నో రాజేంద్రా! నిష్కపటమగువాక్కును బలుకుచున్నాఁడను. నామాటను వింటివి. మదిఁ జేయఁదగిన దిదియని నిశ్చయించుకొని యేది యుక్తమని తోఁచునో యట్లు చేయుము. * భీష్మకరాజవల్లభా! మఱొక్క మాట యాలకింపుము. రుక్మిణి యనుపేరఁబరఁగు నీకన్యక

* రుక్మిణీ నామ తే కన్యా న సా ప్రాకృతమానుషీ, శ్రీరేషా బ్రహ్మవాక్యేన జాతా కేనాపి హేతునా. ౩౧ న చ సా మనుజేంద్రాణాం స్వయంవర విధిక్షమా, ఏకా త్వేకాయ దాతవ్యా ఇతి ధర్మో వ్యవస్థితః ౩౨ అని హరివంశము.

సామాన్యమనుజస్త్రీ కాదు. లక్ష్మీదేవియే. బ్రహ్మప్రార్థింప నొకా నొకహేతువుచే భూలోకమునఁ బుట్టినది. ఆరుక్మిణి మనుజేంద్రులకు స్వయంవరవిధిచే వరింపఁదగినది కాదు. ఆమె ప్రకృతి. అద్వితీయుఁ డగుపురుషున కీఁదగినది. అని ధర్మము నిర్ధారణ చేయఁబడినది. రాజా! ఆరుక్మిణి సాక్షాల్లక్ష్మి గావున స్వయంవరమున నొకరికీయ నీకు శక్యముకాదు. తగినవరుని దిలకించి ధర్మపద్ధతి విడనాడక యీయఁదగినది. అందువలన నీవివాహ సమయమున నేమేని విఘ్నములు కలిగిన వానిం దొలఁగింపఁ బూనియే యీావైనతేయుఁ డరుదెంచెను. ఇంద్రుఁడు పురికొల్పఁ నీగరుడుఁ డరుదెంచెను. నేను రాజులమహోత్సవమును జూడఁగోరి వచ్చితిని. * ఆకన్యకను బద్మసంవాసముమాత్రము లేనిలక్ష్మిగాఁ దలంపుము. నాయెదుట నిలువంబడి క్షమింపుమా. యని వేఁడితివి. ఇది యుక్తిపూర్వమనియే తలంతును. కృత్రిమముగా నడిగితివని భావింపను. ఏముహూర్తమున నీరాజ్యమునకు సౌమ్యరూపమున వచ్చితినో ఆకారణముచేతనే క్షమించితిని. శాంతులయందు గుణబాహుళ్యము గలుగు. క్షమయనఁగా దోషాపహరణమే కదా. మావంటివారిమనసులయందెట్లు కలుషము నిలుచును. సత్కులమున జనించి శాంతధనుఁడై ధర్మముల నెఱింగి సత్యముచెప్ప నలవాటుపడిన నీవంటి రాజునందుఁ గలుష మెట్లు నిలువఁగలదు? సేనలఁ గూడివచ్చిన నన్ను క్షమించుస్వభావము గలవానినిగా నంగీకరింపుము. శత్రువాహినులఁ దునుమఁబోవునపుడు సేనాసహాయుఁడనై

* తాం చ కన్యాం వరారోహాం పద్మేన రహితాం శ్రియం=అని మూలము.

పోఁదలంపను. గరుడవాహనము నెక్కి శాంతిమానిరిపుసేనావ మర్దనము చేయఁబోదును. అత్తఱి నా చతుర్బాహువుల సోమార్కసంకాశాయుధములు చెలఁగుచుండును. నీవు మాకు మాన్యుఁడవు. రాజా! వయస్సుచేత మా తండ్రివంటివాఁడవు. ఈనగరమును జక్కఁగాఁ గాపాడుము. రాజవంశమునకుఁ గీర్తిఁ దెమ్ము. కాపురుషులయందే కలుషముండును. పరిశుద్ధస్వభావులగుశూరులయందు కలుషమెట్లు నివసింపఁ గలదు? రాజా! * ఇది నావృత్తియని యెఱుంగుము. పుత్త్రులయందుఁ దండ్రి యెట్లు వర్తించునో మేమట్టి వృత్తిగలవారమని యూహింపుము. † ఈ రాజులిద్దఱు క్రథకైశికులు విదర్భనగరాధిపతులు మా కాతిథ్యమొసంగుటయే కాక స్వరాజ్యమును గూడ నొసంగిరి. ఈ దానఫలముచేత నీరిపూర్వులు పదితరములవారు స్వర్గసుఖముల ననుభవింపఁ బోయిరి. వీరివంశమునఁ జనించువారికముందుఁ బదితరములవారు పుత్త్రపౌత్త్రులం గూడి వర్ధిల్లి స్వర్గసుఖముల ననుభవింపఁగలరు ‡ నీరిద్దఱు చాలకాలము రాజ్యసుఖములం బడసి రాజ్యము నిష్కంటకముగా నుండఁగా నెపుడు ముక్తిఁబొందఁగోరుదురో యపుడు నిర్వృతిసుఖమును బడయుదురు. నన్ను నభిషేకింప నేయేరాజు లరుదెంచిరో

---

* జానీధ్వమేషా మే వృత్తిః పుత్త్రేషు పితృవద్వయం—అని మూలము.

† ఇమావపి చ రాజానౌ విదర్భనగరాధిపౌ, ఆతిథ్యకరణేఽస్మాకం స్వరాజ్యం దదతావుభౌ, తేన దానఫలేనాస్య దశపూర్వా దివంగతాః, భవిష్యాశ్చైవ రాజానో పుత్రపౌత్రా దశావరాః—అని మూలము.

‡ అనయోస్సుచిరం కాలం భుక్త్వా రాజ్యమకంటకం యదాభిలాషో మోక్షస్య యాస్యేతే నిర్వృతిం సుఖమ్—అని మూలము.

వారెల్ల సకాలమున దేవలోకమునకుం బోఁగలరు. రాజా! మీకందఱకు మేలు చేకూరుఁగాక. గరుడసహాయుఁడనై యింకఁ బోయెదను. భోజరాజపరిపాలిత మగుమధురానగర మును జూడఁబోయెదను.

అని యిట్లు భోజరాజును సంబోధించి పలికి యదునంద నుఁడు రాజులనెల్ల గారవించి విశేషించి క్రథకైశికుల గౌర వించి సభనుండి పయనముచేసి రథమున్న చక్కటి కరిగెను.అందు లకు రాజులెల్ల విషణ్ణులైరి. భగవదుక్తులకుఁ బ్రహృష్టచిత్తుఁ డై భీష్మకుఁడు స్వాయంభువరూపునిగా, నాదిదేవునిగ, సురా సురనమస్కృతునిగ, సహస్రపాదునిగా, సహస్రశీర్షునిగా, సహ స్రభుజవిగ్రహునిగా, సహస్రాక్షునిగ, సహస్రమకుటోజ్జ్వలు నిగ, దివ్యమాల్యాంబరములఁ దాల్చి దివ్యగంధానులేపనములఁ దనరారి, దివ్యాభరణములఁ బరిఢవిల్లి, దివ్యానేకాయుధముల ధరియించి వెలుఁగొందువానిగ, రక్తారవిందాక్షునిగఁ, జంద్ర సూర్యాగ్నినేత్రునిగ, శ్రీకృష్ణుని దిలకించి నమస్కరించి కృ తాంజలియై వాఙ్మనఃకాయములను త్రికరణము లొక్కరీతి నిశ్చలతం గాంచ నిట్లు వినుతించెను. దేవదేవా! నీకు నమ స్కారము. అనాదినిధనుఁడవు, శాశ్వతుఁడవు, ఆదిదేవుఁడవు, నారాయణుఁడవు, భక్తిపరాయణుఁడవు, స్వయంభువుఁడవు, ప్రపంచస్వరూపుఁడవు, స్థాణువవు, బ్రహ్మవు, పద్మనాభుఁడవు, జటివి, దండివి, పింగళుఁడవు, హంసప్రభుఁడవు, హంసుఁడవు, చక్రరూపుఁడవు, అట్టి నీకు మ్రొక్కెదను. మహాత్మా! వైకుం ఠుఁడని, అజుఁడవని, పరమాత్మవని, సదసద్భావయుక్తుఁడవని, పురాణపురుషుఁడవని, పురుషోత్తముఁడవని, నిర్గుణుఁడవని,

పేరొందు నీకు నంజలిగావింతు. స్వామీ! నాకు వరదుండవు కమ్ము. సురేశ్వరా! నేను నీభక్తుండను. నీవులోకనాథుండవు కదా, జ్ఞానులు నిన్ను విష్ణువునుగా ధ్యానింతురు. ఇట్టి నిన్నుం బ్రార్థింతును. నాయం దనుగ్రహ మునుంపుము.

అని యిట్లు వినుతించి రాజులందఱు చూచుచుండంగా భీష్మకుండు మహార్హమణిముక్తా వజ్రవైడూర్యములను సువర్ణ భూషణములను శ్రీకృష్ణునకుం గానికల నొసంగెను. మరల నమస్కరించెను. వైనతేయునకు మ్రొక్కెను. ఇట్లు మ్రొక్కి గరుడునిం గాంచుచు నిట్లు వినుతించెను. ఖగేంద్రా! మీరు తరంపహాశ్యాలివిని, కామరూపుండవు, దివ్యుండవు, కౌశ్యపుండవు, ఇట్టి నీకు వందనము. అని పొగడి మహాభూషణముల సత్క రించి యూరకుండెను. శ్రీహరి బయలువెడలెను. రాజులందఱు తోడుచనిరి. అంత శ్రీహరి రాజుల సత్కరించి వారి నిలువ నియోగించి తన తేజఃపుంజముల దశదిశల వెలుంగఁజేయుచు మధురానగరమునకు కరిగెను. సౌపర్ణరూపుండగు వైనతేయుండు శ్రీహరిం గొలుచుచు బోయెను. యాదవసేన లాముకునను భావుని గొల్చుచు శంఖభేరీమృదంగాదివాద్యముల దిక్కుల నవియఁజేయుచు శూరుల సింహనాదములు మిన్నంటుచుండ మథురకుం బోయెను. శ్రీకృష్ణుండు మధురానగరమునకరుగ దివ్యాసనమును దీసికొని దేవతలు త్రిదశాలయమునకుఁ బోయిరి. రాజులందఱు నాయద్భుతచరిత్రమును బొగడుచు మరల స్వయం వరమండపమునకుం బోయిరి.

మహాశయులారా! ఈకథను జక్కఁగా వింటిరి. భగవం తుండు మరల మధురాపురమునకుం బోవుట మీకెల్లఁ గడుం

గడు విచిత్రముగాఁ దోఁచును. రుక్మిణి పరితపించుచున్నదను భాగవతకథను జదివి దానినే మనసుల నిలుపుకొన్న మీకిది విచిత్రముగ, నసంగతముగను దోఁచుట యొకయబ్బురము కాదు. కాని భాగవతకథ నిపుడు స్మరింపక హరివంశకథలనే స్మరింపుఁడు. ఆయచ్చెరు వడంగును. కథ చక్కఁగా నుండును. ఇఁక నీకథాచమత్కృతిని దీనఁ గలరహస్యవిషయములను జిత్తగింపుఁడు. అందును గృష్ణభగవంతుఁడు భీష్మకునకుఁ జెల్పిన మాటల భక్తిమై నాలకింపుఁడు.

రుక్మిణి సామాన్యమనుజస్త్రీ కాదు. మహాలక్ష్మి. బ్రహ్మ ప్రార్థింపఁగా నసఁగా శ్రీకృష్ణపరమాత్మ విష్ణునారాయణాది వివిధభేదముల వివిధనామముల వివిధలోకములనుండిన తన తేజస్సు నొక్కటిగాఁగూర్చి మనుజలోకమున నవతరించును. ఇట్టియవతార మీావఱకెన్నఁడు జూడలేదు. ఇదియొక క్రొత్త యవతారము. కావున వివిధలోకముల బహునామముల నలరు లక్ష్మ్యంశముల నలరు మీారెల్ల నాపరమపురుషునకు భార్యలై సేవింపవలయు.రాధాదేవి ముందే యవతరించినది. అని ప్రార్థింపఁగా నీయింటఁ బుట్టినది. అంతియకాని సాధారణ మనుజకన్యకయని భావింతువేమో. యట్లు తలంపకుమా యని నొక్కి చెప్పెను. దీనిసారమేమి ? భీష్మకరాజా! లక్ష్మీదేవి విష్ణుమూర్తికే పత్ని కాఁదగినది. ఇతరులకుఁ దల్లియగునే కాని భార్య కాఁదగదు. నీకీవిషయ మింతకుముందు తెలిసియుండదు. కావుననే చెప్పెదను. నీకీవార్త తెలియమింజేసి స్వయంవరము చాటించితివి. దాన నీపై నాకాగ్రహము లేదు. లక్ష్మీదేవియైనఁ బద్మసంబంధము లేదేయని శంకింతువో యేమో. పద్మసంబంధమును

భాసి యవతరించినలక్ష్మి. మనుజయోనిప్రభవ దేవతాలక్షణ ములు కొన్ని యుండవలదు. కావున నిర్ధ్వసరించినది. అట్టి లక్ష్మి యద్వితీయుండగు నారాయణుం డగనదియే కాని యితరుల కర్హయౌ! మాతృభావమున నితరులెల్ల పూజింప దగుదురు. అట్టిలక్ష్మికి స్వయంవరము చాటించి యందువరించినవాని కీర్తి ననుటయు నందును శిశుపాలున కీయం బుత్తునని చేటు బలికొల్పం బడుటయు నజ్ఞానవిలసనములు కాని సత్యములుకావు! అని భగ వంతుండు పల్కెను. దీనిచే వైకుంఠము నొదలి లక్ష్మీదేవి రుక్మిణిగా నవతరించెనని స్పష్టమైనది. ఈవిషయము భాగవత మునం గానరాదు. భాగవతము ననుసరించిన రుక్మిణియు నొక భార్యయే యని తేలునేగాని వైకుంఠవాసిని, పద్మాలయయు నగుశ్రీదేవియని స్పష్టము కాదు. ఇట్టి భిన్నపురాణములకు సమ న్వయ మెట్లు? అనుప్రశ్నము రాకమానదు. సమాధాన మేమనంగా వినుండు. గోలోకవాసిని రాధాదేవి. వైకుంఠవా సిని లక్ష్మీదేవి. శ్వేతద్వీపవాసిని పద్మావతీదేవి. అను నిముగ్గురు రూపనామభేదము గలవారేకాని యాత్మభేదము గలవారు గారు. మూవు రొక్కరూపమునుండి మూండులోకముల భక్త లకు సకలవాంఛలనొసంగ భగవదాజ్ఞను వేచియుండు ప్రకృతి స్వరూపిణులు. పురుషోత్తముండు శ్రీకృష్ణ విష్ణునారాయణనా మముల ద్విభుజచతుర్భుజచతుర్భుజములం బై మూండులోక ముల వెలసి భక్తుల నుద్ధరించుచుండును. ఈమూండురూప ములు కలిసి యొక్కరూపమున ద్వాపరయుగాంతమున నవత రించెను. ఆయనను సేవింప రాధారుక్మిణీ ప్రభృతినామముల మూలప్రకృతి యవతరించెను. భగవంతుం డొక్కరూపమున

నవతరించినపుడు ప్రకృతియుఁ బెక్కురూపముల నవతరింపనేల? ఒక్కరూపమున నవతరింపఁగూడదా యనుదురేమో. రాధ శాపవశమున నూఱేండ్లు వియోగము నొందవలయును. శాపమును మార్పరాదు కదా. కావున నిట్లు వేలువేలు నవతరించిరని యెఱుంగునది. ఇవు దేవపురాణమునకు విరుద్ధముగాఁ గథ సాగదు. అంతయు సరిపడును.

భగవంతుని తర్వాతివాక్యమును బరిశీలింపవలయును. అందు రహస్య మొక్కండు కలదు. క్రథకైశికు లిర్వురు భగవంతున కాతిథ్యము నొసంగి రాజ్యము నిచ్చిరి. దానఁ బదితరముల వారు పూర్వులు పదితరములవారు తరువాతివారు ముక్తులగుదురని వరమిచ్చెను. దీని సారమేమి? శ్రీకృష్ణునకుఁ గ్రథకైశికు లిర్వురొసంగిన యల్పరాజ్యము మహత్తరప్రీతిదాయక మయ్యెను. ఏలన? ప్రీతి భక్తిచేఁగలుగును గాని పదార్థబాహుళ్యమున భగవంతునకుఁ గలుగదు. క్రథకైశికులు భగవంతుఁ డనుబుద్ధిచేఁ దమకుఁగల రాజ్యము మనస్ఫూర్తిగా దారవోసిరి. "పరమేశ్వరార్పణమస్తు" అని ధన్యులైరి.

శ్లో. "పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యాప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః." ౨౬
గీత ౯ అధ్యా.

అనికదా భగవద్వాక్యము. ఆదానమున భగవంతుఁడు మిన్నందెను. వారిభక్తికి మెచ్చెను. అదియే యవ్యాజభక్తి. దాని ఫలమునకుఁ బారములేదు. ద్రవ్యమొసంగి భగవంతుని సంతృప్తినొందఁ జేయఁజాలము. భక్తిచే నత్యల్పపదార్థ మొసంగి మహానందమునొంది మిన్నందఁ జేయఁజాలుదుము. కావున

భక్తికి సమానమగుధన మీలోకమున వేఱేదియు లేదు. దానికి సర్వభూతదయ గలుగుట ప్రధానము. అది లేనివానికి భక్తి కుదురదు. కుదిరినదన్నను నది నటించుటగాని వేఱుకాదు. ఈవిషయము భగవద్గీతాశాస్త్రమునం దిట్లు చెప్పఁబడినది.

శ్లో. "అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ,
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖః క్షమీ. ౧౩
సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్త స్స మే ప్రియః. ౧౪
యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః,
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో య స్స చ మే ప్రియః. ౧౫
అనపేక్ష శ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః. ౧౬
యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః. ౧౭
సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః,
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సర్వవివర్జితః. ౧౮
తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్ మే ప్రియో నరః. ౧౯
యేతు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్దధానామత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః." ౨౦

౧౨. అధ్యాయము.

ఆర్యులారా! భగవత్కృపకుఁ బాత్రుఁడు కాఁదగినవాని లక్షణము లిందుఁ జెప్పఁబడినవి. ఇందు దేనికిఁగాని ద్రవ్య

మక్కఱలేదు. వేషములు మార్చిమార్చి వేయ నక్కఱలేదు. భాషాప్రవచన మక్కఱలేదు. భూతదయ ప్రధానము. సుఖ దుఃఖములయందు సమత్వము. ద్వేషభావ మెవరియందును లేకపోవుట యివియే ప్రధానములు. సంతుష్టి కలిగియుండు టయు నందు నొకటి. శత్రుమిత్రులయందు సమత్వము. ఇత్యాదులు భగవద్దయకుఁ బాత్రుఁడు కాఁదగినవానికి నుండఁ దగినవి. అంతియకాని వేషము వేసినంతమాత్రమున వాఁడు భక్తుఁడు కాఁడు. ద్రవ్యమిచ్చిన భూషించుట. ధనమీయకు న్నను, గొంచెమిచ్చినను దూషించుట యనునివి భక్తునిలక్షణ ములే కావని భగవద్గీత బోధించుచున్నది. కౌపీనమాత్రధారు లైనంతనే భక్తియోగి యతఁడు కానేరఁడు. మనస్సునందు భూతదయ, ద్వంద్వసహిష్ణుత లోనగు సద్గుణములు లేకయు న్నచో నాకౌపీనధారణము వంచకునిలక్షణముల నొక్కటి యగు. తొలుఁదొలుత భక్తుఁడగువాఁడు సర్వసమత తనకుఁ గలిగినదా లేదా యని పరీక్షించుకొనవలయును. సర్వభూత దయ యలవడినదా లేదా యని చూచుకొనఁదగు. మానావ మానములు స్తుతినిందలు మొదలగువానియందు మార్పులు లేవుకదా యని యెన్నుకొనవలయును. పైఁజెప్పఁబడినలక్షణ ములలో నెదియైనఁ దనయం దలవడినదా యని యాలోచించు కొని యవ్వల నెన్నివేషములువేసినను బాగుండును. ద్రవ్యసం బంధమున నెవనిబుద్ధి హర్షవిషాదముల నొందునో వాఁడు భగ వత్సేవ కర్హుఁడు కాఁడు. వానిభక్తి కపటభక్తి. అది లోక మును వంచింపఁ బనికివచ్చును. ఎవ్వఁడు గురువుగా నెల్లరకుఁ దత్త్వోపదేశములు చేయుచు ధనము సంపాదించునో వాఁడు

నరకప్రాప్తుఁ డగును. అట్టియుపదేశము లాతనిదుర్వృత్తిని గప్పిపుచ్చుటకు ద్రవ్యమార్జించుటకుఁ బనికివచ్చును. కాని యాతనిఁ దరింపఁజేయ నవి చతురములు గావు. ఎవ్వనిమదిఁ బరమేశ్వరుఁడు శ్రీకృష్ణమూర్తియయి భక్తికలదో వాఁడు నిస్సంగుఁడగుటకు, జనసంఘమునకు దూరముగా నుండుటకుఁ బ్రయత్నించును. ఎవ్వఁడు విశేషముగా జనసంఘమునఁ దిరుగఁ బ్రయత్నించునో వాఁడు యశఃకాముఁడు గాని భగవత్కారుణార్థి కాఁడనుట దృఢము. ఇవ్విషయము శ్రీకృష్ణపరమాత్మయే భగవద్గీతాశాస్త్రమున బోధించియున్నాఁడు. కావున భక్తులగు వారు శ్రద్ధచేతఁ దనకుండినపదార్థమును భగవంతున కర్పించిన నది పదివేలుగా భావించి సర్వేశ్వరుఁ డానందించి యనన్యమతి యగు నాతని నుద్ధరించును.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః."

౧౮. అధ్యా.

కొందఱుమూఢు లీశ్లోకమును బఠించి సంధ్యావందనాదులను గూడ వదలి భగవంతు నాశ్రయించితిమని ప్రల్లదము లాడుచు స్వేచ్ఛగా భుజించి శిశ్నోదరపరాయణులై యుందురు. సర్వపాపములను భగవంతుఁడే తొలఁగించునని యీశ్లోకమును బ్రమాణముగా నుదహరింతురు. సీ! ఇసీ! ఇస్సీ. ఛీ. ఛీ. అట్టి దురాత్ములను స్మరింపరాదు. వారికంటెఁ బాపాత్ములు లోకమున లేరు. దీనిభావమేమి? సకలధర్మములను జేయవలయునను యాశమాని చేయఁదగు నుచితధర్మములను జేయుచుఁ దత్ఫలమును దా నాశింపక పరమేశ్వరార్పణము చేయుచు శ్రీకృష్ణా!

నీకంటె నన్యదైవమును దలంచువాని నీలోకమునఁ గానను. న న్నుద్ధరింపుము. పూర్వభవమునఁ దెలియక చేసినపాపముల నశింపఁజేయుము. నీపాలఁ బడితిని. న న్నుద్ధరింపుము. అని దృఢమతియై కోరువానిని భగవంతుఁడు కాపాడుననియే గాని ప్రతిదినము సకలపాపములు చేయుచు నన్నియుఁ గృష్ణార్పణ మనువానిని భగవంతుఁ డూహించి మనుష్యజన్మముకూడ నొసంగఁడు. అట్టివాఁ డాత్మవంచకుఁ డగును. ఎవ్వఁడు భగవంతునియందు దృఢభక్తియుక్తమతియో వాఁడు పాపములఁ జేయనైనఁ దలంచునా? వానికిఁ జేయఁదగినకృత్యము లుండునా? అన్నియు బ్రహ్మార్పణము చేయుటయే యతని విధి. అట్టి భక్తుని భగవంతుఁ డగుశ్రీకృష్ణమూర్తి తానే వచ్చి రక్షించును. వాని కేయాపదలు రాకుండఁ జేయును. అది యీశ్లోక తాత్పర్యము గాని కపటనాటకసూత్రధారులు చెప్పునది కాదు. అట్టి వంచకులమాటలకు మోసపోరాదు. ఎవ్వనిజూచిన సర్వభూతములు ప్రేమించి మైత్రిని బాటించువానివలెఁ జెంతఁ జేరునో యాతఁడు,

శ్లో. "సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి సచ మే న ప్రణశ్యతి. ౩౦
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే. ౩౧

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః"
గీత. ౬. అధ్యా.

అని భగవద్గీతాశాస్త్రమునఁ జెప్పఁబడినప్రకారము యోగి యనఁబడును. ఆతఁడే భగవంతునిదృష్టికి సమ్మతమైనవాఁడు. ఎవనివేషమును జూచి జంతువులు క్రౌర్యమును గనఁబఱుపఁ బూనునో వానికి భగవత్తత్త్వము తెలియదనియు, వానిమాటలు శాస్త్రములయందు దుష్టములైనను అవి వానికిఁ బనికిరాక పొట్టపూటకై యుపయోగించుననియు మన మూహింపవచ్చునని గీతాశాస్త్రమే నొక్కి వక్కాణించుచున్నది. కాఁబట్టి వేషభాషలు భక్తునకుఁ బ్రధానములు కావు. భగవత్సేవయే ప్రధానము. వాఁడే భగవద్భక్తుఁడు. అను నీయర్థము శ్రీకృష్ణుఁడు భీష్మకునకుఁ జెప్పినయుపదేశవాక్యములం బట్టి తేలుచున్నది. దీని మదినిలుపుకొని యభ్యాసమునకుఁ దెచ్చుకొనినవారలే ధన్యులు. మూఁటికి మున్మూటికి ధన్యులు. కృతకృత్యులు. ముక్తులు నగుదురు. ఇంకను దీనింగూర్చి పెంచి వ్రాయక తరువాతికథను వ్రాసెదను. మరల మథురానగరమున కేలపోయెను శ్రీకృష్ణుఁడని యనుమానింపక యోపికతోఁ గథ నాలకింపుఁడు.

* శ్రీకృష్ణమూర్తి బలదేవాదులం గూడి మథురానగరమున కరుగఁగా నిట రాజులందఱు భూషణభూషితాంగులై స్వయంవరసభామండపమును జేరిరి. మహావిభూతియలరఁ దమ

---

* ఈకథ హరివంశము విష్ణుపర్వము ఏఁబదిరెండవయధ్యాయము నుండి సంగ్రహింపఁబడినది.

కర్హ్యము లగునాసనముల నుపవిష్టులై ప్రయాణాభిముఖులై యుండఁగా వారిని దర్శించి రాజపుంగవుఁ డగుభీష్మకుఁడు నీతి పారంగతుఁడు కావున నిట్లు ప్రార్థించెను. రాజచంద్రులారా! స్వయంవరవిషయమగు నాదోషమును క్షమింపవలయును. వృద్ధుఁడనని దుర్విదగ్ధుఁడనని యిట్టివాఁ డొనరించుకార్యముల యందు దోషములు లేకుండవనియు నమ్మి నాయపరాధములను నమ్మి సైపవలయును. అని ప్రార్థించి వారినెల్ల యథార్హ్యముగా సత్కరించి మధ్యదేశపాలకు లగురాజులను సాగనంపెను. పిదపఁ బూర్వపశ్చిమదేశాధీశుల నుత్తరాపథకులను బ్రయాణ ము చేయ ననుమతించెను. వారెల్ల మహాబలపరాక్రమశాలు రయ్యు యథార్హ్యముగ సంపూజితులై పోయిరి. జరాసంధ సునీథులు, దంతవక్త్రుఁడు, శాల్వుఁడు, మహాకూర్మపతియుఁ, గ్రథకైశిక ముఖ్యులగు కులీనభూపాలకులు, వైణుదారి యను రాజర్షియుఁ, గాశ్మీరాధిపతియు లోనగురాజులు దక్షిణాపథి కులు ప్రయాణము చేయఁబూనియు రహస్యవాక్కులను వినఁ గోరి భీష్మకునిచెంతకుం బోయిరి. ఆరాజపుంగవులను విలకించి బలశాలి యగుభీష్మకుఁడు స్నేహపూర్ణమనస్సుతో నలరు నా రాజచంద్రులతోఁ ద్రివర్గసహితము మధురము షడ్గుణాలం కృతము హితము నగుచందమునను నీతిబాహ్యము కాకుండు నట్లు గంభీరవాక్కు లలర నిట్లులనియెను. నీతిపారంగతులరగు మిమ్మెల్ల దర్శించి మీ రుపదేశించిన నీతివాక్కులను విని కార్య మీరీతిగా సాగించితిని. మేము నిత్యాపరాధులము. కావున మాతప్పును క్షమింతురుగాక. అని పలికి నయకోవిదుఁ

డగుభీష్మకుఁడు కొడుకునుద్దేశించి రాజసభయందే యిట్లు హితముపదేశించెను.

భీష్మకునిచిత్త మాతరుణమునఁ ద్రాసమాకులమై చంచలాత్ములు గలదియై స్థిరతం గాంచకుండెను. కావున భీతిల్లు మనస్సుతో నిట్లు పలికెను. వత్సా! ఈవచ్చినరాజులనందఱను బాలకులగా భావించెను. శ్రీహరి పురాణపురుషుఁడు. కీర్తియు నతఁడే. కీర్తిమంతులలో నుత్తముఁడు యశస్సు. యశోవంతులలో మేలుబంతియు నగుశ్రీహరి యీభూలోకమున నూర్జితమగు బాహుబలమున ధర్మమును స్థాపింప నవతరించెను. దేవకీదేవి స్త్రీరత్నము. ధన్యయు నగు. త్రిలోకశ్రేష్ఠుఁ డగు కొడుకును బడసెను. ఆమెగర్భమే రత్నగర్భము. కమలపత్రాక్షుఁడై యమరార్చితుఁడై వెలయు శ్రీకృష్ణుని స్నేహపూర్ణములగునేత్రములతోఁ దనివి మిగులకుండునట్లు చూడఁగలదు కదా. అని రాజసభలో నేమేమో పలుకుచుండ శల్యరాజు మృదుమధురవాక్కుల నిట్లు బదులుచెప్పెను. రాజేంద్రా! ఖేదపడనేల? దానిని మానుము. రిపుధ్వంసకుఁ డగుకొడుకున కుపదేశించుటయుఁ జాలును. తద్విషయమున విచారపడకుము. యుద్ధమున క్షత్రియునకు జయపరాజయములు గల్గుట నిశ్చితము. మనుజులకు గతి నియతము. ఇది సనాతనధర్మము. బలకేశవులకంటె నధికుఁడగుపురుషుఁ డెవ్వఁ డీలోకమునఁ గలఁడు? వారి నెదిరించిపోర శక్తుఁ డెవ్వఁడు? నీకొడుకు నట్టివాఁడు. రణశూరుఁడు. రథికులు,నతిరథులు,పెక్కండ్రు చుట్టుముట్టినను రణాంగణమున నీకొడుకొక్కఁడే చాలును. మహాభుజుఁ డగు నీకొడుకు ధనుర్ధారియై నిలువంబడి రిపువితతులఁ బరిమార్పఁ

గలఁడు. మహారౌద్ర మగుభార్గవాస్త్రము కలదు. అది దేవతలకును దురాసదము. దానిని జేఁబట్టి నిలిచిన నేపురుషుఁ డెదుట నిలువఁబడఁగలఁడు. ఈకృష్ణుఁ డనాదినిధనుఁడు. అవ్యయుఁడు. ఆపురాణపురుషు నీలోకమున జయించువాఁ డెవ్వఁడు ? శూలాయుధమును దాల్చిన యీశ్వరుఁడు చాలఁడన నిఁక నితరులమాట యిట నేటికి ? మహారాజా! నీకొడుకు నసదుగాఁ దలంపకుము. సర్వశాస్త్రార్థతత్వవేత్తయని యూహింపుము. దేవదేవునిగా భావించియే కృష్ణునితో రణ మొనరింపకున్న వాఁడు. ఇపుడు సంగరరంగమున శ్రీకృష్ణుని మార్కొని జయింపఁగలవాఁడు కాలయవనుఁడే. కాలయవనుఁడు కేశవునకు నవధ్యుఁడు. వానితండ్రి దారుణతమ మగుతపము సలిపెను. అది యితరులుచేయ శక్యము కానిది. * అతఁడు రుద్రు నారాధించి పండ్రెండేఁడు లుపవసించి పుత్రకాముఁడై తపముచేసినందున నీకొడుకు గలిగెను. వాఁడే కాలయవనుఁ డనువాఁడు. మథురానగరమున వీఁ డవధ్యుఁడని శంకరుఁడు వరమిచ్చెను. మునిప్రార్థనము నిట్లు చెల్లించి హరుఁ డంతర్హితుఁ డయ్యెను. గార్గ్యమునికొమరుఁడు కాలయవనుఁడు. రుద్రవరోత్పన్నుఁడు. మథురారాజ్యపాలకులకు వాఁ డవధ్యుఁడు. విశేషించి మథు

* కాలయవనునివృత్తాంత మీవఱకే వ్రాయఁబడినది. హరివంశము ప్రకార మీ కాలయవనునివధము రుక్మిణీపరిణయానంతరము కలదు. కావున మరలఁ గాలయవనుఁ డెవఁడని బెదరక చదువుఁడు. వీనియుద్ధవార్తలిక వ్రాయఁబడవు. విషయాంతరఖ్యాతము కావున నిందు వ్రాయక తప్పక వ్రాసితిని. వ్రాసినకథలనే మరల వ్రాయుచున్నాఁడే యని విసుగునొందవలదని ప్రార్థించెదను.

రానగరమున నవధ్యుఁడు. కృష్ణుఁడు బలవత్తరుఁడైనను మథురాదేశమునఁ బుట్టినవాఁడు కదా. మథురానగరమున వీరిరువురు కూడినచోఁ గాలయవనుఁడు శ్రీకృష్ణు నోడించును. రాజులందఱు నీమాటను దూలనాడక విశ్వసింపవలయును. కావున యవనేంద్రు నిగుఱించి దూతను బంపుఁడు.

అని పలుకుచున్న సౌభపతియగు శాల్వునిమాటలను విని మచ్చరముకలవారు కావున నట్లేచేయుట లెస్సయని పలికి జరాసంధుం దిలకించిరి. బలాధికుఁడగు జరాసంధుఁ డా రాజుల మాటల నాలకించి విమనస్కుఁడై బ్రహ్మవాక్యమును స్మరించుచు నిట్లు పలికెను. ఈరాజులందఱు నిన్న నన్నాశ్రయించి నృపభయార్దితులై మాటలాడిరి కదా. ఇప్పుడు వీరు తమతమ దేశములకుం బోవుదురు గాక. కన్యక తాఁగోరిన కృష్ణుని ద్వేషించువారిని వరించునా నాకింతకంటె మరణమే శ్రేయస్సు. వేఱొకరి నాశ్రయింపను. కృష్ణుఁడుగాని బలదేవుఁడుగాని మఱొక యుత్తమరాజేంద్రుఁడు గాని నన్నుఁ జంపువానిని మార్కొని పోరాడెదను. బ్రహ్మ యిట్లే నాకు విధించెను. ఇది నా మనోనిశ్చితము. ఇదియే నా పురుషవ్రతము. వీనికి విరుద్ధముగాఁ జేయుశక్తి నాకు లేదు. విధి బలవత్తరము కదా. పరుని సమాశ్రయింపను. కాలయవనుఁడు సాధుమతులగు మీకు బదులుపల్కఁడు. రాజరక్షణార్థమై దూతను బంపెదను. ఆకాశమార్గమున దూతపోవలయు. కృష్ణుని బాధకలుగని మార్గ మదియే. పోవుటకు సిద్ధపడువాని నాలోచించి పంపుట మంచిది. ఈశాల్వుఁడు దివ్యరథము నెక్కి తనదేశమునకుఁ బోవఁగలఁడు. నరేంద్రులమాటల నాలకించి కృష్ణునితోఁ బోర

సిద్ధపడునట్లు దూతకుం దెల్పి పంపవలెను. అని పలికి సౌభపతి యగు శాల్వునిగాంచి మరల జరాసంధుఁ డిట్లు పలికెను. ఆర్యా! మానదా! సర్వభూపతులకు సాహాయ్యము చేయుము. యవనేంద్రుఁ డేరీతిఁబల్కిన నంగీకరించి వచ్చి కృష్ణుని జయించునో మనమెల్ల నేకార్యముచేఁ దృప్తులమగుదుమో యట్టినీతి నాలోచింతువు గాక.

అని పలికి రాజులనెల్ల బహూకరించి భీష్మకుని బొగడి జరాసంధుఁడు తనబలములం గూడి నిజపురమున కరిగెను. శాల్వుఁడును జరాసంధక భీష్మకపూజితుఁడై యాకాశమార్గమున ననిలవేగముగల రథము నెక్కి పోయెను. దక్షిణాపథవాసు లగురాజులందఱు జరాసంధుననుసరించి తమతమనగరముల కరిగిరి. భీష్మకుఁడు జ్యేష్ఠపుత్త్రునిం గూడి దుర్నయమును బూనినను స్వగృహమునందుండియే దీనుఁడై కృష్ణునే చింతించుచుఁ జేయునదినేరక పుత్త్రప్రేమమున నుండెను. స్వయంవరము నిలుచుట విని రుక్మిణీదేవి కృష్ణాగమనమున రాజులయందు దోషము గపడుట నెఱింగి యంతఃపురమున సఖీబృందమునడుమ వ్రీడితాననయై యిట్లు పలికెను. చెలికత్తియలారా! శ్రీకృష్ణుఁడుగాక తక్కినరాజులలో నొక్కరికేని భార్యనుగా నుత్సహింపను. కమలపత్త్రాక్షుఁ డగుకృష్ణునకే పత్ని నయ్యెదను. ఈవచనము సత్యము. సత్యము. అని పలికెను.

ఆర్యులారా! ఈకథనుండి వ్రాయఁదగినవిషయములు విశేషించి కానరావు. ప్రత్యక్షముగా భగవత్కల్యాణగుణములు శతముఖాదిదేవతలవలనఁ గనఁబడినను క్రోధపూర్ణమానసు లగురాజులచిత్తములు తత్కాలమునకు మార్పు

నొందినను మరల యథాపూర్వముగ నుండెను. భగవంతుఁడు కృష్ణుఁడని తమరే యంగీకరించి యుపన్యసించిన రాజులు కాలయవనసహాయమున మరలఁ గృష్ణుని జయింప నాశించుట వారి దుష్టగ్రహాచారమనక మఱేమనవచ్చును. ఎవరెన్ని విధముల బోధించినను దోషపరీతాత్ములచిత్తములు మార్పునొందవనుట కిదియొక దృష్టాంతమనవచ్చును గదా. ఇదియే భగవంతుని మాయాసమాచ్ఛాదనము. ఆమాయను వోలఁగింప బ్రహ్మకే నశక్యము. కావుననే శ్రీకృష్ణమూర్తి భగవద్గీతాశాస్త్రమునందు,

శ్లో. "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే. ౧౪
న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః,
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః." ౧౫

౭. అధ్యాయము.

"మాయయా అపహృతజ్ఞానాః సమ్ముషితజ్ఞానాః ఆసురంభావం హింసానృతాదిలక్షణమాశ్రితాః." అని శాంకరభాష్యము.

అని బోధించెను గదా. భగవద్వాక్యము తప్పునా! ఏకాలమునందును మార్పునొందదు. ఇంతకుముందే క్షమింపుమా యని రాజులు భీష్మకుఁడు ప్రార్థింపఁగా

"క్షంతవ్యం రోచతేఽస్మాకం వీతవైరా భవంతు తే."

అని హెచ్చరించెను. అప్పుడేమో వారెల్ల వీతవైరులవలె నటించిరి. కాని నటన మెంతకాల ముండును? క్షణకాలమున కది మాఱెను. యథాప్రకారముగ నయ్యెను. సాక్షాద్భగవంతుఁడని యింద్రాదులు వచింప నస్మి యభిషేకోత్సవమునఁ

బోల్గొనినరాజులు భీతులలో నొకఁడు కాలయవనునివార్తఁ దెల్పినంతనే మరల జయింపఁ దలంపుగొని భగవద్ద్వేషి నాశ్రయించుట మాయాచేష్టలకు లోఁబడుట కాక మఱేమిటి? ఆసురీభావముగలవారెల్ల నిట్లే మాఱుచుందురనుట నిశ్చయము. కర్మము ప్రాణులఁ జర్మనిర్మితప్రతిమలంబోలెఁ ద్రిప్పుచుండును. ఇంతమాత్రమున కహంకారమేటికో తెలియరాకున్నది.

శ్లో. "ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే. ౨౭
సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి,
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి." ౩౩
౩. అధ్యాయము.

అను సీగీతావాక్యములు పైయర్థమును దేటపఱచుచున్నవి. కావున మనము రాజుల నాక్షేపింప నక్కఱలేదు. జనప్రళయము కావలసి యున్నది. భగవదిచ్ఛయు నందులకు సమ్మతించినది. తదనుగుణముగాఁ బ్రకృతి జీవుల నాడించుచున్నది. పాపము! వా రేమి చేయఁగలరు? ఇం దెవ్వరిదోషము నాదృష్టికిం గానరాదు. భగవంతుఁ డేకార్య మేరీతిగాఁ జేయఁదలంచునో యాకార్య మాపద్ధతిగనే సాధింపఁబడును. దానిని మార్ప బ్రహ్మాదులకేనశక్యమని సిద్ధాంతమైయుండఁగా రాజులేల యిట్టియకార్యములను జేయవలయునని మనము దూషింపవలయును? కర్తృత్వము వారికి లేదని స్పష్టమైనది.పరతంత్రు లేమి చెప్పిన నది చేయఁదగువారే కదా. దీనిచే దైవచేష్టిత మని

వార్యమని యెఱింగి సన్మార్గమునఁ బ్రవర్తింపఁజేసి నీచరణదాసుల మగునట్లు చేయుమా యని భగవంతుని బ్రార్థించుటయే మనకృత్యము. పరిశుద్ధచిత్తమున శ్రీహరిని భజించుచుండవలయుననుటయే యిట సారము. ఇఁకఁ దరువాతివిషయమును నాలకింపుఁడు.

కాలయవనుని వధవిషయ మింతకుముందే వ్రాయఁబడినది కదా. రుక్మిణీస్వయంవరసమయమున నాఁడ దానినేల వ్రాయవలయునని ప్రశ్నింతురని నే నెఱుంగుదును. హరివంశమున నాకథను వ్రాసివైచినఁ గథ కొదువలేకుండ సాగదు. కావున దాని నించుక వ్రాయక తప్పదు. వానియుద్ధము మృతియుమాత్రము వ్రాయుదు. ఎన్నియో విషయము లీకథలనుండి తేలును. భగవన్మహిమముఁ దెలిపిన ట్లగును. కావున నే వ్రాసెదను. ఇంతియకాక కాలయవనుఁ డెవఁడో యేల యతని రాజులాశ్రయించిరో యనువిషయము భాగవతమునఁ గానరాదు. కృష్ణుఁ డాతని దానే చంపక యేల పంచనపోయి ముచుకుందునిచేఁ జంపించెనో యందులకును గారణము భాగవతమున స్పష్టముగాఁ జెప్పఁబడలేదు. కావునఁ దద్వృత్తాంతమంతయుఁ దెలియుటయు నవసరమే. కావున వ్రాయఁబూనితిని. ఇఁక వినుఁడు.

### శాల్వుఁడు కాలయవనునికడ కరుగుట.

* యవనులలో మహాబలపరాక్రమములుగలవాఁడు కాలయవనుఁ డనువాఁ డొకఁడుండెను. అతఁడు భూపాలకుఁడు. అతఁడు ధర్మము నెడఁబాయకయే రాజ్యమును విశేషించి నగర

---

* ఈకథయంతయు హరివంశ విష్ణుపర్వము ఏఁబదిమూఁడవయధ్యాయము నుండి గ్రహింపఁబడినదని యెఱుంగునది.

మును గాపాడుచుండును. త్రివర్గముల నెఱింగి షడ్గుణముల నెఱింగి సప్తవ్యసనముఁ దెలియక సద్గుణములయందుఁ బ్రీతిగలిగి శ్రుతిమంతుఁడై ధర్మశీలుఁడై సత్యవాదియై జితేంద్రియుఁడై యుండెను. ఆతఁడు సాంగ్రామికవిధుల నెఱింగినవాఁడు. దుర్గనిర్మాణలాభముల గుఱుతెఱుంగును. శూరుఁడు అప్రతిబలుఁడు. మంత్రిప్రవరు లాతనికడ నుందురు. సుఖాసీనుఁడై సచివులం గూడి ధర్మమున ననుసరించి రాజ్య మేలుచుండును. వానిని యవనవీరులు విశేషించి కొలుచుచుందురు. వారును మూర్ఖులు కారు. ఆత్మవేత్తలు. పండితులు. వివిధగాథల ననవరతము కాలయవనునకు వినిపించుచుందురు. ఇట్టులుండ నొకనాఁడు దివ్యగంధవహుఁడు మెల్లమెల్లగా వీచెను. సుఖశీతలుఁడై మదనాబోధమును గలిగించెను. ఆసభలో నున్న వారందఱు నిదియేమని యచ్చెరువందిరి. మఱియు నుత్ఫుల్లనయనులై యుండిరి. రాజుకూడ నిదేమని నలుప్రక్కలం జూచెను. అంతలో దివ్యస్యందన మొండు నేత్రపర్వ మొనర్చెను. ఆరథ మత్యద్భుతముగా నుండెను. నవరత్నము లద్దానికిఁ జెక్కఁబడి దశదిశల వెలుఁగొందఁ జేయుచుండెను. దివ్యధ్వజ మద్దానికిఁ గట్టఁబడి యుండెను. దివ్యతురగములు మనోమారుతరంహస్సుగలవయి యుండెను. బంగారుచే భాస్కరశీతాంశుబింబములుగా నొనరించి యం దమర్చియుండెను. విశ్వకర్మయే యాచిత్రమును నిర్మించెను. వైయాఘ్రవరవిభూషితమై యారథము కన్నులపండువుగా నుండెను. దానిని జూచినంతనే శత్రువులు భయంపడుదురు. మిత్రు లానందసాగరమున నోలలాడుదురు. ఆయర

దము దక్షిణప్రదిక్కునుండి వచ్చుచుండెను. శత్రురథము లద్దానిం జూపఁజాలవు.

ఆయరదమునందు శ్రీమంతుఁడై యాసీనుఁడై యున్న సౌభుఁడు (శాల్వుఁడు) రాజేంద్రలక్షణలక్షితుఁడై యుండెను. ఆ రాజు దృష్టిగతుఁడు కాఁగాఁ గాలయవనుఁడు యర్ఘ్యపాద్యాదివిధులఁ బూజింప మంత్రుల కాజ్ఞాపింప మంత్రిశేఖరుఁడు లేచి యెదురుసని యర్ఘ్యము పాద్యములోనగు నాతిథేయము లాచరించి రథావతరణము చేయించెను. కాలయవనుఁడు నతని నెదుర్కొనియెను. శాల్వుఁ డందులకుఁ బరమానందభరితుఁడై మహేంద్రసమతేజుఁ డగునాతనిం గాంచి మెచ్చుకొనుచు రాజేంద్రా! నేనిపుడు పూజార్హుఁడను గాను. నేను రాజులుపంపఁగా వచ్చినదూతను. నీయంతికమునను నన్నెల్లభూపతులు పంచిరి. జరాసంధుఁడు విశేషించి సర్వభూపతులచేఁ బ్రార్థితుఁడై నన్నుఁ బొమ్మని బలవంతపెట్టెను. కావున నావచ్చిన కార్యమును బట్టి పూజార్హుఁడను గానని విన్నవించితి. అను నారాజుమాటలు విని కాలయవనుఁ డిట్లు పల్కెను. మహాత్మా! దౌత్యమున నీవిటకు వచ్చితివని యెఱుంగుదును. నరపతులొక్కచోఁ జేరి మాగధునితో విన్నవింప నతఁడు పంపెననియు నెఱుంగుదును. కావుననే విశేషించి భూపాలకా! నిన్నర్చించువాఁడను. యథావిధి నర్ఘ్యపాద్యముల నిన్నుం బూజింపవలయు. రాజులనుబూజింప మానవులనెల్లఁ బూజించినట్లగును. నన్నుం గూడి యీయాసనమునఁ గూరుచుండుము.

అని పలికి యాతనికరమును స్వహస్తమునఁ దెమల్చి పిలుచుకొనిపోయి కూరుచుండఁజేసి ప్రీతిపూర్వకముగాఁ

గుశలమడిగి సింహాసనములఁ గూరుచుండిన తమ్మిర్వుర నెల్లరుం గాంచి చిత్రప్రతిమలవలెనుండ నా కాలయవనుఁడు మరల నిట్లు పలికెను. మనమెల్ల రాజులము. బాహుబలమునే యాశ్రయించి తదాధారమున నుండువారము. విగతోద్వేగులమై వసించువారము. నాదగ్గర కేపనికై పంపఁబడితివి ? అదేమసాధ్యము? సత్యము రచింపుము. ఏమి యాజ్ఞాపించిన నట్లే చేయుదును. ఆ కార్యము దుష్కరమైనను జేసెద. జరాసంధుఁ డేమిచేయవలయునని నా కాజ్ఞాపించెను. అని పలుక సంతసించి శాల్వుఁ డిట్లు బదులుచెప్పెను. రాజేంద్రా! మగధదేశాధిపతి యేమాటలు చెప్పఁబనిచెనో అట్లే విన్నవించెద. అవధరింపుము. 'కృష్ణుఁడనువాఁ డెవ్వరికి జయింపనలవిగాక లోకులను బాధింప నొక్కఁడు పుట్టినాఁడు. ఆతనిదుర్వృత్తముల నెఱింగి యతనిం బొలియింప నరిగితిని. సమగ్ర బలవాహనోపేతులై రాజులెందఱో నాతోడ వచ్చిరి. గోమంత మనుపర్వతోత్తమమున నతఁడుండ నడ్డగించితిని. చేదిరాజు మహార్ధవేదియగుట నతనిమాటను బాటించితిని. కృష్ణునకు సోదరుఁడు గలఁడు. వారిద్దఱి నశింపఁజేయుపొంటెఁ బర్వతమును గాల్పించితిని. ప్రళయకాలాగ్నిజ్వాలలవిఁంచిన మంటలెగయఁ బర్వతము కాలుచుండఁగా బలరాముఁడు హేమతాలమును ధరించి తత్కూటము నుండి లంఘించి సాగరమును మించియున్న మహాసేనను నుగ్గాడి యంతట నూరకుండక రథికులఁ జూర్ణముచేసెను. ఆతనికి లాంగలాయుధము గలదు. దాని నందఱిమెడలకుఁ దగిలించి లాగి లాగి నరనాగాశ్వబృందముల ముసలాఘాతమునఁ బిండిచేసెను. అంతియగాక గజములతో గజములను, రథములతో రథము

లను, హయములతో హయములను, బదాతులచేఁ బదాతులను నాశనము చేసెను. ఆదారుణసమరమునం దారాముఁడు హలముసలాయుధములఁ జేఁబూని రాజలోకమును నుగ్గుగాఁ జేసి విహరించెను. రాముని వెనుకఁ గృష్ణుఁడు భాస్కరతుల్యప్రకాశము గలచక్రమును గైకొని సింహము మృగవితతులఁ బొరిగొనుచందంబునఁ బాదవేగమున నాపర్వతమును గంపింపఁజేయుచుఁ దన యత్యద్భుతప్రతాపములచే శత్రుసైన్యములపై కడరెను. ఆపర్వత మాశ్చర్యజనకముగా వర్షధారాభిషేచితమై నృత్యముచేయునట్లు ఘూర్ణిల్లుచుండఁగా నగ్ని చల్లారెను. ఆశిఖరమునుండి యెగిరి జనార్దనుఁడు సేనాసాగరమున దుమికి చక్రవ్యగ్రమగు హస్తముచే శత్రువులఁ దునుమాడెను. చక్రజ్వాలలఁబడి సేనలు మిడుతలపగిది మ్రందెను. ముసలాద్యాయుధములచే నిశ్శేషము గావించెను. ఇంతయేల? వాహినులన్నియు నిదాఘభాస్కరరశ్ముల జలమింకినట్లు లింకెను.

అత్తఱి నేనును యుద్ధముచేయుచుండ రాముఁడు గదాహలాయుధములఁ దాల్చి నాయెదుట నిలిచి గదచే నన్ను మోఁదెను. ఆదెబ్బ వజ్రపాతమును మించినది. నేనెన్నఁడు గదాఘాతమున నంత నొవ్వలేదు. త్రిపురాసురుల సంహరించిన రుద్రునియాకారమును దాల్చి బలదేవుఁడు నాకుం గనఁబడియెను. రక్తాక్షుఁడై ప్రాణములఁ గొననుంకించు నాబలదేవుని మార్కొన బ్రదుకఁగోరువా రెవ్వరు పూనుదురు? కాలదండము నీసడించుగదను త్రిలోకములఁ జూర్ణించుహలమును ధరించి నాయెదుట నిలువఁబడియెను. ఆసమయమున నంబరమునుండి మేఘగర్జన గంభీరమై పితామహప్రేరితమై స్వరమొ

క్కఁడు వినఁబడియెను. రాజా! ఈతనిం గొట్టకుము. వీఁడు నీచేఁ జావఁడు. మఱొకరివలన వీనికి వధము కల్పింపఁబడినది. హాలా యుధా! విరమింపుము. ఆమాటలు స్పష్టముగా నాకును వినఁ బడఁగాఁ జింతావిష్టుఁడనై మరలితిని. హరియు నూరకుండెను. సర్వప్రాణులకు మరణము కల్పించు బ్రహ్మాయే యిట్లు పల్కెను. కావున రాజులకు హితమును గోరి మీకొక్కమాట చెప్పె దను. దానిని విని నీవే కార్యముఁ దీర్పుము. మీతండ్రి మహా త్తరదారుణతపం బొనరించి శంకరుం బ్రీతునిం గావించి మథు రానగరజనులచే నవధ్యుఁడ వగునిన్నుం గాంచెను. మీతండ్రి మహాముని. ద్వాదశవార్షికనిరశనవ్రతము నూనెను. సురా సురస్తుతపాదపంకజుఁ డగునామహర్షి యీప్సితకామసంప న్నుఁడ వగునిన్నుఁ బడసెను. మహాత్ముఁ డగుగార్గ్యముని తపో బలమువలనను వరప్రభావమువలనను నిన్నుమాఱొక్కని జనార్ద నుఁడు భాస్కరకాంతుల హిమము కరఁగినట్లు బ్రుంగఁగలఁడు. రాజవచనములచేఁ బురికొల్పఁబడి ప్రయత్నింపుము. కృష్ణుని మాఱొక్కని జయింపఁ బయనము కమ్ము. మథురారాజ్యమును ప్రవేశించి సేనాసమితిచేఁ బురముం గిటడంచి కృష్ణుం బొలి యించి యశము సంపాదింపుము. వాసుదేవుఁడు మాథురుఁడు. బలదేవుఁడు మాథురుఁడే. వారినిర్వురను దద్బంధువులను రణ రంగమున నోర్వఁగలవు. కాన మథురాపురిపై దండువిడి యుము".

అని జరాసంధునిపలుకులుగా విన్నవించి శాల్వుఁడు మహారాజా! రాజహితమునుగోరి జరాసంధుఁడు పచించిన పలుకు లివి. వీనిని మంత్రులంగూడి విమర్శించి మీబుద్ధికి సరి

పడునేని యట్లొనర్పుము. బుద్ధికనుకూలమైనకార్య ముత్తమము కదా యని పలికి జరాసంధుఁడు రాజులయభిమతమును గోరి చెప్పినకార్యము నెఱవేర్ప శాల్వుఁ డూరకుండెను.

ఆర్యులారా! కాలయవనునిచరిత్రము లోపల భాగవతమునను సరించి వ్రాసియుంటిని. నారదప్రచోదితుఁడై కాలయవనుఁడు దండెత్తివచ్చినట్లే యందుఁ గలదు. శ్రీకృష్ణుఁడు యుద్ధరంగమునకు నాయుధవిహీనుఁడై పరుగెత్తుటకుం గలకారణమందుఁ జెప్పఁబడలేదు. ఆవిషయ మిందుఁగలదు. కావునఁ గాలయవనుఁడు మృతినొందినట్లు మీరీవఱకుఁ జదివియున్నను దత్పూర్వచరిత్రము నిపుడెఱుంగుట మంచిదియే గాని వ్యర్థము కాదు. కావున నింక దీనిసారము నాలకింపుఁడు. కాలయవనుఁడు శంకరవరప్రభావమువలన మథురానగరవాసులచే నవధ్యుఁ డయ్యెను. శంకరుఁడు రాఁగలవిషయము నాలోచించియే మాథురజనులచే నవధ్యుఁడు కాఁగలఁడని వరమిచ్చునపుడే యాప్రాంతమున ముచుకుందుఁ డుండుటయు, నతని నిద్రనుండి లేపునతఁడు మృతుఁడగునట్టు లమరులచే నతఁడు వరముల నందుటయు నెఱింగియే యిట్లు వరములిచ్చెను. శ్రీకృష్ణుఁ డీవరము నెఱింగి తనచేఁ జావఁడని యుపాయముచే ముచుకుందునిచెంతకుఁ దీసికొనిపోయెను. అఘటనాఘటనసమర్థుఁ డగు భగవంతుఁ డతని జంపఁజాలఁడా యని శంకింపరాదు. శంకరుఁడు తాను భేదముగలవారు గారు. కార్యార్థము వేఱు రూపములఁ దాల్చిరి. కానఁ దనయాజ్ఞను దానే మార్చినట్లగును. కావున నేపని యెట్లు చేయఁదగునో యట్లు చేయుటయే భగవచ్ఛక్తి గాని వేఱువిధమున నుండదు.

తపఃప్రభావమున జనించినకుమారుఁడు సాత్వికుఁడుగాక మహాక్రూరుఁడై యందును యవనుఁడై పుట్టఁ గారణ మేమని శంకింపవచ్చును. సమాధానము నాలకింపుఁడు. సాత్వికాహారము లంగొని శాంతతపస్సు చేసినఁ దత్ఫలము శాంతరూప మగును. రాజసాహారములం గొనుచు నహంకారవిశిష్టుఁడై కర్తృత్వము తనయం దారోపించుకొని చేయుతపస్సునకు ఫలము తదనుగుణముగా నుండును. తామసాహారములం గొనుచుఁ గేవల క్రోధాదితమోగుణప్రధానుఁడై చేయుతపస్సునకు ఫలము దానికనుగుణముగా నుండకమానదు. నిరాహారుఁడై పండ్రెండువత్సరములు పుత్రార్థియై గార్గ్యముని తప స్సొనరించెను. ఫలార్థము మునియగువాఁడు తపస్సు చేయరాదు. అందు నతని మదిఁ గ్రోధావేశము మెండుగ నుండును. మాథురజనులపై నీసుగలిగి యతఁడు తపమొనర్చెను. క్రోధావిష్టహృదయము గల యవనజాతియం దుద్భవించెను. కావున వాఁడు మహాహంకారముగలవాఁ డయ్యెను. ఈవిషయము శ్రీగీతాశాస్త్రము నందు శ్రద్ధాత్రయవిభాగయోగమను పదునేడవయధ్యాయమునం దిట్లు చెప్పఁబడినది.

శ్లో. "ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః,
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేదమిమం శృణు. 8
ఆయుస్సత్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః,
రస్యాస్స్నిగ్ధా స్థిరా హృద్యా ఆహారాస్సాత్వికప్రియాః.
కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః,
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః.

యాతయామం గతరసం పూతిపర్యుషితంచ యత్,
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్. ౧౦
అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే,
యష్టవ్యమేవేతి మనస్సమాధాయ స సాత్త్వికః. ౧౧
అభిసంధాయతు ఫలం దంభార్థమపి చైవ యత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్. ౧౨
విధిహీన మసృష్టాన్నం మంత్రహీనమదక్షిణం,
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే. ౧౩
దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్,
బ్రహ్మచర్య మహింసాచ శారీరం తప ఉచ్యతే ౧౪
అనుద్వేగకరం వాక్యం సత్యప్రియహితం చ యత్,
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. ౧౫
మనః ప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః,
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానసముచ్యతే. ౧౬
శ్రద్ధయా పరయా తప్తం తప స్తత్త్రివిధం నరైః,
అఫలాకాంక్షిభిర్యుక్తైస్సాత్త్వికం పరిచక్షతే. ౧౭
సత్కారమానపూజార్థం తపోదంభేన చైవ యత్,
క్రియతే త దిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్. ౧౮
మూఢగ్రాహేణాత్మనో య త్పీడయా క్రియతే తపః,
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్.” ౧౯

“మూఢగ్రాహేణ అవివేకనిశ్చయేన ఆత్మనః పీడయా యత్

క్రియతే తపః పరస్య ఉత్సాదనార్థం వినాశార్థం వా తత్.
తామసం తపః ఉదాహృతమ్." అని శంకరభాష్యము.

ఆహారయజ్ఞతపములం గూర్చిన భగవదభిప్రాయమును దిలకించితిరి కదా. ఇందుఁ గడపటివిధమగుతపస్సు గార్గ్యముని చేసినట్లు స్పష్టముగదా. పరప్రతారణార్థ మొనరించుతపస్సులు దుష్ఫలముల నొసంగక సత్ఫలముల నొసంగఁజాలునా? తుదకు బ్రాహ్మ్యమును కూడఁ గోలుపోయెను. అట్లుగాక లోకోపకార తత్పరుఁడై శాంతధనుఁడగు పుత్త్రునింగోరి

"మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః"

అన్నట్లుగాక దేహశోషణము చేయుటయే ప్రధానముగాని తపస్సుచేసియుండిన శుకయోగివంటికుమారుఁడు జనించి యెందఱినో తరింపఁజేసి యుండును. దీనింబట్టి పరికింపఁగా వేఱొక రహస్యము బయల్పడియెడిని. కేవలోపవాసము లుత్తమములు గావనియు దాననే భగవదనుగ్రహము కలుగదనియుఁ దెల్లమయ్యెడిని. ఉపవాసములే పనికిరావాయన్న నౌనఁజాలను గాని కేవలోపవాసములే తపస్సనుకొనువారు మూఢులనియే నాభావము. ఉపవాసములు కల్పింపఁ గారణమేమనఁగా భోజన ప్రసక్తి లేనినాఁడు సాంసారికకృత్యములు తగ్గుననియు నాకాలముకూడ భగవద్ధ్యానమున కుపయోగింపవలయుననియు నుపవాసమునకు ముందటిదినమునుండి యీప్రస్తావమే వచ్చుచుండును గాన నుద్దేశముకూడ భగవత్సంబంధమగుననియు నదియు సత్కాలక్షేపమే యనఁబడుననియు మహాత్ముల తాత్పర్యమే. గాని నేఁ డుపవాసమని దంతధావనాది నిత్యవైదికలౌకికక్రియలు మానివేయవలయునని కాదు. వైద్యశాస్త్రము ననుసరిం

చినచో లఘుభోజనము, ఉపవాసము ననునివి యారోగ్య హేతువులనియు దాన నాయుస్సు వృద్ధియగుననియు స్పష్టమగును. అంతియగాని యనవరతోపవాసముల నాయుస్సు క్షీణించుననియే తాత్పర్యము. జ్యోతిశ్శాస్త్రమున నాయుర్నిర్ణయావసరమున

శ్లో. "స్యాద్ధర్మిష్టసుశీలపథ్యసుభుజాం నస్యాదిదం పాపినామ్."

అని కేశవీయజాతకపద్ధతియందుఁ జెప్పఁబడినది. పథ్యసుభుజామ్- అనఁగా హితముగను అల్పముగను బరీక్షించి భుజించువారని తెలియందగును. ఈవిషయమే గీతాశాస్త్రమునందు,

శ్లో. "యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. ౧౭
యదా వినియతం చిత్త మాత్మన్యేవావతిష్ఠతే,
నిస్స్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా."
౬ అధ్యా.

మఱియు నందే,

శ్లో. "నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాంతమనశ్నతః,
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున." ౧౬

ఇదా ఈవశ్లోకమునకు భాష్యము.

"న అత్యశ్నతః. ఆత్మసమ్మితమన్నపరిమాణం అతీత్య అశ్నతః అత్యశ్నతః నయోగః అస్తి. న చైకాంతమనశ్నతః యోగః అస్తి. తదుక్తమ్, 'యదువా ఆత్మసమ్మితమన్నం త దవతి తం నహినస్తి యద్భూయో హినస్తి తద్యత్కనీయోఽన్నం

సతదవతి.' ఇతి శ్రుతేః. తస్మాద్యోగీన. ఆత్మసమ్మితాదన్నాదధికం న్యూనం వా అశ్నీయాత్. అథవా యోగినో యోగశాస్త్రే పరిపఠితా దన్నపరిమాణా దతిమాత్రమశ్నతః యోగో నాస్తి. ఉక్తం హి. 'అర్ధం సవ్యం జనాన్నస్య తృతీయ ముదకస్య చ, వాయోస్సంచరణార్థం తు చతుర్థ మవశేషయేత్.' ఇత్యాది పరిమాణం. తథా. నచాతిస్వప్నశీలస్య. యోగోభవతి. నైవ చాతిమాత్రం జాగ్రతో భవతిచార్జున."

దీని తాత్పర్యసారము. ఎంతయాహారముం గొనిన నించుకయు శ్రమముగలదో యది యతనిదేహమున కాహార పరిమాణము. దానికిమించిన యాహారమును గొనినవాఁడు యోగము నభ్యసింప నసర్థుఁడు. ఆత్మసమ్మితపరిమాణాల్పమగు నాహారముగొన్నవాఁడును యోగాభ్యాసమున కసర్థుఁడు. అన్నమునకుఁ గడుపున సగముచోటు గలదు. ఉదకమున కొక భాగము. వాయువున కొకభాగము వదలవలయును. అన్న మెంతభాగము నాక్రమించునో యందు సగముభాగమే జల మాక్రమించుకొనవలయు. నాల్గవభాగము రిక్తగా నుండ వలయు. అట్టివాఁడే యోగాభ్యాసార్హుఁడు.

దీనింబట్టి యాలోచింపఁగాఁ బరిమితాహారమును గొనక తప్పదనియు, నధికముగఁగాని యల్పముగఁగాని యాహారము గొనువాఁడు యోగి కాఁజాలఁడనియు శ్రీకృష్ణాభిప్రాయము కదా. దీనింబట్టి శుష్కోపవాసములు చేయువారు యోగా భ్యాసమున కసర్హులనియు, యోగికానివాఁడు మనస్సు స్థిర ముగా నునుపఁజాలఁడనియు, నది నిశ్చలముకాదేని భగవత్క

రుణకుఁ బాత్రుఁడు కాఁడనియు స్పష్టము. యోగికాఁజాలని యల్పమతికి నుపవాసములు పనికివచ్చుననియు నది తొలి సోపానమనియు నదియే విద్యాభ్యాసమునందు మొదటితరగతివంటిదనియు స్పష్టము కదా. ఇంకఁ బదునేడవశ్లోకమునకు భాష్యమును జిత్తగింపుఁడు.

"యుక్తాహారేతి. యుక్తాహారవిహారస్య. ఆహ్రియతే ఇత్యాహారః అన్నం.విహరణం విహారః పాదక్రమః తౌ యుక్తౌ నియతపరిమాణౌ యస్య సః యుక్తాహారవిహారః తస్య. తథా. యుక్తచేష్టస్య యుక్తా నియతా చేష్టా యస్య కర్మసు తస్య. తథాయుక్తస్వప్నావబోధస్య యుక్తౌ స్వప్నశ్చ అవబోధశ్చ తౌ నియతకాలౌ యస్య తస్య. యుక్తాహారవిహారస్య. యుక్తచేష్టస్య కర్మసు యుక్తస్వప్నావబోధస్య యోగినో యోగో భవతి. దుఃఖహా దుఃఖాని సర్వాణి హంతీతి దుఃఖహా సర్వసంసారదుఃఖక్షయకృద్యోగః భవతీత్యర్థః."అని శంకరాచార్యులు.

దీని సారతాత్పర్య మేమనఁగా, నియతాహారము నియతవిహారము ననునివి కలిగి (విహారమనఁగా నడచునపు డడుగు లిడుట) కర్మములయందు నియతవ్యాపారముగలిగి తగినంత నిద్ర, తగునట్లు జాగరణము చేయుట యనునివి కలవానికే యోగము సిద్ధించునుగాని లేకయున్న యోగము ఫలింపదని సారము.

యోగికాకున్న నేమి నష్టమందురేని,

శ్లో. "తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున." ౪౬
౬ అధ్యా..

అని గీతాశాస్త్రమునందే కలదు. యోగికానివాఁ డుపన్యసించు వేదాంతవాక్యములు పొట్టకూటికేకాని మఱెందులకుఁ బనికి రావని యెఱుంగవలయు. మోక్షశాస్త్రము పొట్టకూటికై యుపయోగించుచుఁ గపటవేషధారు లగుచున్న లుండు నంతదాఁక నా దేశము బాగుపడదని యంద అంగీకరింపక తప్పదు.

ఆహారములేక చిరకాలము జీవించువారు కలరని పురాణములు తెల్పును గదా. అపుడేమిసమాధానమని యడుగుదు రేని విసుఁడు. లంబికాదియోగములచే వాయువు బహిర్వ్యాప్తినొందక కుండలీశక్తియందే తిరుగుచుండుననియు నట్టివారి కమృతముద్భవించి యాహారమగుచుండుననియుఁ దెలిసికొన వలయు. ఈవిషయము శ్రీశంకరాచార్యకృతసౌందర్యలహరి యందిట్లు చెప్పఁబడినది.

శ్లో. "సుధాధారాసారై శ్చరణయుగళాంతర్విగళితైః
ప్రపంచం సించంతీ పునరపిరసామ్నాయమహసః,
అవాప్య స్వాం భూమిం భుజగనిభమధ్యుష్టవలయం
స్వమాత్మానం కృత్వా స్వపిషి కులకుండే కుహరిణి." ౧౦

వ్యా. "అతశ్చ శిరస్థితసహస్రకమలాంతర్గత శ్రీచక్రాత్మకశశిబింబమధ్యస్థితాయా భగవత్యాశ్చరణకమలనిర్గతజలై స్సుధామయై స్సాధకస్య సకలం శరీరం సంప్లావ్య పునర్భుజగ రూపేణాధారకుండం ప్రవిశ్య సుషుమ్నామవష్టభ్య సా భగవతీ స్వపితీతి."

శ్లో. "భుజంగాకారరూపేణ మూలాధారసమాశ్రితా,
శక్తిః కుండలినీ నామా బిసతంతునిభాననా.
మూలకందం ఫణాగ్రేణ దృష్ట్వా కమలకందవత్,
ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమన్వితా.
పద్మాసనగతస్స్వస్థో గుదమాకుంచ్య సాధకః,
వాయుమూర్ధ్వగతం కుర్వన్ కుంభకావిష్టమానసః.
వాయ్వాఘాతవశాదగ్నిస్స్వాధిష్ఠానగతో జ్వలన్,
జ్వలనాఘాతపవనాఘాతైరున్నిద్రితోఽహిరాట్.
రుద్రగ్రంథిం తతో భిత్త్వా విష్ణుగ్రంథిం భినత్త్యథ,
బ్రహ్మగ్రంథిం చ భిత్త్వైవ కమలాని భినత్తి షట్.
సహస్రకమలే శక్తిశ్శివేన సహ మోదతే,
సాదావస్థాపరా జ్ఞేయా సైవ నిర్వృతికారణమ్."

అని వామకేశ్వరతంత్రము.

శ్రుతి. "లోకస్య ద్వారమర్చిమత్పవిత్రం
జ్యోతిష్మద్భ్రాజమానం మహస్వత్,
అమృతస్య ధారా బహుధా దోహమానం
చరణం నోలోకే సుధితాం దధాతు."

వ్యా. లోకస్య నివాసస్థానస్య సాయుజ్యస్య వా పార్షదేర్వా. బ్రహ్మదేర్వా ద్వారం తత్ప్రాపక మిత్యర్థః. అర్చిమత్. అర్చింషి మయూఖా అస్య సంతీత్యర్చిమత్. అర్చిష్మదిత్యర్థః. ఛాందసస్సకారలోపః. మయూఖాః కిరణాః పవిత్రం, స్వయమతిశుద్ధం. అస్య శుద్ధిహేతుశ్చ. జ్యోతిష్మద్భ్రాజమానం మహస్వత్. ఇత్యామ్రేడనం. అర్చి

ష్టత్వాంతు తథ్యమిత్యర్థః. యద్వా. 'త్రిఖండం మాతృకా చక్రం సోమసూర్యానలాత్మక'మితి వక్ష్యతే. అర్చిష్మదిత్యనేన ఆగ్నేయాన్యర్చీంషి అష్టోత్తరశతం కథ్యంతే. జ్యోతిష్మదిత్యనేన బైందవాని షట్త్రింశదుత్తరశతం జ్యోతీంషి వినిర్దిశ్యతే, మహస్వదిత్యనేన భానవీయాః షోడశోత్తరశతం మహాంసి కిరణాస్సంగృహ్యంతే. అమృతస్య ధారాః సుధాప్రవాహాన్ బహుధా బహుప్రకారేణ ద్విసప్తతిసహస్రనాడీమార్గేషు దోహమానం కిరత్. చంద్రమండలసుధాగతసుధారసప్రవాహాన్ స్వనిర్ణేజనపవిత్రితాన్ వర్షదిత్యర్థః. తచ్చరణం. చరణశబ్దో నపుంసకః. 'పదంఘ్రి శ్చరణోఽస్త్రియా'మిత్యభిధానాత్. నః అస్మాన్ సాధకాన్ లోకే ప్రపంచే సుధితాన్ దధాతు. తృప్తాన్ కరోతు యద్వా సంజాతబుద్ధిప్రకాశాన్ సుధియః కృత్వా దధాతు. పుష్ణాతు.

మహాశయులారా! ఈప్రమాణములనుబట్టి యోగులాహారమును మానియుందురనఁగా బాహ్యాహారమును మాని యోగజనితాహారమును గ్రోలుదురు గాన నాయమృతపానమునఁ జిరకాలము జీవింతురని తాత్పర్యము. కావున భక్తులగువారు శుష్కోపవాసముల కలవాటుపడి దేహము కృశింపఁగా సేవనియుఁ జేయఁజాలక యుండరాదనియు, యుక్తాహారవిహారములు గలవారలై భగవత్సేవాపరతంత్రులు కావలయునని దీనినుండి గ్రహింపవలయును. ఇంకను దీనిని బెంచివ్రాయక తరువాతికథను తెలిపెదను.

### కాలయవనుని సమాధానము.

* ఇట్లు శాల్వుఁడను రాజు జరాసంధాదుల యనుమతమున వారిమాటలుగాఁ జెప్పినవాక్యముల నాలకించి కాలయవనుఁ డిట్లు బదులు చెప్పెను. రాజా! ధన్యుఁడను. కృపాపాత్రుఁడను. నాజీవితము నేఁటికి సఫలమైనది. కృష్ణనిగ్రహార్థము మండలరాజులు నన్ను నియోగించిరి. మూఁడులోకముల యందు దుర్జయుఁడని పేరుపొంది సురాసురనమస్కృతుఁడై వెలయుకృష్ణుని నిగ్రహించుకార్యమునందు నియోగించితిరి. జయాశీషముల నొసంగితిరి. రాజసింహులందఱు నాజయము నాశించుచున్నవారని స్పష్టమయ్యెను. వారివాగమృతవృష్టిచే నాకు జయము సిద్ధము. నేను రాజులవచనమును శిరసావహించితిని. పరాజయము నాకుఁ గలిగినను జయతుల్యమే యని భావించెదను. నేఁటి తిథివారనక్షత్రయోగకరణములు శుభము నొసంగునవిగా నున్నవి. కావున సంగరమునఁ గేశవుజయించుటకు మథురానగరమునకుఁ బ్రయాణము చేసెదను. అని పలికి యాశాల్వరాజును బూజించి కానికలచే సత్కరించి యందున్న బ్రాహ్మణప్రవరులకు యథోచితదక్షిణల నొసంగి వారియాశీషములు ఫలము నీఁజాలునని నమ్మి, పురోహితునకు సంతృప్తిగా ద్రవ్యమును దానము చేసి యగ్నిని బూజించి కృతకౌతుకమంగళుఁడై జయేచ్ఛ యలరుచుండఁ బ్రయాణము సాగించెను. శాల్వుఁడును గృతార్థుఁడై హృష్టమానసుఁడై కాలయవను నాలింగనము చేసికొని స్వపురమునకుం బోయెను.

---

* ఈకథయుం హరివంశము విష్ణుపర్వము ఏఁబదినాల్గవయధ్యాయము నుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగునట్లొప్పు.

ఆర్యులారా ! హరివంశమునందు దీనితరువాతికథ యిట్లు వ్రాయఁబడినది. దాని సంగ్రహముగా నుదాహరించి రుక్మిణీ స్వయంవరము నన్నింటితోఁగలిపి హరివంశకథనుగూడ వ్రాసెదను. రామకృష్ణులు మథురానగరమును బ్రవేశించువార్త విని యుగ్రసేనాదు లెదురువచ్చి తోడ్కొనిపోయి శ్రీకృష్ణాభిషేక వార్తాశ్రవణకుతూహలమున నంతరంగము లుప్పొంగఁ బెక్కుదానము లాచరించిరి. ఉగ్రసేనుఁడు శ్రీకృష్ణా ! నీయభిషేకము త్రిలోకమోదావహము. మథురారాజ్యమును బాలింప నీవే వలంతివి. సాక్షాన్నారాయణమూర్తివి. సకలబ్రహ్మాండనాయకుఁడవని వినుతించెను. శ్రీహరియు నాతనిం గాంచి యీ రాజ్యకాంక్ష నాకు లేదు. నీది యీరాజ్యము. మిమ్ములను గాపాడుభారము నాది. ఈరాజలక్షణములగు ఛత్రచామరాదులను ధరించునధికారము నీకుఁ గలదు. నాకు వలదనిపలికి వారికి మహానందమును గల్గించి తా మథురయం దుండెను. కొంత కాలమునకుఁ గాలయవనుఁడు దండెత్తివచ్చుటయు నాసమయమున మథురానగరవాసులెల్ల భీతిల్లుటయు నాకారణమున ద్వారకానగరమునకు మథురానగరవాసులనెల్ల గరుడసహాయమునఁ బంపి తానొక్కఁడె నిరాయుధుఁడయి పోఁగాఁ గాలయవనుఁడు వెంటనంటుటయు హరి పరుగెత్తిపోయి కొండ గుహఁ జొచ్చుటయు నం దదృశ్యుఁడగుటయుఁ గాలయవనుఁడు గుహఁజొచ్చి యందు శయనించియున్న ముచుకుందుని గాంచి కృష్ణుఁడనుభ్రాంతిఁ గాలఁదన్నుటయు నతఁడు మేల్కాంచి వీక్షింపఁ గాలయవనుఁడు భస్మమగుటయు నవ్వల ద్వారకాపురమునఁ గొన్ని దినములు సుఖంబుండుటయు నాసమ

యమున జరాసంధుఁడు మరలఁ బురికొలుప స్వయంవరము సాటించుటయు శిశుపాలాదులు నగరముచేరుటయు నావార్త యాలకించి కృష్ణుఁడు చతురంగబలంబులం గూడి కుండిననగరమునకుఁ జేరుటయు నీరిని రాజు పూజించి విడిదియింట నునుచుటయు ననుకథలు ఏఁబదితొమ్మిదవయధ్యాయమున ముప్పదిరెండవశ్లోకమువఱకు వ్రాయఁబడినది. ఇద్ది సంగ్రహమని నమ్మవలయును. ఈకథ లీవఱకే భాగవతానుసారముగా వ్రాయఁబడినవియే. ఇంక నన్నిపురాణముల ననుసరించి కథ వ్రాయవచ్చును.

భక్తజనులారా! ఇపుడు శ్రీకృష్ణుఁడు రాముఁడు యాదవవీరులంగూడి కుండిననగరమున నున్నవాఁడు. రేపు రుక్మిణికి వివాహమని నిశ్చయింపఁబడినది. అని మదినెంచి తరువాతికథను బఠింపుఁడు. అంతయుఁ జక్కఁగా నర్థమగును. తికమకలుండవు. స్వయంవరమహోత్సవమును భక్తియుక్తిం బఠింపుఁడు.

## రుక్మిణీకల్యాణము.

*ఇందు రుక్మిణి పార్వతిఁ బూజింపఁ బురబాహ్యప్రదేశమునకుఁ బోయెనని శ్రీభాగవతమునందు గర్గసంహితయందును, ఇంద్రాణిని బూజింపఁబోయెనని హరివంశమునందును జెప్పఁ

* ఈకథ భాగవతము ౧౦ స్కం. ౫౩ అధ్యాయమునుండియు హరివంశము విష్ణుపర్వము ౫౯ అధ్యాయమునుండియు, బ్రహ్మపురాణము ౯౧ అధ్యాయమునుండియు, శ్రీకృష్ణజన్మఖండము ౧౦ అధ్యాయమునుండియు గర్గసంహిత ద్వారకాఖండము ౫౧ అధ్యాయమునుండియు సంగ్రహింపఁబడినది.

బడినవి. బ్రహ్మ విష్ణుపురాణములయందు ఈప్రస్తావమే లేదు. శ్రీకృష్ణజన్మఖండమునందు భీష్మకసుతయాత్రావిషయము ప్రధానము కాక తండ్రియే కన్యాదానము చేసెనని చెప్ప బడినది. కావున భాగవతాదుల ననుసరించి వ్రాయుచుఁ దక్కుంగల పురాణగాథలను గలిపెదను. పూర్వాపరవైషమ్యములు కొంత వ్యత్యములు. రుక్మిణీదేవి తాఁబంపిన బ్రాహ్మణుఁడు వచ్చి హరి రాకఁ జెప్పఁగాఁ బహుమానందభరిత యయ్యెను. ఆరేయి గొట్లో గడపెను. మఱుదినము వివాహనిర్ణీతము. కావునఁ గులమర్యాదల ననుసరించి కన్యక పార్వతిం బూజించి వచ్చినపిదప వివాహము సాగవలయును. ఇదియే వృద్ధాచారమని పిలువఁబడునది. ఒక్కొక్కజాతికిఁ బ్రాయశః ఒక్కయాచారము గలదు. ఒక్కొక్కయింటివారి కొక్కొక్కయాచారముండుటయుఁ గలదు. భీష్మకునింటి యాచారముననుసరించి కులదేవతయగు భవానిని బూజించివచ్చి యవ్వల వివాహమున దీక్షితయగుట వృద్ధాచారము. దీనినే శిష్టాచార మందురు. ఏశాస్త్రమున గలదని ప్రశ్నింతురేమో అది నిగులఁ బొరపాటు.

"శ్లో. శిష్టాచారః పరిగ్రాహ్యశ్శ్రుతిస్మృత్యోర్వర భావతః."

[దశనిర్ణయి

అని ప్రమాణము కలదు. శ్రుతిస్మృతివిహితకర్మములకు శిష్టాచార మక్కఱలేదు. శ్రుతిస్మృత్యనుక్తకర్మములకే పెద్దలయాచారము కావలయు. శ్రుతులు రెండువిధములుగా నాచారమును దెల్పినపుడు నెవని కేదియిష్టమో దానిని మార్చిమార్చి యాచరింపక పెద్ద లేయాచారమును బాటించిరో దాని నాచరింపవలయునని శాస్త్రనియమము. కావున రుక్మిణి కులాచారము

ననుసరించి పరమేశ్వరిని దర్శించి రా నాయత్తమతి యయ్యెను. అది తల్లిదండ్రుల యాజ్ఞయుఁ గావున నాంజా తగినపరివారము నొసంగి పంప నూహించెను. కొడుకు దుడుకుఁదనమునకు మది రోయక తద్వశంగతమానసుఁడై శిశుపాలున కిచ్చుటకే పూని బహువిధప్రయత్నములు చేసెను. రుక్మియు మహోల్లాసమున విజృంభించుచుఁ దనకోరిక నెఱవేఱునన్న కుతూహలముతో నుండెను.

అంతట రుక్మిణి కాలినడకతో నగరము వెలుపలనున్న యంబికాలయమునకుఁ బ్రయాణ మయ్యెను. ముకుందచరణారవిందముల ధ్యానించుచు నంబికను దలంచుకొనుచుఁ దల్లులు వెంట రాఁగా సఖీబృందము కొలుచుచుండఁగా శూరులగు రాజభటులు వివిధాయుధములం దాల్చి నలుప్రక్కలం బలసి రాఁగా మృదంగశంఖపణవతూర్యభేరీనాదములు మ్రోగుచుండ వివిధోపహారవస్తువులను బలులను గైకొని వారవనితలు వేనవేలు కొలుచుచుండఁగా నవ్యసుమహారములు వస్త్రాభరణములు తీసికొని విప్రపత్నులు వెంటనడువఁగాఁ బాటలుపాడుచు వినుతించుచు వాద్యముల వాయించుచుఁ గొందఱు రాఁగా సూతవందిమాగధులు జయజయనాదములు చేయుచు రాఁగా మందమందగమనంబుల నగరము నిర్గమించి దేవసదనముదాపునకుం బోయెను. దేవాలయముదాపునకుఁ బోవఁగానే పాదములు హస్తములు శుద్ధోదకములం గడుగుకొని యాచమనముచేసి పరిశుద్ధాంతరంగయై శాంతధనయై జగదంబికాలయమును బ్రవేశించెను. ముదుసలులగు విప్రప్రవరపురంధ్రులు విధులనెఱింగినవారు కావున భవపత్నియు సదా పతినెడఁ

బాయకయుండునదియు నగుభవానికి మ్రొక్కించిరి. ఇట్లు మ్రొక్కి రుక్మిణి దృఢభక్తిమెయి నాయాదిమదంపతుల నిట్లు ప్రార్థించెను. ఈఘట్టమున మూలమునందు,

శ్లో. "నమస్యే త్వాంబికేఽభీక్ష్ణం స్వసంతానయుతం శివం,
భూయాత్పతిర్మే భగవాన్ కృష్ణస్తదనుమోదతామ్.".

అని యున్నది. "రుక్మిణ్యా తదైవ దృష్టోఽయం మంత్రః. స్వసంతానయుతం గణేశాదిసహితం ఆత్మానాం మోఽసౌ కథం త్వత్పతిస్స్యాదితి చేదత ఆహ తదనుమోదతామితి భవతీ శ్రీకృష్ణ ఏవ వా." అని వ్యాఖ్య.

ఓయంబికా! నీకు నమస్కరించుదానను. పరమేశ్వరునకు నమస్కరించుదానను. మీసంతానమగు గణేశ కార్తికేయాదులకు నమస్కరించుదాన. నాకుఁ గృష్ణుఁడే భర్తయగునట్లనుగ్రహింపుఁడు. ఈమూలమునకు మహాకవిపోతన,

ఉ. "నమ్మితి నామనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల మేలుభజింతుఁగదమ్మ మేటిపె
ద్దమ్మ దయాంబురాశివికదమ్మ హరిం బతిసేయుమమ్మ నిన్
నమ్మినవారి కెన్నటికి నాశము లేదుగదమ్మ యీశ్వరీ."

మూలమునకు నీపద్యార్థమునకు సంబంధము లేదుగాని పెక్కికట్టులలోఁ జిక్కియున్న పురంధ్రి న్యాయసమ్మత మగు వాంఛను బడయఁగోరి తనయిష్టదేవతను బ్రార్థించునపు డే యభిప్రాయము కలదిగనుండునో యట్టిభావ మీపద్యమునఁ గలదు సనాతనులు పురాణదంపతులు అను నీరెండువిశేషణములు సరసకవులస్వభావమును దెలుపునవి. దయాంబురాశి,

ఈశ్వరీ, పేటపెద్దమ్మ యనునివి నిజమనోభావమును దెలుపు నవి. తల్లీ, నీవు చాల పెద్దదానవు. నాకిష్టమువచ్చినవో యివి స్త్రీజనసహజములగునో కావో నీవెఱుంగఁజాలిన వయస్సుకల దానవు. అందును దయామయురాలివి. నాకేసియుపకారము నీకోర్కెఁ దీర్పఁగలసందువా? నీ వీశ్వరివి కాదా! కావున న్యాయసమ్మతపు గుట్టు నావాంఛయని యెఱుంగఁజాలుదువు. స్త్రీలకుఁ దాఁ గోరినప్రాణనాథుండు చిక్కకున్న నెట్టి కష్టముల పాలగుదురో యెఱుంగుదువు. నీవును స్త్రీవేకదా. ఇట్టివాంఛల నొసంగునట్టిశక్తి నీకుం గలదు. కావుననే యీశ్వరివైతివి. కావునఁ దల్లీ! సర్వలోకారాధ్యపదకమలారవిందములు గలపరమపురుషుని శ్రీకృష్ణుని నాకు భర్తగా ననుగ్రహింపుము. నేను నీవలెనే శాశ్వతసుమంగళీత్వమును గోరుదానను. అను భావము ధ్వనియించునట్లు దోఁచును. ఇట్టి గంభీరార్థముగల పద్యరత్నములను రచించినమహాకవి పోతనామాత్యుఁడు కదా. ఈ ఘట్టమున గర్గసంహితయందు,

శ్లో. "దుర్గే స్వకాంతానయనే శివే శుభే
నమామి తుభ్యం సతతం భవాని తే,
భూయాత్పతిర్మే భగవాన్ పరేశ్వరః
శ్రీకృష్ణచంద్రః ప్రకృతేః పరస్స్వయమ్."

అని కనుపట్టెను. ఎంతమిక్కిలి చక్కనికోరికను గోరినది! తాను మహాలక్ష్మి కనుకనే యిట్టికోరికను గోరినది.

## శ్రీహరి రుక్మిణిని రథమునఁ గూరుచుండఁ జేయుట.

ఇట్లు కోరి యయ్యాదిమదంపతులను విధివిహితపద్ధతిం బ్రియమార విప్రపత్నులం గూడి శుద్ధోదక గంధాక్షత ధూప

ములు వస్త్రాభరణములు మాల్యములు నానోపహారములు బలులు దీపావళులు ప్రత్యేకము సమర్పించెను. మఱియు బ్రాహ్మణదంపతులకుఁ బూజ లొనరించెను. వెండియు సువాసినులకు లవణాపూపతాంబూలకంఠసూత్రఫలేక్షుదండముల నిచ్చి పూజించెను. ఆపురంధ్రీమణులు బహువిధశుభములు కలుగున ట్లాశీర్వదించి రుక్మిణిని సంతోషభరాక్రాంతస్వాంతం గావించిరి. మఱియుఁ బరమేశ్వరీపరమేశ్వరులకు సువాసినీ బృందమునకు నమస్కరించి తక్కినవారి నుచితరీతి గౌరవించి మౌనవ్రతమును మాని యమ్మానినీతిలకము భగవంతుఁ డగు శ్రీహరిని దలంచుచుఁ బ్రయాణము చేసెను.

అత్తఱి రుక్మిణీదేవి రత్నముద్రికాలంకృత మగుహస్తారవిందమునఁ జెలికత్తియ కేలుగీలించి యొయ్యారంబున నడుగిడుచు, నడుము సోయగము చూపఱకు సంశయమును గలిగింప రత్నకుండలముల తళతళలు మోమున వ్యాపించి యచ్చెరువునింప యౌవనప్రాదుర్భావమునకు మిగుల్చుచున్న తనూలత వింత నెల్లరకుఁ బుట్టింప, నితంబబింబార్పితరత్నమయమేఖలాభరణము శేషాదులకే వినుతిచేయ శక్యంబు గాదనునూహ నంకురింపఁ, బాలిండ్లపొంకంబు జగన్మాతృత్వ మవధరింపఁ, గుంతలములసొబగు మహాకవులకే వర్ణనాశక్తత నారోపింపఁ, జంచలేక్షణము లనన్యపూర్వదృష్టసౌకుమార్యత నావహింప, నిర్మలస్మితంబు బాలచంద్రచంద్రికల నంతంతన నావరింపఁ, బాటలబింబాధరద్యుతులు ద్విజకుందకుట్మలముల కరుణకాంతి సంపాదింపఁ, బదములఁ బెట్టుట కలహంసగామిత్వము నార్జింప, శింజత్కలానూపురధామముల వెలయుచు, వీరమోహినియై దేవ

మాయవలె దేవీమందిరాంగణము వెలువడి మందమందసుందరగమనంబుల నవయౌవనస్ఫురితుల మానసస్థైర్యనాశంబు మూలములతోఁ బెకలింపఁ జాలియుండు నలరారుచు రాఁగా నాజలజాతాయతపత్త్రలోచనం గాంచి తదీయసుస్మితావలోకనవిలసనంబులను మోహించి యసమానభావసంబద్ధహృదయులై రాజులు పెక్కుమంది దేహములు మఱచి యాయుధములు తమంతన హస్తములనుండి జారిపడఁ దిగ్భ్రమంబెఱుంగని మోహ రారోహించియున్న యేనుఁగులను గుఱ్ఱములను రథములను వదలి ధరణిపయిం బడిరి. యుగ్రాచ్ఛలమున శ్రీహరికిం దన నిరుపమానశోభను సమర్పించునట్లున్న యారుక్మిణిం జూడఁగనే వారిమనస్సులు పరవశములైనవి. కావుననే వారెల్లఁ గ్రిందఁ బడిరి.

అత్తఱి సమ్మత్తకాశిని పాదారవిందకుట్మలములను ధరణీతలమున మెల్లమెల్లన నిడుచు వానిసౌకుమార్యమునకుఁ గొంచెమే భంగము గలుగనీనిచందమునఁ గనఁబఱచుచు నత్తరుణముననే భగవంతుని జేరుట కాలోచించుచుఁ దదభిప్రాయద్యోతకముగాఁ జూచుచు వామకరనఖముఖముల ముంగురులఁ జక్కనొత్తుచు నునుసిగ్గున నచ్చటం జేరి ధరణింబడియున్న రాజాలిం జూచుచు నచ్యుతుని దర్శించెను. * రుక్మిణి యితరపురుషునకుఁ దగినకన్యక కాదు. రూపముచేతను, యశస్సుచేతను, సంపత్తుచేతను, భగవంతునకే యర్హయగుటకుగా నవతరించినది. కావున రుక్మిణి మానవాకారమును ధరించిన

---

* "అనన్యా ప్రమదా లోకే రూపేణ యశసా శ్రియా, రుక్మిణీ రూపిణీ దేవీ పాండురక్షౌమవాసినీ" అని హరివంశము.

శ్రీదేవియే. పాండురక్షౌమవస్త్రమును గట్టియుండెను. ఆదేవి యెప్పుడెప్పుడు వరింతునా యని తన్నుగుఱించియే యున్నోళ్లూరుచు రాజులం గాంచి యేల వీరికీభ్రాంతియని చిఱునవ్వున వారికోరిక నీసరించుచు నెల్లవారిం జూచునెపమునఁ దనమీఁద నేత్రములను దనపాదారవిందములనుండి ముఖారవిందము దనుక వ్యాపింపఁ జేయుచుఱింగి మందహాసమున నీసందేశ మందినది. అంగీకరించితిని. నీవింత త్వరపడనేల? నేనెఱుంగనా నాకృత్యమును. ఇంకనైనఁ జింతం బాయుదువా. అను తన సద్భావమును బ్రసాదదృగంచలముల వెడలఁజేయుచు రాము నితో నాలోచించి యదువృష్ణిభోజాంధకులు దవ్వుదవ్వుల నిలిచి చూచుచుండ నారాజపుత్రికను, స్వనిహితహృదయమును రాజులెల్లరు నందును బ్రతిపక్షభూపాలకు లందఱును గాంచు చుండఁగా శ్రీకృష్ణుఁడు సువర్ణలక్షణము పరరాజభయంకరము నగుస్యందనమునందు నెప్పుడెప్పుడు కూరుచుండి భగవంతుని పార్శ్వమునఁ జెలువారుచుందునా యని యాతురంపడుదానిని శ్రీదేవిని రుక్మిణిని బరరాజుల లెక్కింపక పక్కునసవ్వుచుఁ గరారవిందమునఁ గీలించి గ్రుచ్చియెత్తి కూరుచుండఁ బెట్టెను. సృగాలములనడుమనుండి తనభాగమును విలాసముగాఁ గొని పోవు మృగరాజునంగి శ్రీకృష్ణుఁడు రుక్మిణిం గైకొని ప్రయాణము సాగించెను. శ్రీకృష్ణుఁడు రుక్మిణినెత్తికొని రథముపైఁ గూరుచుండ బెట్టుటం గాంచి రాజలోకంబున హుంకార ములు చేయసాగిరి. బలదేవప్రేరితులై యాదవవీరులు వారి నెల్ల రథముచెంతకు రాకయుండ నిల్పి సంసిద్ధులై యాయుధ హస్తులైరి. ఆసమయమునఁ బరరాజు లాయవమానము నోర్వక

యశోభంగమునకు లజ్జించుచు జరాసంధప్రముఖులకుం దెలుపఁబోయిరి. ధనుర్ధారులమగు మనయందున్నను గోపాలకు లపహరించిరే. అక్కటా! మనపౌరుషములు గాల్పనే. మృగేంద్రభాగము నల్పతమమృగము లపహరించునట్లు గోపాలుఁడు మనమండలము చూచుచుండఁగనే రుక్మిణిని బలవంతముగా నించుకంతయు భీతిలేక యపహరించెఁ గదా యని దుఃఖించుచుం దెలిపిరి.

ఈఘట్టమున మహాకవిపోతనసూక్తము ఇట్లు సంఘటింపఁగినది.

మ. "ఘనసింహంబులకీర్తి సిద్ధమృగసంఘంబెల్ల గైకొన్న చందంబునన్
మనకీర్తుల్ గొని బాలఁ దోడ్కొనుచు సున్నాఁడా బలాఢ్యుల్ గో
పకుల్, చనుచున్నారదె శౌర్యమెన్నటికి! మీ శస్త్రాస్త్ర
ములున్ గాల్పనే, తనువుల్ ప్రాణము విడిపింపఁగున్నా నగరే ధాత్రీ
జనుల్ క్రంతలన్."

కృష్ణమూర్తి రథము పోవనిమ్మని దారుకునకు సంజ్ఞ చేసి తక్కింగలభారమెల్ల రామునియందు బెట్టి దన్నుఁ జుట్టుముట్టఁ దలంచు రాజలోకంబు నారింప యాదవవీరుల కాజ్ఞాపించి యున్న యనుమతి నొంది పరరాజు లెవ్వరేఁ ద్రోవలో నడ్డమున్నఁ జెండాడ నిశ్చయించి పయనము సాగించెను. అస్త్రారక్షితవర్గులు చక్రదేవసుదేవసారణులు పరరాజుల నిలువరింప సంసిద్ధులైరి. ఉగ్రసేనాత్మజుం డగు కంకుఁడు విదూరథుఁడు లోనగువా రహంసహమికచే నాయుధములఁ ద్రిప్పసాగిరి. మృదురుఁడు, ప్రసేనచక్రకులు, నాదిదంతుఁడు, బృహద్దుర్గుఁడు, శ్వఫల్కుఁడు, సత్యకుఁడు, పృథువు మొదలగు వృష్ణ్యంధకవీరులు కృష్ణానుమతిని

బలదేవునిం గూడి రణమొనరింప నిలిచిరి. సకలభారమును వహింప బలరాముఁడు సంసిద్ధముగ నుండెను.

అప్పుడు క్రోధావేశమున మేనులు మఱచి రాజులాయో ధనము సేయఁ దలంపు గొనిరి. చతురంగబలంబులఁ బురికొల్పిరి. అందుఁ బౌండ్రకుఁడు రెండక్షౌహిణులం గూడి యురవడిం చెను. విదూరథుఁ డక్షౌహిణీత్రయముం గూడి యనికి నడ చెను. దంతవక్త్రుఁ డైదక్షౌహిణులం గూడి విజృంభించెను. శాల్యుఁడను రాజు మూఁడక్షౌహిణులతో సంగరమున కేతెం చెను. అతఁడు రాజపురేశ్వరుఁడని యెఱుంగవలయు. బలాధి కుఁడగు జరాసంధుఁడు దశాక్షౌహిణులు వెంటరా కదనమునకు సంసిద్ధుఁ డయ్యెను. ఆతఁ డొక్కతుున యాదవుల నుఱుమాడఁ బూనెను. ఇంకను శిశుపాలపక్షమునఁ గల రాజులెల్లరు తమతమ వాహినులం గలిసి యుద్ధము చేసి తమ ప్రాణముల నర్పించియైన రుక్మిణిని హరలింప శ్రీకృష్ణునకుఁ బరాభవపరాజయములఁ గల్పిం పనుంకించిరి. వారొండొరులఁ బురికొల్పుకొనుచుఁ బౌరుషో క్తులం బచరించుచు గోపాలకుల నీసడించుచు రాజవంశగౌరవ ముల నుగ్గడించుచు సంగరమునకుం ద్వరపడిరి. మహారథులగు సోదరులంగూడి చేదిరాజగు శిశుపాలుఁడు తనయనీకినులం గలిసి త్వరపడి నడచెను.

ఇట్లు పరరాజబలంబు లాయోధనంబునకు సంసిద్ధములై వచ్చుటం గాంచి మహారథులగు వృష్ణివీరులు నిలువంబడి వారి నిలువరించిరి. దేవేంద్రపురోగములై దేవతలసురులమార్కొని నట్లు వృష్ణిభోజాంధకవీరులు బలరాముని బురస్కరించుకొని నిలువంబడి ధనుస్సుల నారాచములం గూర్చిరి. అందఱం దల

హించి దంతవక్త్రుఁడు నిశితదశవిశిఖముల నాతని నొంచెను. చక్రదేవుఁడు మరలఁ బదితూపుల శిశుపాలుఁడు తన్నునొంచి సింహనాదముచేయఁగా మగల నన్నింట వాని నొంచెను. కృతవర్మ రణరంగమున రాజపుత్రుని మూఁడుబాణముల నొప్పించెను. సారథిని ధ్వజమును భేదించెను. వానిని క్రుద్ధుఁడై పౌండ్రకుఁ డాఱుబాణముల నొమ్మసిల్లం జేసెను. ఒక్కబాణమునఁ గృతవర్మధనస్సును భేదించెను. నివృత్తశత్రువు కాలింగునిమార్గాని వాఁడితూపుల నవయవములఁ జించెను. కళింగరాజు నాతనికిఁ దనపౌరుషమును శరరూపమునఁ జూపెను. ఈరీతిగాఁ బరస్పరజయకాంక్షల నొండొరుల మిగులుపరాక్రమములఁ బొలిచి యవనీపతులు పోరిపోరి చల మంతకంతకు వృద్ధియగుచుండ మహాస్త్రముల వైచియు గదాద్యాయుధములఁ బోరాడియుఁ దమకులధర్మమును బాటించుచుండిరి. అత్తఱి యదుబలములు దైన్యంబునొందుట కనఁబడియెను. శిశుపాలపక్షరాజులు తత్సైన్యములు ప్రాణములపై నాశలు మాని తమమోపినంతవట్టు పోరాడి మరలించిరి.

ఆయాయోధనమును గాంచి తనపతిబలములు చీకాకుపడుటం గాంచి రుక్మిణి చకితస్వాంతయై సిగ్గు భూషణముగా నుండ విహ్వలలోచనములు ముం దేమగునో యనుసాధ్వసమును దెలుపఁగా భర్తృవదనారవిందమును జూచెను. భగవంతుఁ డామెయాశయ మూహించి చిఱునవ్వునఁ దనసంతోషమును దెలుపుచు నో వామలోచనా! భీతిల్లకుము. మనశత్రుబలముల యదువీరులు క్షణమాత్రమునఁ బాఱఁదోలుదురు. అని భీతిఁబాపెను. అంతలోనే గదసంకర్షణాదులు చెలరేఁగి,

ప్రతిపక్షక్షితిపతిసైనికుల యాటోపంబున కోర్వఁజాలక యెందఱో యనేకములగు శస్త్రాస్త్రములఁ బ్రయోగించి గజములను హయములను రథములను బిండిచేసిరి. రథికులశిరసులు ధరఁ దొరఁగెను. అశ్వారోహకుల తలలు దొరలెను. గజారూఢుల మస్తకములు నుగ్గయ్యెను. పదాతులు రథికుల శకటముల రత్న శకలములు భూమియందంతటను వ్యాప్తములగుచు దీప్తిగొని యెను. కొందఱకు బాహువులు తెగిపోయెను. కొందఱి యూరువులు కనఁబడకుండెను. కొందఱు శిరోహీనులైరి. కొందఱు కీర్తిశేషులైరి. కొందఱి యంగములు ప్రాణములుపోఁగా ధరస్థితయనించెను. ఇట్లు కాఁగా రాజులను నిస్సహాయులుగను నిలువఁజాలక జరాసంధాదులం గూడి ప్రయాణము చేసిరి

అట్టి సమయమున నపహృతకళత్రుని వలె నాతురుండగు శిశుపాలుం గాంచి రాజులందఱు తద్వ్యసనము వాపఁబూనుటం గాంచి గతోత్సాహుఁడయ్యెనని యూహించి యతని యార్తిఁ బాపనెంచి యిట్లు హితము నుపదేశించిరి. పురుషపుంగవా! యీ కార్శ్యము వదలుము. ప్రియాప్రియములయందు విచారము చుచుకొనఁ దగదు. దేహి స్వతంత్రుఁడు కాఁడు. సూత్రధారుని యిచ్ఛానుసారము దారుమయ యుగ్గుపుత్రిక నృత్యము చేయును. మనముకూడ యీశ్వరపరాధీనులము భగవంతుఁ డాడించినట్లు లాడుచుందుము. మనకిం దధికారము సుంతయు లేదు. సుఖదుఃఖములయందు నించుకంతయు స్వాతంత్ర్యము లేమి నిటునటు తిరుగుచు నవశత దాని ననుభవించుచుందుము. అని పలికి యించుకదైన్యమును బాపిరి. ఇంకను శిశుపాలునిమనసునఁ గలచింత యంతరింపలేదని యెంచి జరాసంధుఁడు

రాజేంద్రా! వినుము. దైవము బలవత్తరము. దానినివారింపఁ దరముకాదు. ఇతరులమాట యేటికి? నావిషయము తెల్పెదను. ఇరువదిమూఁడక్షౌహిణులసైన్యముం గొని మథురానగరంబును ముట్టడించితిని. పదునేడువారములు పరాజితుండనైతిని. ఒక్కకృష్ణు నోడింపఁజాలనైతిని. పదంపడి పదునెనిమిదవసారి సంగరమునకుఁ బోయి జయించి యిట్లు చెరిగితిని. నేనాపరాజయపరాభవములకుఁ జింతించుచున్నవాఁడనా? లేదు. చింతించి లాభములేదు. ఎన్నియోసంగరముల గెలుపొందితిని. అప్పుడానందించితి ననుకొందువో! లేదు. హర్షశోకములందు సమత వర్తించువాఁడే సుఖి. లేకున్న దుఃఖియగు. దైవముచేతఁ బ్రోత్సహింపఁబడి కాలము బలవత్తరమై సకలకార్యంబులొనరించుచుండును. ప్రపంచమంతయు దాని యాటోపంబున కోర్వఁజాలదు. అని హితముపదేశించుఁ గృష్ణునిశక్తివలన మన మోడినవారము కాము. కాలముచేతనని తెలుపనెంచి

మ. "తమకుం గాలము మంచిదైన మనలం ద్రైలోక్యవిఖ్యాత
విక్రములన్ గెల్చిరి యాదవుల్ హరిభుజాగర్వంబునన్
నేఁడు కాలము మేలు చనుదెంచెనేని మనముల్ లంఘించి
విద్వేషులన్, సమరక్షోణి జయింత మింతపనికై శంకింప
నీకేటికిన్."

(పోతనకవి.)

అని పలికి యతని మనస్సంకటమును దీర్చెను. రాజులు నిట్లే పలుభంగులఁ దెలిపి తమతమభూములకుం బయనము సాగించిరి. ఆప్రయాణమున భీష్మకరాజు సత్కారము నాసింపలేదనుటొక్కటియే విచిత్రము. శిశుపాలుఁడును వివాహమహోత్స

వార్తా వేషము తనంతన యూడిపోవఁగా విషణ్ణహృదయుండై హతశేషసైన్యంబులం గూడి యెట్లో తనపురంబునకుం బోయెను.

మహాత్ములారా! హరివంశాదులు భాగవతకథను జక్కఁగా ననుసరింపకయున్నను రుక్మిణిని శ్రీకృష్ణుఁడు మార్గమధ్యమందు రాజలోకంబు చూచుచుండఁ నగరంబు పైనిడుకొని చనియె ననువిషయమున నద్వైతత్వమునే పొందినవి. యుద్ధహరణము రాక్షసవివాహలక్షణము గాన నది సకలపురాణసమ్మతముగానే సాగినది. ఈకథను విశేషించి సంగ్రహించి వ్రాసినవి కొన్ని పురాణములు కలవు. రుక్మికలహమును వారుకూడ వ్రాసిరి. తక్కినవిషయముల నీషద్భేదము లున్నను వాని నితరులు చెప్పకుండుట రీతిభేదమున వ్రాసినందుననే కాని తెలియక కాదని యెఱింగి కథను బఠించుటుచితము. భక్తిభావమునఁ బఠించిననే ఫలముఁకలుగును. మనకుఁ గథయందుఁ గాక దాని నుండి గ్రహింపఁదగినవిషయమునందే శ్రద్ధ నుదుగవలయును. ఇపు డీకథనుండి మనము నేర్చుకొనఁదగిన విషయమేది? అని ప్రశ్నింపవలయును. సమాధాన మిట్లుండును. మనుజుఁడు దైవ యత్నమునకే నాలుకలుచాపక తనయోపినంతవట్టు పురుష ప్రయత్నము చేయవలయును. ఆప్రయత్న మశ్రద్ధమైఁ గాక బహుభంగుల నాలోచించి పట్టుదలంబూని చేయవలయును. అట్లు చేయనిచో దైవ మనుకూలింపదు. అంతియగాక భగవదాజ్ఞను మీఱిన ట్లగును.

శ్లో. "కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫల హేతుర్భూర్మాతే సంగోఽస్త్వకర్మణి." ౪౭

యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే."

౨ అధ్యా.

అను నీగీతావాక్యములు పై యర్థమును దృఢపఱచుచున్నవి. పురుషప్రయత్నము చేయునపుడు తత్ఫలమునకై యాశపడక దైవముపై భారమువైచి చేయవలయు. సిద్ధించినచో హర్షింపరాదు. సిద్ధింపకున్న దుఃఖింపరాదు. ప్రయత్నము చేయునపుడు తనశక్తియంతయు నుపయోగించి భగవంతునిపై ఫలమునొసంగు భారమువైచి చేయవలయును గాని యశ్రద్ధగాఁ జేయరాదు. శిశుపాలుఁడు రుక్మిణి తనకుఁ గళత్రమగుననియే నమ్మి వివాహమునకు వచ్చెను. జరాసంధాదులను దోడురమ్మనియె. భగవంతుఁడే కాక లోకములోనివీరులలో నొక్కఁడుగాఁ గృష్ణుఁడున్నయెడల నీప్రయత్నమును విఫలముచేయఁ జాలఁడనుట నిక్కము. సర్వప్రయత్నములు సంసిద్ధములు. కాని దైవము వేఱువిధముగా నూహించెను. కాన ఫలింపదయ్యెను. అట్టితఱి విషాదమొందకుండినచో శిశుపాలుఁడు జ్ఞానియే యనఁదగినవాఁడు. "సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా" అన్న భగవదుక్తిని మీఱెను. కావున దుఃఖపడియెను. దానఁ గలిగిన లాభమేమి? దుఃఖమే. తుదకు నోడినరాజులందఱు దైవము బలవత్తరము గాన మనము దానికై వగవఁ బనిలేదని యుపదేశించిరి. దాననే యించుకశాంతి యతనికిం గలిగెనవక తప్పదు. కావునఁ గర్మముచేయుటకే మనకధికారము గాని దానివలనిఫలమును సంపాదించుటకు మనకధికారము లేదు. అది భగవదధీనము.

కావుననే యదృష్టమందురు. కనఁబడనిదని దాని యర్థము. తెలియ శక్యముకానిదని దాని భావము.

రుక్మిణి యంతఃపురచారిణియైనను సర్వోపద్రవముల నొక్కవిధముగ శ్రద్ధగలిగి భగవంతుని ప్రార్థించెను. ఆమె వాంఛ భగవంతుని కోరికయే. ఎట్టియుక్తియుపాయమును ఫలించెను. త్రికరణశుద్ధిగాఁ జేయు ప్రయత్నమునకు భగవంతుఁడు తోడ్పడుననియు, నది ఫలమును నీయక మానదనియు దీనినుండి తెలియును. త్రికరణశుద్ధిగా నొనరించు ప్రయత్నము ఫలవంతముగాకున్న శ్రద్ధాలోపముననే యనవలయునుగాని భగవంతుని లోపము కాదు. సత్కార్యమును ఫలింపఁజేయ సర్వేశ్వరుఁడు కాచియుండును. అది ఫలింప వీలులేనిదైనను ప్రయత్నము చక్కఁగా నుండిన ఫలింపఁ జేయును అని మనము గ్రహింపవలయును. ఇంతమాత్ర మీకథ నుండి నేర్చుకొందము. ఇఁకఁ దరువాతికథను వినుఁడు.

## రుక్మి శ్రీకృష్ణు నెదిరించి భంగపడుట.

బలభద్రప్రముఖులచే నిట్లు శిశుపాలుఁడు ప్రభృతి ప్రజాధినాథులు చతురంగబలములతోఁ బ్రాణావశిష్టులై యెట్లో తమపురములకు విదర్భనగరము నెవ్వరికిం జెప్పక పోఁగా రుక్మి తనయనుజాతను వనజాక్షుఁడు రాక్షసవివాహపద్ధతిం గొని పోయెనన్న వార్త చెవులసోఁకఁగనే రోషజ్వాలాకలితుఁడై యేకాక్షౌహిణీబలము వెంటనడువఁగా నరదము నధిరోహించి కృష్ణుని వెనుకొనఁ బోయెను. ప్రయాణము సాగించునప్పుడు రాజులందఱు వినుచుండఁగా శరశరాసనములఁ దాల్చి యిట్లు ప్రతిన చేసెను. రాజులార! వినుఁడు. కృష్ణునిం బొలియింపక రుక్మిణిని మరలింపక కుండినపత్తనమును బ్రవేశింపను. ఇది సత్యమని

నమ్ముఁడు. మీయందఱు వినుచుండఁ జెప్పుచున్నవాఁడను. అని పలికి రథమును ద్వరగా నడిపింపుమని సారథిని హెచ్చరించుచుఁ గృష్ణుఁడున్నచోటికి రథముఁ దోలుము. ఆతనితోఁ బోరాడ వలయును. ఇపుడు దుర్బుద్ధియగు (రాజగృహమర్యాదల నెఱుంగని) గోపాలుని మార్గానిశాతవిశిఖాసారమునఁ దదీయవీరమదమును బరిహరించెదను. నాతోఁబుట్టును బలాత్కారముగా హరించినక్రియకుఁ బ్రతిఫలమును గల్గించెదను. అని యిట్లు బీరములాడుచుఁ గుమతిగావున భగవంతుఁడు సకల బ్రహ్మాండనాయకుఁడు నగు శ్రీకృష్ణుని ప్రమాణ మింత యని యెఱుంగనివాఁడగుట యొక్కరథము సాయముగాఁ బాఱి వెనుకొని గోవిందుని నిలునిలుమని యదలించుచు ధనుస్సు నాకర్ణముగ నాకర్షించి మూఁడు వాఁడితూపుల హరిని నొప్పించి యిట్లు పలికెను. ఈఘట్టమున మూలమునందు

శ్లో. "ఆహో చోర క్షణం తిష్ఠ యదూనాం కులపాంసన,
　　కుత్ర యాసి స్వసారం మే ముషిత్వా ధ్వాంక్షవద్ధవిః.
　　హరిష్యేఽద్య మదం మంద మాయినః కూటయోధినః,
　　యావన్న మే హతో బాణైశ్శయీథా ముంచ దారికాం."

అని చూపట్టెడిని.

"యదూనాం కులపాంసన కులదూషకేతి లౌకికార్థః. వాస్తవార్థస్తు. యదూనాం కులస్యప. యదుకులపతే అంసన స్వయం చ రిపుహననచతుర. అంసనమాఘాత ఇత్యస్మాద్ధాతోః కర్తరిలిట్. ప్రత్యయోనందాది విహితః. ధ్వాంక్షః కాకః స. యథాహవిః ముష్ణాతీతి తద్వత్. వస్తుతః అధ్వాంక్షవదితి ఛేదః సహస్రాక్షవ దిత్యర్థః. సింహతార్క్ష్యవద్వా" అని వ్యాఖ్య.

ఈ శ్లోకద్వయమునకు రెండర్థములు గలవు. ఎట్లనఁగా: చోర= చోరుఁడా. (అనఁగాఁ జిన్ననాటనుండి గోపాలకులయిండ్ల వెన్న మొదలగువాని నపహరించినవాఁడ వనుట. లేక చోర స్వభావము గలవాఁడవు. కనుకనే మాపరోక్షమందు నొంటి గావచ్చుచున్న మాపిల్లను దొంగిలికొని పోవుచున్నాఁడవు.) యదూనాం కులపాంసన - యాదవవంశము చెడ జనించిన వాఁడవు. (నీవలె నిట్టియకార్యముల నీవఱకు యాదవులలో నెవ్వఁడును జేయలేదు. కావున నీవు కులద్రోహివి.) క్షణం తిష్ఠ=క్షణకాలము నిలువుము. మే స్వసారమ్ - నా తోఁబుట్టు వగు నీ రుక్మిణిని, ముషిత్వా - దొంగిలించి, హవిః = పవిత్ర మగు హోమద్రవ్యమును, ధ్వాంక్షవత్ = కాకివలె, (అనఁగాఁ బరిశుద్ధమగు హోమపదార్థమును అపవిత్రజన్మ మగు కాకి దొంగిలించుకొని పోవుచందమున,) క్వయాస్యసి=ఎక్కడకుఁ బోవఁగలవు. మంద=మూర్ఖుఁడా. మాయినః = మాయకాఁడవు. కూటయోధినః = కృత్రిమయుద్ధములు చేయువాఁడవు. (అను నీయొక్క) మదం - గర్వమును, హరిష్యే - హరించెదను. అద్య = ఇప్పుడు, (ఆలస్యము లేదు.) యావన్న మే హతో బాణైశ్శయీథా ముంచ దారికామ్=నాచేఁ బ్రయుక్తములగు నిశితవిశిఖములఁ దెగి భూమిఁ ద్రెళ్లకమున్న నాచెలియలిని వదలిపెట్టుము. అని దీనియర్థము.

తనసహజాతను శిశుపాలున కీవలయుననియుఁ జైద్యుఁడు కులీనుఁడనియు నతనికొసఁగిన తనమర్యాదకుఁ దగిన ట్లుండు ననియుఁ దలంచి కులహీనుఁడనియు గుణరహితుఁడనియుఁ గృష్ణుని దెగడిన రుక్మి తనప్రయత్నము విఫలముకాఁగాఁ

గృష్ణుఁడే దొంగిలించుకొనిపోవుచుంటఁ గాంచినపుడు తా కోపూరుఁ డయ్యుంటం జేసి యెట్లు మాట్లాడఁదగునో యట్లు రుక్మి మాటలాడినట్లు పై శ్లోకమునకు లౌకికార్థము గలదు. భగవద్దర్శనమగుట పూర్వజన్మపుణ్యమువలననే కావున రుక్మి యెంత దుర్వృత్తుఁడైనను దద్దర్శనబలమున నతఁ డెఱుంగకుండ నామాటలు వెడలినవి. కావున రెండవయర్థముకూడ నున్నదని వ్యాఖ్యాతలు వ్రాసిరి.

యదూనాం కులపాంసన = అనుచోట కులప, అంసన అని పదవిభాగము చెప్పవచ్చును. యదూనాం కులప = యాదవకులము నుద్ధరించువాఁడా, అంసన=శత్రుహననచతురుఁడా, చోర = భక్తులపాపములను దొంగిలువాఁడా, క్షణం తిష్ఠ = ముహూర్తమాత్రము నిలువుము. క్షణకాలము నిన్ను దర్శించిన భవబంధములు తెగుననుట. మే స్వసారం ముషిత్వా=నా యనుజాతయగు నీరుక్మిణి హరించి కుత్ర యాస్యసి=ఎందుఁ బోయెదవు? మాపూర్వపుణ్యమున నీకుఁ బత్ని కాఁదగిన యీ లోకజనని మాయింట జన్మించినది. ఆమెను నీకునిచ్చి కన్యాదానము చేయఁ జూచుపుణ్యము నేఁ జేయనికారణముగ నీవే నావంటిపాపాత్ముఁడు చూడకుండనే హరించుకొని పోవుచున్నాఁడవు. ఇది న్యాయమగునా. ఎందుఁ బోయెదవు! నేను నీ వెంటఁబడక విడుతునా అని భావము. సర్వాంతర్యామివి కదా. యని సారము. ముషిత్వాధ్వాంక్షవత్ = అనుతావున ముషిత్వా, అధ్వాంక్షవత్. అని పదవిభాగ మగును. యజ్ఞపురోడాశమును బవిత్రదేవత (సహస్రాక్షుఁడు) కొనిపోవును. అట్లే నీవు నాతోఁబుట్టువును గొని యెచ్చటికి బోవఁదలంచితివి?

అనఁగా నిచ్చటనే యుండుమని ప్రార్థనము. మంద - శాశ్వతుఁడా, కూటయోధినః = ఎవ్వరికిఁ దెలియకయుండ యుద్ధము చేయఁగలవాఁడవు. (అనఁగా నీవు చేయు సంగరమున నీవలె నుండువాఁడు మఱొకఁడు లేఁడు కనుక నీయుద్ధచమత్కృతి నితరు లెఱుంగఁజాలరని భావము) మాయినః మాయాశీలుఁడవు. (అనఁగా మాయచే నన్నికార్యములు చేయించువాఁడవు. నిర్లిప్తుఁడవని భావము) అగు నీయొక్క, మదం - గర్వమును, అనఁగా నావ్యాపార మెవ్వరెఱుంగిరన్న యభిమానమును, హరిష్యే = హరింపఁగలను. అనఁగా నాతోఁబుట్టువును బరిగ్రహించితివి కావున మాయింటి కల్లుఁడవైతివి. కావున నీకింక నాగర్వ మెక్కడిదని సారము. ఎంతవనుక నాబాణములచేఁ గొట్టఁబడి నేలఁబడుండవో, నా నమస్కారబాణములు నీమేనునంటఁగా నీవు రథమునుండి క్రిందదిగవో అంతకు లోపలనే మాకన్నియను వదలుము. క్షత్రియులు గౌరవార్థము బాణములవిడుచుట యాచారము కావున నమస్కారబాణములు ప్రయోగించువాఁడు తనయందు గురుభావము కలవాఁడని తెలుపుటకు రథము దిగి యెదురొక్కనుట క్షత్రియాచారము గనుక నంతకుముందే యనఁగాఁ దోలుదోలుతనే మాకన్నియ రథమునుండి దింపుము. పిదప నీవు దిగుము. ముందు నీవు రథముదిగిన నాసహజాత యున్నతాసనమున నున్నట్లగును గాన ముం దామెనుదింపి నీవును దిగి నాయీ రథము నెక్కి వచ్చి మాయింటఁ బాణిగ్రహణమహోత్సవమును జరపి మ మ్మానందింపఁజేయుమా యని దీని సారతరార్థము.

ఇట్టియర్థము తర్వాతికథనుబట్టి సుసంగతమా యను ప్రశ్నము వచ్చును. రాఁ దగినదే. భగవద్దర్శనమున నెట్టివారికి మనస్సు మార్పునొందును గావునఁ దటాలున భగవంతుని దివ్యమంగళవిగ్రహమును గాంచినపుడు పూర్వపుణ్యవశమున మార్పునొందుట యస్వభావము కాదు. మార్పునొందిన చిత్తము పరిపక్వము కావలదా. అట్లు గాలేదే యందురేని, పూర్వపుణ్యము విశేషించియుండకున్న నంతమాత్రమే లాభముగా నది యథాపూర్వ మగును. కావునఁ బైయర్థ మసంగతము కాదని యెఱుంగుటుచితము. భగవంతునియందు ద్వేషమూను వారల కది సరిపడదన్నను బాధలేదు. ఈశ్లోకమునకు మహాకవిపోతనగారొకచక్కనిపద్యమును వ్రాసిరి. విశేషార్థ మం దిమిడియే యున్నది.

"సీ. మాసరివాఁడవా మాపాపఁ గొనిపోవ
నేపాటిగలవాఁడ వేదివంశ
మెందు జన్మించితి వెక్కడఁ బెరిఁగితి
వెయ్యది నడవడి యెవ్వఁ డెఱుఁగు
మానహీనుఁడ వీవు మర్యాదలును లేవు
మాయఁ గైకొనికాని మలయరావు
నిజరూపమున శత్రునివహంబుపైఁ బోవు
వసుధేశుఁడవు గావు వావి లేదు
ఆ. కొమ్మనిమ్ము నీవు గుణరహితుండవు
విడువు విడువవేని విలయకాల
శిఖిశిఖాసమానశితశిలీముఖముల
గర్వమెల్లఁ గొందుఁ గలహమందు."

అని పలికి రుక్మి యంతటఁ దనక్రోధము యథాపూర్వముగాఁ బురికొలుపుచుండ నిలువక పలుకుచుంటఁ గాంచి యంబుజాక్షుఁడు ముసిముసినవ్వులు నవ్వుచు నాలుబాణంబుల నతని నొంచెను. ఎనిమిదిబాణంబులచేఁ దదీయరథ్యముల నొవ్వఁ జేసెను. రెండువిశిఖముల సూతుని మూఁడుతూపుల ధ్వజము నొప్పించెను. మఱియు నాలుబాణముల ధనుస్సు ఛేదించెను. అంతలో రుక్మి వేఱుచాపంబుగొని యైదుమార్గణంబుల హరి నొప్పించి యా ర్వ హరియు నాతనిచాపఁబును మగలఁ ద్రుంచెను. వేఱొండు చాపంబెత్త నదియును దెగిపడిపోయెను. పరిఘ పట్టిసశక్తితోమరచర్మాసిప్రముఖసాధనంబుల నాతఁడు ధరింప వానినెల్ల నచ్యుతుఁడు దునిమెను. అంత రుక్మి రథమునుండిదిగి ఖడ్గపాణియై హరి వధించునిచ్ఛచేత మహాక్రోధమున హరిపై కుఱికెను. అపుడుగిడుట ప్రజ్వలజ్జ్వలనునిమీఁదికి శలభము పోవునట్లుండెను. హరియు నతనిరాకం గాంచి యించుకకోప మూని చర్మఖడ్గములను ఛేదించి యతనిం బొలియింపఁ బూని నట్లు తీవ్రఖడ్గము గైకొనియెను. తనయన్నఁ బొలియింప సమకట్టుట నెఱింగి తోఁబుట్టువు మృతికి వగచునది గావున రుక్మిణి భర్తృప్రయత్నమునకు భీతిల్లి విహ్వలయై పతిపాదములపైఁ బడి కరుణముగా నిట్లు పలికెను. యోగేశ్వరా! అప్రమేయాత్మా! దేవదేవా! సర్వలోకేశ్వరా! కల్యాణాత్మకా! నాతోఁబుట్టువును వధించుట న్యాయముకాదు. మహాభుజా! నాకొఱ కీతనిం గాపాడుము. అని పలుకుచుఁ గన్నీరుమున్నీరుగాఁ బ్రవహింపఁ బరిత్రాసవికంపితాంగముతో వాడినముఖముతోఁ దడఁబడుపలుకులు గలకంఠముతో భీతిచే పడిపోవు

చున్న హేమమాల గలుగునట్లు పాదములపైఁ బడియున్న రుక్మిణిం గ్రుచ్చియెత్తి యామెపలుకుల గారవించుచందంబున నాప్రయత్నమునుమాని మరలెను. దుర్మతి గావునఁ దత్ఫలము ననుభవింపవలయునని యూహించి హరి తనచేతి నిశాతఖడ్గమున శ్మశ్రుకేశములు గొఱిగి బంధించి విడిచి మరల నరదం బెక్కెను.

అంతలో యాదవవీరులు పరసైన్యముల మర్దించి వారు పాఱిపోవఁగా మరలి హరిం జేరిరి. అందు రుక్మిని జూచిరి. హతప్రాణుఁడై పడియుండు రుక్మిం గాంచి కరుణించి హలాయుధుఁడు బంధముల విడిపించి కృష్ణునిం జూచి యిట్లు పలికెను. కృష్ణా! ఈచేసినపని సమ్మతము కాదు. జుగుప్సితమైనది. శ్మశ్రుకేశవపనము వైరూప్యహేతువు. అవి సుహృద్వధమే యగును. అని పలికి సోదరావమానజనితతాపభరాక్రాంతస్వాంత యగు రుక్మిణి నూఱడించుట మంచిదని తలంచి రుక్మిణిం గాంచి అమ్మా, తోఁబుట్టువునకు విరూపత్వమును గల్పించితిమని మమ్ముం దూఱకుము. సుఖదుఃఖముల నొసంగుటకుఁ గర్త యొక్కఁడును లేఁడు. తనకర్మమే తనకు ఫలము నిచ్చును. వధింపఁదగినంత యపరాధ మొనర్చినను బంధువు చంపఁదగఁడు. ఆదోషముచేతనే యతఁడు చంపఁబడియెను. మరల వానిం జంపనేల? క్షత్రియుల కీధర్మము బ్రహ్మనిర్మితము. తోఁబుట్టువు తోఁబుట్టువునైన రాజ్యకాంక్షచేతఁ జంపుట యాచారముగ నున్నది. ఇంతకంటెఁ గ్రూరతరాచారము లేదు. ఐన నిది సనాతనము కాని మాకాలమున వచ్చినది కాదు. కావున నీవీపరిభవమునకు వ్యసనపడవలదు. అమ్మా! భూలోకమున మఱొక

దురాచారమున్నయది. భూమికొఱకు, ధనధాన్యములకొఱకు, స్త్రీలకొఱకు, మర్యాదకొఱకు, ఐశ్వర్యముకొఱకు, వాంఛపై కొనఁగా ధర్మాధర్మముల నాలోచింపక ద్రవ్యమదముచే రాజులితరులకు హానిచేయుచుండుదురు. ఇదియు మానాఁడు వచ్చిన యాచారము కాదు. సృష్టిమొదలుకొని నేఁటివఱకిది సాగుచున్నయది. మఱొక్కమాట వినుము. సర్వభూతములకు ద్రోహముచేయుచున్నాహగల నీభ్రాతలను సజ్జనివలె మేలుగోరుదేని యట్లుగోరుట నీబుద్ధికి న్యాయము కాదు. ఏలయనఁ నిది సాధువులకు బాధాకరమగును. సర్వభూతములయందు దుష్టబుద్ధులగు నీతోఁబుట్టువుల సుహృదయులనుగా భావించి యట్టివారలకు మేలుగోరుదువేని యదియు నీకు విషమబుద్ధియే. దానసాధువుల కెందఱకో బాధ కలుగును. సర్వభూతములయందు దుర్మనస్కులగుశిశుపాలాదులకు సభద్రము, సుహృదయులకు భద్రమును గోరుదువేని యదియు నీను సద్బుద్ధియే గాదు. అట్లుకోరుట యజ్ఞులలక్షణము. ఏలయన వారిబుద్ధి సర్వభూతములయందు సమానము కాదు. సర్వభూతములయందు సమబుద్ధియుండుట యనఁగా నొకరికి మేలు వేఱొకరికిఁ గీడును గోరుటయనునది విషమబుద్ధిగలవారల లక్షణముగాని సమబుద్ధిగలవారల లక్షణము కాదు. ఏల యందువేమో వినుము. దేహాత్మమానులకు నరులకు దేవమాయచే మిత్రులని, శత్రువులని, యుదాసీనులని ముత్తెఱంగుల దేహాభిమానము కల్పింపఁబడినది. కాని యిది వ్యర్థమైనది. ఆకాశము చంద్రాదులం గలజ్యోతిస్సు ఒక్కఁడైనను ఘటాదులయందుఁ బ్రతిఫలించినపుడు పెక్కులై కానంబడినట్లు ఆత్మ యొక్కఁ

డయ్యుఁ బెక్కువిధంబుల నజ్ఞులచే గ్రహింపఁబడుచుండును. కాని యాకాశము, చంద్రుఁడు, సూర్యుఁడు, బహుభంగులఁ గనఁబడుట సత్యముకాదు. అది చూచువారికి సత్యజ్ఞానము లేనికతన నిట్లు కల్గినది. ఘటాదులయందు బహువిధములఁ గనఁబడుచుండ నాకాశమువైపునకు దృష్టి నిగిడించి పరికింపఁగా నొక్కవిధముగనే తోఁచును. అపుడు వెనుకఁ దోఁచినది మిథ్యయనియే తోఁచును. జన్మమరణములు గలయీదేహము ద్రవ్యప్రాణగుణాత్మకము గావున నవిద్యచేఁ గల్పితంబై దేహిని సంసారమునఁ బరిభ్రమింపఁజేయుచునే యుండును. కాని యిది వాస్తవము కాదు. సూర్యుఁడు తమస్థుఁడై యుండఁ బ్రకాశమానంబులయిన దృష్టిరూపంబులుపోలె నాత్మ తటస్థుండై యుండును. దేహేంద్రియములు ప్రకాశమానంబు లగునాత్మకు వేఱొక్కదానితోడ సంయోగవియోగంబులు లేవు. వృద్ధిక్షయంబులు చంద్రికకే గాని చంద్రునకు లేవు. అట్లే పుట్టుట గిట్టుట దేహమునకే గాని యాత్మకు నుండవు. ఒకఁడు నిద్రవోవుచు ఆత్మను విషయఫలానుభోగంబుగలదానిగాఁ జేయించును. అట్లే జ్ఞానశూన్యుఁడు సత్యముగాని యర్థంబునందును భవంబు నొందుచుండును. ఇది యజ్ఞానజనితం బనుజ్ఞానంబు నొందఁ బ్రయత్నింపఁడు. కావున నజ్ఞానంబువలనఁ గలిగినశోకము విడువుము. ఇది యాత్మశోషవిమోహనము. తత్వజ్ఞానమున దానిని దొలఁగించుకొనుము. స్వస్థహృదయవు కమ్ము. ఇంక నీ చింతఁ బూనవలదు. అని యిట్లు బలభద్రుఁ డుపదేశింపఁగా వైమనస్యమును బాసి భ్రాతృవమానజనితదుఃఖంబును మాని యుండెను. రుక్మియు నాబలభద్రోపదిష్టవిజ్ఞానసారమున బోధి

తుండై బంధవిముక్తుఁడై నగరాభిముఖుండై పోవుచుఁ దన ప్రతిజ్ఞను దలంచి పురంబు సొరఁబూనక తపస్సుచేయఁ బ్రయత్నించెను. కాని మంత్రిపురోహితులు వారించి ధర్మోపదేశముచేయఁగా నందుల కంగీకరించి కుండినపగరంబును బ్రవేశింప నన్నమాటనుమాత్రము నిలుపఁబెట్టఁబూని తన దేశము నందే భోజకటమనుపేరుగల నూతననగరమును గల్పించుకొని యందె యుండెను.

ఆర్యులారా! రుక్మిణికి బలరాముడు చేసె విషయమీషద్భేదముగా సార మొక్కరీతిగా నన్ని పురాణములయందు సమానముగాఁ జెప్పఁబడినది. ఇంతవనుకఁ గలకథ శ్రీకృష్ణుండు మునుఁడు వీనితో సంబంధము లేనియట్లు చెప్పఁబడినది. సార మొక్కఁడైనను రీతిభేదముగలదు. దానిం దెలుపకున్న ముందు వివాహకథ సాగదు. కావున సంగ్రహించి వ్రాసి తరువాతి కథతోఁ గలిపెదను. రుక్మిణీవివాహవార్త నాలకించి శ్రీకృష్ణుఁడు రాముఁనింగూడి చతురంగబలములు తోడరాఁగాఁ గుండిననగరమును బ్రవేశించెననియు, శ్రీకృష్ణాగమనమునకుఁ గుపితులై రుక్మి శాల్వ శిశుపాలాదులు శ్రీకృష్ణుని బరిహసించిరనియు, దానఁ గుపితుఁడై రాముఁడు హలాయుధమూని రుక్మి ప్రభృతుల మర్దించెననియు, వా రాయనయుద్ధతికి నోర్వఁజాలక కాందిశీకులైరనియు, నంతఁ బురోహితుఁడగు శతానందుఁడు తెలుపఁ గళంకమువూని భీష్మకుఁడు శ్రీకృష్ణబలభద్రాదుల కాతిథేయసత్కారము లాచరించి విడిదియింటఁ బ్రవేశింపఁజేసి సత్కరించెననియు, వసుదేవాదులు తదాహూతులై వచ్చిరనియు, మఱుదినము వివాహార్థము నిర్ణీతముకనుక వివా

హామండపమునకు నందఱుదయచేయ భీష్మకుఁడు ప్రార్థించె ననియు, శ్రీకృష్ణజన్మఖండమునఁ గలదు. వివాహము కుండిన నగరమునందే సాగినట్లు కలదుగావున దానిననుసరించి వ్రాయఁ దలంచినవాఁడ గావున నిట భాగవతాదుల ననుసరించి కథను సంగ్రహించి వ్రాసి పిదప నీపురాణముననుసరించి వ్రాసెదను.

* ఇట్లు రుక్మిణి ఖేదంబుమానియుండఁగా రుక్మి లోనగువారు మరల పోవఁగా నివృత్తచింతాభరహృదయ యగు రుక్మిణిం గాంచి శ్రీహరి బలదేవాదులు త్వరసేయ ద్వారకా నగరమున కరిగెను. యాదవు లానందపరవశులై శంఖతూర్యాది ధ్వను లంబరమును మాఱుమ్రోఁగఁ జేయుచుండ ద్వారకా నగరంబున కరిగిరి. ఈవార్త వినఁబడఁగనే హరిరాక కెదురు చూచుచు నాగరులు పురమును సింగారించిరి. యాదవవీరులం గూడి కృష్ణబలభద్రులు పురమును జొచ్చిరి. ఉగ్రసేనాదు లెదుర్కొనిరి. మహావైభవమున గృహప్రవేశమహోత్సవము సాగెను. వివాహము నిర్ణీతమయ్యెను. తదుచితవేషముల నందఱును దమయానందపారవశ్యమును దెలిపిరి. వివాహమండపము సర్వాలంకారసంభృత మయ్యెను. మహావైభవమున నా వివాహమహోత్సవమును సాగింప నెల్లరు నిశ్చయించిరి. సర్వసంభారములు సేకరింపఁ బడియెను. బంధువులెల్ల వేలకువేలుగా వచ్చిరి. ద్వారకాపురమునకే పెండ్లియాయెనని యెల్లరు తలంచున ట్లానగర మొప్పారెను.

---

* ఈభాగము శ్రీభాగవతాదుల ననుసరించి వ్రాయఁబడునని యెఱుంగునది.

* భీష్మకరాజపురోహితుఁడగు శతానందుఁడు పురికొలుప భీష్మకుఁడు రుక్మిప్రభృతులకు బలభద్రునివలనఁ గలిగిన పరాజయమునకు వంతనొందియు నాచింతమాని సాక్షాత్పరమేశ్వరుఁడు శ్రీకృష్ణుఁడు జామాతగా దొరకెఁగదా యన్న యానందమున హరిని బూజించి వివాహముచేయ నిశ్చయించెను. వసుదేవాదు లరుదెంచి వివాహమహోత్సవమును గన్నులారఁ గాంచ నాతురంపడుచుండిరి. ఆవివాహముచూడ దిక్పాలకులు బ్రహ్మయు శంకరుఁడు సభార్యులై యరుదెంచిరి. దేవతలు యక్షులు గంధర్వులు నరుదెంచిరి. వివాహమండపముల శ్రీకృష్ణుఁడు కైచేయఁబడియెను. ఆ దివ్యమంగళవిగ్రహమును బుణ్యవశమునఁ గాంచ మునిపత్నులు మునికన్యకలరుదెంచిరి. తక్కుంగలవారు వచ్చిరని వేఱ చెప్పవలయునా? ఆకాంతామణులందఱా జగన్మోహనాకారుని దిలకించిరి. అత్తఱి వారినేత్రములు నిర్నిమేషము లయ్యెను. కావున వారనిమిషాంగనలని చూచువారు తలంప నవకాశము కల్గెను. ఆతరుణమున నా శ్రీకృష్ణుఁడు రత్నేంద్రసారనిర్మాణరథము నధిష్ఠించి పరమేశ్వరుఁడని యెల్లరు భావించుచుండ సర్వాంతర్యామి యని మహర్షులు వినుతించుచుఁ దద్రూపమును ధ్యానించుచుండ భక్తానుగ్రహతత్పరత హృదయమున నిండియుండ, నవీనజలదశ్యామాకారము వెలయుచుండ, పీతవస్త్రమును ధరించి చందన

---

* ఇటనుండి యీవివాహము బ్రహ్మవైవర్తపురాణాంతర్గత శ్రీకృష్ణజన్మఖండమునుండి వ్రాసెదను. కావున నిక్కడ రుక్మి మొదలగువారు పరాభవము పొందినపిదప సాగినదని స్మరించుచుఁ గథను జదువుఁడు. చిక్కులుండవు. ౧౦౭ అధ్యాయమున నీకథ గలదు.

చర్చలఁ దనూలత యలరారుచుండ, వనమాలావిభూషితహృద యము చూచువారల కానందపారవశ్యమును గల్పించుచుండ, రత్నకేయూరవలయరత్నమాలావితానోజ్వలాంగుఁడై రత్న కుండలములఁ దాల్చి, వానికాంతులచే గండభాగములు తళతళ లాడుచుండఁగా, రత్ననిర్మిత మంజీరరంజితుఁడై, చిఱునవ్వు మోమున కొక నూతనాలంకారము నొసంగుచుండ, మురళి హస్తారవిందమునఁ గనుపట్టఁగా రత్నదర్పణము నొకఁడు చే ధరించి ముందు నడుచుచుండఁగా దాని నప్పుడప్పుడు చూచుచు శ్వేతచామరములను దాల్చి పార్షదులకు గోపాలకులు తన్ను సేవించుచుండఁగా నవయౌవన ముద్దీపింప, శరత్కమలలోచ నుఁడై శరత్పూర్ణేందుతుల్యాస్యుఁడై కోటికందర్పసౌందర్య మును దృణీకరించు సౌందర్యముతో నలరారుచు, సత్యమని, నిత్యుఁడని, సనాతనుఁడని, తీర్థపూతుఁడని, కీర్తిపూతుఁడని, బ్రహ్మేశానంతసేవితుఁడని, పరమాహ్లాదరూపుఁడని, కోటిచం ద్రశీతలుఁడని, ధ్యానాసాధ్యుఁడని, దురారాధ్యుఁడని, ప్రకృ తికంటెఁ బరుండని, దూర్వారచితపట్టసూత్రుఁడని, సర్వ కారణుండని, సర్వకర్తయని, కందళీమంజరీపరిశోభితహస్తుం డని, త్రివిక్రమాకారచూడాలంకారుఁడని, మాలతీమాల్యా భిరామకంధరుఁడని, మహాత్ములు వినుతింపఁగాఁ దేజరిల్లుచు వచ్చుచున్న యీ పెండ్లికొడుకును జిలకించి నారీమణులు, మహర్షులు, దేవతలు పరమానందమున మేనులు మఱచిరి.

కొంద ఱత్తరుణమున రుక్మిణీజీవనము ధన్యమనిరి. కొందఱు రుక్మిణియీప్సిత మెంతదృఢతమమో యనిరి. మఱి కొందఱు భీష్మకునియదృష్టమే యదృష్ట మనిరి.. ఆసమయమున

భీష్మకుని భార్య యల్లుని గన్నులారఁ గాంచెను. ఆమె యా దర్శనకాలమందు నిర్నిమేషాక్షి యయ్యెను. ఆమెమనస్సు సుప్రసన్నమయ్యెను. భీష్మకుఁడును ప్రసన్నవదనుఁడై సామాత్యుఁడై సపురోహితుఁడై యరుదెంచి దేవతలను భూదేవతలను భక్తియుక్తి నర్చించెను. వారికి నమస్కరించెను. అర్ఘ్యసత్కారముల నలరించెను. వరునొక రమ్యహర్మ్యమున విడియించెను. ఆరేయి సుఖముగా సాగెను. ప్రభాతమున వసుదేవుఁడు మేల్కాంచి కార్యములం దీర్చి స్నానము చేసి సంధ్యాదినిత్యనైమిత్తికవిధివిహితకృత్యముల నిర్వర్తించి వివాహదినోచితవస్త్రముల ధరించి శ్రీవారికి వేదమంత్రములచే నాభ్యుదయికకృత్యమును జేయించెను. శ్రీహరియుఁ దల్లులకు దేవతలకు నమస్కరించి ప్రాయశ్చిత్తదక్షిణల నొసంగి వృద్ధిశ్రాద్ధాదికమును జేసి విప్రభోజనము చేయించిరి.

అంత శుభవాద్యధ్వని లెగసెను. భీష్మకుఁడు వరుని భగవంతునిగాఁ బూజించెను. రుక్మిణి నలంకరింపఁ బంచెను. వివాహవేషముఁ గైచేసిరి. పట్టపురాణులు మునిపత్నులు

**రుక్మిణీకల్యాణమహోత్సవము.**

నారుక్మిణి నలంకరించిరి. అంత సుముహూర్తకాల మాసన్నమయ్యెను. మహేంద్రనామకమని దానికి నామము కలదు. అది పరమ శుభప్రదాయకము. వివాహయోగ్యము. లగ్నాధిపతి యందేయుండెను. శుభగ్రహము లాలగ్నమును జూచుచుండిరి. పాపదృష్టి దానికి లేకుండెను. అది శుభగ్రహాధిపత్యము గలది. శుభతమమని పేరుపొందినది. చంద్రసూర్యులు బలహీనులు కాకుండిరి. వేధదోషాదులు దానికి లేవు. శలాకాది

వేధలు లేవు. ఆలగ్నము దంపతులకు సుఖసమృద్ధిని బ్రసాదించు నది. సదా యమంగళములు చేకూరకుండఁ జేయఁజాలినది. అట్టి శుభసమయమునందు భీష్మకప్రాంగణమును హరి ప్రవేశించెను. దేవతలు హరివెంట వచ్చిరి. మునిప్రవరు లాపరమేశ్వరు నాశ్ర యించి వచ్చిరి. పురోహితులు ముందు నడచిరి. జ్ఞాతులు బంధు వులు చేరివచ్చిరి. తల్లిదండ్రు లుచితరీతి వచ్చిరి. గోపాలకులు, పార్షదులు, వయస్యులు, భట్టులు, గణకులు వెంటనుండిరి. నానావిధవాద్యములు మ్రోఁగసాగెను. నర్తకగాయకులు నా నాశిల్పకులు మాలాకారులు నడచిరి. విద్యాధరులు, అచ్చరలు, కిన్నరీగణములు వచ్చిరి.

వివాహమునకు నిర్ణయింపఁబడిన యాస్థలము నందఱు పరికించిరి. ఎండఱువచ్చినను గూరుచుండఁ దగినంత యాయా మవిశాలములుగలదిగ నుండెను. అరఁటిస్తంభము లందుఁ గట్టఁ బడి యుండెను. చంపకాదిపరిమళకుసుమదామము లందు వ్రేలా డఁజేయఁబడియెను. పీతరక్తనీలవర్ణముల రాజిల్లు పూలదండలు కనఁబడుచుండెను. పల్లవకుసుమఫలములు గలమంగళకుంభ ములం దునుపఁబడియెను. చందనము వానికిఁ బూయఁబడియుం డెను. కుంకుమపంకమున నవి రాజిల్లుచుండెను. మఱియుఁ బాణి గ్రహణకాలోచితవస్తువ్రాత మందుఁ జేర్పఁబడియుండెను. గుప్తద్వారములనుండి యంగనామణు లందుఁ బ్రవేశించిరి. జను లుచితస్థలములఁ గ్రిక్కిరిసియుండిరి. మంగళకలశముంగొని పురోధసుఁడు శతానందుఁడును, గుశహస్తుఁడై భీష్మకుఁడు నం దుండిరి. అట్టివారినందఱను దదీయమండపమునఁ గాంచి బ్రహ్మాది దేవతలు సంతోషాంబుధి మునింగిరి. శ్రీకృష్ణుఁడు రథావతర

ణము చేసి బ్రహ్మాదిదేవతలు, రాజర్షులు, బ్రహ్మర్షులు, సనకసనంద నాదిదేవర్షులు తోడరాఁగా భీష్మకుఁడు వారికెల్ల నమస్కరించెను. వేలువేలు వారికి రత్నమయాసనముల నుంచి కూరుచుండఁ జేసెను. చేతులొగ్గి నిలువంబడి యిట్లు పలికెను.

నేఁటికి నాజన్మము సఫలము. జీవితము ధన్యతమము. అనేక జన్మకృతపాపములు నశించినవి. జగములసృజించు బ్రహ్మదేవుఁడు భక్తులకు సుఖప్రదాతయగుశంకరుఁడు లోనగువారెల్ల నాప్రాంగణమున దర్శనమిచ్చిరి. మీపాదారవిందములు స్వప్నమునఁ గనఁబడినను కృతకృత్యు లగుదురు అట్టి మహాత్ములు సాక్షాద్దర్శన మొసంగితిరి. కల్పాంతపర్యంతము తీర్థభూతులగువారెల్ల నాయింటికి వచ్చితిరి. నాయీగృహము పవిత్రము. * భూమింగల తీర్థములన్నియు సాగరమునఁ

* పృథివ్యాం యానితీర్థాని తాని తీర్థాని సాగరే, సాగరే యాని తీర్థాని విప్రపాదేషు తాని చ, విప్రపాదోదకక్లిన్నా యావత్తిష్ఠతి మేదినీ, తావత్పుష్కరపాత్రేషు పిబంతి పితరోజలమ్, విప్రపాదోదకం భుక్త్వా దత్వావిప్రాయ దక్షిణాం, స్నాతానాం సర్వతీర్థానాం ఫలమాప్నోతి నిశ్చితమ్. నికృంతనం చ విపదాం వ్యాధినిర్మూలకారణమ్, సుఖదం శుభదం సారం విప్రపాదోదకం నృణామ్, న గంగాసదృశం తీర్థం న దేవో మాధవాత్పరః, సనత్కుమారా ద్భక్తో న న హి కల్పతరో స్తరుః, న పుష్పం పారిజాతాచ్చ న వ్రతం హరివాసరాత్, పూజనేన హి పూజ్యం చ న పత్రం తులసీపరమ్, న దేవీ ప్రకృతే శ్చాపి నాధారః పవనాత్పరః, న హి స్థూలో మహావిష్ణో ర్నసూక్ష్మం పరమాణుతః, న బ్రాహ్మణాత్పరః పూతో నాశ్రమశ్చ పరః ప్రభుః,......నిర్గుణశ్చ నిరాకారో భక్తానుగ్రహ విగ్రహః, సవివ చతుషోన్యాణాం సాక్షాదేవ తు మద్గృహే. మూలము.

గలవు. సాగరతీర్థములన్నియు విప్రపాదమునఁ గలవు. విప్ర పాదోదకముచేఁ దడుపఁబడి భూమి యెంతదనుక నుండునో అంతదనుకఁ బుష్కరపాత్రములందుఁ బితరులు జలపానము చేయుదురు. విప్రపాదోదకంబును ద్రావి సద్విప్రునకు దక్షిణల నొసంగినవారు సర్వతీర్థముల స్నానముచేయఁ గలుగు ఫలము నొందుదురు. ఆపదలను నాశనముచేయుచు వ్యాధుల నిర్మూలించుటకుఁ గారణమై శుభము సుఖమునొసంగుచు సార భూతమైనది విప్రపాదోదకము. లోకమునందు గంగాసమాన మగుతీర్థము లేదు. మాధవునికంటె నుత్కృష్టుఁ డగుదేవుఁడు లేఁడు. సనత్కుమారునికంటె భక్తుఁడు లేఁడు. కల్పవృక్షమున కంటె నుత్కృష్టతరువు లేదు. పారిజాతపుష్పమునకంటె మించిన వాసనగల యోగ్యమగుపుష్పము లేదు. హరివాసరవ్రతమును మించినవ్రతము లేదు. పూజార్హము లగుపత్రములలోఁ దుల సీపత్రమును మీఱినది లేదు. ప్రకృతిమించిన దేవత లేదు. పవనునిమించిన యాధారము లేదు. మహావిష్ణువునుమించిన స్థూల వస్తువు లేదు. పరమాణువునుమించిన సూక్ష్మవస్తువు లేదు. బ్రాహ్మణునికంటెఁ బరిశుద్ధుఁడు లేఁడు. ఆశ్రమములలో గృహా స్థాశ్రమమును మించినది లేదు. కావున ధ్యానింప నలవిగాక దురారాధ్యుఁడై యోగులకుంగూడఁ దెలియఁబడక వెల్గుచు నిర్గుణుఁడై నిరాకారుఁడై భక్తానుగ్రహవిగ్రహుఁడై యల రారుమహాత్ముఁడే యిపుడు చక్షుర్గోచరుఁడై నాయింటఁజేరెను. ఏ శ్రీకృష్ణునిపాదారవిందమును దేవతలు బ్రహ్మాదులు ధ్యానిం తురో యాకృష్ణుఁడే నాగృహామునకు వచ్చెను.

అని వినుతించి భీష్మకుఁడు శ్రీకృష్ణుని బూజించి యిట్లు స్తుతించెను. సర్వాంతరాత్మవు. సర్వసాక్షివి. నిర్లిప్తుఁడవు. కర్మలకుఁ గర్మములకుఁ గారణమవు. సర్వకారణకారణుఁడవు. ఇట్టి నిన్ను నాత్మయని కొందఱు, జ్యోతిస్స్వరూపుఁడవని కొందఱు, సనాతనుఁడవని కొందఱు, పరమాత్మవని కొందఱు, ఆత్మప్రతిబింబరూపుఁ డగుజీవుఁడవని కొందఱు, ప్రాకృతుఁడవని కొందఱు, సగుణుఁడవని కొందఱు భ్రాంతిబుద్ధులై పలుకుచుందురు. కొందఱు నిత్యశరీరుఁడవందురు. కొందఱు సూక్ష్మబుద్ధులు జ్యోతిరభ్యంతరమునందు సనాతనరూపుఁడవందురు. ఎవనినుండి తేజస్సు వెలువడునో యతఁడు సాకారేశ్వరుఁడు గాక మఱెవ్వఁడగును! అట్టివాఁడవు నీవే. అని పలికి భగవంతుని ధ్యానించుచు గట్టిగాఁ బొగడెను. మహాలక్ష్మి సమర్పితాంఘ్రిపంకజములకుఁ బాద్యమొసఁగెను. పరమపవిత్రము లగుపాదములకు దూర్వాపుష్పజలాన్విత మగునర్ఘ్య మిచ్చెను. మధుపర్కము, చందనము, శ్రేష్ఠతమగు పారిజాతమాల్యము సమర్పించి యందుఁ గలహారమున శ్రీకృష్ణునికంఠము నలంకరించెను. కుబేరదత్తరత్నహారమును వరపూజాకాలమున భక్తిపూర్వకముగ సమర్పించెను. వహ్నిదత్తమగు వస్త్రద్వయమును సమర్పించి కృతకృత్యుఁడ నైతిననియె. విశ్వకర్మనిర్మించిన రత్నమకుటము నిచ్చి ధూపదీపముల నారాధించెను. నానావిధోపచారములఁ బూజించి పుష్పాంజలి నొసంగి వివాహవేదికకడకుం బిలుచుకొని పోయెను.

మహామతులారా! ఈకథనుండి యెఱుంగఁదగిన ముఖ్యవిషయ మొక్కండు కలదు. భీష్మకుఁడు శ్రీకృష్ణ నల్లునిగానే

భావింపక శ్రీమద్భగవంతునిగా భావించి పూజించెను. విప్ర పాదోదకమహిమమును జెప్పెను. ఆవిషయమున నాలుగు మాటలు వ్రాయవలసి యున్నది. పూర్వకాలమున సర్వవర్ణ ముల ధర్మములు బ్రాహ్మణవశమున నుండెను. వర్ణాశ్రమధర్మ నియామకుఁడు విప్రుఁడని యాకాలపుటాచారము. కారణ మేమన, లోకవ్యవహారముల ప్రసక్తియే లేక సదా వేదమా ర్గమునఁ బ్రవర్తించుచు నితరకార్యములఁ బ్రవర్తింపక భగవం తునిసేవ చేయుచు లోకమునకు సువృష్టి నొసంగఁగోరి యజ్ఞ ములఁజేసి దేవతలఁ బ్రసన్నులం జేయుచుఁ దద్ద్వారా లోక ములకు మహోపకారముచేయువారు బ్రాహ్మణులే కావునఁ దక్కిన మూఁడుజాతులవారును వీరిని బోషించుచుండిరి. యజ్ఞ ములద్వారా వృష్టికలుగునా యని ప్రశ్నింతురేమో,

శ్లో. "యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః,
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగ స్సమాచర. ౯
సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వ మేషవోఽస్త్విష్టకామధుక్. ౧౦
దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః,
పరస్పరం భావయంత శ్శ్రేయః పరమవాప్స్యథ. ౧౧
ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,
తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవసః.
యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః,
తే త్వఘం భుంజతే పాపా యే పచం త్యాత్మకారణాత్.
అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్నసంభవః,
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః. ౧౪

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్,
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్." ౧౫
భగవద్గీత. 3 అధ్యా.

అను నీ భగవద్గీతావాక్యములు తీర్చుననుట నిక్కము. యజ్ఞ ములద్వారా దేవతలు ప్రసన్ను లగుదురనియుఁ దద్ద్వారా వృష్టికలుగుననియుఁ బర్జన్యునుండియే భూతముల కన్నము గలుగుననియు, నాపర్జన్యుఁడు యజ్ఞసముద్భవుఁడనియు, శ్రీ కృష్ణుఁడే యుపదేశించెను. అనఁగా బ్రాహ్మణులు యజ్ఞములు చేసినఁ బర్జన్యుఁడు తృప్తుఁడగుననియు దాన వర్షములు కురి యుననియు దానిచే నన్నసమృద్ధి గుదురుననియు దాన భూత ములు వర్ధిల్లుననియుఁ గదా భావము. అట్టియజ్ఞములు బ్రాహ్మ ణాధీనములు గావున వీరు సకలకార్యములుమాని లోకమునకు నుపకారము కలుగవలయునని యజ్ఞములుచేయుచు దేవతల సంతృప్తులనుగాఁ జేయుచు బ్రహ్మనిష్ఠులై యుండిరి గావునఁ బక్కుంగలజాతులవారు వీరి నన్నివిధముల గౌరవించుచుండిరి. కావుననే లోకోపకారమే స్వకృత్యముగా భావించి ద్రవ్య సంబంధమును మాని ప్రాప్తలాభమునకుఁ బరమానందమం దుచుఁ దృప్తియే ప్రధానముగాఁ దపస్సే ధనముగా నుండుటం బట్టి తత్పాదోదకము పరమపావనమని చెప్పఁబడినది. అట్టి వృత్తిలేనినాఁ డిదియు లేదనుట విస్పష్టమే.

శ్లో. "సావిత్ర్యాశ్చాపి గాయత్ర్యా
సన్ధ్యోపాస్త్యగ్ని కార్యయోః,
అజ్ఞానాత్కృషికర్తారో
బ్రాహ్మణా నామధారకాః. 3

అవ్రతానామమన్త్రాణాం జాతిమాత్రోపజీవినామ్,
సహస్రశ స్సమేతానాం పరిషత్త్వం న విద్యతే. ౮

పరాశరస్మృతి. ౮ అధ్యాయము.

యే పఠంతి ద్విజా వేదం పంచయజ్ఞరతాశ్చ యే,
త్రైలోక్యం తారయంత్యేతే పంచేంద్రియరతా అపి."

పరాశరస్మృతి. ౮ అధ్యా.

ఈపరాశరస్మృతివాక్యములు పైయర్థమును దృఢపఱచుచున్నవి. కావున నిట్టిదోషములు లేకయుండ నాకాలమున బ్రాహ్మణులున్నందునఁ దత్పాదోదకము సర్వతీర్థతుల్యమని చెప్పఁబడినది. అనఁగా సర్వతీర్థస్నానపుణ్యఫలము బ్రాహ్మణునకుఁ బాదప్రక్షాళన మొనరించి యాతీర్థమును మార్జనముచేసికొన్నఁ గలుగునని తాత్పర్యము. ఆకాలపునియమము లీకాలమున నపహాస్యభాజనములగుటకుఁ గారణము తద్ధర్మముల నవలంబింపక యుండుటయే కారణమనక తప్పదు. ఇంక నీచర్చ మాని తరువాతికథను సాగించెదను.

## భీష్మకుఁడు రుక్మిణిని గన్యాదానవిధిచేఁ గృష్ణునకు సమర్పించుట.

* ఆసమయమున మహాలక్ష్మి యగురుక్మిణి మునిదేవతాపత్నులు తోడితేర వివాహవేదికకడ కరుదెంచెను. వివాహోచితవేషమున నారుక్మిణి యొప్పుచు జగజ్జననిగాఁ గనుపట్టెను. మహర్షు లారుక్మిణిని జగదేకమాతయగు లక్ష్మీదేవిగాఁ గాంచి యాదాంపత్యమునకు మహాహర్షమున నోలలాడిరి. అంతఁ బురో

---

* ఈభాగము శ్రీకృష్ణజన్మఖండము ౧౦౮ అధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

హితుఁడు రుక్మిణి నేడుమారులు ప్రదక్షిణములు చేయించెను. ఆమెయుఁ బదుక్షత్రాకారము భర్తకు నమస్కరించి చంపక పల్లవములం బోలిన శీతలతోయములఁ బర్తపైఁ జల్లెను. జగత్కాంతుఁడగు శ్రీకృష్ణుఁడు శాంతమూర్తియై పతివ్రతాశిరోమణియగు రుక్మిణిపైని శీతలోదకశీకరములఁ బ్రోక్షించెను. అప్పుడు శ్రీకృష్ణుఁడు రుక్మిణిని, రుక్మిణి శ్రీకృష్ణుని జూచెను. పరస్పరము దృష్టియోగమున నానందము ననుభవించిరి. అత్యతిశ్రేష్ఠుఁడు సుకుమారిని తనచెంతఁ గూరుచుండఁ బెట్టుకొనియెను. లజ్జచే మోమును వంచెను. ఆమె తేజస్సు నలుదెసల వెలయించుచుండెను. రాజు పరమానందమున స్తోవ ఱచి వేదమంత్రములఁ బురోధసుఁడు చెప్పుచుండఁగాఁ బరిపూర్ణతముఁడగు శ్రీకృష్ణునకుఁ దనపుత్రిక నొసంగెను. వసుదేవు ననుమతినొంది కన్యక నంగీకరించెను. రుక్మిణి పతికరము నందుకొనియెను. ఆసమయము భవానీశంకరుల వివాహసమయము స్మృతిగోచరమయ్యెను. పదులక్షల సువర్ణటంకములు భగవంతు దక్షిణనొసంగి రాజు కృతార్థుఁ డయ్యెను. ఈఘట్టమున మహాకవిపోతన పద్యరత్నము పఠింపఁదగినది.

మ. ధ్రువకీర్తిన్ హరి పెండ్లియాడె నిజచేతోహారిణిన్ మాన్యవై
భవగాంభీర్యవిహారిణిన్ నిఖిలసంపత్కారిణిన్ సాధుబాం
ధవసత్కారిణిఁ బుణ్యచారిణి మహాదారిద్ర్యసంహారిణిన్
సువిభూషాంబరధారిణిన్ గుణవతీచూడామణిన్ రుక్మిణిన్.

కన్యాదానానంతర మాకుమారికను జెంతకుం దీసికొని రాజు మునిదేవతాసభయందు బిట్టు రోదనముచేసెను. ఇంతకాలము

పెంచి మఱొకరికి సమర్పించి కన్నులార ననుక్షణము నిన్నుం గాంచ కెట్లుందును దల్లీ యని గద్గదస్వరమునఁ బలికెను. అశ్రుధారల నారుక్మిణీ తనూలతం దడిపెను.

భక్తజనులారా! ఈగాథనుండి తెలుపఁదగినవిశేష మొక్కఁడు కలదు. రుక్మిణిని శ్రీకృష్ణునకు దానమిచ్చి భీష్మకుఁడు బిట్టురోదనము చేసెనఁట! ఏల? చాలకాలము పెంచి పరున కప్పగించునపుడు దేహసంబంధము బాధించును. ఈయాచార మీకాలమునను గలదు. ఇది సనాతనమైన యాచారము గాని పూర్వకాలమున లేక యీకాలమునవచ్చిన పామరుల యాచారము కాదని యెఱుంగవలయు. ఇట్టియాచారములు సంతతధారగా నన్నట్లు వచ్చుచున్నవి కాని తపస్సు మొదలగునవిమాత్రము సాంతరములై ధరణిఁ బ్రుంగినవి.వానికై దుఃఖింపవలయునే గాని కన్యాదానకాలమునఁ బిల్ల తల్లిదండ్రులు కన్నీరు పెట్టుకొను నాచారము నేఁటికున్నది కదాయని సంతోషింప నక్కఱలేదు. ఇంతకంటె నిందుండి క్రొత్తగా నెఱుంగఁదగినవిషయములని తెలుపఁదగినవి కానరావు. తర్వాతికథ నాలకింపుఁడు.

## పార్వతి లోనగుపతివ్రతలు శ్రీకృష్ణు నాశీర్వదించుట.

* వివాహము పూర్తికాఁగా భీష్మకరాజుపత్నిపతిపుత్రులు గలసాధ్వీమణులం గూడి మహాసంతోషమున నీరాజనములావధూవరుల యభివృద్ధికై యొసంగి యాదంపతుల నొక దివ్యసుందరమందిరమున గృహప్రవేశ కర్మపద్ధతి నునిచెను. ఆ

* ఈకథయుం శ్రీకృష్ణజన్మఖండము నూటతొమ్మిదవ యధ్యాయము నుండి సంగ్రహింపఁబడినది. ఇతరపురాణములయం దీకథ కానరాదు.

మందిరశోభను వర్ణింప నలవికాదు. ఏలయన సర్వబ్రహ్మాండ జనకు లందు విడిసిరి. ఆభాగ్య మొక్కండు చాలదా. దేవపత్నులు, మునిపత్నులు, రాజపత్ను లాదంపతులం గాంచి యానందించి దీవించిరి. రత్నమయపీఠముల వారిని గూరుచుండం జేసిరి. లక్ష్మీనారాయణులు గావున వారిని దేవతాసులు వినుతించిరి. ఆవల వరునింగూడి కన్యకను భుజింపం జేసిరి. ఎల్లరు వారిపంక్తిం గూరుచుండి భుజించిరి. దానివంటిభోజనము కలదా? అదియే యమృతము. ఆదంపతులు భుజించి తాంబూలచర్వణము చేయుచుండంగా నాశుభకాలమున దుర్గాదేవి శ్రీకృష్ణునకు మంగళకరపత్రిక నిచ్చెను. అందలియను మతిం గాని శ్రీకృష్ణా! ఈశుభపత్రికను జదువుమా యని దుర్గ ప్రార్థించెను. సస్మితాస్యకమలుండై తదాజ్ఞ శ్రీహరి దానిం జదివెను.

"శ్లో. లక్ష్మీ సరస్వతీ దుర్గా సావిత్రీ రాధికాసతీ,
తులసీ పృథివీ గంగా ఽరుంధతీ యమునాదితిః.
శతరూపా చ సీతా చ దేవహూతిశ్చ మేనకా,
దేవ్యశ్చైతాశ్చ దంపత్యోః పరం కుర్వంతు మంగళమ్."

అని యాపత్రికయం దుండెను. దీనిం బఠింపంగానే వారెల్ల సుస్మితముఖుల గావించిరి. అందుం బార్వతి యిట్లు పలికెను.

వత్సా! శ్రీకృష్ణా! రుక్మిణీకాంత! నిన్నుం జిఱునవ్వు గల మోము వెలయం గనుంగొనుచున్న ప్రౌఢను రూపవతిని నవయౌవనస్ఫురిత నీరుక్మిణిం జూడుమూ అనియె. సరస్వతి యిట్లు నుడివెను.

వత్సా! శ్రీకృష్ణా! నీకీరుక్మిణి యోగ్య, యువతియు, రత్నభూషణభూషితయు నగు నిన్నుఁ బతిగాఁగోరి చిరకాలము దేవతలం గొల్చినది. ఈమెను మర్యాదగాఁ జూడుమా యని పరిహాసించెను.

అంత సావిత్రి నవ్వుచు నాయనా! శ్రీకృష్ణా! వరుఁడెట్లో కన్యక యట్లే. మున్నే విధి మీ కిరువురకు దాంపత్యముం గూర్చెను. విదగ్ధ యగునారీమణిని విదగ్ధుఁడగు పురుషునితోఁ గూర్చుటయే ఫలము కదాయని యుల్లసము లాడెను.

అంత రతీదేవి యిట్లు భాషించెను. జగదీశ్వరునిం గాంచి పరిహాసింప నెవ్వరు సమర్థులు? కావున రుక్మిణీ! ధ్యానాసాధ్యుఁడు. దురారాధ్యుఁడు. కావున నీవీయీశ్వరుని నవమతిం జూడుకుమా యని నవ్వెను.

అంతట గాయత్రి యీరీతి వాక్రుచ్చెను. ఈభీష్మరాజగృహము పరమపవిత్రమైనది. కావుననే కన్యకుం దగిన వరుఁడు దొరకెననిరి. రోహిణీ యిట్లు సంభావించెను. జగన్నాథా! స్త్రీలసభలో సత్యము పల్కుము. రాధాదేవి యెట్టిది? రుక్మిణి యెట్టిది ? అని స్మితమొనరించెను. సరస్వతి మరల నిట్లు పలికెను. రాధయం దే ప్రీతికలదో రుక్మిణియం దట్టిదియున్న జాడ కానరాదు. ఆమె పూర్వకాలమునుండి సంబంధించియున్నది. సర్వవిహారములయం దెడఁబాటులేనిది. ప్రాణాధిష్ఠాత్రుదేవి. పంచప్రాణములకంటె నధికురాలు. రాధ యిట్టిది. ఈరుక్మిణి యో కమలాదేవి, సంపదధిష్ఠాత్రుదేవత. సర్వశక్తిస్వరూపిణి, వృద్ధవృద్ధిదేవత, దుర్గ, నారాయణి, పరదేవి. కావున నీయిరువురయందు

భేదబుద్ధి యెట్లుంచఁదగునో తెలియుచున్నది. సావిత్రీదేవి వేదమాత. నేను విద్యాధిష్ఠాతృదేవిని. బ్రహ్మ శివ శేష గణేశ దినేశ భక్తులయందును బద్మాదేవియందును బార్వతియందును నాయందును శ్రీకృష్ణుని కెట్టియనుగ్రహమో అట్టియనుగ్రహ మీరుక్మిణియం దుంచకుండుఁగాక. త్రిలోకములయందుఁ బృథివి ధన్యురాలు. భారతవర్షము ధన్యము అందు బృందావనము ధన్యము. అది రాధాపాదాబ్జచిహ్నితము. సకలదేవతలలో రాధిక ధన్యురాలు. ఆమె పాదాంబుజనఖములను లందు శ్రీకృష్ణుఁడు తనచేతితో లత్తుకనుంచెను. నా సాహసము సత్కృ మర్యాద సాగుంగాక. అని పలుకి నందెలు నిచ్చెను. రుక్మిణీ! రాధాదేవికి నమస్కరింపుము. రాధ నీకు హితమ్మునయమున నున్నది. అనఁగానే పార్వతి లోనగువా రిది మంచిదనిరి. లోపాముద్రానసూయా ప్రభృతిమునిపత్నులు శ్రీకృష్ణు నాశీర్వదించిరి. మహానందము ననుభవించిరి.

తరువాత నాభీష్మకుఁడు వచ్చినవారికెల్ల యథోచిత భోజనమిడియె. వసుదేవాదులు, బంధువులు, గోపాలకులు తద్దత్త భోజనమున సంతృప్తులైరి. రుక్మిణిమాతయగు సుభద్రాదేవి రుక్మిణిని కౌఁగిలించుకొని రోదనము చేయుచు వదలలేని ప్రీతితో నమ్మా! నను వదలి నీ వెట్లు పోవుదువు! నిన్ను వదలి యెట్లు జీవింపఁగలను? నన్ను వదలి నీవెట్లు బ్రదుకఁగలవు? మహాలక్ష్మి వగునీవు నన్ను మోసగించి వసుదేవాలయమున కరుగుచున్న దానవు. వాసుదేవప్రియురాల వైతివి. అని పలుకుచు నశ్రుజలముల నామె దేహమును దడుపుచుండెను. భీష్మకుఁడు కన్యకను శ్రీకృష్ణునకు సమర్పించి కన్నీరునించెను. రుక్మిణియుఁ దల్లి

దంద్రుల౦ గాంచుచు దుఃఖించెను. శ్రీకృష్ణుఁడును దుఃఖము నభినయించెను. అంత శ్రీహరి రుక్మిణింగూడి రథమెక్కెను. వసుదేవాదులు తమతమవాహనముల నధిరోహించిరి. భీష్మకుఁడాసమయమున నల్లునకు యౌతుకము నీయఁదలఁచి గజేంద్ర ఘోటకేంద్రరథదాసీదాసజనముల యథావిభవముగ నొసంగెను. విశేషించి రత్నాభరణముల నిచ్చెను.

అంతట ద్వారకకుఁ బ్రయాణము సాగెను. ఉదకాంతములదాఁక సాగనంపి బంధువులెల్ల నశ్రుకణపూరితనయనులై చూచుచుండ వసుదేవాదులు రాఁగా శ్రీహరి ద్వారకాపురాభిముఖుఁడై పోయెను. ద్వారకాప్రవేశమహోత్సవము వచింప నలవికానిది. వసుదేవుఁడు బంధువులను బ్రాహ్మణులను సేవకులను విశేషమర్యాదల ధనదానములఁ బ్రీతిపూర్వకసంభాషణాదుల సత్కరించెను. వారెల్లఁ దమతమ వసతులకుం బోయిరి. శ్రీకృష్ణుఁడు మహాలక్ష్మియగు రుక్మిణింగూడి యభిమతసుఖంబు లనుభవించు చుండెను.

ఆర్యులారా! ఈ గాథయందలిరహస్యములు చర్చింపఁదగినవి యనేకములు గలవు. రాక్షసవివాహమునఁ బాణిగ్రహణము సాగెననియు నదియు ద్వారకయందేయనియు భాగవతాదులు చెప్పుచున్నవి. బ్రహ్మవైవర్తపురాణమున రుక్మి పరిభవానంతరము భీష్మకుఁ డరుదెంచి హరిని బ్రార్థించి తోడ్కొనిపోయి విధివిహితముగా వివాహము కుండిననగరమునందే సాగించి యల్లున కనేకయౌతకముల నొసంగిపంపెనని చెప్పఁబడినది. ఇది యయుక్తమని కొందఱందురు. అయుక్తముకాదని నాభావము. ఎట్లనఁగాఁ దొలుదొలుత భగవద్గుణములు భీష్మకుఁడు వినియుం

డెను. విశేషించి తత్కృత్యము లమానుషములనియు నెఱింగి యుండెను. అంతియకాక రుక్మిణికిఁ దగినవరుఁడు కృష్ణుఁడేయని యూహించి కన్యక నీయఁదలంచుకొనియెను. జ్యేష్ఠపుత్త్రుఁ డగు రుక్మి వలదన్న కారణమునఁ జేయునదిలేక శిశుపాలున కీయఁ బూనెను. ఆప్రయత్నము సాగెను. పెక్కుమంది చేరిరి. శిశుపాలునిపక్షమునఁ గలరాజులంద ఱరుదెంచిరి. తప్పక శిశుపాలునకే రుక్మిణినిత్తురని రేపేనివాహమని యెల్లవార లూహించిరి. అట్టి తఱి శ్రీకృష్ణుఁడు వచ్చెను. ఉమాదేవ్యాలయమున కరుగుట వారియాచారము. దానిం బాటింపను బార్వతిఁ బ్రార్థింపను రుక్మిణి దేవాలయమునకుఁ బాదచారిణియై పోయెను పూజించెను. ప్రార్థించెను. శ్రీహరిని భర్తనుగాఁ బడయుభాగ్యము నాకుం గల్గింపుమా యని వేఁడెను. మరల వచ్చుచుండెను. హరి త్రోవలో నామెను రథముపై నెక్కించుకొనియె. అరాతి సేన లడ్డగించిరి. కాని నిలుపఁజాలక పోయిరి. బలరామాదులు వారల నిలువరింప నుండిరి. శ్రీహరి పయనము సాగించెను. శిశుపాలాదులు మార్కొనిరి. జరాసంధాది రాజచూడామణులు వానికి సాయముగాఁ దలపడిరి. ఘోరాహవ మయ్యెను. కాని యందఱను బలదేవాదులు నిలువరించి సేనలను దన్నాయకులను దళాధిపతులను జించి చెండాడిరి. తుదకు శిశుపాలాదులు పాఱిపోయిరి. రుక్మి మహాకోపమున హరిని మార్కొని యవమానింపఁబడి రుక్మిణీసహాయమునఁ బ్రాణములఁ దక్కించుకొనియెను. నగరమును బ్రవేశింపఁజాలక క్రొత్తనగరమును నిర్మించుకొని యుం డుండెను. ఇదికదా భాగవతాదుల ననుసరించిన కథాసారము.

దీనిననుసరించి యాలోచింతము. కృష్ణుఁడు శిశుపాలాదుల నోడించుటయుఁ దనకొడుకును విరూపునిజేసి రుక్మిణి ప్రార్థనముపైఁ జంపక వదలుటయు భీష్ముఁ డెఱుంగక యుండఁజాలఁడు కదా. అవలకే శ్రీకృష్ణుఁడు నారాయణమూర్తియని యెఱింగియే యుండెను. ఇప్పు డావార్త ప్రత్యక్షప్రమాణమున స్థిరపడెను. జరాసంధాదులు శిశుపాలునిం గూడి ప్రాణములు డాఁపక పోరిపోరి యోడిరి. తుదకు శిశుపాలునకు వేదాంత ముపదేశించిరి. ఇట్టితఱి జగన్నాథుఁడు కృష్ణుఁడని యెఱింగిన భీష్మకుఁడు జామాతను బ్రార్థించి తెచ్చి వివాహాము చేసెననుట లోకాచారవిరుద్ధము కాదుకదా. ఈయాచారమును బ్రహ్మవైవర్తపురాణము పాటించెను. ఇది యుక్తియుక్తము కాదనరాదు. రాక్షసవివాహమును భాగవతాదులు చెప్పినవి. కావున మనము దేనిని దప్పనరాదు. ఒక్కొక్కనీతికై యొక్కొక్కపురాణము నడుముకట్టినది. కావున నందుఁ జెప్పఁబడిన కథను జదివి దత్సారమును గ్రహింపవలయును. ఒక్కకథనుండియే పెక్కునీతులు నేర్చుకొనవలసియుండును గావున నాకథనే పలుభంగుల ననువదింతురు. అంతియకాని మనకుఁ దెలిసినంతమాత్రము మహర్షులకుఁ దెలియక కాదు. ఇంతమాత్రమైన మనము పెద్దలయందు విశ్వాస మునుపవలసియుండును. పురాణముల నాక్షేపింపక భగవత్కథలు పెక్కురీతులఁ జెప్పినను బెక్కునీతు లందుండి తేలునని సంతసింపుఁడు. అదియె మనకుఁ దరణోపాయము.

రుక్మిణి పార్వతిని బూజించి ప్రార్థించెను గావునఁ బార్వతి యత్యుత్తమదేవతయే కదా యని కొందఱందురు.

అది నిగులం బొరపాటు. రుక్మిణి మహాలక్ష్మి. లక్ష్మీపార్వతులకు భేదము గానరాదు. పరస్పరము పూజించుచుందురు. ఏల యనఁగా లోకానుగ్రహార్థమే. శివకేశవులు పరస్పరనామ జపము చేయుచుందురు. విష్ణువు కైలాసయాత్ర చేసి శివుం బూజించెననుకథలును, శివుఁడు సదా హరినామస్మరణము చేయుచు హరిని బూజించుచు హరిమంత్రమును భక్తుల కుపదేశించుచుండు ననుకథలును గలవు. ఏభక్తు డేమార్గమున భగవంతు నుపాసించినను ఫలము సమానముగాని సారము. రుక్మిణి యంబిక నుపాసింపకున్నఁ గృష్ణుఁడు భర్త కాకపోవునుగాని రుక్మిణీదేవి కూడ దేవినుపాసించినదే మనము పాసింపకున్న వాంఛలు ఫలించునా యన్నబుద్ధి లోకులకుం గలుగునని చేయుటయే గాని వేఱుఫలము దానికిలేదు. రుక్మిణివంటిసాధ్వులకు మన కున్న భేదజ్ఞానము లేదు. సర్వదేవతాసమత్వము వారికిఁ గలదు. కావున లోకసంగ్రహార్థమే మహాలక్ష్మి యీయాచారమును బాటించెనని గ్రహించుటుచితము.

శ్లో. "నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి. ౨౨
యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. ౨౩
ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్,
సంకరస్య చ కర్తాస్యా ముపహన్యా మిమాః ప్రజాః.
సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
కుర్యాద్విద్వాంస్తథాసక్తశ్చికీర్షుర్లోకసంగ్రహమ్."

భగవద్గీత. 3 అధ్యాయము.

అను నీగీతావాక్యములు పైయర్థమును విస్పష్టము చేయుచు న్నవి. కావున నిట్టియాక్షేపణములఁ జేయకయుండుటయే తర ణోపాయము. భగవంతునిమహిమముల నెఱుంగుటకుఁ బ్రయ త్నింపవలయునే కాని తెలివితక్కువగా నాక్షేపించుట ధర్మము కాదు. రుక్మిణి మాపార్వతిని బూజించెఁ గదా. కాఁబట్టి మా పార్వతి యధికురాలని శైవులు శాక్తులు విఱ్ఱవీఁగరాదు. పార్వతి మహాలక్ష్మి నారాధించెనని పురాణములు చెప్పినపుడు మాలక్ష్మి యధికురాలని వైష్ణవులు విఱ్ఱవీఁగరాదు. ఈరెండు తత్త్వము లొక్కటియే యనుజ్ఞానము కలిగినంతవనుక వీరంద ఱకుఁ దరణోపాయము దొరకదని యెఱుంగవలయు.

మతిమంతులారా! ఇంతదనుక రుక్మిణీకల్యాణమను పరమపవిత్రకథను బఠించితిరి. పురాణములయందుఁ గలరీతిభేద ముల నెఱింగితిరి. రుక్మిణిమహిమమును దెలిసికొంటిరి, ఆమె యేరీతిగాఁ దనవాంఛను దీర్చుకొనియెనో తెలిసికొంటిరి. స్త్రీలకుఁ బతిభక్తియే ప్రధానమని దీనిసారమని తెలిసికొంటి రని నమ్మెదను. వేషములమార్పు ప్రధానముకాదనియు శీలము ప్రధానమనియు నదియే వనితలకుఁ దపస్సనియు నదికలిగి యున్నఁ ద్రిలోకముల నావనిత లాడింపఁగలరనియు నదిలేని నాఁడు దంష్ట్రావిహీనవ్యాళులవిధమున వనితలు వాసిచెడనుం దురనియు నెఱుంగవలసి యుండును. పతికన్న మేమేమి తక్కు వయనుభావము వనితల కలంకారము కాదనియు నెఱుంగవల యు. స్త్రీలను రక్షించుట యనఁగాఁ బురుషులచేతఁ గానిపని యనియు వారికి వాక్శుద్ధి గలిగియున్నఁగాని రక్షించుకొనఁ జాలరనియు నది కలుగవలయునన్నఁ బతిభక్తియే ప్రధానముగా

నుండవలయుననియుఁ దత్సారములు. ఏదేశమున స్త్రీలు విచ్చల విడిగఁ దిరుగుచుందురో యాదేశమున ధర్మము నిలువదని భావము. ఇట్టినీతు లీరుక్మిణీచరిత్రమునుండి నేర్చుకొనవలసి యుండును. కావున నిది పరమపవిత్రచరిత్రము. దీనిని భక్తి మెయిఁ బఠించిన నిహపరసుఖములు గలుగును. ఇంకఁ సత్రా తికథ నాలకింపుఁడు. ఇపుడు భగవంతుఁ డీయవతారమున గృహస్థాశ్రమమును స్వీకరించెను. కావున దీనివెంటఁ నవంశ విస్తృతి వ్రాయఁదగినది. తరువాత నెన్నియో యితిహాసము లగు కథలు గలవు. వానిని వ్రాయవలసి యుండును.

## ప్రద్యుమ్నకుమార చరిత్రము.

* ఆర్యులారా! ఈకథకించుక లోపలి కథాసారము వ్రాయక తప్పకున్నది. నాలుగుమాటలు వ్రాసెదను. శంకరుఁడు దక్షపుత్రికా మరణానంతరము ఘోరారణ్యమున నిరంతర తపమొనరించుచుండఁగా దేవతలు శివునితపోభంగ మొనరింపఁబూని యది సాధ్యము కాదనియు శంకరునకు వివాహేచ్ఛఁ బుట్టించినఁగాని యీతపస్సు మానఁడనియు నాలోచించిరి. అం దింద్రుఁ డల్పబుద్ధియై మన్మథుని రావించి యతని వివిధమార్గములఁ బొగడి బీరములు పలుకునట్లుచేసి దేవకార్యమును దీనిని సాధింపుమాయని తెల్పెను. అతఁ డంగీకరించి

---

* ఇది భాగవతము ౧౦ స్కం. ఏఁబదియైదవ యధ్యాయమునుండియుం, బ్రహ్మపురాణము ౨౧ అధ్యాయమునుండియుం, శ్రీకృష్ణజన్మఖండము ౧౧౨ అధ్యాయమునుండియుం గ్రహింపఁబడినది. తక్కిన పురాణములయం దీచరిత్రము యొద్ధప్రారంభమునుండి కలదు. కాన వాని సుచిత్రరీతిం గలుపుకొనుచు వ్రాసెదను.

శంకరుని మనస్స్వరమెఱుంగక రతీదేవిం గూడిపోయి యా మహాదేవుని కెదురనున్న మాలతీగుల్మమున దాఁగి విరిశర ములఁ బ్రయోగించెను. శంకరుని మనస్సు చలించెను. భగవం తుఁడిద్దానికిం గారణమేమని యాలోచించి నాలుగుదిక్కులం దనదృష్టిని వ్యాపింపఁజేసెను. పొదరింటనుండి విరిశరముల నతి వేగముగాఁ బ్రయోగించుచుఁ దన్నలయింపఁ జూచు మన్మ థునింగాంచి యాగ్రహించి తృతీయ నేత్రాగ్నిచే నాక్షణంబ వానిని నీఱుగాఁజేసెను. క్షణమాత్రమున వాఁడు భస్మమై కూలెను. తత్పత్ని రతీదేవి శోకాతిరేకమునఁ బలవించుచుఁ దాను సహగమనవ్రతమూనఁ దలంప నశరీరవాక్కొక్కటి వీ తెంచెను. నీకు వైధవ్యములేదు. నీపతి నీమది గోచరించుచుం డును. కాలాంతరమున నీవాతనిం బడయంగలవు. అని ఆపలు కులు వినఁబడఁగా నామె సహగమనము చేయుటమాని నియ తయైయుండెను. ఇది పూర్వవృత్తాంతసారము. దీని తర్వాతికథ యిందు వ్రాయఁబడును. దీనిం గలిపికొనుచుఁ బఠింపుఁడు. చక్కఁగాఁ దెలియఁగలదు.

శ్రీకృష్ణుఁడు ద్వారకానగరమున రుక్మిణీదేవింగూడి సుఖంబుండెను. కొలఁదిదినములు గడచెను. వసుదేవాదులు హర్షాంబుధి నోలలాడుచుండిరి. ఆతరుణమున నాలోకజనని యంతర్వత్ని యయ్యెను. దౌహృదలక్షణములు తోఁచెను. క్రమక్రమముగా గర్భభారమధికమయ్యెను. నెలలు నిండెను. వాసుదేవాంశమునఁ బుత్త్రుఁడుదయించెను. అతఁడే మన్మ థుఁడు. పూర్వము మన్మథుఁడు విష్ణుపుత్త్రుఁడే. ఇపుడును రుక్మి ణికిం బుత్త్రుఁడే యయ్యెను. అతఁడు రూపచిహ్నాదులచేఁ

చంద్రికిఁ దీసిపోవువాఁడు కాఁడు. రెండవ వాసుదేవుఁడే యన్నట్లుండెను. రుక్మిణియుఁ బరమానందభరిత యయ్యెను. శ్రీహరియు నానందమును బ్రకటించెను. ఎల్లరు సంతోషించిరి. నగరమున మహోత్సవములు సాగెను. ప్రద్యుమ్నుఁడని జన్మించినపుడే నామకరణము సమాప్యముగాఁ జేయఁబడియెను. ఇట్లు దినములు గడచెను.

శంబరుఁడను రాక్షసుఁడొకఁడు గలఁడు. వాఁడు కామరూపుఁడు. సకల మాయావిశారదుఁడు. కాలశంబరుఁడనియు వానినందఱుఁ బిలుతురు. అతఁడనేకమాయలఁ గల్పించెను కావుననే శాంబరి యనఁగా మాయయని యర్థము గల్గెను. వాని కంతపూర్వమే కృష్ణపుత్త్రుఁడు నీకు మారకుఁడని చెప్పియుండిరి. వాఁడు నాఁటంగోలెఁ గృష్ణపుత్త్రుఁ డెపుడు పుట్టునా యెపుడు చంపుదునా యని యుండెను. రేయింబవళ్లు కనిపెట్టియే యుండును. శ్రీకృష్ణుఁ డీవిషయము నెఱింగియు నెఱుంగనట్టు లుండెను. వీనికంతకుఁడు పుట్టఁగలఁడు. కాన వీనిని నేనేల చంపవలయునని యాలోచించు చుండెను. ఆ శంబరాసురునకు మాయావతి యనుభార్య కలదు. ఆమె వేషాంతరమునయున్న రతీదేవి. మహాపతివ్రత. శంబరునియింటఁ జేరును మన్మథుఁడని, వానింగూడఁగలవని మహాత్ము లామెకుఁ దెలిపియుండిరి. ఆమెయు నామాటలను విశ్వసించి వేషాంతర మూని మాయావతి యనుపేర శంబరునకుఁ బత్నియయ్యెను. కాని యాసాధ్వి తనతపోబలమున నొకవనితను దనఛాయను బోలినదానిం గల్పించెను. తా నదృశ్యరాలై యుండెను. వాఁడా ఛాయయే మాయావతీదేవి యనుకొని భార్యగా భావించుచు

సంసారయాత్ర సాగించుచుండెను. మాయావతి పుత్రవిహీనయై తన యపుత్రత్వమునకు వగచుచున్నట్లు నటించుచుండెను.

కొంతకాల మిట్లుసాగఁగా శంబరుఁడు కృష్ణునకు సంతానము గలుగు టెఱింగి మాయాబలంబున వచ్చి * రుక్మిణీ సూతికాగృహమునుండి యేడవనాఁ డాశిశువు నెత్తుకొని శత్రువుగావున వాని వధింపఁదలంచి వడివడిం బాఱి సకల యాదోజంతుబహుళంబుగా నెఱింగి సాగరమున వానిం బాఱవైచి తానింటికిం బోయి సుఖంబుండెను. నడురేయిఁ దటాలునఁ బడిన బాలకు నొకమత్స్యము గుటుక్కున మ్రింగెను. అదియు నిదురించెను. శంబరుఁ డాశిశువు నేజంతువో తినియుండునని తలంచెను. విగతజ్వరుఁ డయ్యెను. ఇంకఁ దనకుఁ జావు లేదని నిశ్చయించుకొనియెను. మత్స్యజఠరానల మాబాలునకుఁ దేజస్సొసంగెను. భగవదనుగ్రహమున్నపు డేచోటనున్నను గష్టములు రావనుట కిదియొక యుదాహరణము కదా. ఆచేఁపకడుపుననున్న బాలున కించుకంతయు బాధ కలుగకుండెను. క్రమక్రమముగాఁ బెరుఁగుచుండెను.

కొలఁదిదినములకు జాలరులు మత్స్యవధబంధములం గొని సాగరమున వేఁటాడం బోయిరి. పెక్కుమత్స్యములం బట్టుకొనిరి. వానినడుమ నీచేఁపయు బంధములకుం జిక్కెను. వానిం గొనిపోయి తమప్రభువగు శంబరాసురేంద్రునకుఁ

* శంబరుఁడు బాలకుం గొనిపోయి పుత్రహీన యగుభార్య కొసంగెననియు నామె పెంచెననియు శ్రీకృష్ణజన్మఖండమున నున్నది.

గానికగా నిచ్చిరి. వానియందపమున కానందించి సూపకారులం బిలిచి వండి తెండని యాజ్ఞాపించెను. వారు వానిని ఛేదించిరి. అం దీమత్స్యమును గోయునపు డద్భుతాకారముగల యీ కుమారుఁడు వారికంటఁ బడియెను. వా రచ్చెరువంది మాయావతికిం జూపిరి. ఆమెయు నచ్చెరువంది భర్తకుం దెలిపి తదనుమతినొంది వానిం బెంచుచుండెను. నారదముని యొకానొకప్పు డామాయావతిం జూడఁబోయి యామెతో నమ్మా! వీఁడు నీకుఁ బుత్రుఁడు కాఁడు. వీఁడు మన్మథుఁడు. నీవు రతీదేవివి. బ్రహ్మనియోగమున నిట్లున్నదానవు. భర్తగా భావింపుమని కలరూపు తెలిపి చనియెను. మాయావతియు నాతని యద్భుతాకారమునకు నచ్చెరువంది పూర్వస్మృతి యించుక దైవబలమునఁ గలుగఁగా బాల్యప్రాయము హృదయగోచరము కాఁగా నతిశయప్రేమమునఁ గౌఁగిటఁ జేర్పనెంచెను. బాలకుఁ డంతకుముందు మాయావతి తనపైఁ జూపుచున్న ప్రీతికి నాఁటి ప్రీతికి ఖేదము లదని యెఱింగి దీనికిం గారణమేమని యూహించి కొలఁదిదినములు పరీక్షించుచుండెను. కారణాంతరమున బాలుఁడే కాని నిర్భరవయఃపరిపూర్ణుఁడే. కావున నాపెకామమును బరీక్షింపఁజాలెను. ప్రతిదినము మాయావతిప్రీతి సుతప్రీతికి విరుద్ధమై పతిప్రీతిగా మారెను. పట్టరానితమకమునఁ గౌఁగిటఁ జేర్పనెంచెను. ఆ తొందరపాటుం గాంచి యతఁడు సాధ్వీ! ఇదేటివింత? మాతృభావము వదలిన ట్లగపడియెడిని. ఇది తగవగునే? ధర్మదేవత యంగీకరించునా అది యంగీకరింపకున్న సాధువులు కోపమూనరా? వారాగ్రహించినఁ బాపము గలుగుటయే గాక వంశమంతరింపదా? ఏల యిట్లు

వలవనిపనికిం బూనితివి? అనుటయు నా మాయావతి సుస్మితముతోడ నిట్లు పలికెను. * బాలకా! వినుము. ఇది దేవరహస్యము. చక్కఁగా మది నిల్పఁదగినది. నీవు నాకొమరుఁడవు కావు. రుక్మిణీపుత్త్రుఁడవు. తొలిజన్మమున నీవు మన్మథుఁడు. శివకోపానలమున దహింపఁబడితివి. నేను సహగమనవిధి నసువులువదలఁ బ్రయత్నింప నాకాశవాణి వలదనియె. ఆకారణమున నేను బ్రదికియున్నదానను. శంబరాసురుఁడు నిన్నుఁ గొనివచ్చునన్నకతన నేనీ మాయారూపమున నిందున్నదానను. శంబరుఁడు నాఛాయను భార్య యనుకొనుచుండు. అది నాకల్పిత మాయారూపము. నేఁ బ్రచ్ఛన్నరూపమున నున్నదాన. నీవు నాప్రాణేశ్వరుఁడవు. మన దాంపత్యమీనాఁటిది కాదు. శంకనొందకుము. నీవు రుక్మిణిగర్భమున జన్మించితివి. ఏడవదినము నిన్ను శంబరుఁడు కొనివచ్చి సంద్రమునఁ బాఱవైచెను. మీనము నిన్ను మ్రింగెను. జాలరులు దానిం దెచ్చి శంబరునకుఁ గానికపెట్టిరి. అతఁడు వండి తెండనియె. సూపకారులు ఛేదించిరి. అందు నీవుంటివి. పుత్త్రుఁడు కాఁగలఁడని పెంచఁబూనితి. నారదముని నీవృత్తాంతమును దెల్పెను. జరగినవృత్తాంత మిది. అనుమానింపకుము. ఇది సత్యము. బుద్ధిని దలంపుము. పతివ్రతననిపించుకొని యింతటియకార్యమునకుం బూనుదునా? నీవును బాలుఁడవు కావున సత్య

---

* శ్రీకృష్ణజన్మఖండమునం దీవిషయము శారదాదేవి ప్రద్యుమ్ననకే తెల్పినట్లు కలదు. బ్రహ్మవిష్ణుభాగవతాదులయందు నారదముని మాయావతికిఁ దెలుప నామె వాని మోహింప నతఁడెఱింగి యిదియేమని ప్రశ్నింప నామెయే యతనికిం దెలిపిన ట్లున్నది. ఇదియే వీనికిం గలభేదమని యెఱుంగునది.

వార్తం దెల్పితినని తెల్పెను. * మాయావతి యిట్లు తెల్పఁ
గానే ప్రద్యుమ్నుఁ డామెను జక్కఁగాఁ జూచెను. వారి
దృష్టులు రెండును గలిసికొనియె. ఆక్షణముననే మనస్సులు
రెండు నైక్యము నొందెను. సుముహూర్తముననే మేనులు
రెండొక్కటిగా నుండెను.

కొలఁదికాల మీరీతి సాగెను. ఒక్కనాఁ డా దంపతు
లేకమ్మై తమదాంపత్యసుఖమును ఫలవంతముగఁ జేయుచుండిరి.
శంబరుఁడు మదిసంశయించు నవకాశమును లేకుండఁజేసి యూరకుం
డెను. పత్నీపుత్త్రు లొకచోటనుండ ననుమానించునంత తెలి
చుగ నుండరుకదా! ఆదినముననే మాయావతి దైవప్రేరణమున
భర్తను మాయాప్రపంచము నుపదేశించెను. ఆమాయలలోఁ
గొన్నింటిని శంబరుఁ డెఱుంగును. అన్నియు వాఁ డెఱుంగఁడు.
నీచేత వాఁడుచచ్చునని చెప్పెను. భర్తను భార్య యుపదేశించె
ననఁగాఁ బూర్వజన్మమున నతఁ డెఱింగి భార్యకుం దెల్పినవాని
నే స్మృతికిం దెచ్చెనని యిట్లగ్రహించుట బుద్ధిమంతుల లక్షణము
కదా. దాన నతఁడు శంబరుఁ బోరిపుత్త్రుఁడని విశ్వసించి
యుండెను. ఇట్లు మఱికొన్ని దినములు గడచెను. శంబరుఁ
డొకనాఁ డేలాగో గృహాభ్యంతరమునకుఁ బోయి యందు
పతిని సుతునిగానక నిష్కుటము (గృహమునకు నలుప్రక్కల
నున్న యుద్యానము) నకుఁ జని యందు సమసాయకనిశాతవిశి
ఖపరంపరలకు లోనై యడఁగి పెనఁగుచున్న భార్యాపుత్త్రులం

* ఆమాటలు విని ప్రద్యుమ్నుఁడే శంబరాసురుని యుద్ధమునకుఁ బిలి
చెనని భాగవతాదులయందుఁ గలదు. పైని వ్రాసినది కృష్ణజన్మఖండము ననుస
రించి వ్రాయఁబడినదని యెఱుంగునది.

గాంచి యాగ్రహంబు ధరింపఁజాలక తటాలున ఖడ్గముంగొని వారింగాంచి పండ్లు పటపటలాడించుచు నిట్లదలించెను. మహాకాముకుఁడవు. మూర్ఖుఁడవు.పండితమానివి. కావున నీచుఁడా! నిన్ను నేమందును? ఛీ. అవతలఁ బొమ్ము. పాపాత్ములలో నుత్తముఁడవు. మాతృగమనము చేసితివి. నీవు నశింతువుగాక. మాయావతీ! ఛీ ఛీ నీవు పుంశ్చలివి. మత్తురాలవు. కాముకివి. హతచేతనవు. కొడుకుతో నేకాంతమున విహరించుచున్న దానవు. అని పలికి ఖడ్గమున భార్యనే చంపఁబూనెను.

మాయాదేవిని జంపనుంకించు శంబరాసురు నదల్చి యిటురమ్మని ప్రద్యుమ్నుఁడు పిలిచెను. ఏమికారణమో తెలియఁబడదు గాని వాఁడు దూరముగాఁబడి మూర్ఛిల్లెను. కొలఁదినిమేషములకు స్మృతి గాఁగా నాగ్రహము రూపముఁ గైకొన్నచందంబున శివదత్తమగు శూలమునుగైకొని విక్రమించెను. ఆశూలము ప్రాణాంతమును గల్గించునది. అప్రతిహతము. దానిం బట్టుకొనఁగా బ్రహ్మాదు లనుమానించిరి. అంతలో బ్రహ్మప్రేరితుఁడై వాయుదేవుఁడు ప్రద్యుమ్నునిచెవిలోఁ బ్రద్యుమ్నకుమారకా! భక్తిమెయి మహామాయను దుర్గాదేవిని స్మరింపుము స్మరింపుమని చెప్పెను. పవనునివాక్కు నాలించి దుర్గాదేవిని స్మరించెను. శంబరుఁడు ప్రయోగించినశూల మాదేవ్యనుగ్రహమునఁ బ్రద్యుమ్నకంఠమునఁ బూలహారమై పడియెను. ఇంక వీని నుండనీయరాదని ప్రద్యుమ్నుఁడు బ్రహ్మాస్త్రము ను బ్రయోగించి వానినొంచెను. వాఁడు ననేకమాయలఁ గల్పించి యవి ప్రతిహతములుకాఁగా దుదకుఁబ్రద్యుమ్ననిచేఁ

జంపఁబడియెను. * ఇట్లు శంబరాసురుఁడు చావఁగా మాయావతీదేవి రతీదేవిగా మాఱెను. అంతఁ బ్రద్యుమ్నుఁడు భార్యం గూడి శంబరనగరమును వదలి యాకాశమార్గమున ద్వారకానగరముం జేరి రుక్మిణ్యంతఃపురమున మేఘమునుండి మెఱుపుఁదీఁగె వలె నంబరమునుండి దిగిరి. ఆటాలున నంతఃపురమున వ్రాలిన యాదంపతులం గాంచి రుక్మిణి యాశ్చర్యమందెను. మేఘశ్యాములుఁడై పీతకౌశేయాంబరమును దాల్చి యాజానుబాహువు లలరారఁ, దామ్రాక్షములు రంజిల్ల, సుస్మితాననవదనము చెలువార, నీలవక్రాలకముల ముఖాంభోజము మెఱుగుపఱుపఁగాఁ,

* భాగవతమున నీయుద్ధము పెంచి వ్రాయఁబడినది. అనేకాస్త్రములతోఁ బోరాడినట్లును, గదాయుద్ధము చేసినట్లును, సకలాస్త్రములతో వాఁడు చావక మాయాయుద్ధము చేయుచుండఁగాఁ బ్రద్యుమ్నుఁడు మాయావతి తెల్పిన మాయపరంపరల వానిం దొలఁగించి పదంపడి వానికి తెలియంగని మాయలఁ గల్పించి వానిని వధించెనని చెప్పఁబడినది. బ్రహ్మవిష్ణుపురాణములం దించుకగాఁ జెప్పఁబడినది. అంతియకాక విషయభేదము విశేషించి లేదు. శంబరశిరస్సును ఖడ్గముచే ఛేదించెననియు వైష్ణవపురాణమున నస్త్రముచే ఛేదించెననియుఁ జెప్పఁబడుట విశేషభేదము కాదనియు నూహింపవచ్చును. ఈవిషయమే హరివంశమున విష్ణుపర్వోత్తరార్థమున ౧౧౪, ౧౦౫, ౧౦౬, ౧౦౭ అధ్యాయములయందు విశేషించి కలదు. దానిసార మీభాగవతగ్రంథమం దిమిడియున్నయది. కాని ప్రద్యుమ్నచరిత్రము ముందు వ్రాయఁదగియున్నది. అపుడు వజ్రనాభవధవిషయమున వ్రాసెదను. ఇపుడు ప్రద్యుమ్నోత్పత్తి శంబరాసురుని సంహరించుట. ద్వారకానగరముఁ బ్రవేశించుట. యను నీకథలే యిందు వ్రాయఁబడినది. దీనిచే రుక్మిణీకల్యాణము సంగ్రహముగఁ దెలిపినట్లైనదని యెఱుంగవలయును.

గృష్ణునిగాఁ దలంచి యందున్న మందయానలు విభ్రాంతులైరి. సిగ్గుపడి లేచిరి. కొందఱిని మేషములకుఁ గృష్ణునికంటె విలక్షణము లగుగుణతులలం గాంచి యించుక యాశ్చర్యంబొందిరి. కూడనున్న స్త్రీరత్నముం దిలకించి హర్షించిరి.

అంతట రుక్మిణీపురంధ్రీమణి నవయౌవనమున విలసిల్లు నాతనిం గాంచి మృతుఁడగుతనపుత్త్రుని స్మరించెను. పోలిక లొక్కరీతిగా నుండెను. * కావునఁ బాలిండ్లు చేఁపెను. పుత్త్రస్నేహ మట్టిదియే కదా. ఎవరీ పురుషరత్నము? ఈకనులే త్రుఁడౌ దేవ్వనికుమారుఁడు? వీనిని గడుపునధరించిన మోసిన యాభాగ్యవతి యెవ్వతుక? ఎవనిని తండ్రీ యని పిలుచునో? నాకుమారుఁడు నిట్టివాఁడే సూతికాగృహమునుండి కొనిపోఁబడి నష్టమయ్యెను. వీరిద్దఱికి వయస్సు సమానము. ఎందేని నాకొడుకు జీవించియుండునా? లేకున్న శ్రీకృష్ణసమానరూపము లభించు టెట్లు? రూపము, నవయవములు, గతి, కంఠస్వరము, హాసావలోకనములు, శ్రీకృష్ణుని బోలియున్నవి. నేను నవమాసములు మోసి కన్నవాఁడే వీఁడు. ఇది సత్యమనియే నాయంతఃకరణము తెల్పుచున్నది. వీనిం జూడఁగనే బుద్ధి స్నేహాయుక్త మయ్యెను. నావామభుజ మదరుచున్నది. ప్రీతి యంతకంత కధికమగుచున్నది. అని యిట్లు మీమాంస చేయుచుండునంత దేవకీతనయుఁడు దేవకీవసుదేవులం గూడి యచ్చటికేతెంచెను. వారింగూడి నారదముని యరుదెంచెను.

భగవంతుఁ డంత వృత్తాంతమెఱింగియు నూరకుండెను. నారదముని రుక్మిణీదేవిం గాంచి శంబరాసురుఁడు శిశువును

* స్నేహస్నుతపయోధరా = అని మూలము. భాగవతము.

గొనిపోయినదిమొదలంతదనుక జరగినవార్తలనెల్ల సంతయు వదలక చెప్పెను. ఆవార్త వినఁగానే యందున్నకాంతలందఱు విచిత్రరీతి నాలోచించిరి. నిశ్చేష్టులయిరి. ఇట్టి యాశ్చర్యవార్త యీవఱకు వింటిమా యని యొకరితోనొకరు చెప్పుకొనిరి. చిరకాలముక్రింద నష్టమైన పదార్థముభంగిఁ బెక్కువత్సరములకుఁ బూర్వము నష్టతం గాంచినకొడుకు మరల వచ్చినందున దేవకీవసుదేవులు కృష్ణరాములు రుక్మిణీప్రభృతులు పరమానందము నొందిరి. మాయావతీప్రద్యుమ్నులు వారలకెల్ల నమస్కరించిరి. రుక్మిణీదేవియు వారినాశీర్వదించి కొడుకు నాలింగనము చేసికొని కరము హర్షించిరి. చిరకాలముక్రిందఁ జనిపోయినను కొన్న ప్రద్యుమ్నుఁడు మరలబ్రదుకుట, తెటూలున భార్యంగూడి వచ్చుటవిని ద్వారకానగరవాసు లాశ్చర్యంపడిరి. చచ్చిన బాలుఁడు మరల బ్రదికెను. ఆహా! యింతకంటె నదృష్టము కలదా? లోకమున నిట్టియదృష్టవంతులు కలరా యని యనుకొనుచుంటిమి. ఇపుడు రుక్మిణీకృష్ణులు కలరని తెలిసెను. అని పలుభంగులఁ జెప్పుకొనుచు సంతోషించుచుండిరి. ఈఘట్టమున మహాకవిపోతనగారి స్వకపోలకల్పిత పద్యమొండు మిగుల హృద్యంబుగ నున్నది. కాన వ్రాసెదను.

శా. అన్నా నాచనుఁబాపి నిన్ను దనుజుం డంభోనిధిన్ వైచెనే
యెన్నే వర్షములయ్యెఁ బాసి సుత నీవేరీతి జీవించి యే
సన్నాహంబున శత్రు గెల్చితివొ యాశ్చర్యంబు సంధిల్లెడిన్
నిన్నుం గాంచితి నింతకాలమునకున్ నే ధన్యతం జెందితిన్.

కదంపతులం జూచి యంద ఱిట్టిదాంపత్యమే తగినదనిరి. ఊ

మన్మథునిం గాంచి యంతఃపురమునఁ గలవారలే స్నేహయుక్తలైరన నీఁక నన్యకాంతలమాట చెప్పనేఁటికి ?

మహామతులారా! ఈవిచిత్రకథనుండి యనేకవిషయములు తెలిసికొనఁ దగియున్నవి. ఏడవదినమున శిశువును శంబరాసురుఁడు కొనిపోయి సముద్రమున వైచుటయనునది విచిత్రము గాదు. శత్రుశేష మునుపరాదన్నమాటను రాక్షసుఁడు పాటించెను. కాని చావునుగోరి సాగరమునఁ బాఱవైచెను. జలజంతువులు ఘోరాకారము గలవిగనుండుననియు నీనిసువు నేదిమ్రింగినను నశించుననియు వాఁ డూహించెను. వాఁ డనుకొన్నయట్లే యొకచేఁప మ్రింగెను. ఇదియు నబ్బురపాటును గల్గించునది కాదు. కాని యాచేఁపగర్భమునఁ గల యగ్ని యతనిం గాపాడెననుటయే యొకచిత్రము. మనుష్యశిశువు మత్స్యోదరమునఁబడి జీర్ణింపక వృద్ధినొందుట కడుం గడు విచిత్రము. ఇది సాధ్యమాయనియుఁ గొంద అనుమానింప వచ్చును. కాని సృష్టిచమత్కృతి దురూహము. భగవచ్ఛక్తి యమేయము. ఎట్టిమార్పుల నొందించునో యెవ్వరు నెఱుంగఁ జాలరు. భగవదిచ్ఛకే కార్య మడ్డుపడఁజాలదు. ఒక్కగవ్వలోఁబడిన వర్షబిందువులు మౌక్తికములగు. అవి నవరత్నములలోఁ బరిగణింపఁ బడునవియే. ఒక్కకాలమునఁ గురిసిన వర్షబిందువులే యట్లుగా మార్పునొందును ? దీని కేమి సమాధానము? తుదకు భగవదిచ్ఛ యనవలయునుగదా. అట్లు మార్పునొందుట స్వభావ మనవచ్చుననుకొందము. అన్నిగవ్వలలోఁ బడినబిందువు లట్లు మార్పునొందవు గాన నది స్వభావ మనుట సగసము కాదు. సాలగ్రామములను జలజంతువులయం

గమున నొకభాగమున స్వర్ణముండును. దానికేమికారణమన్న మిన్నువంకఁ జూడవలసినదే కాని కారణమును గల్పింపఁజాలము. కల్పించినను అది సర్వత్ర సంభవముగా సుసంగతముగా నుండదు. కావున భగవచ్ఛక్తియే యనవలయుఁ గాని యితర కారణములు చాలవు. అగ్నిని భక్షించుపక్షులు గలవు. దానికది ప్రియతమాహారము. ఏల? భగవంతునికే తెలియును గాని మనమూహింపఁ జాలము. ఒక్కచిన్నజంతువు నాసికారంధ్రములనుండి యగ్నిజ్వాలలు వెలువడుచుండును! ఏమిటి! అన్న మిన్నుఁజూడవలసినదే కాని కారణము నిర్వచనము చేయలేము. ఒక్కజంతువు నాభియందుఁ గస్తూరియుండును. విచిత్రము కాదా. ఇట్టివెన్నియో యుదాహరణములు చెప్పవచ్చును. కాని వీనికిం గారణములు కల్పించి పరిహసింపఁబడుటకంటె నోరుకదల్పక యూరకుండుటయే మర్యాద. నోటికివచ్చినట్లు ప్రేలరాదు. ఏమానవునకేని భగవదిచ్ఛను దెలిసికొనుట శక్యము కానిపని. ఘూమనొకటము నదిలోఁబడఁగా నొకచోఁ గూడుచున్నవారందఱు మృతినొందఁగా వారినడుముఁ జిక్కి నీటిలోనున్నవృద్ధాంగన బ్రదుకుట చూచియున్నారము. భగవదిచ్ఛ యనక వేఱు కారణములను గల్పింపఁజాలను. గల్పించినను నవి వికల్పములగుంగాని సంకల్పములు గావు. కావున జననకాలమున జీర్ణింపక యేడుదినములబాలుఁ డెట్లు బ్రదికెననుట మిగులఁ బొరపాటు. శీతకాలమున నందు నాచ్ఛాదనరహిత స్థలమున నహరహము వానజల్లులు పడుచుండు కాలమునఁ గ్రిందఁబరుండినస్త్రీ ప్రసవించి యాబాలుఁడు నిరోగియై యుండఁగాఁ జూడఁగల్గును. ఇవన్నియు బాలుని యకాలమరణహే

తువులు కావా. ఎట్లు తప్పినవి ? భగవంతుఁడే రక్షకుఁ డనవల యుఁగాని వైద్యులు రక్షింపఁజాలరు. ద్రవ్యమును భక్షింతురు. భగవంతుఁడు ప్రాణముల రక్షించును. ఇట్టిఘట్టములందు దైవ శక్తికిఁ బ్రాముఖ్య మంగీకరించి నోరుకదల్పకుంట మర్యా దయే గాని వేళాకోళపద్ధతి యుచితము కాదు. కావున మనుష్య ప్రయత్నమున సాధ్యముగానివి లేవనియు, మనయూహలకు సరిపడని వసంగతములనియుఁ దలంపక దైవగతి బలవత్తమమై నదని తలంచుచు మనయూహ లావిషయమున నాలోచింపఁ జాలవని యూరకుండుట యత్యుత్తమము.

రతీదేవి మాయాశక్తిచే నొకస్త్రీని గల్పించి శంబరునకు భార్యగానునిచి తనపాతివ్రత్యమును గాపాడుకొనఁ జాలెన నియు వాఁ డామెనే భార్యగా ననగా మాయావతియే యను కొని సంసారయాత్ర సాగించుచుండెననియుఁ గలకథాభాగ మసంగతముగా నుండలేదా యనువారు కలరు. వారికిగా నాలుగుమాటలు వ్రాసెదను. పూర్వము యోగాభ్యాసము చేయువారు పెక్కండ్రుండిరని పురాణములనుండి స్పష్టమ గును. యోగశక్తినుండియే పరకాయప్రవేశాదులు, అణిమా ద్యష్టవిధసిద్ధులు గలుగును. దివ్యదృష్టి వారి కలవడుట యొక గొప్ప కాదు. ఈకాలమందును దివ్యదృష్టి మాకుఁగలదని చెప్పు కొనువారుకలరని మనమే యెఱుంగుదుము. అణిమాదిసిద్ధులు మీకుఁ గలవాయన్న నవి మాకు వలదందురు. బూటకపుయో గులమాట లిట్లే యుండును. ప్రత్యక్షముగాఁ గనఁబడుచుండగన వానిని దాంబికములనుమాటచే గప్పిపుచ్చి యప్రత్యక్షమగు దివ్యదృష్టి మాకుఁగలదనియు దాని నుపయోగింపమనియుఁ

బలుకుదురు. కారణ మేమనఁగా దివ్యదృష్టి నుపయోగింతుమన్నచో నేమి దర్శనములు చూపునని పరిశీలింతును. అపుడు గుట్టు బయటఁబడును. కావున నది యుపయోగింపరా దందురు. యోగసిద్ధులలో ఖేచరణ మొకసిద్ధి. అది లేనినాఁడు యోగుల మనుకొనుటేల ! [illegible] బ్రయాణమునకు యోగసహాయము లేనప్పుడు యోగసిద్ధికలదనుట సిగ్గు కాదా! పూర్వకాలమున నట్లుగాక యోగము స్వానుభవముగా నుండెను. తత్సహాయమునఁ జేయు కార్యములు మన కసంగతములుగాఁ దోఁచినను బెక్కులు గలవు. వానిసాయము స్త్రీలకు విశేషించి యుండెను. కాబట్టి కాముకజనమధ్యమునఁ గాంతామణులు మర్యాదను గాపాడుకొనఁ గల్గిరి. అందును రతీదేవి విశేషయోగముల నభ్యసించి సకలసిద్ధులం బడసినది కానఁ దన ప్రతికృతిగా శంబరాసురగేహమునకుం దోఁచులాగున నొకవ్యక్తిని గల్పించి దానిం గాంచి వాఁడు తృప్తి నొందఁ జేసెననుట సులభమార్గమే కాని దుర్లభమార్గము కాదు. సర్వశక్తులను గల్గించు యోగవిద్య లుపన్యాసవేదికలపై దొరలాడుచు దిక్కుమాలియున్నవి. ఇదియే యిప్పటి భరతవర్షదౌర్భాగ్యము. యోగశాస్త్రము పఠనమాత్రమునఁ గాక యభ్యాసమునకు వచ్చినచో మనదేశ మదృష్టము కలదగును. ఆకాలము సంభవించినపు డిట్టిస్వల్పవిషయముల నసంగతములని యాక్షేపించువా రుండరని నా విశ్వాసము. దంపతులు వియన్మార్గమున ద్వారకానగరమునకుఁ జేరఁగల్గిరి యనుటకు సమాధాన మీపైఁ జెప్పఁబడినదే యని గ్రహింపవలయు. ఇంక నీ విషయమును వదలెదను.

## రుక్మిణీసంతానము.

* ప్రద్యుమ్నకుమారుని యనంతరము రుక్మిణీదేవి, చారుదేష్ణ, సుదేష్ణ, చారుదేహ, సుషేణ, చారుగుప్త, భద్రచారు, చారువింద, సుచారు, చారు నామకులఁ గొడుకులను, చారుమతి యనుపుత్రికను గనియెను. అవలఁ బ్రద్యుమ్నకుమారుఁడు మరల రాగాఁ దొలికొడుకుం గొడలిం గాంచి పరమానంద మొందుచుండెను. కొలఁది కాల మిట్లు భగవంతుఁడు సాంసారికకృత్యములతోఁ గాలముఁ గడపుచున్నట్లు నటించుచునుండెను. వసుదేవాదులు కొడుకుం గోడలు మనుమలు సంతోషాంబుధి మునుఁగుచుండ వారు నానందించుచుండిరి కొంత కాలము సాగఁగా భగవంతుఁడు తనమదిలో నిట్టులాలోచింపఁ జొచ్చెను. ఈలోకమున నీయవతారముతో నుండఁదగిన కాలము విశేషించి లేదు. చేయఁదగినకార్యములు పెక్కులున్నవి. నన్నుఁ బ్రేమించి యవతరించినకాంతలు పెక్కుమంది గలరు. వారు గోలోకమున నాకు భార్యలుగ నున్నవారలే. వారిని గారణము కల్పించి వివాహ మాడవలయును. ప్రాణాధిక యగురాధాదేవి యిన్నిరూపములఁ దాల్చి తన శ్రీదేవీత్వమును మూలప్రకృతి తనువెలయించుచున్నది. ఆమె శాపవశమున దూరమం దున్నది. ఆమెరూపమే యిన్నివిధములుగా నాకగపడుచున్నది. వీరినందఱఁ బెండ్లియాడినట్లు నటింపక తప్పదు. వీరికి నాకొడుకులుగా జన్మింపఁదగినప్రాణులు పెక్కుమంది వేచియున్నవారు. ఇంక గొప్పసంసారము చేయఁబూనవలయు.

---

* ఈభాగము బ్రహ్మపురాణము ౯౨ అధ్యాయమునుండి వ్రాయఁబడినది.

చేయఁదగినకార్యములు చేయుచుండినఁ గాని భూభారము తొలఁగు ప్రయత్నము సాగదు. అని చింతించుచుండెను. ఇంతలో సత్రాజిత్తు స్యమంతకమణిని సుకుమారికను భగవంతున కొసంగెను. ఈకథ తెలిసికొనఁదగినది. ఆలకింపుఁడు.

## స్యమంతకోపాఖ్యానము.

* మహాశయులారా! ఈయుపాఖ్యానము తెలిసినఁ గాని సత్యభామాపరిణయము తెలిసికొన నవకాశ ముండదు. ఈకథయం దత్యద్భుతవిషయములు గలవు. దానినెఱుంగుట సమంజసము. కావున నవధరింపుఁడు శుకమహర్షి జనమేజయునింగాంచి రాజా! యీకథ నవధరింపుము. సత్రాజిత్తను రాజు సూర్యనారాయణభక్తుఁడై యుండెను. ఆతనియందు భాస్కరుఁ డత్యంతముదితుఁడై యుండెను. అందుచేత సత్రాజిత్తున కేకష్టములు కలుగకయుండఁ గాపాడుచుండెను. ఇట్లుండఁగా నొకనాఁడు రాజు చేయుపూజల కత్యంతసంతుష్టహృదయుఁడై స్యమంతకమను పేరుగల మణి నొసంగెను. సూర్యప్రసాదలబ్ధమగు నామణివర్యమును గళమున ధరించి సత్రాజిత్తు వియద్భాగమున సూర్యుఁడు ప్రకాశించునట్లు వెలుంగుచు ద్వారకానగరమును బ్రవేశించెను. ఆతేజస్సు విచిత్రముగా నుండుటంబట్టి యెవ్వరు నాతనిఁ జూడఁజాలకపోయిరి. కొందఱు సత్రాజిత్తును దిలకించి దూరమునుండియే కన్నులు మిఱుమిట్లు గొలుపఁగాఁ జేరఁజాలక తొలఁగిపోయిరి. కొందఱు పరుగిడి పోయి శ్రీకృష్ణమూర్తితో సూర్యుఁడే మననగరమున కరు

* ఈకథ శ్రీభాగవతము ౧౦ స్కం. ౫౬ అధ్యాయమునుండి గ్రహింపఁబడినదని యెఱుంగునది.

దెంచెనని తెలిపిరి. కొందఱు శ్రీకృష్ణా! నారాయణా! శంఖ చక్రగదాధరా! గోవిందా! యదునందనా! అరవిందాక్షా! యిదిగో! సూర్యుఁడు వచ్చుచున్నాఁడు. నిన్నుఁజూడ నరుదెంచుచున్నవాఁడు. ఆసూర్యుఁడు తనతేజస్సులచే మనుజులనేత్రములు మూయించుచున్నవాఁడు. దేవతలును త్రిలోకవాసులును వారివెంటఁబోవఁ దలంచుకొందురు. ఆమహానుభావుఁ డీనగరమును బ్రవేశించునపుడు మహాశ్చర్యము గల్గించెను. నావిని శ్రీకృష్ణుఁడు పక్కున నవ్వి వారలం గాంచి యాదవవర్యులారా! అతఁడు సూర్యుఁడు కాఁడు. సత్రాజిత్తు. సూర్యదత్తమణివరమునఁ బ్రకాశించుచు మీా కిట్టిభ్రాంతిని గల్గించుచున్నాఁడు. అని పలికి వారిసందియమును బాపి తా సుఖంబుండెను.

సత్రాజిత్తు దివ్యమణిభూషితుఁడై గృహమును బ్రవేశించి కృతకౌతుకమంగళుఁడై దేవభాగమునందు నామణిను నిచి విప్రులచే దానికిఁ బూజచేయించి తా సుఖముగ నుండెను. ఆమణివరము ప్రతిదినము తప్తకార్తస్వరము నిరువదిబారువులొసంగుచుండును. సూర్యుఁ డామణి నొసఁగునపుడు సత్రాజిత్తుతో నీమణి యేచోటనుండునో యాచోట దుర్భిక్షములు లోనగు దేశారిష్టములుకాని యాధివ్యాధులుగాని తక్కుంగల యశుభములుగాని యుండవు. మాయావు లం దుండఁజాలరు. కావున దీనిని బూజించుచుండవలయును. ఇది పూజింపఁబడుచునుండునేని సకలారిష్టములు తొలఁగుననియె. ఆమాట నమ్మి సత్రాజిత్తు తన్మణివరమును విధిప్రకారము నిత్యము పూజించుచుఁ బ్రతిదినము ఇరువదిబారువుల బంగారును గ్రహించుచు

నుండెను. కొంతకాల మిట్లుసాగఁగా నొకనాఁడు శ్రీకృష్ణుఁడు సత్రాజిత్తును జూచి యామణిని నాకిమ్మని యడిగెను. సత్రాజిత్తు ద్రవ్యమునందలియాశచే నీనొల్లఁ డయ్యెను. అంతియగాని యాచ్ఞాభంగమున నేమేని భయము గలుగునేమో యని యూహింపఁ డయ్యెను. కొంతకాల మీరీతిగా సాగెను.

ఒకానొకప్పుడు సత్రాజిత్తుసోదరుఁడు ప్రసేనుఁడు మణివర్యమును దానిని గంఠమున ధరించి దానిదివ్యతేజస్సులు వనమున నెల్లెడల వ్యాపించుచుండఁగా హయారూఢుఁడై మృగయావ్యసనమునఁ దగిలి యడవిం దిరుగసాగెను. ఆమణిని జూచినంతనే మృగములు వెఱచి చెదఱుచుండెను. ఇదొక యత్యద్భుతభూతమని మృగము లెల్లఁ బాఱిపోయెను. ప్రసేనుఁ డాయడవిందిరుగుచు మృగములం బొంచిపొంచి వేయుచు వినోదించుచుండెను. సాంద్రారణ్యమునడుమ నతఁ డిచ్ఛానుసారము తిరుగుచుండ నాతనిని హయమును బొలియించి సింహము మణినొక చిత్రవస్తువుగా భావించి కొనిపోవుచుండఁగా నామణికాంతుల కబ్బురపడి యాసింహము గొండగుహాలోఁ బ్రవేశించునపుడు జాంబవంతుఁ డాకేసరిఁ బొలియించి మణివర్యమును బరిగ్రహించి యావాసమునకుఁ బోయి తనబిలమితరాదృష్యము గావున నందుఁజొచ్చి తనసంతానమున కొకయాటవస్తువుగా నీరత్నము నిచ్చెను.

ప్రసేనుఁ డడవినుండి తడవు రామిం జేసి సత్రాజిత్తు వానిని వెదుకించి యందతఁడు కానరామికి వగచుచుఁ జింతావేశమున మనస్సు దిటవుతప్పఁగాఁ బరితపించుచుండెను. అంతియగాక మణివరమును ధరియించి మృగయారతిం బోయిన

నాసోదరుని శ్రీకృష్ణుఁడు చంపి మణిని గ్రహించెను. మణిలోభమింతకార్యము చేయించెను లేకున్న నాతమ్ముఁడు రాకుండనుండువాఁడు కాఁడు. నిక్కముగా నాతఁడు వాలిసెను. కృష్ణుఁడ్రోహమగు దుష్కృత్య మిదియనవచ్చును. మున్నొకసారి నన్నీమణి నిమ్మని యడుగ నే నీనంటిని. అది మది నునుచుకొని సమయమునకు వేచియుండి నాసోదరుఁ డడవులకుం బోవ నింతటియకార్యము చేసెను. ఏమిచేయవచ్చు? అనుకొనుచుండ నీవార్త చెవినుండి చెవికిఁగా నందఱకుఁ దెలిసెను. పరమేశ్వరుఁ డాయపయశమును బొంగఁగించు నుతుల నాలకించి యాయపయశమును దొలఁగింపనెంచి నాగరకులంగూడి ప్రసేనుఁ డడవికి నేమార్గమునఁ బోయెనో వేటగాండ్రనడుచు నడుగుల జాడంబట్టి యాతఁడు బోయినచోటులకన్నిటికిం బోయి వెదుకనాగెను. ఆయడవియం దొకచో హతుఁడై పడియున్న ప్రసేనుని గాంచెను. అడుగులంబట్టియు నాచోటునఁ గనఁబడు క్రమ్ములాటం బట్టియు సింహముచేఁ ప్రసేనుఁడు చంపఁబడియెనని తెల్లమయ్యెను. అందే విగతాసువై పడియున్న యాతని తురంగముకూడఁ గనఁబడియెను. ఆజాడం బట్టిపోవఁగా బర్వతముచెంత భల్లూకము సింహము పెనఁగులాడినజాడ లగపడియెను. అందే సింహశవము దృగ్గోచర మయ్యెను. జనులందఱు దానిం గాంచిరి.

అంత నాభల్లూకము పాదచిహ్నములం బట్టి కొంత దవ్వు చనఁగా నందొకభూబిలము కానంబడియెను. కాని యది యంధకారావృతమై యతిభయంకరముగా నుండెను. ఇతరులు ప్రవేశింప వెఱచిరి. దుష్ప్రవేశ్య మగుదానిని భగవంతుఁ

దొక్కరుండే ప్రవేశింపఁదలఁచి యందఱను వెలుపల నిలువ నియమించి యవలీలగా నందుఁ జొచ్చెను. నాగరికులందఱు వేఁటకాండ్రం గూడి ప్రతిచందమునఁ గృష్ణాగమనమును గోరి వెలుపల నిలిచియుండిరి. శ్రీహరి వడివడి బోయిపోయి యనేకాంధాంతరమార్గములఁ బడిపోయి యందొక గుహ్యస్థలమున శిశువును, బాలక్రీడనకముగాఁ జేయఁబడియున్న మణిరాజమును గాంచెను. తనయుని యుయ్యెలను నూఁగించుచున్న సూతికా నామణిరత్నమును గైకొన శ్రీహరి యాశిశువు చెంగటకుం బోయెను. అప్పుడా దాదియును జూ నాతనిం గాంచి భయమునఁ దత్తఱిల్లి కు మొఱ్ఱో మొఱ్ఱో యని యంగలార్చెను. బలవంతులలో మేటి యగు జాంబవంతుఁడు క్రుద్ధుఁడై యా యార్తి యంగలార్పుట నాలకించి పరుగెత్తెను. జాంబవంతుఁడునుఁ గృష్ణునను ఘోరకృషిని దారణ మయ్యెను. * జాంబవంతుఁడు శ్రీకృష్ణుఁడు దేవదేవుఁడు యని యెఱుంగఁ జాలఁడయ్యెను. అంతియగాక శ్రీకృష్ణపరమాత్మను బ్రాకృతుఁ డగుపురుషునిగా భావించెను. దానఁ గుపితుఁ డయ్యెను. కాని శ్రీహరి యనుభావము నింతయనం తయు నెఱుంగఁజాలక పోయెను. ఇరువురు విజిగీషువులు. కావున నొండొరుల మీఱుపౌరుషముల ద్వంద్వయుద్ధమును తుములముగా నొనరించిరి. తొలుదొలుత నాయుధములం గొని పోరాడిరి. అవలఁ బాషాణవ్రాతములం గైకొని భీమసంగ్రామ మొనరించిరి. అంతకుంబోక భూరుహవ్రాతములం బరిగ్రహించి పోరాడిరి. ఆమీఁద బాహుబాహిఁ బెనఁగఁ గడం

---

* స వై భగవతా తేన యుయుధే స్వామినాత్మనః, పురుషం ప్రాకృతం మత్వా కుపితో నానుభావవిత్ — అని మూలము.

గిరి. ఆపోరాటము మాంసముకొఱకుఁ బోరాడు డేఁగలకలహా
మును బోలియుండెను.

అత్తఱి బిట్టురోషంబున నొండొరులఁ బడవైచుచుఁ బట్టు కలల శ్రీకృష్ణజాంబవంతులు ముష్టియుద్ధమునకుం గడంగి పరస్పరతనువులు శోణితసిక్తములు కాఁగా యుద్ధమును నిలుపక సాగించుచుండ నిరువదియెనిమిదిదినములు గడచెను. వారిముష్టులు వజ్రాయుధమును బోలి పరుషములుగా నుండెను. ఆముష్టిప్రహారముల కెడఁబాటు కానరాదు. విశ్రాంతి దానికి లేదు. రేయింబగళ్లను భేదము లేదు. నిరంతరముగా నాపోరాటము సాగెను. అంతటఁ గృష్ణమూర్తి ముష్టిఘాతములచే జాంబవంతు నొప్పించెను. దాన నాతని యవయవసంధులు వదలెను. సత్వము వడుపుగా క్షీణించెను. గాత్రము తగ్గసాగెను. దాన నతఁడు మిగుల విస్మితుఁ డయ్యెను. అంతట పూర్వస్మృతి తోఁచెను. తనతోఁ బోరాడుమహాపురుషుఁడు తనకుఁ బ్రభువగు భగవంతుఁడని స్పష్టమయ్యెను. పోరాటము నిలిపి వినయభక్తులు పురికొన నిట్లు పలికెను. మహాత్మా! నీవు సర్వభూతములకుఁ బ్రాణమవని తేజస్సని, ఇంద్రియహృదయదేహబలమని స్పష్టమయ్యెను. ఇన్ని దినములకీవార్త నెఱింగితిని. పురాణపూరుషుఁడవు. ప్రభవిష్ణుఁడవు. అధీశ్వరుఁడవు. శ్రీమహావిష్ణుమూర్తివి నీవే. నీవు ప్రపంచము నిర్మించువారిని బుట్టించువాఁడవు. సృజింపఁదగినవానికి సత్పదార్థమవు. సాంఖ్యులకుఁ గాలస్వరూపుఁడవు. ఆత్మవేత్తలకు నుత్కృష్టాత్మభూతుఁడవు. కొలఁదిగా రోషము నుద్దీపింపఁజేసి దానిని గబాతములద్వారా వెడలించితివి. దానిచే నక్రగ్రాహములు తిమింగిలాదులు క్షోభిం

చెను. దాని సముద్రము కలఁతనొందెను. అట్టి సాగరమునను సేతువు గట్టితివి. దానిమార్గమున లంక సుజ్వలిత మయ్యెను. దానిచే యశస్సు ప్రకాశింపఁజేసితివి. దానిచే రక్షశ్శీర్షములు త్రెంపఁబడియెను. వానితోడ నీవు ప్రయోగించిన బాణములు ధరఁ దూఱి యంబులపొదులఁ జొచ్చెను. అట్టి విచిత్రయుద్ధమును చేసిన శ్రీరఘురాముఁడవు నీవే. అని వినుతించి భక్తిప్రసన్నాత్మ కంధరుఁ డయ్యెను.

ఇట్లు విజ్ఞాతవిజ్ఞానుఁ డగు జాంబవంతుని విలోకించి యచ్యుతుఁడు భగవంతుఁడు నగు దేవకీనందనుఁడు కరుణాపూరిత హృదయపంకజుఁడై యిట్లు పలికెను. పలుకుచు నమ్ముకుం దాజలజాతుని హస్తారవిందమును జాంబవంతుని దేహమున వ్యాపింపఁజేసెను. ఆకరకమలములు తత్తనువును నిమురఁగా నెంతో సుఖమును గాంచెను. పడినకష్టములు తొలఁగెను. అంత మేఘగంభీరవాక్కులు వెలువడెను. ఆవాక్కులు కరుణారసపరిమళితములు. * భల్లూకనాయకా! ఈమణికొఱకు నిందు వచ్చితిమి. బిలమును ప్రవేశించితిమి. ఈమణిచేత మిథ్యాపవాదము గలిగినది. దాని నీమణిచేఁ దొలఁగించుకొనియెదను. అని పలికిన నాలకించి మహానందమునఁ దనకూఁతు నగు జాంబవతిని, స్యమంతక మణివర్యమును గానుకగా నిచ్చి కన్యాదానమున మణిని దక్షిణగా నిచ్చినట్లు భావించుచు నుప్పొంగుచుండెను. భగవంతుఁడా కన్యారత్నస్యమంతకరత్నములఁ బరిగ్రహించెను. అంత

---

* మణిహేతో రిహ ప్రాప్తా వయమృక్షపతే బిలం, మిథ్యాభిశాపం ప్రమృజన్నాత్మనో మణినామునా—అని మూలము.

జాంబవంతుఁడు తనప్రభువగు శ్రీకృష్ణునకుఁ దనకడనున్న మఱి కొన్ని రత్నముల నొసంగి పూజింప నాభక్తవత్సలుఁడు జాంబవంతునకు మహానందమున ముక్తి నొసంగెను.

బిలము వాకిటనున్న శ్రీకృష్ణానుచరులు కొలఁదిదినములకుం గూడ బిలమువెడలి రాకుండుట నెంచి యంధకారావృతం బగుబిలమును బ్రవేశించెనే యని దురపిల్లుచుఁ బండ్రెం డుదినము లందు వేచియుండి యందే మ్రందెనని తలంచి దుఃఖించుచు ద్వారకానగరంబున కరిగిరి. నాగరకులవలన నంత వృత్తాంత మెఱింగిన దేవకీవసుదేవులు శ్రీకృష్ణపత్ని యగు రుక్మిణియు, శ్రీకృష్ణమిత్రులు జ్ఞాతులు నితరబంధువులు బిలము నుండి శ్రీకృష్ణమూర్తి రాఁడాయెనే యని దుఃఖించిరి. వారెల్ల సత్రాజిత్తును శపించిరి. ద్వారకానగరవాసులెల్ల శ్రీకృష్ణునకుం గల్గిన యీయాయలజడికి సత్రాజిత్తే కారకుండని దూషింప నారంభించిరి. ద్వారకానగరముచెంతఁ జంద్రభాగ యనుపేరుగల దుర్గాదేవి కలదు. ఆదేవి నాపత్కాలములయందు సంపదభివృద్ధుల యందుఁ బూజించుట యాదవులయాచారము. అత్తఱుణమున ద్వారకానగరమునఁ గలవారెల్ల శ్రీకృష్ణునియాపదలఁ దప్పించి వేవేగరప్పించి మాకుం జూపుమా యని ప్రార్థించుటకై చంద్రభాగాంబకడకుం బోయిరి. భగవతిం బూజించిరి. మాయిడుమలం బాపుమా తల్లీ యని మ్రొక్కిరి. వినుతించిరి. ఆమెయు వారియెదుటం దోఁచి శ్రీకృష్ణుని కాపదలు రానేరవు. భయం పడకుఁడు. అని యాశీర్వచనము లిడుచుండఁగనే శ్రీకృష్ణపరమాత్మ జాంబవతియను భార్యంగూడి తాఁ బోయినపని ఫలింపఁగా వారికింగనఁబడి యానందము గలిగించెను. భార్యాభర్త

లను జూచినపు డానాగరకులకు రుక్మిణీశ్రీకృష్ణులకుం గల్గిన యానందమునకుఁ బరిమితియుండునే.

మణిఁ గంఠమునఁ దాల్చి భార్యంగాంచి మృతుఁడు మరల జీవితుఁడయినచందమునఁ దమయెదుటనున్న శ్రీహరిం గాంచి యెల్లరు మహోత్సాహపుల మహోత్సవముల నలరారిరి. రాజసన్నిధియందు నందఱు గూరుచుండుటజేసి సత్రాజిత్తును బిలిపించి భగవంతుఁ డాతనికి మణిచరిత్రమునంతయుఁ దెలిపి నీమణిని గ్రహింపుమని యాతనిముందట నుంచెను. సత్రాజిత్తు మిథ్యాపవాదమును శ్రీహరిపై నిడితిఁ గదా యని సిగ్గుపడుచు మోమువాల్చి యేమియుఁ బలుకకయుండి యాస్యమంతకరత్నమును గ్రహించి పరితపించుచుమదితో నింటికిం బోయి తనపాపముచేతనే పీడింపఁబడుచుండెను. ఇంటనుండియు విజ్ఞురుఁడు కాక యిట్టి ఘోరపాపము నొనరించితినే యని తలంచుచు బలవంతులతోటి విరోధమునకుఁ బాల్పడితినే యని వగచుచు నామనోమలము నెట్లు తొలఁగించుకొందును? అచ్యుతుఁడు ప్రసన్నుఁ డగును? ఏకార్యముచేసిన నాకు భద్రము కలుగును? ఏకార్యముచేసిన జనులు నన్ను దూషింపకుందురు! దీర్ఘదృష్టిలేక యల్పమతినై యుక్తాయుక్తపరిజ్ఞానహీనుఁడనై ద్రవ్యవిషయమున నాసక్తిగలిగియున్న నేనెట్లు భగవత్కారుణకుఁ బాత్రుఁడనై జననిందకు దూరుఁడనై మనఁగలను? అని పెక్కుభంగుల నాలోచించి యొకవిషయము మదికి సరిపడఁగా దానినే తర్కించితర్కించి యిదియే యుపాయమనుచుఁ జేయఁదగిన పని! నాపుత్రికారత్నమును స్యమంతకరత్నమును సమర్పింతును. ఈయుపాయము సమీచీనము. వేఱొండుపాయమున శ్రీహరి

మదికి శాంతినిగల్గింప శక్యము కాదు. అని పలుమార్గములఁ జింతించిచింతించి యనన్యగతికుఁడై యొకశుభలగ్నమున దుహితృరత్నమును స్యమంతకరత్నమును భక్తియుక్తుఁడు కొనిపోయి. పరమేశ్వరునకు సమర్పించి కృతకృత్యుఁడయ్యెను. * శ్రీహరి యాకన్యారత్నమును రత్నమును బరిగ్రహించి యథావిధిఁ

* తాం సత్యభామాం భగవా నుపయేమే యథావిధి, బహుభిర్యాచితాం శీలరూపౌదార్యగుణాన్వితామ్. భగవానాహ న మణిం ప్రతీచ్ఛామో వయం నృప,తవాస్తాం దేవభక్తస్య వయం చ ఫలభాగినః. అనిమూలము. దేవా పుత్రత్వా త్త్వదీయం ధనమస్మాక మేవేతి గూఢోఽభిప్రాయః = అని వ్యాఖ్య. ఈభాగమునకు మహాకవిపోతన తనప్రౌఢిమయు భక్త్యుత్కర్షము కనంబడ దనయశశ్చంద్రుఁడు నిర్మలతనువున నెల్లయెడలఁ బ్రకాశింపఁగా,

మ. అని యభ్భంగి బహుప్రకారముల నేకాంతస్థుఁడై యింటిలో
దనబుద్ధిం బరికించి నిగ్గని సత్రాజిత్తు సంప్రాప్తశో
భనుఁడై యిచ్చె విపక్షరోధిసరికిన్ భామామనోహారికిన్
దనుజాధీశవిదారికిన్ హరికిఁ గాంతారత్నమున్ రత్నమున్.

ఉ. తామరసాక్షుఁ డచ్యుతుఁ డుదారయశోనిధి పెండ్లియాడె సా
మాను జేంద్రనందితగుణస్థితి లక్షణసత్యభామ ను
ద్దామపతివ్రతాత్వనయ ధర్మవిచక్షణతా దయాయశః
శ్రీమను సత్యభామను సుఖద్యుతినిర్జితసోమ నయ్యెడన్

క. మణియిచ్చినాఁడు వానర
మణి నీకును మాకుఁగలవు మణులు కుమారీ
మణి చాలునంచుఁ గృష్ణుఁడు
మణి సత్రాజిత్తునకును మరలఁగ నిచ్చెన్.

అను నీపద్యరత్నముల వ్రాసెను.

బరిణయము కమ్మని పెక్కుమంది ప్రార్థింపఁ బెండ్లియాడ నంగీకరించి తదీయశీలమును, సౌందర్యము, సౌభాగ్యమును, సద్గుణములను బరికించి యాలసింపక విధివిహితముగాఁ బెండ్లియాడెను. తరువాత భగవంతుఁడు సత్రాజిత్తుం గాంచి స్యమంతకమణిని గైకొనుము. కన్యారత్నమును గ్రహించితిమి. నీవు సూర్యభక్తుఁడవు. కావునఁ దత్ప్రసాదలబ్ధమగుమణి నీకడనుండనిమ్ము. అని మృదూక్తులం బలికి సత్రాజిత్తు సుతసంతానహీనుఁడగుటఁ దద్ధనమంతయుఁ దనవంశమునకే చెందునని యూహించి యాపలుకుఁ దెలుపక గోత్రనామము గలుగునట్లు రాజా ! మేము ఫలభాక్కులమని యుపాసించెను. సత్రాజిత్తు శ్రీహరివాక్కుల కానందించి స్యమంతకమణిని గ్రహించి సూర్యునారాధించుచు సుఖంబుండెను.

మహాశయులారా ! స్యమంతకరత్నచరిత్రమును బఠించితిరి. దీనియం దనేకవిచిత్రవిషయములు కలిసియున్నవి. అవి తెలిసికొనఁ దగును. ఇందుఁ జర్చింపఁదగినవిషయము లివి. స్యమంతకమణి యిరువదిరెండుబారువుల బంగారము ప్రతిదినము నిచ్చుట, జాంబవంతుఁడు శిశువున కాటవస్తువుగా స్యమంతకమణిని గొనిపోయియుంచుట, శ్రీకృష్ణుఁడు బిలముఁ జొరఁగా దాది యరచుట, జాంబవంతుఁ డిరువదెనిమిదిదినములు బాహుయుద్ధము చేయుట, యాదవులు దుర్గాదేవిని బ్రార్థించుట లోనగునవి. వీనికి సమాధానములు పెంచివ్రాయక సంక్షిప్తముగా వ్రాసెదను.

సత్రాజిత్తు సూర్యభగవంతు నారాధించెను. "యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అన్న ప్రాచీనోక్తిప్రకా

రము తేజోనిధి యగుభాస్కరు నారాధించెను. దానికిఁ బ్రతి ఫలముగాఁ దేజఃపుంజమగు మణినొసంగి భాస్కరుఁడు తనవిధి నెఱ వేర్చెను. తేజస్స్వరూపుఁడు, కర్మసాక్షి, త్రిమూర్త్యాత్మకుఁడు నగుసూర్యు నారాధించినందున సృష్టిస్థితిసంహారములను మూఁడు విషయములు గలరత్నము లభించెను. సృష్టిభాగమున స్వర్ణ మును బుట్టింపఁజాలెను. భక్తుఁడు ఐశ్వర్యమునుగోరి ప్రార్థించి నందునఁ బ్రసన్నుఁడై సూర్యుఁడు స్వర్ణము నొసంగు శక్తిగల రత్నమును బ్రసాదించెను. బంగారును బ్రసవించుశక్తి మణు లకుం గలదా యనుప్రశ్నము రావచ్చును. పదార్థములశక్తి యత్యద్భుతము, ప్రాణము లేదేయని కొందఱనుచుందురు. మనుష్యులకుంబలెఁ బ్రాణము వానికిలేకున్న నొకవిధముగాఁ బ్రాణము మణులకున్నది. ఎట్లు నిర్ణయింపవచ్చు? అని యడుగుదురేమో! ఒక్కరత్నము తృణము నాకర్షించును. దూరమం దున్నతృణమును సమూలముగా నాకర్షించుశక్తి దానికిం గలుగుటనుట ప్రత్యక్షము. కావున దానికిం బ్రాణమున్నదనక తప్పదు. ఇంకొక్కరత్నము విషమును నిర్మూలించును. సర్పము కఱచినచోట దానినుంచిన విషమును బీల్చి యాప్రాణి జీవింపఁజేయును ఇదియు నెల్లరకు బ్రత్యక్షమే. మఱొకరత్నము సకల పదార్థముల జీర్ణింపఁజేయును. ఇంక నొక్కమణి తుట్టడను జల పానాసక్తిని దొలఁగించును. రామాయణము భారతము దీనిఁ దృఢపఱచుచున్నవి. ఇట్టులుండుటంబట్టియే జీవమణులని పేరు వానికిం గల్గినది. చింతామణిప్రభావము పురాణములయందు స్పష్టమయ్యెడిని. అతిశయోక్తి యనఁగూడదా యని కొందఱనవచ్చును. కాని, యది మంచిదిగాదు. ఏలన, లేనిపదార్థ

మునకు నామకరణముచేయు టసంభవము. మనుష్యులు గడ్డి తినిరని యెవరు కల్పింపఁగలరు? బండెడన్నము తిందురందురు. ఒక్కఁడింతయన్నము తినఁజాలకున్నను అతిశయోక్త్యలంకారమున కుదాహరణముగాఁ జెప్పుచుందురు. మనకుఁ జిక్కిన యత్యద్భుతశక్తిగల మణులెన్నియో కలవు. చిన్నికథను చిత్తగింపుఁడు.

నేను బదునెనిమిదివత్సరముల ప్రాయమువాఁడనుగ నుండునపుడు నాబంధుగేహమున శ్రాద్ధమునందు నగ్రపంక్తి భోక్తగా నియమితుఁడనైతిని. నాకు జతగా భాష్యము కామాక్షయ్య యను విప్రుఁడుకూడ నియమితుఁ డయ్యెను. జాముప్రొద్దు గలగాఁ బయనమై యాయూరికిఁ బోయి దిట్టముగా భుజించి సాయంకాలముదనుకఁ బరుండి మరలి వచ్చుచుంటిమి. అస్తమయ సమయము. చిన్నకొండ యొకఁడు నడుమఁ గలదు. దానినెక్కి మాగ్రామమునకు రావలయు. చాలదూర మెక్కితిమి. ఇఱుకగా మార్గ ముండెను. ఇంచుకదూరమని చకచకఁగా నెక్కి పైత్రోవలను గలిసికొనఁ బోవుచుంటిమి. దానియంతరము రమారమి యిరువదిగజము లుండునేమో! ఆనడుమ చిన్నిపొద యుండెను. మేము నడచునపుడు పలకరాళ్లపై నడుగు లిడ వలసివచ్చెను. అచ్చపుడుకులికి యాగుల్మమునుండి విశాలతర ఫణము గలయొక త్రాఁచుఁబాము ఫూత్కారానిలముల మాకు భీతినిగొలుపుచు లేచెను. ముందునడచుచున్న నేనబ్బో యని రెండవవానిపైఁబడి వరుసగాఁ గ్రిందికి దొరలితిని. కామాక్షయ్య నాకంటె రెండుమడుంగులెక్కుఁడు వయస్సుగలవాఁడు. ఏమిదియని చూచెనఁట. ఫణాగ్రము మెఱపుఁదీఁగవలె జ్వలిం

సుచుండ మా ప్రక్కనుండి ఫణమెత్తి చూచిచూచి దక్షిణ భాగముననున్న చట్రాతి క్రిందికిఁ బోయెనఁట. ఆయన యద్భుత [illegible]తులు పెనఁగొనవచ్చి నన్నుఁ బెక్కులు మూసి లేవనెత్తి భీతివాపి మార్గముననే పైకెక్కించెను. అదియున్న భాగము పైకెక్కియున్న మాకుఁ గ్రిందనుండుఁ జక్కఁగాఁ గనఁబడుచుండెను. ఆ సమయ మయ్యెను. మరల నాకా త్రాఁచుదేహము గానరాలేదు. గాని యా పాషాణము క్రిందిభాగము తమోవృతము కాక దీపముచెంతనున్న భూమివలె నుండెను. సాయంసమయ భానుకిరణము లందుఁబడెనేమో యనుకొందమన్న నించుక చీకటులు క్రమ్మియుండెను. క్షణమునిలువంబడి యావిప్రుఁడు నాకు నాభాగమును గనఁబఱచెను. ప్రతిక్షణమునకు రక్తకాంతు లధికమగుచుండెను. ఆపర్వతమున నొక మహాసర్పమున్నట్లు, ఎవరిని బాధింపకున్నయట్లు ఎప్పుడే నొకప్పు డదియున్న తావున విద్యుత్ప్రకాశము వంటి వెలుఁగు కనఁబడునట్లు ప్రతీతి కలదు. ఇది నాయెఱింగిన విషయము. ఇది నాకల్పించినదిగా మీరు భావింతురేని బదులు పలుకఁజాలను. నమ్మింపఁ జేయఁజాలను. అంతకంటెముందు, దానితరువాత నెన్నియోసారు లామార్గమునఁ బోవుచుండినను నాకది దృగ్గోచరము కాలేదు కాని యాచోట నాకు భయముమాత్రము గలుగుచుండును. తెలిసినవిషయమును విన్నవించితిని. మీరు దీనిని విశ్వసింతురని నమ్ముచున్నాఁడను. కాఁబట్టి రత్నములు జీవమణులను పేరఁ బఱగుచుంట విదితము. దానిశక్తి యబ్బురమును గల్గింపకమానదు. ఇట్టులుండఁ దేజోరాశి యగుభాస్కరుఁ డనుగ్రహించిన స్యమంతకమణి యిరువదిబారువులబంగారును బ్రతిదినమిచ్చు

టసంగతము కాదు. అది చాల యల్పఫలమని నాయాశయము. ఇంక దానికింగలస్థితి భాగమువలనఁ గలిగినఫలమును వినుఁడు.

స్థితికధికారి శ్రీమహావిష్ణువు. ఆమహాత్ముని కటాక్షము గలిగిన నీతిబాధలు లోనగునవి యుండవు. కావుననె యీరత్నము పూజింపఁబడుతావున క్షామరోగాదిబాధ లుండవని చెప్పఁబడినది.

"శ్లో. దుర్భిక్షమార్యరిష్టాని సర్వాధి వ్యాధయోఽశుభాః,
న సంతి మాయిన స్తత్ర యత్రాస్తేఽభ్యర్చితోమణిః." ౧౦

అని భాగవతము.

"మారీనామ అకాలమృత్యుః. అరిష్టమభద్రమ్ అశుభా దుఃఖహేతవః." అని వ్యాఖ్య.

శ్రీభాగవతమును దానివ్యాఖ్యను దిలకించితిరి. పురాణములే యసత్యములనువారి కీసమాధానములు పనికిరావని నే నెఱుంగుదును. కాని వారు సమ్మతమాత్రమునఁ నవి ప్రమాణములు కాకపోవు. ఇపుడిపు డమెరికాలోనగు భూఖండములయందుఁ బురాణముల విమర్శించువారు గలరు. వారివ్వానిం బఠించి యిందలి యపూర్వవిషయముల కచ్చెరువందుచు ముక్కుపై వ్రేలిడుకొనుచున్నారు. మనదేశమునఁ బాటింపక వానిని వీటఁబుచ్చుటయే కాక వానినెఱుంగనివారు పెక్కుమంది కలరనుట దేశదుస్థితిని బోధించుచుండును గదా. అది యటులుంచి విషయమును వ్రాయఁగడంగెదను. మణి నర్చించిన చో క్షామాదిదేశారిష్టము లుండవనఁగా నర్థమేమి? భగవంతునిగా దానిని భావించి (అందలికళ భగవత్కళయే) పూజిం

చిన భగవత్కరుణ గలుగును. భగవత్కరుణకుఁ బాత్రమగు టావున నేబాధ యుండును? కపటాత్ములు నందుండఁజాలరు. భగవత్కరుణ వాని నందుండనీయదని యెఱుంగునది.

ఇఁక మూఁడవది లయభాగము. దానికధిపతి మహాదేవుఁడు. ఆభాగముకలనఁ గలుగుఫలము కాలమృత్యువు లేకుండుట. అకాలమృత్యువునుగూర్చి యీవఱకే వ్రాసితిని. కాన మరల నిటఁ బెంచి వ్రాయను. ఇట్టి లామణి సూర్యదత్తము కావునఁ ద్రిమూర్తులశక్తులు గలిగినదని యెఱుంగవలయు. ఇరువదిబారువులబంగారు ప్రతిదిన మిచ్చుచుండిన నంతబంగారు నెందుంచుకొందురని కొందఱు నన్నుఁ బ్రశ్నించిరి.

"శ్లో. చతుర్భిర్వ్రీహిభిర్గుంజం గుంజాన్ పంచ పణంపణాన్,
అష్టౌధరణమష్టౌ చ కర్షం తాంశ్చతురః ఫలమ్,
తులాం పలశతం ప్రాహుర్భారస్స్యాద్వింశతిస్తులా ఇతి."

ఇది వ్యాఖ్యానమునఁ గలశ్లోకము. ఇరువదితులము లొకభారమని పేరుగలది. భారము తెనుఁగున బారువ యనఁబడును. నాలుగువందల తులములబంగారు వ్యయముచేయఁగల రాజకుటుంబము లుండఁగూడదా. ఈస్వల్పప్రశ్నముల కేమిగాని విషయము నాలకింపుఁడు.

(జాంబవంతునిగుఱించి.)

జాంబవంతుఁడు కేసరిం బ్రహరించి యాస్యమంతకమణిని గొనిపోయి తనసంతానమున కాటవస్తువుగా నిచ్చెననియు దాని యుపమాత యందుండి శ్రీకృష్ణునిం గాంచి భీతిల్లి యాక్రోశించెననియు భాగవతమునఁ గథకలదు. దీనింగూర్చి నాలుగుమా

టలు ప్రాయికతప్పదు. జాంబవంతుఁడు భల్లూకపర్యాయుఁడు. ఆతనికి భార్యయు సంతానమునుండుట స్వభావవిరుద్ధము కాదు. ఆపిల్లలను బోషించుట కొకయుపమాతయుండుట పొసఁగునా యను నది యొకప్రశ్నము. అంతియగాక రత్నముం గొనిపోయి శిశువున కాటవస్తువుగా నిచ్చెనునది యసంగతము కాదా యను నదియు నొకప్రశ్నమే. శ్రీకృష్ణునిం గాంచి యుపమాత యాక్రోశించుచు లోనికింబోవుట స్వభావవిరుద్ధము. మనుష్యుఁడు కనఁబడినపుడు నఖరముఖములఁ జించి చెండాడుట భల్లూకనైజము కాని కుయ్యో మొఱ్ఱోయని యార్చుచుఁ బోవుట యసంభవము. అనువవియుఁ బ్రశ్నములే. వీనికి సమాధానముల నాలకింపుఁడు. ఇట్లు ప్రశ్నించువారికి జాంబవంతుని తొలిజన్మవృత్తాంతము తెలియదని నాభావము. జాంబవంతుఁడు బ్రహ్మాయంశమునఁ బుట్టినవాఁడు. కామరూపుఁడు. భల్లూకాకృతి రావణవధార్థ మలవడినది. విభీషణుఁడు రామలక్ష్మణులు లోనగు వారితో సంభాషించుట యెట్లనియు యోజింపవలదా! జన్మమేకులమునవో ఆకులోచితరూపముననే ముక్తి యలవడవలయు. రామావతారముతో నాతనికని ముగియలేదు. కృష్ణావతారమున భగవంతునకు భార్య నీయవలసినట్లు, తద్ద్వారా ముక్తి లభింపవలసినట్లు విధికలదు. కాఁబట్టి శ్రీకృష్ణావతారము దనుక నతఁడు జీవించియుండెను.

"శ్లో. దదౌ తస్మై పరాం ముక్తిం ప్రీత్యా జాంబవతే హరిః."

ఆని మూలమునఁ గలదు. భల్లూకజాతియందుఁ బుట్టిన కాంత యతని భార్యకాదు. ఆయమ పుత్రికయే జాంబవతి. వీరెల్ల దేవతాంశజనిత లగుస్త్రీలు. కావుననే యుపమాత

యాతని శిశువుల కడనుండుట సంగతముకాదు. జాంబవతి భల్లూకజాతిస్త్రీ అనియూహించువారి కిది యసంగతమని తోఁప వచ్చును. కృష్ణజాంబవతి మనుజకాంత యనుకొనువారి కిదసంగతము కాదనియు సుసంగతమనియుఁ దోఁపకమానదు. జాతి సామాన్య ధర్మమగు నజ్ఞానముచే నతఁడు హరితోఁ బోరాడి దీనుఁడై ప్రార్థించెను. శ్రీహరి యతనికి ముక్తి నొసంగెను. జాతిచే భల్లూకమైనను జ్ఞానముచే నతఁ డతిమానుషుఁడు. కావునఁ గేసరిం బ్రహరించి మణినిగొనిపోయి తనశిశువున కాట వస్తువుగా నిచ్చెనన్న విషయమునం దతిశయోక్తి యించుకంతయుఁ గానిపింపదు. శ్రీకృష్ణు నెన్నివిధములనో యాశ్రయించి సేవించి ముక్తిఁ బడయఁదగువారెల్ల నెప్పుడెప్పుడు హరి యవతరించునా యని వేచియుండి వారికెల్ల నాకరుణావరుణాలయుఁడు సేవాప్రీతుఁడై తద్వాంఛలనొసంగి తనయవతారఫలమును సార్థకము చేసికొనియెను. కావున జాంబవంతునకుఁ గూఁతురా యని, ఆమెను శ్రీహరి కొసంగుటయా యనియు నచ్చెరువొంద వలసినయంతయవసరము కనఁబడదు.

జాంబవంతుఁడు శ్రీహరితో నిరువదెనిమిదిదినము లాహారనిద్రలు మాని యుద్ధము చేసెనుగదా. ఇదసంగతము కాదాయని ప్రశ్నించువారుకలరు. ఔరా! వారిమది నెంతపట్టు దలకలదు? జాంబవంతుఁడు బలశాలి, బ్రహ్మవరమున శ్రీరామ కార్యమునకు సాహాయ్య మొనరింపఁ బుట్టినప్రాజ్ఞుఁడు. శ్రీరామావతారము సమాప్తినొందఁగా జాంబవంతున కొసంగిన బ్రహ్మవరము సమాప్తినొందెననుట హాస్యవాదము. పరోపకార వాదము. పరోపకారపరాయణులబుద్ధి యామరణ ముండును.

భగవద్దత్తశక్తి మానుషశక్తిని మించియుండుననుట నిర్వివాదాంశము.

"శ్లో. దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా,
మాశుచస్సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ.

గీత. ౧౬ అధ్యా ౫ శ్లో.

అను నీగీతావాక్యము దైవసంపన్నిరుపమానతను వెలువుచున్నది. ఎంతదనుక జాంబవంతునకు జాతిసాధారణాజ్ఞాన క్రోధ దంభములు క్షీణింపకుండెనో యంతదనుక భగవంతుఁ డతనితోఁ బోరాడెను. శ్రీహరి యంతదనుక నాతనినొంపక సమానముగాఁ బోరాడుచుండెను. ఏలయనఁగాఁ దనంతనే భక్తుఁడు విజ్ఞానవంతుఁడై నన్నెఱుంగుఁ గాక యని భగవంతునాశయము. కావుననే భల్లూకపతి క్రమముగా క్షీణశక్తియై గర్వము తొలఁగిపోవ దంభము సన్నగిల్లఁ గ్రోధము తోఁకముడువఁగా మోహము నాశముకాఁగా గామ మేమూలనో యొదిగియుండ లోభము కృశింపఁ గ్రమముగా వీనినడంచు విజ్ఞానభానుఁ డుదయించి తమఃపటలము నడంప శ్రీహరి యని యెఱింగెను. ఏతరుణమునఁ దనను జాంబవంతుఁడు భగవంతునిగా నెఱింగెనో యాక్షణమునఁ గరుణారసపరిపూరితాంతఃకరణుఁడై,

"శ్లో. అభిమృశ్యారవిందాక్షః పాణినా శంకరేణతు,
తమాహ కృపయా భక్తం మేఘగంభీరయా గిరా."

అని మూలమునఁ జెప్పఁబడినట్లు భక్తుఁడగు జాంబవంతుని యజ్ఞానము తొలఁగి విజ్ఞానభాను డుదయించెఁగదాయను

ప్రీతిచే సుఖమును గలిగించు హస్తారవిందమున నాతనియా యాసముపోవఁ జడవి యతని వాంఛలఁ దీర్చు భావము కనఁబడి మాటలాడి ముక్తినొసంగెను.

"శ్లో. యే యథా మాం ప్రపద్యంతే
తాం స్తథైవ భజామ్యహమ్. గీత."

అనునట్లు జాంబవంతుఁ డేభావముతో యుద్ధము చేసెనో యా భావముతో శ్రీకృష్ణుఁడతని ననుసరించి యాయనయహంకార మును దొలఁగించెను. ఇదియే భగవంతుని మార్గము. కావున భగవంతునిఁ గన్నులారఁ గాంచుచున్నపు డాహారనిద్రలుగలు గుచో మనుష్యదర్శనమునకు భగవద్దర్శనమునకుఁగల భేద మేమో తెలియఁజాలకున్నాఁడను. భగవంతుఁడగు శ్రీకృష్ణుని దర్శించునపుడు క్షుత్తృష్ణలు మానవిచో ముక్తియెట్లు దొర కును? కావున నిట్టిశంకల కవకాశము మనమునఁ గలిగించు కొనకుఁడు.

ఇఁకఁ బౌరులు దుర్గాంబను ప్రార్థించి రనువిషయము నించుక విమర్శింపుఁడు.

"శ్లో. ఉపతస్థుశ్చంద్రభాగాం దుర్గాం కృష్ణోపలబ్ధయే,
తేషాం తు దేవ్యుపస్థానాత్ప్రీత్యాదిష్టాశిషాచ సః.
ప్రాదుర్బభూవ సిద్ధార్థస్సదారో హర్షయ౯ హరిః. అని మూలము.

దీనికి మహాకవి పోతన.

క. దుర్గమమగుబిలమున హరి
నిర్గతుఁడై చేరవలయు నేఁడని పౌరుల్

పర్గములై సేవించిరి
దుర్గం గృతకుశలమార్గఁ దోషితభర్గన్.

క. డోలాయితమానసులై
జాలింబడి జనులు గొలువఁ జండిక పలికెన్
బాలామణితో మణితో
హేలాగతి వచ్చు నంబుజేక్షణుఁ డనుచున్.

"ప్రత్యాదిష్టాశిషాచ" యనుమూలమునకు, "దేవ్యుప స్థానాత్. తయా తాన్ ప్రతి ఆదిష్టా దత్తాయా ఆశీః కృష్ణం ద్రక్ష్యథేతి తయా స్వైహైవ" అని శ్రీధరాచార్యులు వ్యాఖ్య వ్రాసిరి. ఈభావమును గూడ గ్రహించి పద్యము వ్రాసిరనియు "ముక్తస్యముక్తార్థః" అన్నట్లు పండితమ్మన్యులు పల్కునట్ల ర్థము చేసికొని పద్యము వ్రాయలేదనియు నెఱుంగవలయు.

యాదవులు బిలముదగ్గఱనిలిచి కొలఁదిదినములు హరి రాకకై వేచి రాకుంట వెతనొంది బిలము దుర్గమము, ఇందే యేజంతువులుండునో యేయపాయము వాటిల్లెనోయని దిగు లుపడి ద్వారకకుంజని కులదేవతయగు దుర్గాంబికను ప్రార్థిం చిరి. ఆమె శ్రీహరి సదారుఁడై వచ్చునని యాశీర్వదించెను. అను నీభాగవత భాగమునుబట్టి యాలోచింప నాకాలము రాజు లెల్లరు దుర్గాపూజకులని స్పష్టమగు. రుక్మిణీదేవియుఁ బార్వతిం బూజించెను. దుర్గాపూజమానిన యీకాలమున నట్టి ఫలము లేల కలుగును? రాజులేకాక సాధారణముగా నెల్లమానవులు కులోచిత బలిప్రదానముల భగవతి నారాధించువారు. కాఁబట్టి

యీమూల ప్రకృతి భగవత్కృపకు నెల్లర బాత్రులనుగాఁ
జేయుచుండెను. అది మానిన యీకాలమున భగవదనుగ్ర
హము కలుగుటెట్లు? భగవంతునే యాశ్రయించినఁ గృప
గలుగ నవకాశములేదా యని ప్రశ్నింతురా. ఆపక్షమున,

"తదను ప్రధానద్వారా రాజదర్శనంకర్తవ్య" మ్మను
న్యాయము మీఱినట్లగును గదా. భగవంతుఁడు నిర్లిప్తుఁడు
కావునఁ బ్రకృతి నాశ్రయించి తద్ద్వారా భగవంతు నాశ్ర
యింపఁగోరిన సులభముగా భగవత్కరుణకుఁ బాత్రులు కా
వచ్చును. ప్రకృతి నాశ్రయింపక భగవంతునే యాశ్రయించు
వారుకలరే యందురేని వారెల్లఁ బ్రాగ్జన్మమునఁ బరదేవి
నాశ్రయించి తపస్సు పూర్తికాక మృతి నొందినవారనియుఁ
దత్తపోబీజావాపముచే మరలఁ గల్గిన జన్మమున వారెల్ల సులభ
ముగా భగవత్కరుణకుం బాత్రులైరనియుఁ దెలియందగు. ఇట్టు
లీస్యమంతకమణి చరిత్రము మనకనేక విషయములను బోధిం
చుచున్నది. దీనిం బఠించుతఱి నిందుండి నేర్చుకొనఁదగిన విష
యము లేవని యోజింపవలయునే కాని కథపైననే కన్నులుం
చిన లాభము విశేషించి కలుగదు. కావున భక్తులందఱు భగ
వత్కథలం బఠించుచుఁ దద్భావమును మది నిల్పుకొనుచుం
దన్మూలమున భక్తి దృఢపడున ట్లోపికమై జేసికొని తరింపవల
యును. దీనికంటె సులభతమమగు మార్గము కానరాదు. ఇంక
నీవిషయము నుజ్జగించి తరువాతి కథను వ్రాయ లేఖినిం ద్రిప్పె
దను.

## శ్రీకృష్ణుఁడు సత్యభామాదికాంతలం బరిణయంబగుట.

* సత్రాజిత్తు ప్రీతిపూర్వకముగ నొసంగిన యాసత్యభామంగైకొని స్యమంతకమణి నతనికి మరల నొసంగి యాతనిం బ్రీతునిం గావించి యనిపెను. తరువాత సుముహూర్తమున రాధాదేవ్యంశ జనితలగు కాంతారత్నములం బెండ్లియాడం గోరి వారివలని యుపయోగముల నారసి బంధువులానందాంబుధినోలలాడ దేవతలు హర్షింప మహర్షులు పరమానందమునఁ దేలియాడఁగాఁ గాళిందిని, సత్యభామను జాంబవతిని బెండ్లియాడెను. అవంతిదేశాధీశులైన విందానువిందులు తమచెలియలగుమిత్రవిందకు స్వయంవరవిధిని వివాహముచేయ నూహించి దుర్యోధనునకు వశ్యులై స్వయంవరంబు చాటించిన శ్రీకృష్ణుండచటికిం బోయి రాజాధిరాజులెల్లఁ జూచుచుండ నామిత్రవిందంగైకొని వచ్చి పెండ్లియాడెను. కోసలదేశాధిపతియగు నగ్నజిత్తునకుఁ గూఁతురుఁ నాగ్నజితియుండెను. ఆమె సుందరాంగి. గుణవతి. కావున నాకన్యకం బెండ్లియాడఁ గోరి యెందఱో రాజన్యులరుదెంచి యతని యాచించిరి. ఆతఁడొకపణము పెట్టియుండెను. వాడికొమ్ములుగలిగి మత్తిల్లి పట్ట శక్యముకాక వీరుఁడన్నంతమాత్రమున నోర్వలేక వానిం జించి చెండాడఁగోరుచు హింసాకర్మాసక్తములైయున్న యేడు గోవృషముల నెవ్వఁడు

---

* ఇది శ్రీకృష్ణజన్మఖండము ౧౧౨ అధ్యాయ శిష్టభాగమునుండియు, బ్రహ్మపురాణము ౯౨ అధ్యాయమునుండియు, భాగవతము ౧౦ స్కం.౫౮ అధ్యాయమునుండియు, విష్ణుపురాణము ౫ అంశము ౨౮ అధ్యాయమునుండియు గ్రహింపఁబడినదని యెఱుంగవలయు.

పట్టి లోఁబఱచుకొనునో వాఁడు నాకన్యం బెండ్లియాడఁదగిన వాఁ డనునదియే యాశపథము. ఎందఱో యందులకుం బ్రయత్నించిరి కాని యొక్కఁడైన సఫలమనోరథుఁడు కాఁజాలఁ డయ్యెను.

ఆవార్త శ్రీకృష్ణుని శ్రవణరంధ్రములం బ్రవేశించెను. వెంటనే యాకన్య తన్నుం బెండ్లియాడ గోలోకమునుండి యవతరించిన రాధా కళయేయని యెఱింగి చతురంగ బలములఁ గూడి కోసలదేశమున కరిగెను. శ్రీహరియాగమనమున కచ్చెరువంది యెదురుగాఁ బోయి సకలోపచారములఁ బూజించి దివ్యాసనమునఁ గూరుచుండఁ జేసెను. నాగ్నజితి శ్రీహరి దివ్యసుందరాకారముం గాంచి భర్తగానెంచి నాపూనినవ్రతము సత్యసంకల్ప మయ్యెనేని యీమహానుభావుఁడు నాకుం బతి యగుం గాక యని తలంచెను. అవ్వల నాభూనాయకుఁడు సింహాసనాసీనుఁ డగుభగవంతునిం గాంచి జగన్నాయకా నీయాగమనమున నాయిల్లు పవిత్రమయ్యెను. నావంశము ధన్యమయ్యె. నానోములు ఫలించెను. నాపుణ్య మేమందును ? అని బహుభంగులఁ బొగడుచుండెను. అత్తఱుణమున నాగ్నజితి తనమనంబున మహాత్మా ! జగన్నాయకా ! జగదాధారా ! పరిపూర్ణుఁడవగు నీకు నల్పమతినగు నేనేమిపూజలొనరించి ప్రసన్నుం జేయఁజాలుదు ? మహాత్మా ! నీపాదపంకజరజోలేశమును శ్రీదేవియు బ్రహ్మయు శంకరాదులును శిరములం దాల్తురు. నీరూపములు లీలాకల్పితములు. ధర్మసేతువును బరిరక్షింప నవతరించుచుందువు. అట్టి నిన్ను నే నేసత్కారమునఁ దృప్తినొందింపఁగలను ? అని ధ్యానించుచుండెను.

అంత శ్రీకృష్ణుఁడు సర్వజ్ఞుఁడు గావున నారాజకన్యా మనోభావము నెఱింగి స్మిత మాస్యరంగమున నృత్యంబుసలుపు చుండ మేఘగంభీరభాషణంబుల నిట్లు రాజుంగాంచి పలికెను. రాజవర్యా! స్వధర్మమున వర్తించురాజునకు యాచన పనికి రాదని పెద్దలు వచింతురు. నీమైత్రిని బురస్కరించుకొని రాజ ధర్మము కాకున్నను యాచింపఁదలంచితిని. నీకొమరితను నాకొ సంగుము. శుల్కము నిచ్చువాఁడను గాను. అని యూరకుం డెను. ఈపట్టున శ్రీభాగవతమునందు,

"శ్లో. నరేంద్ర యాచ్ఞా కవిభి ర్విగర్హితా
రాజన్యబంధో ర్నిజధర్మవర్తినః,
తథాపి యాచే తవ సౌహృదేచ్ఛయా
కన్యాం త్వదీయాం న హి శుల్కదా వయమ్."

అని కలదు. దీనికి మహాకవిపోతన,

క. అన్యుల యాచింపరు రా
జన్యులు సౌజన్యకాంక్షఁ జనుదెంచితి మీ
కన్యక వేఁడెద నిమ్మా
కన్యాశుల్కదుల మేము గాము నరేంద్రా.

అనివ్రాసి తనచమత్కృతిని చెలిపెను. "నిజధర్మవర్తినః" అను దానిని వదలకయుండిన బాగుండెడిది. రాజన్యు లనుపదము నందే రాజ్యపాలకు లనునర్థము గలదుగానఁ బైవాక్యమునర్థ మిందిమిడియున్నదని తలంచియుందురని నాభావము. గంభీ రాశయముగల శ్లోకార్థమెల్లఁ జిన్నపద్యమున నిమిడించిరి. మెచ్చువచ్చు.

రాజా శ్రీహరిపలుకుల కలరి కరయుగము జోడించి బ్రహ్మాండనాథా! లోకమున నీకంటెఁ గోరఁదగినవరుఁడు కలఁడా. సకల సుగుణధాముఁడవు. నీయంగమున శ్రీదేవి యనపాయినియై యున్నదికదా. నాభావ మేమనఁగాఁ బూర్వము సమయమొక్కటిదానిని జేసితిని. పురుషుల శౌర్యపరీక్షార్థము. కన్యావరపరీక్షార్థము. ఆసమయము ననుసరించి దుర్దాంతములు, దురవగ్రహములు నగునేడుగోవృషములఁబట్టి కట్టివేయవల యును. దానిం జెల్లింపఁగోరి యెందఱో రాజకుమారు లరు దెంచిరి దానిచే దేహములు చీల్పఁబడఁగా వారు మృతినొం దిరి. ఈవఱకు నీచే నెందఱో వైరులు పాలియింపఁ బడిరి. నీవీర్యధైర్యాదులు త్రిలోకవిశ్రుతములు. శ్రీనాథా! నీవే నాకన్యక కభిమతుఁడ వగువరుఁడవు. అని యూరకుండెను. శ్రీకృష్ణుఁ డాసమయము నాకర్ణించి తనరూపమును సప్తప్ర కారముల విభజించి విలాసముగా వానింబట్టుకొని భగ్నశౌ ర్యములై యవి లోఁబడఁగా బంధించి తన్ననుసరించి యవి రాఁగాఁ గట్టివైచెను. ఆవిధముఁ జూడఁగా బాలుఁడు కొయ్య బొమ్మల బంధించినట్లుండెను. ఆయద్భుతకర్మంబున కానందించి రాజు తనదుహితను భగవంతున కొసంగెను. విధియుతముగా నాగ్నజితిని వివాహమాడిన రాజపత్నులు తమకొమరిత కను రూపుఁ డగుపతిదొరకెనని పరమానందభరితలైరి. అంతఃపుర మునఁ బురవరమున మహోత్సవములు సాగెను. రాజల్లునకు సపారధనంబుల, గోవుల, దాసీదాసజనంబుల, గజతురంగస్యంద నంబుల నొసంగి కృతకృత్యుం డయ్యెను. అంత నాయపూర్వ

దంపతులు స్యందనము నధిష్ఠించి బలంబులు గొలుచుచు రాఁగాఁ బ్రయాణము చేసిరి.

ఆవివాహవార్త నాకర్ణించి యంతకుమున్ను గోవృషంబులచేఁ బొడువంబడి భగ్నవీర్యులై ప్రాణావశిష్టులై పాఱిన రాజు లాతురంబున నొక్కచోఁ జేరి హరినడ్డగించి శరవృష్టిం గురియించిన నాదండిమగండు గాండీవకోదండంబంది నారి సారించి బాణపరంపరల వారినెల్ల మృగేంద్ర మల్పమృగంబులం జంపునట్లు వడిఁ బొలియించి ద్వారకానగరంబుం జేరి * సత్యభామాలోలుఁడై సుఖంబుండి యితరపత్నుల కుల్లాసంబుఁ గల్పించుచుండెను. అంత మంచిముహూర్తమున భద్రయనుకన్యను బరిణయమయ్యెను. ఆమె శ్రుతకీర్తిదుహిత. శ్రుతకీర్తి శ్రీకృష్ణునకు మేనయత్త. కైకేయియనియు నాభద్రాదేవికి బేరు గలదు. ఆపేరు దేశమునుబట్టి వచ్చినది. ఆమెను సోదరులు శ్రీహరి కొసంగిరి. భగవద్దర్శనకాలమున నామె కానుకగా నీయఁబడియెను. ఆవల మద్రదేశాధిపతిపుత్రికయగులక్షణాదేవియు స్వయంవరకాలమున శ్రీహరిచేఁ గైకొనఁ బడియెను. ఆమె సాధులక్షణముల నలరుట లక్షణాహ్వయమును గాంచెను. ఇట్లు లేడ్వురుభార్యలు శ్రీకృష్ణునకు సమకూడిరి. తొలిభార్య రుక్మిణి. ఇవ్విధమున నెనమండ్రుగురఁ బత్నులంగూడి భగవంతుఁడు ద్వారకానగరంబున సుఖంబుండెను.

మహాశయులారా! ఈవివాహవృత్తాంతమును దెలుపునట్టి యీభాగమునందు విశేషము లేవియుండునని తలంతు

---

* పారిబర్హ ముపాగృహ్య ద్వారకామేత్య సత్యయా, రేమే యదూనాం వృషభో భగవాన్ దేవకీసుతః = అని మూలము.

రేమో? ఒక్కయద్భుతవృత్తాంతము కలదు. అది యెఱుంగఁ దగినదియే. తొలుదొలుత శ్రీకృష్ణమూర్తి రుక్మిణిని వివాహమాడి పిదపఁ గొలఁదికాలముననే తక్కినయేడ్వురను బెండ్లియాడెను. అష్టభార్యలైరి. వీరియం దెవ్వరికింగాని సపత్నియం దసూయయున్నట్లు కానఁబడదు. ఇందిదేమియు నద్భుతము లేదు. పతివ్రతలగు పురంధ్రీమణులకుఁ బతివలచిన కాంతపై నసూయయుండదనుట తెల్లము. కాఁబట్టియే వారికి సాధ్వీనామము చెల్లెను. కావుననే వారియానందమునకు గొఱంత లేకుండెను. తృప్తియే యానందమునకుఁ బ్రధానము. అదిలేకున్న నేవియుండినను లాభము లేదు. భగవంతుఁ డందఱికన్ని రూపములఁ బొడకట్టుచు నెవ్వరికిని మది శంకలేకయుండ నాయింటనే హరి యుండునన్నవిశ్వాసమును గల్గించుచుండ నిఁక నసంతృప్తి వారికెట్లు కల్గఁగలదు?

శ్లో. "ఆత్మానం సప్తధా కృత్వా న్యగృహ్ణాత్ లీలయైవ తాః" అని మూలము.

"బహ్వీనామపి యోషితాం సంపూర్ణవివాహం సంభోగయోగ్యస్యాన్య ఋతి సత్యాం ప్రత్యసాపత్న్యప్రదర్శనార్థ మాత్మన స్సప్తధాకరణమ్" అని వ్యాఖ్య.

ఈభావమే యిందుఁ బ్రధానము. ఏలాగో యీభావము మహాకవిపోతన పద్యమునఁ గానరాకున్నది.

ఉ. చేలము చక్కఁగట్టుకొని చిత్రగతిన్ వడి నేడుమూర్తులై
బాలుఁడు దారురూపములఁ బట్టెడుకైవడిఁ బట్టి వీరశా

ద్ధాలుఁడు గ్రుద్ది నేలఁ బడఁద్రోచి మహోద్ధతిఁ గట్టి యీ
డ్చె, భూపాలకులెల్ల మెచ్చ వృషభంబులఁ బర్వతసన్నిభం
బులన్.

చూచితిరిగదా పద్యరత్నమును. ఏడుభాగములుగాఁ జేయుట సత్యభామకు సవతి కలదనుభావము తోఁపకుండుటకొఱకే యని శ్రీధరాచార్యులు వ్రాసిరి. రుక్మిణీప్రభృతులు భార్యలుండఁగా సత్యభామను బేర్కొననేల? ఇందేదో రహస్యార్థముండియే తీఱవలయును. శ్రీధరాచార్యులభావము మనకేల! అని కొందఱు దేవానాంప్రియులు పలుకుదురేమో? ఈ యర్థము దృఢపఱచునట్టి మూలముకూడఁ గలదు.

శ్లో. "హరి బర్హాముపాగృహ్య ద్వారకా మేత్య సత్యయా,
రేమే యదూనాం వృషభో భగవాన్ దేవకీసుతః."

నాగ్నజితి బిలుచుకొని ద్వారకానగరమునకు వేంచేసి సత్యభామంగూడి సుఖించెనని పై మూలమునకుఁ దాత్పర్యసారము. ఇట నాలుగుమాటలు వ్రాయకతప్పదు. నిష్పక్షపాతబుద్ధితోఁ బరికింపుఁడు. రుక్మిణి మహాలక్ష్మియని, సత్యభామాదులు సామాన్యమానవకాంతలని పెక్కుమందిభావము. ఆభావమే నిశ్చయమగుచో రుక్మిణీదేవింగూడి సుఖించెనని చెప్పక నాగ్నజితిం బెండ్లియాడి యామెను బిలుచుకొని ద్వారకానగరము చేరి యామెంగూడి సుఖించెననిగాని, భార్యలనందఱింగూడి సుఖించెననికాని, రుక్మిణింగలిసి యానందించుచుండెననికాని చెప్పక ద్వారకంజేరి సత్యభామనుగూడి సుఖించెనని యేల మూలమునఁ జెప్పఁబడియెను? ఇందేమో రహస్యవిషయము

కలవని మన మూహింపఁగూడదా? సారమిది. శ్రీకృష్ణునకు భార్యలందు సత్యభామపై నెక్కుడుప్రీతి కలదు. శతవత్సరములు శ్రీకృష్ణునితో విరహము కలుగఁగలదనుశాపము రాధాదేవికిం గలదు. ఆమె దుఃఖపడఁగా శ్రీకృష్ణుఁడే నీకు స్వప్నమున దర్శనమిచ్చుచుందును. నిన్ను వదలియుండఁగలనా యని చెప్పెను. ఈవిషయము నీగ్రంథమాలికయం దింతకు ముందే పఠించియున్నవారు కదా. దానఁ దృప్తినొందఁజాలక సత్యభామగా రూపాంతరము నొందెననియు శాపానుభవమునఁ గొంకరూపమునఁ దండ్రియింట నుండెననియు గ్రహింపవలయును. ఈవిషయము పారిజాతాపహరణ ప్రస్తావమున విశేషించి వ్రాసెదను. సత్యభామవాంఛలఁ దీర్చుటకై యెంత ప్రయత్నమైనను శ్రీకృష్ణుఁడు చేయకమానలేదు. ఏల? శృంగారాధిదేవతకదా రాధిక. రాసక్రీడాలోలకదా రాధిక. రసికేశ్వరికదా రాధిక. శ్రీకృష్ణప్రాణాధికకదా రాధిక. కావున రుక్మిణికంటె సత్యభామ యెల్లవిషయములం దక్కువశక్తికలది. అని యూహించుట మిక్కిలి పొరపాటు. భాగవతాభిప్రాయ మట్టిదికాదనియు శ్రీకృష్ణునకు సత్యభామయం దెక్కుడుప్రీతి యనియు నమ్ముఁడు. మఱొక్కమాట. శ్రీకృష్ణపత్నులందుఁ దారతమ్యము గలదనిమాత్రము తలంపకుఁడు. అది మహాదోషము. శ్రీదేవీకళాసంభూతలే శ్రీకృష్ణపత్నులందఱని నమ్ముఁడు. శ్రీమహావిష్ణువున కొక్కశ్రీదేవియే పత్ని. ఒక్కొక్కయవతారమున నొక్కొక్కనామమునఁ బత్నియగుటకు నవతరించును. ఒక్కొక్కకోరికను దీర్చుకొన శ్రీకృష్ణావతారమున నెన్నియో రూపముల నవతరించెను. పదారువేలమందిని భగవంతుఁడు

పెండ్లియాడెనన్న కథయం దిదియేరహస్యము. త్రిమూర్తులకుఁ బలువురుపత్నులు లేరు. వారెల్ల నేకపత్నీవ్రతులే. ఈయవ తారమున నాశ్రీకాంతయే భగవత్సేవార్థ మిన్నిరూపములఁ గైకొని శ్రీహరిని సేవించెననిభావించి వారినెల్ల సేవించి పూ జించుట మనకుఁ దరణోపాయము. అంతియకాని జారుఁడు, చోరుఁడు, వంచకుఁడు, అని శ్రీకృష్ణుని దూషించుట సంసార సాగరనిమజ్జనోపాయము. అట్టివాఁడు మరల నెప్పుడేని సంసార జలధినుండి వెలికి రాఁజాలఁడు. కావున నట్టిపాపమునకుఁ బాలు పడక శ్రీహరిపాదారవిందముల సేవింపుఁడు. ఇంక నీవిషయ మును జర్చింపమాని యవ్వలిచరిత్రమును వ్రాసెదను. స్యమం తకమణి సత్రాజిత్తున కొసంగినపిదపఁ దన్మణిచరిత్ర మించుక గలదు. దానిని వ్రాసినఁగాని యాకథనుండి తెలియఁదగునీతి బోధపడదు. కాన నాచరిత్ర శిష్టభాగమును వ్రాసెదను. ఈ కథ మొదట బాండుకుమారులచరిత్రము నత్యల్పముగా వ్రా యక మానరాదు. కాన దానిం జేర్చెదను.

## శతధన్వుఁడు స్యమంతకమణి నపహరించుట.

* పాండురాజకుమారు లగుధర్మజ భీమార్జున నకుల సహదేవు లైదుగురు కడుం జిన్నవారు. పాండురాజు శాపవశ మున మృతినొందెను. రెండవభార్యయగు మాద్రి యతని సహగమననియమమూని యనుసరించెను. తండ్రిలేని పిల్లల యిరి. కుంతిదేవి యొక్కతయె వారి నెల్లఁ బెంచుచుఁ బర్వత మునందే యుండెను. ఆవార్తనాలకించి ధృతరాష్ట్రుఁడు సద్బుద్ధి

* ఈకథ శ్రీభాగవతము దశమస్కంధము. ౫౭. అధ్యాయమునుండి సంగృహీతమని యెఱుంగవలయు.

నూనియే విదురుఁడు భీష్ముఁడు తనకాలోచనము చెప్ప సమ్మతించి పర్వతమున వసించుసోదరపత్నీపుత్త్రులను బిలిపించి కుంతినూఱార్చి నగపుమగుమని తెల్పి కుమారులఁ గ్రుచ్చియెత్తి స్వపుత్త్రులంబోలె గారవించి హస్తినగరమునందే యునిచి పోషించుచు వారిననుదినము తడివిచూచుచు నుండెను. భీష్మ విదురులు విశేషించి వారికుశలముల నరయుచుండిరి. కొలఁది దినము లెల్లే హాయిగాఁ గడచినవి.

పాండుకుమారులు నగరము జొచ్చినదాదిగా దుర్యోధనునకుఁ బట్టరానియాగ్రహము వారిపైఁ గల్గెను. వారు దేవాంశసంభూతులనియు, గుణనిధులనియు, నెల్లరు వారిం బ్రేమించుటయే దీనికిం బ్రధానకారణము. వీరువృద్ధియైనఁ దనగౌరవము దక్కదన్నభీతి యాతనిమది నాఁటెను. కావున వారినిం జంపింపవలయునన్న యాశయము తోడనె పొడసూపెను. రాజ్యము నార్జించి దిగ్విజయముచేసి యాచంద్రార్కవిఖ్యాతిని సంపాదించినది పాండురాజని యెల్లరకుం దెలియుటయు నొకకారణము. ప్రజ లీయభిప్రాయము గలవారయినయెడలఁ దుదకు రాజ్యమంతయు ధర్మరాజుపాలఁ బడునేమో యన్న యనుమానమాతనికిం గలిగినది. ఇవన్నియుం గలిసి యొక్కమా ఱాతనిను త్తలంపడఁ జేయసాగినవి. అల్పమతియు, దురదృష్టవంతుఁడు నగుదుర్యోధనుఁ డేమిచేయఁగలఁడు? పాప మాదురూహాలకు లొంగిపోయెను. దానికిఁదోడు సోదరుఁ డగుదుశ్శాసనుఁ డతని యూహాలను బలపఱచువాఁ డయ్యెను. తక్కుంగల తమ్ములందఱును దుర్యోధనునిమాట కడ్డముచెప్పునట్టివారు కారు. అఖండైశ్వర్యము తోడుపడినది. చక్రవర్తిత్వ మలవడ నున్నది.

ఇట్టిస్థితిలో వాఁ డేమిచేయఁగలఁడు ? విధియు నాతనినదృశ్య పాశములు కంఠమునకుఁ దగిలించి త్రిప్పుచుండెను. పాపమా లఘుబుద్ధి యింక నేమిచేయఁ జాలును? దురూహ లెన్ని గలవో యన్నింటికిని దనమదిఁ జోటిచ్చి హాయిగా విహరింపుఁడీ యని యాదరించెను. కావున ననుక్షణము పాండుకుమారులఁ బొలియించు టెట్లనునాలోచనమే కాని వేఱొక్కయాలోచన మాతనికిఁ గలుగకుండెను.

యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వ మవివేకితా,
ఏకైకమప్యనర్థాయ కిము యత్ర చతుష్టయమ్.

అను ప్రాక్తనసూక్తి తప్పదుకదా. ఇన్నియు నాతనికిం గలవు. వానరము మధుపానముచేసి వృశ్చికదష్టమై గ్రహబాధావృతము కాఁగా నెట్టిచేష్టలఁజేయునో యట్లే దుర్యోధనుఁడు ప్రతిక్షణ మాలోచింపసాగెను.

పురుషునకు ప్రాయికముగాఁ బదాఱువత్సరములనుండి యిరువదివత్సరములవయస్సు వచ్చులోపలనే వానిబుద్ధి సన్మార్గ మువనో దుర్మార్గమునవో చరించుట కలవాటుపడును. ఆయల వాటును దప్పించుట శక్యముకానిపని. ఇది లోకాచారము. ఇట్లులుండ దుర్యోధనునకు విధివశమున దుర్బుద్ధి జన్మముదొట్టి పట్టుపడినది. దానినెట్లు మార్పుకొనుశక్తి వానికిం గల్గును? మఱెవ్వరు దానిని మార్పఁగలరు? దానికిం దగునౌషధము లేదు.

"శ్లో. శక్యోవారయితుం జలేన హుతభుక్ఛత్త్రేణ సూర్యాతపో
నాగేంద్రో నిశితాం కుశేన సమదో దండేన గోగర్దభౌ,

వ్యాధిర్భేషజసంగ్రహైశ్చవివిధైర్మంత్రప్రయోగైర్విషం
సర్వస్యౌషధమస్తిశాస్త్రవిహితంమూర్ఖస్యనాస్త్యౌషధమ్.

అని భర్తృహరియుఁ జెప్పియేయున్నాఁడు కదా. ప్రతిక్షణము నందు నాదురాలోచనము ప్రబలుచుండెను. మఱికొంద ఱర్థ లుబ్ధు లందులకు సాయపడ సిద్ధపడిరి. అప్పటికి భీముఁడొక్కరుఁడే బలవంతుఁడని తనకంతకుఁడని తోఁచినందున ముందు వానిం బొరిమిఁ జేసిన నందఱ నవ్వలఁ జంపవచ్చుననియు నొక యాలోచన ముదయించినందున భీమునకు విషమును బెట్టించియు జలములం ద్రోయించియుఁ బాములచే గఱపించియు నింక నెన్నియోయుపాయప్రయోజనములచేఁ జంపింపఁబూనె నుగాని యవి నిరర్థకము లయ్యెను. ఇంకను ఘోరకార్యములు చేయఁబూనిన భీష్మాదు లెఱుంగుదురనుభీతి యాదుర్యోధను నకుం గల్గెను. కావున స్థలాంతరమునకు వారలం బంపుప్రయత్నము చేయఁబూని తండ్రితో నెన్నియోభంగులం దెల్పి వారిని వారాణసికిం బంపి యందు నివసించునట్లు చేయించెను.

కాశీనగరమునందు గృత్రిమభవనము (లక్కయిల్లు) కట్టించుట అందుఁ బాండవుల నుండునట్లుచేయించి యర్ధరాత్రమున దాని కగ్నిసంస్కారము చేయునుపాయము తెల్పి యేవురుకొడుకులు గలతల్లి నందుంచుట యెట్లో విదురున కెఱుకపడియెను. ఆగృహనిర్మాణ మచిత్రము. దానికుపయోగించిన పరికరము లగ్నిజ్వాల యంటినమాత్రమున నెల్లయెడల నం

టుకొని భస్మమగునట్టివి. అందుఁ బాండవులదహించుట సుల భము. అగ్నియిడిన వారు తప్పించుకొనిపోవుద్వార మం దమ ర్పఁబడియె అను నీవిషయములుకూడ విదురునకుం దెలిసెను. దాన నతఁడు పాండవుల నచ్చటికింబంపుట తగవుకాదని ధృత రాష్ట్రునకుం దెల్పి ఫలముగానక ప్రయాణకాలమునందు సాగ నంపంబోయి ధర్మరాజున కావృత్తాంతమును దెల్పి చేయఁదగు ప్రక్రియ నుపదేశించి తా నెఱుంగనట్లు హస్తినపురమునందే యుండెను. ఈదుష్కార్యము సాగుచున్న వార్త మఱ్ఱెవరికిని దెలి యకుండెను.

పాండవులు కాశీనగరమును జేరి పౌరుల నానందవార్ధి నోలలాడించుచుఁ దత్క్షేమంబుల నేకోరుచు నం దుండిరి. ధర్మజుఁ డేమఱుపాటులేక విదురానుమతంబున జాగరూకుఁడై గృహం బున కనలంబు దరికొల్పుదినంబు నెఱుంగుం గావునఁ గనిపెట్టి యుండెను. నగరము సంతోషమయమై యుండెను. నియమిత దినము సమీపించెను. "ఆత్మానం సర్వథారక్షేత్" అన్న సూక్తి ననుసరించి యాదినమున నప్పనికి నియమితులగువారు జాగ రూకు లగుటకుముందే భీమున కవ్వార్తం దెలిపి దవానలంబు దరికొలుపం బంచి నిర్గమనద్వారంబు రహస్యముగాఁ దెలిపెను. భీముం డన్నమాటను దాఁటువాఁడు కాఁడు కావున మేల్కని యుండి యర్ధరాత్రము కాకముందే యనలంబుముట్టించి తల్లిని సోదరులను బిలుచుకొని రహస్యభూవివరమార్గంబునఁ గాశీనగ రమును దాఁటిపోయెను. ఆ లాక్షాభవనము భస్మమయ్యెను.

నాగరకు లా ఘోరకార్యమునకుం బెల్లుచింతిల్లిరి. అం దేవ్వరు
కొడుకులు నొక్కతల్లియుఁ గాలియుండిరి. ఆకారములఁ బోల్ప
వీలులేకుండెను. పంచపాండవులు దగ్ధులైరనియే వారు తలం
చిరి. ఆనాఁడు కాశికానగరము దుఃఖాలయమై యుండెననుట
కావంతయు శంకయుండదు. ఆవార్త కరినగరవీథుల వెల్లివిరి
సెను. ఎల్లరును గోడుగోడున నేడ్చిరి. ధృతరాష్ట్రుఁడు మూర్ఛిల్లి
మృతప్రాయుఁ డయ్యెను. దుర్యోధనాదు లానందపరవశు లైరి.
విదురుఁడు చింత నభినయించెను. భీష్మాదులు దుఃఖించిరి. ఆదు
ర్వార్త యెల్లకడల వ్యాపించె. ద్వారకానగరమున మ్రోఁగెను.

ఆర్యులార! ఇంతదనుక నీకథ వ్రాయవలసివచ్చినది.
ఇఁక శ్రీకృష్ణచరిత్రము నాలకింపుఁడు. పాండవులు లాక్షాగృ
హమున దగ్ధులైరన్న వార్త విని శ్రీకృష్ణుఁడు తాను సర్వజ్ఞుఁడ
య్యును బాండునందనులు దగ్ధులైరనుటకు దుఃఖించినట్లు
నటించి యాక్షణంబ బలరాముంగూడి కురుదేశముల కరిగెను.
కరినగరంబున భీష్మద్రోణులను విదురుని గాంధారిని గాంచి
వారు మిగుల వగలఁబొగులఁగా దానును దుఃఖించెను. వారి
నూఱడించెను. కరిపురంబునఁ గలవారల వగపుడిపి కొలఁది
దినము లందేయుండెను. బలరాముఁడు శ్రీకృష్ణుఁడు ద్వారకా
నగరంబున లేకుండుటెఱిఁగి యిదియ సుసమయమని తలంచి
యక్రూరకృతవర్మలు శతధన్వునిం గాంచి యోయీ సత్రా
జిత్తు మొదటినుండి మనకిత్తుననిన వాగ్దానముచేసి కన్యారత్నము
నీయక కృష్ణున కొసంగెను. అతనికి న్యాయముకలదా? మృతుఁ

డగు ప్రసేనునిసోదరుని వెదకనైనఁ బోయెనా? ప్రసేనుఁడు చావవలయుననియే యాతనిభావము. కావున నేయుపాయము చేనైన సత్రాజిత్తునుండి స్యమంతకమును బరిగ్రహింపుము. అని కలుభంగులఁ బురికొల్పిరి. శతధన్వుఁ డామాటల కాగ్రహించి యారేయి సుఖనిద్ర చేయు సత్రాజిత్తును బశువును గటికివాఁడు చంపునట్లు దుర్వృత్తిం బొలియించి యాతని భార్యలు వాపోవుచుండఁగాఁ గరుణ యించుకంతయు లేక యామణిని దీసికొనిపోయెను.

సత్యభామ హతుఁడగు పితరునిదిలకించి హతచేతనయై తండ్రీ! చంపఁబడితివే యని యాక్రోశించి యాక్రోశించి తనకు మృతి వాటిల్లినట్లు దుఃఖించి దుఃఖించి యాకళేబరమును దైల ద్రోణియం దునుపఁబంచి కాపాడఁదగువారి నియోగించి కరిపురంబున కరిగి సర్వజ్ఞుఁడగు ప్రాణనాయకునకుఁ బరితపించు చిత్తముతోఁ దన పితృవధవార్తను దెలిపెను. * రామకృష్ణులీశ్వరులయ్యును మనుష్యులయాచారమును బాటించి సత్రాజిత్తుమృతికై వగచి మహత్తరకష్టము కలిగినవారిచందము నభినయించి యప్పుడ సత్యభామాసహితుఁడై యన్నంగూడి ద్వారకకుఁ బయనమై కతిపయప్రయాణంబుల ద్వారకానగరంబుం బ్రవేశించి శతధన్వుఁ జంపుటకు స్యమంతకమణిని దెచ్చుటకుఁ గృతనిశ్చయుం డయ్యెను. శతధన్వుఁడు శ్రీకృష్ణసంకల్పము

* తదాకర్ణ్యేశ్వరౌ రాజన్ననుసృత్య నృలోకతామ్=అని మూలము.

నాలించి యింక నన్నుం జంపకమానఁడని నిశ్చయించి భీతి తన్నుఁ బురికొలుపఁగాఁ గృతవర్మ కడకుం జని తనస్థితిం దెలిపి సాహాయ్యమును యాచించెను. ఆతని యాశయ మెఱింగి యా కృతవర్మయుఁ దనశక్తిహైన్యమును దెలుపుచు నయ్యా యీశ్వరు లగు రామకృష్ణులకుఁ బ్రతికూలకార్యమును జేయ నే నెంతవాఁడను ? వారి కపకార మొనర్చి యెవ్వాఁడు బ్రదుకఁ జాలును ! కంసుఁ డామహాత్ముల కపకార మొనరించి తనయనుచరులతో నీలోకమును వదలెను. మహాబలశాలి యగుజరాసంధుఁడు పదునేడుపర్యాయములు చతురంగబలంబులఁ గూడి వచ్చి తుదకెల్లరం బోఁగొట్టుకొని విరథుఁడై పోయెను. కావున వారిమార్కొన నాకుఁ దరముకాదు. అనిపలుక నతనికడ నిరాశుఁడై యక్రూరునింటికిం బోయి తనదైన్యమును దెలిపి సహాయమును యాచించెను. అక్రూరుఁడును రామకృష్ణులఁ దలంచి భయంపడుచు వారిమార్కొన నాకు శక్యమా ? ఆ యూహ వదలుము. శ్రీకృష్ణుఁడన భగవంతుఁడు సుమా ? ప్రపంచమును విలాసమునఁ బుట్టించుచుఁ బోషించుచుఁ బొలియఁజేయుచు నుండును. ఆ మహనీయుని చేష్టలు బ్రహ్మాదులకేఁ దెలియ శక్యముగానివి. ఆకృష్ణమాయ లోకములనెల్లను మోహింపఁజేయును. ఏడువత్సరములబాలుఁడై కృష్ణమూర్తి గోరక్షణముచేయఁ బర్వతము నొకచేత నెత్తెను. కూటస్థుఁడన్న నీశ్వరుఁడన్న నద్భుతకర్ముఁడన్న ననంతుఁడన్నఁ గర్మసాక్షి యన్న నా శ్రీహరియే. ఆపరమేశ్వరునకుఁ ద్రికాలములయందు

దును నమస్కరించుచుందును. భగవంతునితో ద్వేషింపఁగల వారు గలరా ? కావున మాసాయము నాశింపక వేఱుమార్గ మును జూచుకొనుము. నన్నే నమ్మి యిట నుండకుము. అని నిరాశునిగా నొనరించెను.

అంత శతధన్వుఁ డాయిద్దఱు తన సాయపడఁజాలమని తెలుపఁగా నేమియుఁదోఁచక తల్లడిల్లుచు నాస్యమంతకమణి నక్రూరునింట నునిచి శతయోజనదూరంబుఁ గొనిపోవఁజాలు నాజానేయంబు నధిష్ఠించి పరుగిడెను. గరుడకేతనంబగు నరదం బెక్కి రామకృష్ణు లాశతధన్వుని వెంటనంటి పోయిరి. ఆయర దము జవమునఁబాఱఁగా వా రతివేగమున నాతనిఁ జేరఁగల్గిరి. మిథిలానగరోపవనమున శతధన్వుఁడు తన్నుఁ జంపవచ్చు రామకృష్ణులం గాంచెను. ఆతనియశ్వము పరుగిడఁజాలక యలసి యటఁ బడిపోయెను. దానివదలి యాశతధన్వుఁడు పాదచారియై భీతిచేఁ బరుగిడసాగెను. శ్రీహరియు నరదంబు డిగి పదాతియై యాతనిఁజేరం బరుగిడి చక్రముం బ్రయోగింప నది వానిశిరము ఛేదించెను. కృష్ణుఁ డాతనివస్త్రముల నా స్యమంతకమణి యుండునని వెదకెనుగాని యందది దొరక దయ్యెను. మరలి యన్నకడకువచ్చి నందనందనుఁడు మణి దొరక దయ్యెను. వృథా శతధన్వుం బొలియించితిని. వానికడ వెదకి తిని. దానిచిహ్నముకూడఁ గానరా దయ్యెను. అన బలరా ముఁడు దాని నెవరికడనో దాఁచియుంచెనని తోఁచెడిని. నీవు నగరమునకరిగి మణి నన్వేషింపుము. నేను వైదేహునిం జూడఁ

బోయెదను. ఆతఁడు నాకుఁ బ్రాణమిత్త్రుఁడు. అని పలికి శ్రీకృష్ణుని ద్వారకకుం బంపి బలరాముఁడు మిథిలానగరమును బ్రవేశించెను. రామాగమనము నెఱింగి వైదేహుఁడు ప్రీతుఁడై యెదురువచ్చి యర్ఘ్యపాద్యాదికము లగునాతిథేయవిధులం బూజించి విడిది కల్పించి యం దునిచెను. ఆతనిసత్కారముల కానందించుచు నందు రాముఁడు కొన్నివత్సరము లుండెను. * అవార్తనాలకించి దుర్యోధనుఁడు చనుదెంచి జనకునిచేఁ బూజింపఁబడి బలరామునొద్ద గదాయుద్ధపద్ధతుల నేర్చుకొనుచుండెను.

శ్రీకృష్ణుఁడు రామాజ్ఞనంది ద్వారక కేతెంచి ప్రియురాలగు సత్యభామకుఁ బ్రీతికలుగునట్లు శతధన్వనిమృతియు మణి దొరకకుండుటయు నెఱింగించి యామె వగవకుండఁ జేసి చచ్చినసత్త్రాజిత్తునకుఁ జేయఁదగిన యౌర్ధ్వదైహికముల సక్రమముగాఁ జేయించెను. అక్రూరుఁడు కృతవర్మయు శతధన్వనివార్తనాలకించి బెగడి చిత్తములు త్వరపెట్టి ద్వారకానగరమును వదలి పెక్కుయోజనముల దూరమునకుం బోయి యందుండిరి. అక్రూరుడు ద్వారకను వదలిపోఁగా నగరవాసులకెల్ల శారీరమానసికతాపములు దైవికములు భౌతికములును గల్గెను. వారెల్ల శ్రీహరిం గానవచ్చి యిట్లు విన్నవించిరి. నందనందనా! మహామునుల కాశ్రయుండవగు నీవున్న యీపురమున ననావృష్టిప్రభృతిపీడలు గల్గుచున్నవి. ఏలొకో తెలియఁజాలకున్నారము. పూర్వము కాశీశ్వరుఁడు వృష్టి గురియక

---

* తతోఽశిక్షద్గదాం కాలే ధార్తరాష్ట్రః సుయోధనః, మానితః ప్రీతియుక్తేన జనకేన మహాత్మనా = అని మూలము.

పోఁగా శ్వఫల్కునిం బిలుచుకొనిపోయి తనకన్యక యగు గాంది నాతనికొసంగి సత్కరించెను. ఆవల వర్షములు గురిసెను. ఆతనికుమారుఁ డగునక్రూరుఁ డంతటివాఁడు. మహాతపోధనుఁడు. కావున నతఁడు మరలివచ్చునేని యీపరితాపములు తొలఁగును. వృష్టి గురియును. వేవేగ యతనిం బిలుపింపుమా యని ప్రార్థించిరి. వారిపలుకుల నాలకించి ప్రజాహితముచేయుట పరమధర్మము గావున నప్పుడే దూతలంబంచి యాయక్రూరుం బిలువనంపి యతనిసత్కరించి యిట్లు పలికెను. అక్రూరా! దానపతీ! శతధన్వుఁడు పాఱిపోవునపుడు స్యమంతకమణి నీయింట నునిచిపోయెను. ఆవిషయము నే నెఱుంగుదును. సత్రాజిత్తునకుఁ గొడుకులు లేరు. ఆతనిదుహితలెల్ల నపరకర్మము లాతనికాచరించి ద్రవ్యమును, ఋణమును విభజించుకొన నూహించియున్నవారు. సత్రాజిత్తు దుర్మరణంబు చెందినాఁడు. తచ్ఛాంతికై వలయుక్రియల జరపవలయు. స్యమంతకమణి నాకువలదు. నీవ యుంచుకొనుము. మాయన్న రాముఁడు నన్ను నమ్మకున్నవాఁడు. బంధువులు నట్లే యున్నవారు. కావున వారికి విశ్వాసముపుట్ట దానిం జూపుము. నీగృహమున ననవరతము బంగారు వృద్ధియగుచుండఁ గలదు.

అని శ్రీహరి సామవాక్కులు పలుకఁగా నక్రూరుండు తనవస్త్రంబు నంచలంబున ముడిచియున్న యామణిని ప్రదర్శించి శ్రీహరికి సమర్పించెను. ఈఘట్టమున శ్రీభాగవతమున,

"శ్లో. ఏవం సా మభిరాలబ్ధ శ్శ్వఫల్క తనయో మణిమ్,
ఆదాయవాససాఛన్నం దదౌ సూర్య సమప్రభమ్.
స్యమంతకం దర్శయిత్వా జ్ఞాతిభ్యో రజ ఆత్మనః,
ప్రమృజ్య మణినాభూయ స్తస్మై ప్రత్యర్పయత్ప్రభుః."

అని వ్రాయఁబడినది. ఈ రెండుశ్లోకములకు మహాకవిపోతన,

ఉ. సంతసమంది బంధుజనసన్నిధిఁ హరి తెచ్చిచూపె న
శ్రాంతవిభాసమానఘృణిజాలకలాయితభూనభోంతర
ధ్వాంతము హేమభావచయవక్షణవిస్మితదేవమానవ
స్వాంతముఁ గీర్తిపూరిత దిశావలయాంతము నాస్యమంత
[ముఁ.

కం. చక్రాయుధుఁ డీక్రియఁ దన
యక్రూరత్వంబు జనులకందఱకును ని
ర్వక్రముగఁ దెలిపి క్రమ్మఱ
నక్రూరున కిచ్చె మణిఁ గృపాకలితుండై.

అని వ్రాసిరి. సూర్యసమప్రభమ్=అను విశేషణమున కంతటి పద్యమును ముచ్చటగా వ్రాసిరి. అంత్యప్రాసాలంకారమున మహాకవి కెంతమక్కువయో యది తేటపడుచును. అంత బంధువులందఱు సంతసిల్లి మణివిషయమున శ్రీకృష్ణునియం దవిశ్వాసమునుమాని నెమ్మది నుండిరి. ఇది భగవంతుని దివ్యశక్తిప్రదర్శకము. ఈగాథను బఠించినను వినినను దుర్యశోములంబాసి యిష్టవాంఛలం బొందుదురు.

మహామతులారా! స్యమంతకమణిచరిత్ర మీ కథతోఁ బూర్తియయ్యెను. దీనియందుఁ గొన్ని రహస్యార్థములు గలవు. వాని నెఱింగినఁగాని మానవులు వృద్ధిని గాంచఁజాలరు. కృష్ణుఁడు ముందు రాఁదగు కర్మము నాలోచించియే కరిపురంబున కరిగెను. అత్తఱిం గృతవర్మయు నక్రూరుండును శతధన్వునిఁ బురికొల్పిరి. సత్యభామను మనకిత్తునని చెప్పుచు సత్రాజిత్తుఁడే కృష్ణున కిచ్చెననిరి. మణిని గ్రహింపుమనిరి. వాఁ డందులకొడంబడి నిద్రపోవునపుడు సత్రాజిత్తుని బొరిగొనియెను. స్యమంతకమణిని గైకొనిపోయెను. దానిచేఁ గృష్ణు నాగ్రహమునకుఁ బాత్రుఁడై చచ్చెను. తన్నుఁ బురికొల్పినవారు తన మృతిసమయమునఁ దోడ్పడఁజాలక పోయిరి. ఇదియె కథాసారము. అక్రూరుఁడు శ్రీకృష్ణభక్తుఁడు కదా. ఆతఁడేల శతధన్వుని బ్రోత్సహించె నన్న శంక కొందఱికైనఁ గలుగకమానదు. అతఁ డంతటిమూర్ఖుఁడా యనియుఁ గొంద ఱడుగఁబూనుదురు. కాని తత్త్వమారయకయే యిట్లు ప్రశ్నింతురని నాయాశయము. అక్రూరుఁడు పరమభక్తుఁడు. యమునాజలములందును రథమునందు నొక్కసారి రామకృష్ణులం గాంచినప్పడినుండి వారిని భగవంతులనుగా భావించెనే గాని సామాన్యులనుగా భావించినవాఁడు కాఁడు. ఎన్నియో విశేషకృత్యములు భగవంతుఁడు చేయఁగాఁ గన్నులారఁ గాంచినవాఁడే. అయినను సత్యభామావిషయమునను స్యమంతకమణివిషయమునను వానిమనస్సు మాఱిపోయెను. ఏల? కనకము కాంతయు లోకమున నెట్టివారి

నైన ముగ్ధులఁ జేయును. పరాశరాదులు విభ్రాంతులైరన నిఁకఁ దక్కుంగలవారిమాట లిటనేటికి? కావుననే భర్తృహరి,

"శ్లో. తావదేవకృతినాం హృదిస్ఫుర
త్యేష నిర్మల వివేకదీపకః,
యావదేవ న కురంగచక్షుషాం
తాడ్యతే చపలలోచనాంచలైః."

అని వివరించెను. మఱియు,

"శ్లో. స్మితేన భావేన చ లజ్జయాభియా
పరాఙ్ముఖై రర్ధకటాక్షవీక్షణైః,
వచోభిరీర్ష్యాకలహేన లీలయా
సమస్తభావైః ఖలు బంధనం స్త్రియః."

అనియుఁ దెలిపెను. ఆహా! ఎంతవిజ్ఞుఁడు? ఎంతరసికుఁడు? ఎంతటిధీరుఁడు? కనకలోలుపత్వమును గుఱించి యామహాకవియే,

"శ్లో. భ్రాంతం దేశమనేకదుర్గవిషమం ప్రాప్తం న కించిత్ఫలం
త్యక్త్వా జాతికులాభిమాన ముచితం సేవాకృతా నిష్ఫలా,
భుక్తం మానవివర్జితం పరగృహే ష్వాశంకయా కాకవ
త్తృష్ణే జృంభసి పాపకర్మనిరతే నాద్యాపి సంతుష్యసి."

అని తేటపఱచెను. ఏవాఁడు కాంతాకాంచనములపై నాశ మానుకొనునో వాఁడే ధన్యుఁడని పెద్దలభావము. మహాత్ములు దివ్యదృష్టిగలవారు. కాఁబట్టియే విషయలోలత తొలఁగింప రానిదనియు సుదుర్జయమనియుఁ బూర్వకర్మపరిణతిచే నది

లభింపవలయుననియుఁ దెల్పిరి. అక్రూరుఁడు తొలుదొలుత శతధన్వుఁడు తనకు సత్యభామనిచ్చునని తలంచువారిలో నొకఁడని తెలియనయ్యెడిని. ఆమె కృష్ణపత్నికాఁగా దాని విషయమును మాని సత్రాజిత్తుపైఁ గల యీర్ష్యచే శతధన్వుఁడు తనకన్న బలవంతుఁడు కానఁ గృతవర్మనుగూడి స్యమంతకమణినైనం బరిగ్రహింపుమని ప్రోత్సహించెను. అతఁ డట్లే యొనర్చెను. తుదకాతఁడు రక్షింపుమా యని వేఁడఁగా నక్రూరుఁడు జ్ఞానియై భగవంతునిశక్తి నారసి నేనందుల కశక్తుఁడ ననియె. కర్మ యేయేకాలమున నెవ్వరెవ్వరి నెట్లెట్లు త్రిప్పునో వారట్లే తిరుగుచుందురుగాని స్వతంత్రులు కాఁజాలరనియుఁ గర్మమే బలవత్తరమనియు నెంతటివారినైన నది మాఱుత్రోవలఁ ద్రిప్పఁజాలుననియు నీకథనుండి మన మెఱుంగవలయు. ధనాశను వదలినఁగాని మనశ్శాంతి కలుగదనియుఁ దెలిసికొనవలయును. ఎంతదనుక మనశ్శాంతికుదురదో యంతదనుక భగవంతుని యవ్యాజప్రేమమునకుఁ బాత్రులము కాఁజాలమని యెఱుంగుట సముచితము. ఇట్టి సాధుమార్గముల నీకథ మనకు బోధించుచున్నది.

ఈస్యమంతకచరిత్రమును జతుర్థీచంద్రదర్శనము కలుగఁగాఁ దద్బాధానిరసనార్థము పఠింతురు. దీనియందు భగవంతుఁడు తనపై నన్నకు బంధువులకుం గల్గినయనుమానమును దొలఁగించెను గాన దీనిం బఠించిన కళంకములు, దుర్యశములు తొలఁగునని వారితాత్పర్యము. అట్టి యీకథను బఠించినంతమాత్రమునఁ

దొలఁగవని నాయాశయము. భగవంతుఁడు తనకృత్యమున నించుకంతద్దైనఁ బ్రమాదము నొందలేదు. అట్లే మనముకూడ సద్వర్తనమున కలవాటుపడినచో దుర్యశములు తమంతన తొలఁగును. దూషించువారి నోరులడంగును. వారు మనపాప ములను బంచుకొందురు. కావున నాక్షేపించువారు మనకు మిత్రులనిభావించిన మనమనస్సు పరిశుద్ధమగును. అట్లుగాక మనమితరుల నాక్షేపింపక వారిదుశ్చరిత్రములఁ దలంచుచుం డక వారి సాధుచరితముల స్మరించినచో వారిపుణ్యములఁ గైకొనఁజాలుదుము. సులభమార్గమున మనకనంతలాభము కల్గు చుండ నామార్గము నవలంబింపక వృథా ఒరులపాపముల నార్జింపఁ బ్రయత్నముచేయనేల ? ఏవిధముననైనను బరదూష ణము హానికరము. పరభూషణము క్షేమకరము. ఇది చలింపని సిద్ధాంతము. పరదూషణము దైవదూషణము వంటిది. పరుల యభ్యుదయము నోర్చుట భగవత్సేవ వంటిది. కావున నొకర్క గవ్వయైన వ్యయముచేయకయుండ నించుకంతయు దేహశ్ర మముపడకయుండ మహాపుణ్యము లభించునపుడు మనమామా ర్గము నేల యాశ్రయింపఁగూడదు ? అందును గలికాలమునఁ బుణ్యమార్జింప శక్యమేగాదు. అట్టి యీకాలమున నిర్మలచిత్త మున దినమునం దొకక్షణకాలమైనను భగవత్సేవ శక్త్యను రూపముగఁ జేయుట సర్వయజ్ఞములు చేసినట్టి దగును. ఈకా ర్యమునందు భూతహింసచేయ నక్కఱలేదు. ధనమును శ్రమ ములకుం బాలై యార్జింప నక్కఱలేదు. ఇంటనున్న విత్తము

ను వ్యయింప నక్కఱలేదు. శాంతముగాని క్షణకాల మేకాంతముగాఁ గూరుచుండి విషయేచ్ఛలకు లోనుగాకయుండఁ జిత్తము శ్రీహరిపాదారవిందములపయిం జేర్చుటయే చాలును. అదియే పరమపురుషార్థము నొసంగును. ఉత్తమశ్లోకులఁ జేయును. ఇంతకంటె వేఱుసులభమార్గము కలియుగమునఁ గానరాదనుట సత్యము.

మహానుభావులారా! ఈప్రకరణమును ముగించుచు నాల్గుమాటలు వ్రాయఁదలంచితిని. కాలమిది దుర్భరముగా నున్నది. దాంభికులు విచ్చలవిడిఁ దిరుగుచున్నారు. కొందఱు కౌపీనమాత్రవేషులు. కొందఱు దిగంబరులు. కొందఱు విభూతిపరిలిప్తసర్వాంగులు. మఱికొంద ఱూర్ధ్వపుండ్రాంకిత ద్వాదశతనుస్థలులు. ఇంకనుగొందఱు దండకమండలత్యాగులు. మఱియుఁ గొందఱు సర్వసంగపరిత్యాగులు. ఇట్లు నానాభంగుల మహాత్ములు కనఁబడుచున్నారు. ఒక్కొక్కరును బరులను బరమతములను దూషించువారే. ద్రవ్యాశాతత్పరులే. అహంకారతపోధనులే. యోగీశ్వరులే. వీరికి ఇంచుకయైన మనశ్శాంతి కలదా యోజింపుఁడు. వీరు చేయువంచనలకుఁ బారముగలదా యోజింపుఁడు.వీరు నిర్మలచిత్తులా తలంపుఁడు. ఇక్కాలమునఁ బ్రతివాఁడును శిష్యుల సంపాదింపఁ బ్రయత్నించును. శిష్యుల కడ దీర్ఘోపన్యాసములఁ జేయుచుండును. శిష్యుఁడు సర్వద్రవ్యమును గురువున కర్పించినఁగాని ముక్తిదొరకదని పలుకుచుండును. వీరిమనస్సున భక్తిలేదు. ద్రవ్యాశ కలదు. వీరియుప

న్యాసముల విని మనము చెడరాదు. వీరిమాటలవలన భక్తి నశించును. వీరే తరించినట్లు చేయుదురని మనమాశించుట వెఱ్ఱితనము.

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః,
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసి.

గీత. ౫ అ. ౧౦ శ్లో.

అను భగవదుక్తిని బఠింపుఁడు. దానియర్థమును బరికింపుఁడు. మనము చేయఁబూనుకర్మముల నట్లు చేయవలయునని నిశ్చయించుకొనకుఁడు. హింసాకర్మములకు దూరముగ నుండుఁడు. భగవన్నామమును బఠింపుఁడు. భగవత్సేవ చేయుఁడు. అదియే మనకుఁ దరణోపాయము. దానినిమించిన చక్కనిమార్గము లేదు. నిశ్చయముగా లేదు. కావునఁ గాలమును వృథచేయక యోపినకొలఁది భగవచ్చరిత్రమును బఠించుచుఁ దన్మహిమములను జింతించుచుఁ దత్సేవల నెవరెట్లు చేసి కృతార్థులైరో యెఱుంగుచు నట్లు ప్రవర్తించుటకుఁ బ్రయత్నించుచు స్వల్పవాంఛలం గోరక చేయుసత్కార్యముల నెల్లరకుం జాటుచుండక కలికాలమునకు లోఁబడక ప్రవర్తించుటకుఁ బ్రయత్నపరులము కావలయును. భక్తిమార్గము సులభము కావున నద్దాని నాశ్రయింపుఁడు. శ్రీకృష్ణపరబ్రహ్మనామజపమే సంసారార్ణవతారకము. కావున దానిని మఱువఁగూడదు. ఇఁక నీప్రకరణమును ముగించుచు భగవత్స్తోత్రమును వ్రాసెదను దానిని బఠింపుఁడు.

"శ్లో. పురః ప్రసన్నేన ముఖేందుతేజసా
పురోఽవతీర్ణస్య కృపామహాంబుధేః,
తదేవ లీలామురలీరవామృతం
సమాధివిఘ్నాయ కదా ను మే భవేత్." ౩౮

"శ్లో. భావేన ముగ్ధచపలేన విలోకనేన
మన్మానసే కిమపి చాపలముద్వహంతమ్,
లోలేన లోచనరసాయనమీక్షణేన
లీలాకిశోర ముపగూహితు ముత్సుకోఽస్మి." ౩౯

"శ్లో. యావన్న మే నిఖిలమర్మదృఢాభిఘాత
నిస్సంధిబంధనముదేతి న వోపతాపః,
తావద్విభో భవతు తారకవక్త్రచంద్ర
చంద్రాతపద్విగుణితా మమ చిత్తధారా."

శ్రీకృష్ణకర్ణామృతము. [illegible]

ఓం శాంతిః శాంతిః శాంతిః.

శ్రీకృష్ణావతారతత్త్వమున నద్భుతశక్తిప్రదర్శనమను
నెనిమిదవ ప్రకరణము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ



[illegible] 1928

# వైదిక గ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అమావాస్యాతర్పణము | 0 | 2 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | 0 | 3 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | 0 | 3 |
| ఋగ్వేదదేవతార్చన, బ్రహ్మయజ్ఞము, సస్వరము | 0 | 3 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము | 2 | 8 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, చిన్నసైజు | 0 | 4 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | 0 | 3 |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులది) | 0 | 2 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | 0 | 12 |
| దేవతార్చన, చిన్నసైజు | 0 | 2 |
| పంచసూక్తములు, సస్వరము | 0 | 2 |
| పంచోపనిషత్తులు, బ్రహ్మమేధసహిత[illegible] | 0 | 6 |
| పితృతర్పణము, చిన్నసైజు | 0 | 2 |
| బ్రహ్మయజ్ఞము, సస్వరము | 0 | 3 |
| మహాన్యాసము, సస్వరము, చిన్నసైజు | 0 | 12 |
| డిటో సస్వరము (వైకాన్సికాం[illegible]) | [illegible] | [illegible] |
| మంత్రప్రశ్నములు, మూలము | [illegible] | [illegible] |
| [illegible]త్తిరీయ ఆరణ్యకోపనిషత్తులు, పితృమేధము, మంత్రప్రశ్నములు సహా, సస్వరము | 3 | [illegible] |
| మంత్రపుష్పము, సటీక | [illegible] | [illegible] |
| [illegible]సంధ్యావందనభాష్యము | [illegible] | [illegible] |
| [illegible]పూర్వప్రయోగచంద్రిక, సస్వరము | 3 | [illegible] |